# మహానారాయణోపనిషత్తు




వ్యాఖ్యాత. పిడూరు జగన్మోహనరావు

# మహానారాయణోపనిషత్తు

(మూలము, వ్యాఖ్యానము)

(ప్రథమ భాగము)

రచన

డా పిడూరు జగన్మోహనరావు

దివరల్డ్ టీచర్ ట్రస్టు
''వేదభూమి'' 12-2-417/ఎ/8,
జయనగర్, LIC కాలనీ
హైదరాబాదు - 500 028

మూల్యము రూ 58/-

# విన్నపము

'ఓం కారము ఈ సృష్టికి బీజముకాగా దానినుండి వేదము నారాయణుని అంశగా వ్యక్తమైనది అట్టివేదమే బ్రహ్మాయనికూడ సంకేతింపబడినది అట్టి వేదము మరల నారాయణుని ప్రవృత్తులైన సృష్టిదర్మములుగా అనేకములుగా విస్తరించినది సృష్టి సంకల్పమే'ఓం కారముగానున్న మొట్టమొదటి బీజము అదియే ఈ సృష్టికాదారమైనట్టి విశ్వశ్రేయస్సు అనుపేర పరమదర్మముగా తెలియబడుచున్నది అన్ని దర్మములునూ దీనిపైననే ఆదారపడియున్నవి వేదము ఈసృష్టికి కారణమైన మొట్టమొదటి వెలుగు కాగా దానినుండి వెలుగులనేకములుదిగివచ్చినవి అవియే, యిప్పుడు మనకు తెలిసిన వేదములు ఈ మొట్టమొదటి వేదము సృష్టియందంతర్లీనమై యుండి ప్రకృతిద్వారా వ్యక్తమగుచుండగా దానిని దర్శించిన ద్రష్టలు (Seers) తమకు అందినవిదమున అందినంతవరకు బీజాక్షరముల రూపమున సంపుటీకరించి తమకు తెలిసిన బాషలో మానవ సమాజమునకు వేరువేరు కాలములలో అందించుచుండిరి ఇట్లు సృష్టి ప్రారంబమైన నాటినుండి నేటివరకు అట్లు దర్శించుట, అందించుట, అందుకొనుచుండుట జరుగుచునే యున్నది ఇంత జరిగిననూ వేదము మానవులకు పరిపూర్ణముగా అందినదని చెప్పలేము ఎంత అందిననూ అందుకొనవలసినది మరింతగా మిగిలిపోవుచునే యున్నది కనుకనే వేదము అనంతమని చెప్పబడినది

మహార్షులనేకులు తాము దర్శించిన వేదమంత్రములను, సూక్తములను పేర తమ శిష్యులకు అనుగ్రహించి యిచ్చియున్నారు నేటికి ఐదువేల సంవత్సరములకు పూర్వము వేదవ్యాసుడను మహార్షి అప్పటికే తామరతంపరగా పెరిగిపోయి జనబాహుళ్యమునందు విస్తరించియున్న వేదసూక్తములను, మంత్రములను సంహితలుగా కూర్చి స్థూలముగా నాలుగు విబాగములు చేసి సంపుటీకరించెను అవియే సామవేదము, యజుర్వేదము, ఋగ్వేదము, అదర్వణవేదము కానీ యిట్లు వేదము మంత్రముల స్వరూపమున దర్శనమిచ్చుట ఒక్క భారతదేశములోనే కాక ప్రపంచమునందు అన్ని దేశములయందును జరిగినది పాతాళదేశమని పూర్వము పిలువబడిన నేటి అమెరికా దేశమునందును, యవనదేశమునందు, ఈజిప్టు దేశమునందు ఇంకను పెక్కుచోట్ల యిట్లు మంత్రములు దర్శించుట మానవజాతి కందించుట జరిగినది కాని పెక్కు దేశములయందు అవి సమగ్రముగా తరువాత తరములవారికి అందించుట జరుగలేదు అదృష్టవశమున బారతదేశమందు కొంతబాగము ఖిలమైననూ ఎక్కువబాగము ప్రస్తుత తరములవరకు అందింపబడినది కానీ

వేదములు నవీన సమాజమునందు ఎక్కువ ఆదరింపబడకపోవుటచే నేటి బారతీయులలో చాలామంది దానియందు అనాదరము వహించుచున్నారు దీనిని ప్రకృతి మరియొక విచిత్రమైన మార్గమున పరిష్కారము చేసినది జర్మనీ, బెల్జియం, స్విట్జర్లాండ్ మొదలగు అనేక దేశములలో ప్రజలకు వేదమునందు అబిమానము పెరిగి వేదసంహితలను వారివారి బాషలలో కూర్పు చేసుకొని అచ్చువేసుకొనుచున్నారు ప్రస్తుతము మనకు బారతదేశమున లబ్యముకాని వేదసంహితల పాఠములు కొన్ని జర్మనీదేశమున లబ్యమగుచున్నవన్నచో బారతీయుల దురదృష్టమేమని చెప్పవచ్చును।

ఈ ప్రస్తుతము గ్రంధము మహానారాయణోపనిషత్తు అని పిలువబడు ఉపనిషద్భాగము ఇది కృష్ణ, యజుర్వేదమునందలి తైత్తిరీయారణ్యకము నందలిది వేదములయందలి కొన్ని ప్రదాన బాగములు ఉపనిషత్తులను పేర కూర్పు చేయబడినవి వీనియందు మంత్రములు పెక్కుబాగము నిత్యజీవితమునందు సామాన్యులకెక్కువ ఉపయోగించునట్లు కూర్పు చేయబడినవి అనగా యోగసాధనకు సంబందించిన రహస్యములు మంత్రములు, ధ్యాన పద్ధతులే కాక స్నానము, బోజనము, జలపానము, ఇతరులతో వ్యవహారము మున్నగు సమయములందు తానుండవలసిన విదానములనుగూర్చి, అందు దోషములున్నచో తొలగించుకొను విదానములు మున్నగువానితోబాటు ఆహారదోషములు, జలదోషములు నిర్మూలనమగుటకు కావలసిన మంత్రములుకూడ వివరింపబడినవి దీనినిబట్టి వేద ఋషులు ప్రతిపాదించిన మార్గము పూర్తి శుష్కవైరాగ్యము కాదనియు, బౌతిక సుఖములు సాదించుకొనుచునే యోగసాధన చేసుకొనవచ్చుననియు, అదియే యోగజీవనమనియు తెలియుచున్నది ముఖ్యముగా ఈ నారాయణోపనిషత్తునందు అట్టి మంత్రములన్నియూ విశేషముగనూ, సమగ్రముగనూ వ్యక్తీకరింపబడినవి

నారాయణునిగూర్చి తెలుపబడు ఈ సూక్తమునందు నారాయణుని పేరు మిక్కిలి తక్కువగా కనుపించును నారాయణునితోబాటు సృష్టికి కారణములైన దేవతలనుగూర్చి వారి ప్రవృత్తులనుగూర్చి విశేషముగా వివరింపబడినది ముఖ్యముగా అగ్ని, ఇంద్రుడు, వరుణుడు, రుద్రుడు, ఆదిత్యుడు, బ్రహ్మ, ప్రజాపతి, వసువులు, దుర్గ, షణ్ముఖుడు మొదలగు దేవతలనుగూర్చి, వారి ప్రవృత్తులనుగూర్చి చెప్పబడినది అనగా నారాయణుడే ఈ సమస్త సృష్టిగా దిగివచ్చెననియు, ఈ చెప్పబడిన దేవతలందరూ ఆయనలోని బాగములేయనియూ వీరందరినిగూర్చి చెప్పుట యనగా నారాయణునిగూర్చి

చెప్పుటయేయగుననియు ఇందలి బావము దీనిని గుర్తించుకొనకున్నచో ఇది వే ర ు వే ర ు దే వత ల మంత్ర ముల సంపుటి య ు గ ు ను కాని ఇంద లి నారాయ ు ణు అంతర్యామిత్వము స్ఫురించదు

ఈ మహానారాయణోపనిషత్తు వ్యాఖ్యానమునకు నన్ను పురికొల్పినవారు సుహృన్మిత్రులైన శ్రీ J కృష్ణ సోమయాజులుగారు నేను ప్రతిదినము వ్యాఖ్యానము చేయుచుండగా ఆయన రికార్డు చేయగా అది మొత్తము 88 క్యాసెట్లయందు వచ్చినది దానిని పునఃపరిశీలనము చేసి గ్రందరూపమున కూర్పు చేయవలసినదిగా ఆయన కోరిరి ఆయన ద్వారా మాష్టరుగారి ఆదేశమును గ్రహించి నేను అట్టి ప్రయత్నమునకు పూనుకొంటిని ఈ ప్రస్తుత గ్రందముతోబాటు మరియొకబాగముగా గాని మరి రెండు బాగములుగా గాని ఈ వ్యాఖ్యానము పూర్తికాగలదని నాబావన గురుదేవులైన కులపతి ఎక్కిరాల కృష్ణమాచార్యగారి (Master E K) శుశ్రూషచే నాకు లబించిన విజ్ఞానము ఈగ్రందరూపమున వ్యక్తీకరించితిని ఆ గురుదేవుని వెలుగే నాకు నిరంతరము మార్గదర్శకముగానున్నది ఈ ప్రదమబాగములోనే పాఠకుల సౌకర్యార్ధం మూలమంత్రములు సస్వరంగా అందించబడుచున్నది

ఈగ్రంద రచనయందు నాకుసహాకరించిన సోదరీ సోదరులు అనేకులు వారి సహాకారమే లేనిచో నేను దీనిని ప్రకటించుట మిగుల కష్టసాధ్యమై యుండెడిది నాయీ వ్యాఖ్యానమును, అర్ధతాత్పర్యాదులను పరిశీలించి తగు సవరణలు చేసియిచ్చిన పెద్దలు శ్రీ TKVరామవన్ గార్కి, శ్రీ M సత్యనారాయణమూర్తిగార్కి, నా కృతజ్ఞతలు ఈ గ్రందప్రచురణకు ఆర్ధిక సహాయముచేసిన దాతలకు నాకృతజ్ఞతలు ఇట్లు అనేకవిదముల నాకు సహాకరించి, ప్రోత్సహించిన పెద్దలు, పిన్నలు ఎందరో కలరు అట్టివారందరికిని నారాయణ స్వరూపులైన మాష్టరుగారు ఆయురారోగ్య ఐశ్వర్యములనిచ్చి సదా సుఖశాంతులతో వర్ధిల్లచేయుదురు గాక!

ఇట్లు

విధేయుడు

పిడూరు జగన్మోహనరావు

# అనువాకము - 1

## మంత్రము 1

అంబస్యపారేభువనస్యమధ్యే నాకస్యపృష్ఠేమహతోమహీయాన్|
శుక్రేణ జ్యోతీగ్ంషిసమను ప్రవిష్ఠఃప్రజాపతిశ్చరతి గర్భే అన్తః||

## ప్రతిపదార్థము

అంబస్య + అపారే = అపారమైన జలముల యందు,
భువనస్యమధ్యే = లోకములమధ్య (కేంద్రమున),
నాకస్యపృష్ఠే = నాకము లేక దేవలోకము వెనుక,
మహతఃమహీయాన్ = మహత్తుకన్న అతీతమైన వాడైన,
ప్రజాపతిః = సృష్టికర్త,
శుక్రేణ = శుక్రునిచేత,
జ్యోతిగ్ంషి = వెలుగులయందు
సమనుప్రవిష్ఠః = ప్రవేశించెను
గర్భేఅన్తః = ఈసృష్టి గర్భములోపల,
చరతిః = చరించుచున్నాడు

## తాత్పర్యము

అపారమైన ఈ సృష్టి జలములయందు లోకములన్నింటికి మధ్య లేక కేంద్రమున దేవలోకమునకు వెనుక (ఆదారమైన) మహత్తునకు కూడా కారణమైనట్టి ప్రజాపతి శుక్రుడు అను బీజముగ (తారలుగా నున్న) వెలుగుల యందు ప్రవేశించి ఈ (ప్రకృతి యొక్క) గర్భకోశమునందు చరించుచున్నాడు

## వివరణము

ఈ సృష్టికి ప్రారంభమున అంతయు జలములుగా నుండెను జలములనగా భౌతిక జలములుకాక, సమస్త సృష్టి దేనియందు కరగియుండునో అట్టి మహాజలములేక సముద్రము దానియందు వస్తువులు, జీవులు, ప్రాణులు, గ్రహగోళములు, దేవతలు మున్నగునవి కరగియుండి సృష్టి ప్రారంభమగుచున్నపుడు నీటిపై మంచుగడ్డలవలె వ్యక్తమగుచున్నవి ఇట్టి జలములే తన మొదటి రూపముగా దిగివచ్చువాడు

ారాయణుడు నారములనగా నీరు జలములు తన మార్గముగా లేక
ంయనముగా గలవాడు గనుక ఆయన నారాయణుడని చెప్పబడినాడు

అంబస్ శబ్దమునకు నీరనియు తల్లి యనియు అర్థములున్నవి అనగా
ఈ మహాజలములే సృష్టికి మొదటి కారణమై, సృష్టిని తమయందు తల్లి
ర్భకోశమునందువలె దరించి యున్నవి అట్టి ఈ జలతత్వమునే సృష్టికి
ారణమైన మూల ప్రకృతియని కూడా పిలుతురు మహాజలములకు
ంనుబవమనియు, ఆనందమనియు కూడా అర్థములున్నవి ఇవి ఒక
ిస్తువునకు గల రంగు, రుచి, వాసన వంటి లక్షణములు ప్రవహించుట,
రగుట, తనలో కలుపుకొనుట మున్నగు లక్షణములు జలములకు
హజములు ఆనందమునకును లేక అట్టి అనుబవమునకును ఈ
క్షణములే గలవు ఆనందముగా నున్నవానికి మనస్సు, బుద్ధి,
ంద్రియములు మున్నగునవి తాత్కాలికముగా పనిచేయవు వాని
ంవృత్తులన్నియు, ఆనందమునందే లీనమగును చక్కని సినిమాను
ాచుచున్నవానికి చూచుచున్నంతసేపు తన చుట్టును ఉన్న మిగిలిన
షయములు మనస్సు నాకర్షింపవుకదా! చూచుచున్నంతసేపును వాని
ంనస్సు సినిమా యందే యుండును గాని, మిగిలినది గమనించడు
వరకు కాలముకూడ మనస్సు నుండి జారిపోవును ఇంతసేపు
ాచితిమా? యనిపించును కనుక అట్టి అనుబూతికి తమ చుట్టూ
ిన్నవానిని తమలో కలుపుకొను లక్షణము గలదు అట్టి జలములే పై
ోకముల యందు ప్రేమ యను లక్షణమును తెలియజేయును అందుచేతనే
గన్మాతను గూర్చి స్తోత్రము చేయు లలితా సహస్రనామస్తోత్రము
శ్రీమాతా యని ప్రారంబమగును అనగా ఈసృష్టి మొత్తము
ారణము, అవ్యాజము, నిర్మలమూనైన మాతృప్రేమపై
దారపడియున్నది అట్టి తల్లి జీవునికి, పరమాత్మకు మద్యగా నుండి
ంచేయుచున్నది తన పుట్టుకకు తండ్రి కారణమైనను పుట్టగానే మొదట
ను చూచునది తల్లినే కదా! ఇట్టి ఈ తల్లి అను లక్షణమే సృష్టికి
రణముగా పనిచేయును అట్టి ఈ మహాజలములే క్రింది
కములయందు ఆవేశాత్మకమైన మనః ప్రవృత్తులుగా పనిచేయు
న్నవి కనుకనే కామక్రోదాత్మకమైన ఆవేశములయందు చిక్కిన వారికి
ేమున్నగునవి పనిచేయవు

ఈ జలములకు అతీతముగా నున్నట్టి పరమాత్మ ఈ జలముల లోనికి
ేశించెనని చెప్పబడినది అనగా తండ్రి తానే కుమారుడై తల్లి

గర్భకోశమునందు ప్రవేశించుచున్నాడని అర్థము తండ్రియందున్న పితృత్వము అన్న జీవలక్షణము (Seed principle) మరియు బీజాంకురశక్తి (Germination) అనువానినే ప్రజాపతి యని అందురు ప్రజాపతి అనగా The lord of principles of generation, germination and reproduction అతడు పనిచేయు లోకమును జనోలోకము(The plane of generation) అని అందురు ఈ మొత్తము విశ్వమే మూల ప్రకృతి యను తల్లి యొక్క గర్భకోశము కాగా అట్టి గర్భకోశము యందు లేక ఒడి యందు ప్రజాపతి ప్రవేశించెనని చెప్పబడినది ఇదియే వేదమునందు మాతరిశ్వము అని కీర్తింపబడినది అట్లు తల్లి ఒడి యందు ప్రవేశించిన పరమాత్మ వటపత్రశాయిగా వర్ణింపబడినాడు వటపత్రమనగా మఱ్ఱియాకు అందలి శిశువనగా మఱ్ఱిగింజ యందు వృక్షముగా దిగివచ్చునట్టి శక్తి అట్లు వటపత్రశాయిగానున్న శిశువు తన కాలి బొటనవ్రేలిని నోటిలో నుంచుకొనెనట శిరస్సు ప్రారంభమునకును, పాదము అంత్యమునకును సంకేతములు ఈ రెండును కలిసి యండెననగా సృష్టికతీతమైన సృష్టిలోనికి దిగివచ్చిన వెలుగని మరియు రాశి చక్రమని యర్థము మనము పురాణములు, వేదములు చదువుకొనుచున్నపుడు, ముఖ్యముగా గుర్తుంచుకొనవలసిన విషయమేమనగా, జ్యోతిశ్శాస్త్ర విజ్ఞానము వాటిని అర్థము చేసికొనుటకు సహకరించునని రాశిచక్రము, 27 నక్షత్ర విభాగము, గ్రహలక్షణములు మున్నగునవి చక్కగా తెలిసియుండవలెను సూర్యుడు భూమిచుట్టు తిరుగుచున్నట్లు కన్పించుమార్గమునే 'రాశి చక్రము అందురు ఇది 12 విభాగములు చేసి ఒక్కొక్క దానిని ఒక్కొక్క 'రాశి అని పిలిచిరి అవి మేషము, వృషభము, మిదునము, కర్కాటకము, సింహము, కన్య, తుల, వృశ్చికము, దనుస్సు, మకరము, కుంభము, మీనము ఈ పన్నెండు రాశులలో సూర్యుడు ఒక్కొక్క నెల ఒక్కొక్క రాశిలో నుండును అట్టి రాశి చక్రమునందు కాలముగా, మరియు సృష్టిగా వ్యక్తమగువాడు పరమాత్మ ఈచక్రభ్రమణమే నారాయణుని మార్గము లేక అస్తిత్వము నీరు మరుగుచుండగా నీరు పైకి, క్రిందికి ప్రయాణము చేయుచున్నట్టు నారాయణుడు సృష్టి చక్రము నందు ప్రవేశించి, పరిభ్రమించుచు మరల సృష్టి కతీతముగా మరలుచున్నాడు ఇదియే నారాయణము లేక అంతర్యామియైన పరమాత్మ యొక్క అయనము ఇది పైన చెప్పినట్లు నీటివలె నుండును కనుక నారాయణమని చెప్పబడినది నారాయణుడు అనగా అట్టి మార్గము తానే అయినవాడు నారాయణునికిని

వాని మార్గమునకును బేదములేదు నారాయణునుపాసించుట యనగా వాని మార్గమునుపాసించుటయే అనగా (మరల) సృష్టినుపాసించుటయే అగును ఇది ఎట్లు పొసగుననగా, విశ్వమును, అందలి సౌరకుటుంబములను, గ్రహగోళములను, నక్షత్రములను నారాయణునికి అస్తిత్వముగా లేక స్వరూపముగా చూడవలెను వాటి పరిభ్రమణములే నారాయణుని మార్గములు అంతేకాక, కాలచక్రముకూడ వాని పరిభ్రమణ మార్గమే ఈ కాలచక్రము మానవుని జీవితముగా, అందలి సంఘటనలుగా అనుబవమగుచుండును జీవితమునందలి సంఘటనలకు, వాని అనుబవములకు వెనుక గల పరమార్థము తెలియనిచో నారాయణుని సాన్నిద్యము లబింపదు నిజమైన సాదకునకు జీవితమే నారాయణుని మార్గమై ఆనందమే అందలి అనుబవముగా సిద్ధించును

బూ అను శబ్దమునకు పుట్టుట లేక అట్లగుట అని అర్థము బువనమనగా వ్యక్తమైనది లేక లోకము అని అర్థము 'బువనస్యమద్యే అనగా పరమాత్మ నుండి వ్యక్తమైన ఈ సృష్టి గోళము అని యర్థము దీనియందు లోకములన్నియు పొరల పొరల వలెనున్నవి మనయందు మనస్సు, బుద్ధి (Intelligence) ఇంద్రియములు మున్నగునవెట్లున్నవో అట్లే ఈ విశ్వగోళమునందు లోకములన్నియు ఇమిడియున్నవి అట్టి ఈ సృష్టి గోళమునకు మద్యగా అనగా కేంద్రముగా పరమాత్మ యున్నాడని చెప్పబడెను ఇదియే 'సుపర్ణసూక్తము' నందు బువనస్యనాబి" అని చెప్పబడినది కనుక ఈ ప్రజాపతియే లోకమునకాదారముగానున్నాడు బ్రహ్మగా వచ్చిన అంతర్యామి మొట్టమొదటి ప్రజాపతియైనాడు అట్టి ప్రజాపతులు మొత్తము 21 మంది వారు బ్రహ్మ, రుద్రుడు, మనువు, దక్షుడు, బృగువు, దర్ముడు, తపస్సు, యముడు, మరీచి, ఆంగీరసుడు, అత్రి, పులస్త్యుడు, పులహుడు, క్రతువు, వశిష్ఠుడు, పరమేష్ఠి, సూర్యుడు, చంద్రుడు, కర్దముడు, క్రోదుడు, విక్రుతుడు అనగా ఏడు లోకములయందుమ మూడు అంశలు చొప్పున (3x7) 21 మంది ప్రజాపతులు పనిచేయుచున్నారు వీరు ఏడులోకములకు కారణములైన సృష్టికర్తలుగానున్నారు

నాకస్య పృష్ఠే ' అనగా నాకమునకు వెనుక అని అర్థము నాకము అనగా పాపము లేనిది అని అర్థము దీనినే దేవలోకము అని అందురు అనగా దేవతలందున్నట్టి స్థితి దేవతలు తమ కర్తవ్యమును పాపపుణ్యములకొరకు కాక, కేవలము కర్తవ్యముగా నిర్వహింతురు

సూర్యుడు లోకములకు వెలుగునిచ్చుట పుణ్యమును గూర్చి కాక, ప్రకాశించుట తన దర్మముగా వెలుగును ప్రసాదించుచున్నాడు ఇట్లు సకల దేవతలకు కారణమైన ఒకే వెలుగు పరమాత్మ ఆయన మొదట ప్రజాపతియై (దిగివచ్చి) దేవతలను సృష్టించెను

మహతోమహీయాన్ - మహత్తు అనగా ఈ విశ్వగోళమునందు నిండియున్న తెలివి దీనినే బుద్ధి అనియు, electricity అనియు వ్యవహరింతుము ఈ మహత్తే సృష్టికాదారమైన మొట్టమొదటి ప్రాణశక్తి ఇదియే జీవులలోనికి జీవశక్తిగా దిగి వచ్చుచున్నది ఇట్టి ప్రాణశక్తిచే ఈ సృష్టిగోళమంతయు నిండియున్నది దాని వలననే తారలు పుట్టుచున్నవి, వెలుగుచున్నవి ఇట్లన్నిటికి కారణమైన మహత్తు పరమాత్మ వలననే కలుగుచున్నది కనుక ఆయన మహతఃమహీయాన్ అని చెప్పబడినాడు

అట్టి ప్రజాపతి 'శుక్రేణ జ్యోతిగ్ంషి సమనుప్రవిష్టః అని స్తోత్రము చేయబడినాడు శుక్రేణ అను పదమునకు శుక్రుడు అను వెలుగుగా అని అర్థము శుక్రము అనగా శుక్రదాతువని, తెలుపు అని కూడా అర్థము కలదు శుక్రేణ జ్యోతిగ్ంషి సమను ప్రవిష్ఠః అనుటలో ప్రజాపతి ఈ లోకమునందు శుక్రుడను మొదటి వెలుగుగా ప్రవేశించెననియు, ఈ శుక్రుడు బృగువంశము వాడు, గనుక బృగువను పదమునకు సృష్టియందు మొట్టమొదటగా వ్యక్తమైన తెల్లని వెలుగనియు, అదియే మానవుని యందు శుక్రదాతువుగా దిగి వచ్చెననియు, మరల అదియే సౌరమండలములో శుక్రగ్రహముగా వచ్చెననియు సూచింపబడు చున్నది విశ్వేదేవతలలో నొకడైన బృగువను ప్రజాపతి నుండి దిగి వచ్చిన శుక్రుడు, గ్రహదేవతలలోనొకడు అతడే మరల శుక్రదాతువై తండ్రి గర్భమునుండి తల్లి గర్భములోనికి ప్రవేశించి, జీవోత్పత్తికి కారణమగుచున్నాడు ఇదియే 'ప్రజాపతిశ్చరతి గర్భే అన్తః అని చెప్పబడినది ఈ శుక్రుడు రాక్షసగురువుగా పురాణములయందు వర్ణింపబడినాడు రాక్షసః అను శబ్దము రక్ష' అను శబ్దమునుండి వచ్చినది రాక్షసులనగా దేహమును చెడిపోకుండనిలిపియుంచునట్టి లేక రక్షించునట్టి శక్తులు ఇవియే దాతువులయందును ఖనిజములయందును పనిచేయుచున్నట్టి శక్తులు అట్లు, దాతువులతో కూడిన మానవ దేహము మయసబగా మహాబారతమునందు చెప్పబడినది దీనిని మయుడను రాక్షసుడు నిర్మించి పాండవులకు కానుకగా ఇచ్చెను పాండవులనగా పంచేంద్రియ ప్రజ్ఞలు వారికి నివసించుటకివ్వబడిన గృహమే మయసబ

ఇదియే మానవుని బౌతికదేహము అందు ఉన్నవి లేనట్లు, లేనివి ఉన్నట్లు కనిపించును మానవ దేహమునందు, దేహమునకు కారణమైనట్టి ఆత్మ కనిపించదు బౌతికద్రవ్యముల పేర్పుగా నిర్మింపబడిన శరీరము మాత్రము యున్నట్లు కనుపించును ఉన్నది ద్రవ్యముల(Chemicals or elements) పేర్పు తప్ప దేహముకాదు ఆ పేర్పు ప్రాణశక్తి పై మరియు జీవ ప్రజ్ఞ (Soul) పై ఆదారపడియుండును కాని అవి కన్పింపవు ఇట్టి భౌతిక దేహనిర్మాణమునకు శుక్రుడే కారణము దేవదానవ యుద్ధమునందు రాక్షసులు చనిపోవుచుండగా శుక్రుడు మృత సంజీవినీ విద్యచే చనిపోయినవారిని మరల బ్రతికించుచుండెను అనగా జీవులకు శరీరములు నశించుచుండగా శుక్రదాతువు వలన స్త్రీ గర్భకోశమునందు శరీరములు కల్పింపబడి జీవులు మరల జీవించుచున్నారని అర్థము పైన చెప్పబడిన మంత్రామునందు వృత్తము, కేంద్రము అనునవి న్యాసము చేయబడుచున్నవి కనుక ఈ మంత్రార్థము తెలియవలెనన్నచో ఒక వృత్తమును గీచుకొని దాని కేంద్రమున బిందువు నుంచి అట్టిది ద్యానమందిరమున నుంచుకొనువారికి ద్యానము చేయుట సులబమగును

## మంత్రము 2

**యస్మిన్నిదగ్ం సంచవిచైతిసర్వం యస్మిన్ దేవా అది విశ్వేనిషేదుః|**
**తదేవ బూతం తదు బవ్యమాఇదం తదక్షరే పరమే వ్యోమన్||**

## ప్రతిపదార్థము

ఇదం సర్వం = ఈ సమస్తము
యస్మిన్ = దేనియందు
సం (పతిచ) = నిలిచియున్నదో
వి, పతిచ = మరల లయమగుచున్నదో
యస్మిన్ = దేనియందు
విశ్వే దేవాః = విశ్వము నందలి దేవతలు
అదినిషేదుః = ఆశ్రయించి యున్నారో
తదేవః = అదియే
బూతం = జరిగిపోయినది
తత్ + ఉ = అది మాత్రమే
బవ్యమ్ = జరుగనున్నది

తత్ + ఉ = అదియే
ఇదం = ఈ వర్తమానము సైతము
తత్ = అది
అక్షరే =నశింపనిదైన
పరమే = అతీతమైన
వ్యోమన్ = ఆకాశము నందు

## తాత్పర్యము

ఈ ప్రపంచమంతయు, దేనియందు నిలచియున్నదో మరల దేనియందు లయమగుచున్నదో, ఈ విశ్వము నందలి దేవతలందరు దేనియందు ఆశ్రయము కలిగి నిలిచి యున్నారో అదియే భూతము, భవిష్యత్తు మరియు వర్తమానము అను మూడుగా తెలియుబడుచున్నది అది అన్నిటికిని అతీతమై ఆకాశమునందు నశింపని స్థితియందు అనగా అక్షరమైయున్నది

## వివరణ

ఈ ఋక్కునందు మొదటి ఋక్కునందు వలెనే కర్తకు పేరు చెప్పబడలేదు ముందరి మంత్రవివరణయందు నారాయణుడను పేరు చదువు వారి సౌలభ్యము కొరకు ఉపయోగింపబడినది కాని మంత్రము నందు అట్టి పేరు లేకయే ఋక్కు చెప్పబడినది ప్రజాపతియనునది కూడ పేరు కాదుకదా! ఆ పదమునకు సృష్టించువాడు అని అర్థము అది లక్షణమే కాని పేరు కాదు నిజమునకు నారాయణుడనగా జలములే తన మార్గముగా గలవాడని అర్థము కనుక అది కూడ లక్షణమేగాని పేరు కాదు కనుకనే పెద్దలు దానిని 'తత్' అను శబ్దము చేత మరియు వరి అను శబ్దము చేత అతడనియు పిలిచిరి కృష్ణుడు భగవద్గీత యందు దీనినే నేను అను శబ్దముతో చెప్పెను ఈ ఋక్కు నందు దానినే యస్మిన్ అని వర్ణించిరి సృష్టి యందు అదియే సమస్తముగ వ్యక్తమై, మరల ప్రళయములోనికి లీనమగుచున్నది దీనిని ఆశ్రయించియే విశ్వము నందలి దేవతలందరు వ్యక్తమై నిలిచియున్నారు అనగా వారి వారి ప్రజ్ఞలుగా నుండుటయే గాక వారి దర్మములుగా అదియేయున్నది అనగా వారి ధర్మములకు అది అని చెప్పబడు వెలుగే ఆదారమైయున్నది దానినే భూతము జరిగిపోయినట్టిదిగా, మరియు భవ్యము జరుగ బోవు నట్టిదిగా చెప్పిరి భూతముజరుగుటకు ముందు జరిగిపోయినట్టిది ఎక్కడ వున్నదో,

జరుగబోవునది అక్కడవున్నది రెండు చోటులోనే యున్నవి అది ఎట్లనగా మనము వినుచున్నబాగము వర్తమానము ఈ మూడును టేపులో నున్నట్లే విన్నది, వినుచున్నది, వినవలసినది భూత భవిష్యవర్తమానములుగా మూడునూ చోటునందు సంస్కారములుగా నున్నవి ఇట్లు భూతము, భవిష్యత్తు, మరియు, వర్తమానముగానున్న దంతయునొకే వెలుగు సత్యమేమనగా పనులు జరుగుచున్నపుడు వాటి ప్రబావము మనస్సుపై పనిచేయుట వలన అనుభవముగా తెలియుచున్నది నిన్న అనగా జరిగిపోయిన అనుభవము యొక్క స్మృతి అట్లే రేపు అనగా జరుగబోవు పనులను గూర్చిన ఊహ ఇట్లు నిన్న, రేపు, లందు మనస్సు మాత్రమే పనిచేయు చుండగా వర్తమానము నందు అనుభవముగా మేల్కొని యున్నాడు ఇష్టమైనను, కష్టమైనను కాలము దాని ప్రబావము చూపుచునే యుండును ఈ అనుభవములు రుచుల వంటివి అవిపదార్థములకు సంబంధించినవని తెలిసినవానికి అన్ని రుచులు ఇష్టమే యగును కనుకనే ఈ చోటుయందున్నట్టి భూతభవిష్యవర్తమానములనే మానవుల స్వబావములుగా చెప్పుదురు అనగా ఇది వ్యక్తులలోనున్నపుడు వాటిని వారి వారి స్వబావములుగా గుర్తించెదరు వ్యక్తుల కతీతముగాచోటులోనున్నపుడు వాటినే సత్వము, తమస్సు, రజస్సు, అను త్రిగుణములుగా చెప్పిరి ఈ మూడు గుణములతో కూడియున్నటువంటి దానినే ప్రకృతి అందురు

అనగా ఈ త్రిగుణములునూ ప్రకృతి నుండియే పుట్టును, ఈ మూడు గుణముల వలన భౌతికమైన సృష్టియే గాక మానసికమైన అంతఃసృష్టియును జరుగును వాస్తవమునకు ప్రకృతి యనగా ఈ త్రిగుణముల సంపుటీకరణము అనగా ఇట్లు సత్వము, రజస్సు, తమస్సను మూడు గుణములుగా నేర్పడినటువంటి ప్రకృతియే సూర్యోదయము। మిట్టమధ్యాహ్నము, సూర్యాస్తమయము అను మూడు గుణములు గలిగినటువంటిదిగా నున్నది ఈ మూడింటిని కలిపినచో రోజగును అట్లు ప్రకృతియే సూర్యోదయ, సూర్యాస్తమయములుగా దిగివచ్చుచున్నది ఇదంతయు సూర్యోదయమునకు ముందెచ్చటనున్నది?

భూమితన చుట్టూ తాను తిరుగుట అను స్వబావముగా ఇది ఏర్పడి వున్నది ఈ విధముగా ప్రకృతి భూమియందు అనువర్తించుట వలన సూర్యోదయము, సూర్యాస్తమయము ఏర్పడి వాటి కలయికయే రోజుగా తెలియుచున్నది అట్లే ఈ రోజు, రేపు, నిన్న అనునవి కూడా

తెలియుచున్నవి 'నిన్న' కాలమందు చుట్టుకొని యున్నది రేపు విచ్చుకొనబోవుచున్నది ఈరోజు విచ్చుకొనుచున్నది ఇదియే పురాణములు, ఉపనిషత్తులయందు సంకేతింపబడినది నిన్నటిపూవు వాడిపోయినది నేటి పువ్వు విచ్చుకొనుచున్నది రేపటి పువ్వు మొగ్గగానే యున్నది దీనినే పెద్దలు పోలికగా చెప్పిరి అట్లేరాబోవు పువ్వులు పసరు మొగ్గలుగను మరికొన్ని చిగుళ్లయందుండగా అనేకములు ఇంకను చెట్టునందే యిమిడియున్నవి ఇట్లెన్ని యున్నవో చెప్పుటకు వీలుకాదు మరల వాటినుండి విత్తనములు వచ్చి మరికొన్ని మొక్కలు వచ్చును వానికి మరల పూలు పూయును కావున ఈ నాటి పూవు నిన్న మొగ్గగా నున్నది నిన్నటి పూవు నేడు చోటులో కలిసిపోయినది అది అణువులుగా మారి భూమి యందు కలసిపోయి మరల ఆ అణువులే చెట్టునందు భాగములై వచ్చుటకు వేచి యున్నవి దీనినే కాలమను చక్రముగా పెద్దలు చెప్పిరి కావున 'తదేవ భూతం తదుభవ్యమా' అనినచో భూతమనగా జరిగిపోయి నట్టిది భవ్యము అనగా జరుగబోవునట్టిది అని అర్థము దీనినే పెద్దలు అక్షరము (నాశనము లేనిది ) అనిరి అనగా జరిగిపోయినది (ఏమయినది? ఏమియుకాలేదు) మరల రేపుగా దిగివచ్చుటకు సిద్ధముగా నున్నది ఇట్లు మరల మరల సూర్యోదయము వచ్చుచునేయుండును ఇట్లు నశింపని దానినే అక్షరము అని అందురు ఇది పరమమైనటువంటి నాశనము కానటువంటి ఆకాశముగానున్నది అచ్చట ఇది అతీతముగా నున్నది అనగా మనకు అందవి స్థితిలో నున్నది ఇచ్చట మనకు ఈ రోజు నిన్న రేపు యనునది అచ్చట వాని స్వభావములను కోల్పోయి ఆకాశమను పదార్థముగా మారిపోవును అనగా ప్రకృతికి అతీతమయిన స్థితిలోనికి పోవును అప్పుడు అది శాశ్వతమైన వర్తమానము (The Eternal Presence) గా నిలిచి యుండును ఈ వర్తమానము ఆకాశము అంతర్యామి యందు లీనమై పోవును అనగా అప్పుడు చోటు (Ether) అను ప్రజ్ఞ యుండదు చోటును తెలుసుకొను ప్రజ్ఞయు నుండదు ఇదియే తన యందు తానున్నటువంటి స్థితి ఇట్టి స్థితినే పరమాత్మ, నారాయణుడు, అతడు, అది, తత్ యను శబ్దములతో చెప్పిరి అయితే ఈ శబ్దము లన్నియు అతడిని గురించి చెప్పినవే కాని, అనుభవముగా వచ్చినవి కావు ఆయనను తెలిసికొనవలసిదే కాని ఇట్టి వాడు, అట్టి వాడు అని ఇదమిత్థముగా చెప్పుటకు వీలుకాదు అనగా లోపలకు వెళ్ళకుండా Compound Wall చుట్టూ తిరుగుట వంటిది కనుక అతనిని మనము తెలుసుకొనవలెనన్నచో అతడి యందు

మనముండుటయే మార్గము అట్టి స్థితిలో మనకు తెలిసియున్న భౌతిక స్థితులన్నియు నశించును కావున ఇవి యన్నియు ఎచ్చట నున్నవి యన్నచో తదేవ భూతం, తదుభవ్యమా ఇదం, తదక్షరే పరమేవ్యోమన్ అని చెప్పబడినది అనగా భూతము, భవిష్యత్తు, వర్తమానము, యను మూడు స్థితులలో ఈవలకు వచ్చుచున్న సమస్తము అంతర్యామిగా యున్నది అనగా చోటుయందు (తనయందు) తానుగా నున్నది కాని అట్టిస్థితియందు కాలము యొక్క ప్రభావము కాని, దాని అనుభవము గాని ఇచ్చటి లోకములయందు మనకున్నట్లుగా నుండవు

ఉదా బాగా అలిసి పోయిన పిమ్మట, నిద్రించిన వ్యక్తికి బడలిక తెలియని మంచి నిద్ర పట్టి, తిరిగి ఉదయమున లేచినచో తాను అపుడే పడుకొని లేచినట్లనిపించును ఇట్లనిపించుటకు వెనుక ఒక సత్యము కలదు అది కేవలము భ్రాంతి కాదు ఎందుకనగా అట్టి సమయమునందు తన శరీరము, మనస్సు కూడ తనయందే లయము చెంది యుండును అప్పుడు తనకున్నట్టి భౌతిక సంబందములన్నియు తెగిపోవును అప్పుడు జీవుడు కాలాతీతస్థితిని (Timelessness) పొందును అనగా తనయందలి లోకములన్నిటిని అదిగమించి తనయందు తానుండునట్టి, కాలమున కతీతమైనట్టి, స్థితిలో నుండును ఆ సమయమున తన చుట్టు ఏమిజరిగెనో తెలియని స్థితిని పొందును అందువలననే గాఢనిద్ర యందు సుమారు 6 7 గంటలు గడచి పోయినను కేవలము ఒకటి రెండు గంటల కాలము మాత్రమే గడచి నట్లుండును దీనిని బట్టి అట్టి స్థితులయందు కాలము యొక్క ప్రభావము, అనుభవము ఎట్లుండునో గ్రహింపవచ్చును ఊర్ధ్వ లోకములోనికి పోవునపుడు కాలము యొక్క ప్రభావము తొలగి పోవును మన రోజు మనకన్నను తక్కువయైన చీమ, దోమ మొదలైన వానికి ఒక సంవత్సరమువలె నుండు

వాస్తవముగా భూతము, భవిష్యత్తు, వర్తమానము యనునవి పరమాత్మయొక్క వ్యక్తస్వరూపములే అంతర్యామియైనట్టి పరమాత్మయే కాలస్వరూపుడై కాలముగా విచ్చుకొని ఈ మూడుదశలుగా తెలియబడుచున్నాడు కావున నీవు సత్యము, నీ యొక్క అనుభవము సత్యము ఆ అనుభవము నిన్న నొక విదముగను, ఈ రోజొక విదముగాను రేపు ఇంకొక విదముగను యున్నను ఈ మూడుగా కలసి యుండునది ఒకే అనుభవము ఇది తెలిసిన వారు భూతము, భవిష్యత్తు అను ఊహాలలోనికి చెదరిపోక మనస్సును వర్తమానము నందు లయము

చేయుచున్నారు వర్తమానము నందలి అనుభవమే నారాయణుని అస్తిత్వము ఇట్టి అనుభవమును ఇచ్ఛా ద్వేషములతో ముడి పెట్టక అనుభవముగనే గమనించువానికి మిగిలిన వన్నియు నశించి నారాయణుడుండును అప్పుడు జీవునకు బంధము నశించి మోక్షస్థితి కలుగును

ఇట్లు నిరంతరము తానుగానున్న, లేక అనుభవముగ, తనకు తాను తెలియు స్థితినే, అక్షరమని అందురు అక్షరమనగా నాశనము లేనిది అదియేతో "ఓంకారము" కనుక "ఓంకారము" నందున్న వానికి నశించుటలేదు అనగా హృదయమునందు ఓంకారము మేలుకొని యుండి, మిగిలినది లేని వానికి నారాయణుడుండును అట్టి స్థితియే నారాయణుడుండు లోకము అట్టి పరమాత్మ యందు జీవునికి కలుగు అనుభవమే అనేక రకములైన అనుభవములుగా విశ్లేషణము చెంది భయము, క్రోదము మొదలగునవిగా తెలియబడుచుండును అదియే కాలముగా తెలియబడును అట్లు కాలము ఈ రోజు, రేపు నిన్న అను మూడుగా చెదరిపోవుచున్నది అంతే గాక నిన్న, రేపు ఈ రోజు అను ఈ మూడు స్థితులును నారాయణుని లోకము నందు శాశ్వతము అను ఒకే స్థితిగా నున్నవి ఒక విత్తనము మొలకెత్తినపుడు అందునుండి వృక్షము ఎట్లు రావలెనో, ఆ వృక్షము యొక్క రూప స్వభావములు ఎట్లుండవలెనో అనునవి యన్నియు ఆ విత్తనము యందే ఇమిడి వున్నవి అట్లు ఇమిడి వున్న సత్యమే నిన్న బీజముగాను ఈ రోజు మొక్కగాను మారుచున్నది అదియే మరల రేపు బీజముగా వచ్చును అట్లే నిన్న అనునది ఈ రోజు యొక్క సంఘటనలుగా రూపొందును ఈ రోజు మరల రేపుగా వచ్చును ఈ రేపు అనునది మరల నిన్న అగును నిన్నటి అభిప్రాయములు ఊహాలు ఈ రోజు సంఘటనలైరేపటి ఫలితములకు కారణము లగును కావున దీనినే తిదేవభూతం తదు భవ్యమా ఇదంతదక్షరే పరమ్ వ్యోమన్ అని చెప్పిరి అనగా నశించనదిగా పరమమైన ఆకాశము నందు నిండియున్నదియని యర్థము

## మంత్రము 3

యేనా వృతం ఖంచదివం మహీంచ యేనా దిత్యస్తపతి తేజసా భ్రాజసాచ|
యమన్త స్సముద్రే కవయో వయన్తి యదక్షరే పరమే ప్రజాః ||

## ప్రతి పదార్థము

యేన = దేని చేత

ఖంచ = ఆకాశమును

దివంచ = దేవలోకమును

మహీంచ = భూలోకమును

ఆవృతం = చుట్టబడి యున్నవో

యేన = ఎవరిచేత

ఆదిత్యః = సూర్యుడు

తేజసా = తేజస్సు చేత

భ్రాజసా = భౌతికమైన వెలుగు చేత

తపతి = తపింప జేయుచున్నాడో

కవయః = కవులు (సృష్టిని అల్లికగా అల్లుచున్న ప్రజ్ఞలు)

యం = ఎవరిని

యత్ = ఏది

అక్షరే = నాశనము లేనిది

పరమే = పరమమైన

సముద్రే = జలముల మద్యనుండి

ప్రజాః = జీవులను

వయంతి = వడకుచున్నారో

## తాత్పర్యము

ఎవరిచే భూలోకము, భువర్లోకము మరియు సువర్లోకము అను మూడు లోకము లావరింపబడియున్నవో ఎవరి వలన సూర్యుడు తన ప్రకాశము చేత, కిరణములచేత భూమియందలి జలములను, జీవులను తపింప జేయు చున్నాడో, భౌతిక జగత్తును దూది నుండి దారమువడకునట్లు వడకుచున్నారో, ఎవరిని నశింపని స్థితినుండి జీవులుగ వ్యక్తము చేయుచున్నారో (ఆయనను ద్యానము చేయుము)

## వివరణ

అంతరిక్షలోకము, దేవలోకము, భూలోకము దేని చేత ఆవృతమై (చుట్టబడి) యున్నవో దానిని తెలిసికొనవలెను అనగా ఎవరు ఈ మూడు లోకములుగా దిగి వచ్చిరో ఎవరు ఈ మూడు లోకములను ఆవరించి యుండిరో, ఎవరి ప్రభావము వలన ఈ మూడు లోకములును వేరు వేరుగా పని చేయుచున్నవో వానిని తెలిసికొనుటయే (ఈ మూడు లోకములనే ప్రజ్ఞామయ, ద్రవ్యమయ, శక్తిమయ లోకములని చెప్పిరి) ఉదా మంచుగడ్డ, నీరు, నీటియావిరి అను ఈ మూడు స్థితులయందును ఉన్నటువంటి నీటిని తెలిసికొనుచున్నట్లు, పై మూడు స్థితులకు కారణము 'అది' (తత్) అని చెప్పిరి ఆయనయే(తత్) ఈ మూడుగా ఆవరించియున్నాడు మరియు ఈ మూడు లోకములను, భూమియందలి జలములను, జీవులను, ప్రకాశముచేత, కిరణములచేత తపింపజేయు చున్నాడు 'ఖం' అనగా చోటు భూమికి, ఆకాశమునకు మధ్యనున్నది చోటు భూమి కేంద్రముగా నుండి ఆకాశము దాని చుట్టునూ పరిధిగా నున్నవి మనము పైకి చూచినపుడు నీలముగా భూమిచుట్టును ఆవరించి యున్నట్లు కనుపించునది ఆకాశము దీనినే దివము అని కూడ అందురు ఈ ఆకాశము నందే సౌరమండలము తేలియాడుచున్నది

సూర్యుని యొక్క తేజస్సు అనగా ఆయన ప్రకృతి లేదా స్వభావము సూర్యుని శక్తి అనగా సౌరశక్తి సౌరమండల మంతయు వ్యాపించి యుండును అందు గ్రహగోళములు పుట్టుట, వాటియందు జీవులు పుట్టుట, ఆ జీవులకు ప్రాణశక్తి మున్నగునవి సూర్యుని వలన జరుగుచున్నవి జీవులకు జీవించియుండుటకు కావలసిన ప్రాణశక్తి భూమినుండి రావలయును ఎందుకనగా సూర్యుని నుండి ప్రసరించు ప్రాణశక్తి (Solar energy) చాల తీక్షణముగను, అత్యంత తేజోవంతముగను ఉండి జీవులకు భరింపశక్యముగాకుండును సూర్యుని నుండి ప్రసరించు ప్రాణశక్తి భూమిచే గ్రహింపబడి భూమిపై జీవులకు వినిమయమగును ఈ సౌరమండల మంతయు వ్యాపించియున్న ప్రాణశక్తి వలననే సూర్యుని చుట్టు ప్రకాశము (aura) ఎంతవరకు వ్యాపించి యున్నదో తెలియును భ్రాజస్సు అనగా సూర్యుని కిరణములయొక్క వెచ్చదనము, వెలుగు

''ఆదిత్యః తపతి'' అనగా ఆదిత్యుడు తపింపజేయుచున్నాడని అర్థము అనగా వంట చేయునపుడు వంట పాత్ర క్రింద నిప్పును ఉంచుట వంటిది దానివలన మంట తయారగును అట్లే సూర్యుడును ఈ

లోకత్రయమును తపింపజేయుచున్నాడు అనగా సృష్టి ప్రారంభము నందు జీవులు, గ్రహములు ఏర్పడినప్పుడు సూర్య కిరణములు ఈ భూమిని తపింపజేయును తపింపజేయుట యనగా మండించుటకాదు వాస్తవమునకు చోటుయందు మహర్షులు తపస్సు చేయుచుందురు వారు ప్రజ్ఞామయమూర్తులు అనగా మనస్సును కక్ష్యకతీతమగు స్థితియందుంచుదురు కావలసి వచ్చినపుడు మాత్రము మానస కక్ష్యలోనికి దిగివచ్చెదరు కాని వారచ్చట ప్రజ్ఞామయ మూర్తులుగా, తేజస్సులుగా, వెలుగుగా నుందురు

ఇచ్చట తేజస్సు ద్వారా తపింపజేయుట యనగా, తల్లి గర్భము నందున్న బిడ్డకు తల్లి నుండి గలుగు వెచ్చదనము వంటిది సౌరమండలమునందేర్పడుట అది భౌతికమైన వెచ్చదనమే గాక ప్రేమయను వెచ్చదనము కూడ ఈ ప్రేమయే భౌతికమయిన సంబంధముగా రూపొందుచున్నది పరమాత్మ 'తనయందు తానుగా' నున్న స్థితి నుండి ప్రేమగా దిగివచ్చినాడు దీని వలన ప్రేమ, ప్రేమించువాడు అను రెండు వచ్చినవి ప్రేమింపబడుటకు మూడవది ఒకటి కావలసియుండును అట్టి మూడవదిగా సృష్టి దిగివచ్చినది ఇది అనేక స్థితులలో దిగి వచ్చును (Layers of Manifestation) కావున ఎవ్వరైనను పవిత్రమైన ప్రేమను అభ్యసించినచో క్రమేణా వారు సహజముగా అట్టి స్థితియందు ఉండెదరు కనుకనే దానిని "పరమ ప్రేమ రూపా" అని చెప్పిరి ప్రేమ అంతర్యామియందు ఐక్యమైనపుడు జీవులకు నిజమైన ఆనందము తెలియును అట్టి ఆనందము నందు తన అస్తిత్వము పూర్తిగా నశించినచో అట్టి స్థితినే పరమ ప్రేమ అని, ఆనందమని, సముద్రమని పిలచిరి ఇట్టి ప్రేమయను కిరణముల చేతనే సూర్యుడు గోళములను గ్రహములను పొదుగుచున్నాడు ఇట్లు పొదుగుట చేతనే భూమియందేర్పడు వెచ్చదనమునకు భూమి నుండి విత్తనములు మొక్కలుగా వచ్చుచున్నవిగాని కేవలము నీటి వల్ల కాదు ఆంగ్ల సంప్రదాయమునందు దీనిని "Warmth of Love" అందురు

ఇట్లు తపింపజేయు సూర్యుడు తన కిరణముల యందలి మరియొక శక్తి ద్వారా వేడిని కలుగ జేయును దాని వలన సూర్యుని చుట్టు ప్రజ్ఞామయమూర్తులు ఏర్పడిన పిమ్మట వానినుండి గోళములు, గ్రహములు కట్టుకొనుట జరుగుచున్నది ఇట్లు గ్రహగోళము లేర్పడుటకు సూర్యుడు కారణమగుట చేత ఆయనను 'సవితుడు' అనిరి సవితుడనగా

సృష్టికర్త సూర్యుడు తన అపారమయిన ప్రేమయను వెలుగు చేతనే గ్రహములు మున్నగునవి ఏర్పడునట్లు చేయుచున్నాడు తల్లినుండి బిడ్డలవలె సూర్యుని నుండి గ్రహములు పుట్టుచున్నవి సూర్యుడు ప్రేమ స్వరూపుడు అతడు తేజస్సు, బ్రాజస్సు యను రెండు రకముల కిరణముల ద్వారా సమస్తమును తపింప జేయుచున్నాడు అట్లు సూర్యుని వేడి చేత సౌర మండలమునందు అనేక మార్పులు జరిగినవి సూర్యుని వెలుగు మొదట మిక్కిలి తీవ్రముగా నుండును దానివలన సౌరమండలమంతయు పొదగబడినట్లయ్యెను దానివలన అప్పటివరకు భౌతిక గోళములో లేని గ్రహముల కన్నింటికి గోళములేర్పడినవి తరువాత సూర్యుడు తన వేడిని మరికొంత తగ్గించుకొని సప్తవర్ణాకృతమైన తెల్లని వెలుగును ప్రసరింపజేసెను అప్పుడు క్రమేణా భూమియందు అనుకూల వాతావరణమేర్పడి వృక్షసంతతి, జంతుసంతతి, మానవ సంతతి ఉత్పత్తి అయ్యెను అనగా సూర్యుని రూపమున బ్రహ్మ తన కిరణములయిన తేజస్సు, బ్రాజస్సులతో తపస్సు చేయుచున్నాడు తన తేజస్సు చేత గ్రహములు మున్నగు వాటిని పుట్టించుటయే కాక తన బ్రాజస్సు అనగా వేడి కిరణములు ద్వారా భూమియందున్న నీటిని ఆవిరిగా మార్చి ఆ తరువాత అది మేఘములై ఒకదానితో నొకటి తాకుట వలన మెరుపు లేర్పడి (electrical Charge) తిరిగి వర్షము రూపమున భూమికి నీరు వచ్చునట్లు చేయుచున్నాడు అంతే గాక నీరు భూమి మీదకు వచ్చుటకు ముందు చోటు నందలి ప్రాణశక్తి (Vital energy) చే Charge చేయబడుచున్నది నీటిబిందువులు life energy చే Charge చేయబడినప్పుడు మాత్రమే వర్షము వచ్చును లేనిచో మేఘములున్ననూ వర్షము పడుట జరుగదు ఏలయనగా నీరు వర్షించుటకు ముందు చోటు యందున్నట్టి ప్రాణశక్తి (Vital energy or Electrical energy జీవశక్తి (Life Energy) గా మార్పు చెందుచున్నది Here due to the atmospheric changes under Sun's leadership the water molecules absorb the electrical energy which is converted into biological energy (life energy) and then the water becomes fertile మేఘముల యందలి నీటి అణువులయందు ఆ జీవశక్తి నిక్షిప్తము (Charge) చేయబడుచున్నది అనగా ఉరుములు మెరపుల ద్వారా చోటునందలి ప్రాణశక్తి (electricity) నీటి యొక్క అణువులలోనికి నిక్షిప్తము (Charge) చేయబడుచున్నది అపుడా నీటిబిందువులు సత్త్వవంతములు (Fertile or potential) మరియు జీవవంతము లగును అపుడే వర్షము వచ్చును ఇట్లు సూర్యుడు తన

తేజస్సు మరియు బ్రాజస్సులను కిరణముల ద్వారా తపస్సు చేయుచు మూడు లోకములను ఆవరించియున్నాడు ఇదియే నారాయణము అనగా నీటియొక్క పరిభ్రమణాత్మకమైన మార్గము నారముల యొక్క అయనము ఇట్టి అయనము లేక పరిభ్రమణమెవ్వరి వలన జరుగుచుండునో అతడు నారాయణుడు మనకు తెలిసిన ఈ నీరు భౌతికము దానికి కారణమైన జలత్వము అను శక్తి ప్రాణశక్తి రూపమున చోటులో నున్నది అట్టి ప్రాణశక్తి కాధారమైన జలములు, రసములు అను పేర చోటులో నున్నవి అవి అనుభవములు(Experiences) అను పేర మనచే తెలియబడుచున్నవి ఇదియే వేదమునందు "ఆపోవా ఇదగ్ం సర్వం విశ్వాభూతాన్యాపః ప్రాణావా ఆపః పశవ ఆపో అన్నమాపో అమృతమాప" అని కీర్తింపబడినది ఇట్టి జలముల రూపమున సృష్టి లోనికి వ్యాపించి మరల అవ్యక్తముగా లయమగువాడు నారాయణుడే

దివము, అంతరిక్షము, భూమి ఈ మూడును Three levels of energy or forces గా చెప్పబడినవి "Ether" అను పదమునకు చోటు అని అనువదించుట సరికాదు సూర్యుని చుట్టు ప్రాణశక్తి ఉన్న పరిధి సౌరమండల మనబడును ఈ Ether వేరు చోటు వేరు చోటు (Cosmos) నందు సౌరమండలము ఒక గ్రుడ్డువలె తిరుగుచుండును ఈ ఆకాశమునే సముద్రమని కూడ అందురు ఇవి చోటు యందలి వృత్తము, కేంద్రమువలె నున్నవి ఈ రెండింటికిమునకు, వృత్త కేంద్రమునకు గల సంబంధము లేక భావమునే (pie 22/7) అని పిలిచిరి అట్లు ఈ మూడింటినీ (మూడు లోకములను) చుట్టియున్న వానిని ద్యానింపవలెను అనగా భూమియందు భౌతికముగను, అంతరిక్షమునందు శక్తిగను, దివమునందు వెలుగుగను పనిచేయుచున్న వానిని ద్యానింప వలెను అంతేగాక ఎవరియొక్క అనుగ్రహము వలన సూర్యుడు తన తేజస్సుల చేతను, బ్రాజస్సుల చేతను తపించు చున్నాడో అట్టి వానిని (మూలమును) గూర్చి ద్యానించవలెను

ప్రత్తి నుండి దారములు, దారములనుండి వస్త్రములను వడకునట్లు సముద్రము అను మహాజలముల నుండి ఈ సమస్తము అనగా జీవులు జగత్తు వడకబడుచున్నవి అనగా అల్లిక చేయుబడుచున్నవి దీనినే భగవద్గీత యందు కృష్ణుడు "కవీనాముశనాకవిః" అని చెప్పెను అనగా కవులలో నేను ఉశనసుడను అని అర్థము ఉశనసుడు అనగా శుక్రుడు శుక్రుడు అనగా శుక్రము నందున్నట్టి ప్రజ్ఞ అతడే ప్రజాపతి శుక్రమునందుండి వాయువు నీరు మున్నగు పంచభూతములతో చక్కటి

దేహమును నిర్మాణము చేయుచున్నాడు అందువలననే ఈయనను ''కవి యనిరి కవి యను పదమునకు అల్లిక చేయువాడని అర్థము ఇట్లు వేద వాక్యముల నుండి ముఖ్యార్థమును గ్రహించి గౌణార్థమును వదలి పెట్టవలెను ఇట్టి వేదార్థము తెలియుటకే వేదమంత్రములను గురుముఖముగా ఉపదేశము పొంది, దారణ చేసి ద్యానము చేసెడివారు మంత్రముల యందలి ప్రతి పదమునకు గల అర్థమును ద్యానము చేయుట వలన అనేక మార్పులు కలుగును ఈ మంత్రములు గురువులచే ఉపదేశింపబడుచుండెడివి ఋషులు వేదమును అధ్యయనమును చేసిరి అనగా మంత్రముల యందున్న పదములకు కేవలము అంతరార్థమును తెలిసికొనుటయే కాదు ఆచరణ జ్ఞానముండవలెను ఉదాహరణమునకు వైద్యశాస్త్రమునందు పట్టాను పొందిన ఒక వ్యక్తి తనకన్నను అనుభవజ్ఞుడైన (Senior) మరియొక వైద్యుని వద్ద కొంత కాలము పనిచేయును ఇచ్చట ఆయన నుండి ఈయనకు వచ్చుచున్నది ఒకటున్నది దానినే విద్య అందురు విద్య అనగా పుస్తకములను చదువగా వచ్చునది కాదు విద్య యనగా గురువు యొద్దనుండి శిష్యునికి పరంపరగా వచ్చునది అనగా ''ఆచరణతో కూడిన విజ్ఞానము '

''విత్ అను శబ్దము నుండియే విద్య, వేదము అను శబ్దములు వచ్చినవి కావున వేదమునకు విద్యకు సంబంధము గలదు ఈ విషయము గ్రహించిన పిమ్మట వేదమును తెలిసికొనువారు ''విద్యాభ్యాసము'' చేసిన వారగుచున్నారు ఇట్లు విద్యాభ్యాసమును చేయుటను ''అధ్యయనము'' అందురు అధ్యయనము చేయుట యనగా గురువుచే ఉపదేశింపబడినట్టి మంత్రమును ఏకాగ్రతతో దారణ లేక ద్యానము చేయుట వలన అన్యములైన బావము లన్నియు నిర్మూలనము చెంది గురువుచే వివరించబడినట్టి పరమార్థము (Import) మాత్రము మిగిలి యుండును ఇట్లు గురువు నుండి శిష్యునికి ప్రవహించునదియే విద్య, దీనినే 'సరస్వతి' యందురు సరస్వతి యనగా ప్రవహించునది యని అర్థము

ఈ ప్రపంచము దేనియందుండునో అట్టి దానిని సముద్రము యనిరి (అనగా Physical consciousness precipitate కాని స్థితి యిది) అనగా బౌతికమయినటువంటి సత్వము, తమస్సు, రజస్సునూ వేర్వేరుగా ప్రవృత్తి చెందక మూడునూ కలసి ఒకే గుణముగా నుండు స్థితి (All the three gunas are in it, but they are in dissolved condition) అట్టి మూల ప్రకృతి యందు ఈ మూడు గుణములునూ మూడు సంస్కారములు (Tendencies) గా వున్నవి

ఇట్లు సత్వము, తమస్సు, రజస్సులు తమ దర్మములతో కలసియుండు స్థితినే మూల ప్రకృతియని, సముద్రమని, పరాశక్తియని (one continued experience) పిలచిరి అనగా బౌతికముగా తానున్నానను బావన నశించి ఏరూపము ఏర్పడని స్థితి అట్టి స్థితి యందు జీవుల యొక్క అస్తిత్వము కరిగిపోయి, వారి అస్తిత్వము వారికి తెలియని ఒకే స్థితిగా ఉండును. ఇదియే వేదాంతులచే తురీయస్థితి అని పిలువబడినది దీనినే వేద ఋషులు సముద్రమనిరి దానినుండి కవులు లేక ప్రజాపతులు ఈ సృష్టిని వడకుచున్నారు వారునూ ఈ సముద్రమునుండి ఏర్పడిన వారే అయినచో వారు దేనిని వడకుచున్నారు? కుండలను తయారుచేయు కుమ్మరి మనస్సునందు కుండకు సంబందించినట్టి బావము, రూపము ఉన్నట్లుగా ఈ ప్రజాపతుల యందును సృష్టియొక్క ప్రణాళిక యొకటి యుండగా దాని ననుసరించియే వారు సృష్టిని వడకుచుండిరి ఈ సృష్టియొక్క ప్రణాళిక అంతర్యామి యైనట్టి పరమాత్మనుండి వ్యక్తమగును మనస్సునందు కలుగుచున్న ఊహాలు ఆలోచనలు మనయందు కలుగుటకు పూర్వమెచ్చట నున్నవి? మనయందే 'మనము' గా నున్నవి కావున తననుండి పుట్టి బౌతికమయిన ప్రపంచముగా ఏది దిగివచ్చుచున్నదో దానినే అవ్యక్తమనిరి ఆ అవ్యక్తము నుండియే సమస్త సృష్టియూ అవతరించుచున్నది ఇట్లు అవ్యక్తము నుండి ఆపస్సులు లేక మొట్ట మొదటి చైతన్యము ఆవు పొదుగు నుండి పాలు పిండినట్లు కాలము, దేశము, చోటు అను వానిగా పిండబడినది అట్లు పిండువాడు నారాయణుడే ఆయన ప్రజాపతియై తననుండి అంతరిక్షము మరియు సువర్లోకము అనగా శక్తులు మరియు వెలుగులు అను రెండు లోకములను పిండెను రెండింటిని పిండెననగా మొట్టమొదట "నేను, నీవు" అను రెండు ప్రజ్ఞ లేర్పడినవి అనగా ప్రకృతి పురుషులనియూ ప్రజ్ఞలు మరియు శక్తులనియూ అర్థము దేవతలనగా వెలుగులు లేక ప్రజ్ఞలు శక్తులనగా దేవతల బార్యలు నారాయణుడే సృష్టిని తననుండి తానే పిదికెను ఆవు పొదుగును చీల్చి చూచిన వానికి అందు రక్తము మున్నగు దేహదాతువు లుండును గాని పాలు నిండియుండవు గోవు శరీర దాతువుల నుండి పొదుగు నందున్న పాలగ్రందుల ద్వారా పాలు తయారగుచున్నవి కనుకనే సువర్ణసూక్తము నందు సూర్యుడు ఆవు పొదుగుగనూ కిరణములు పాలుగనూ వర్ణింపబడినవి

ంత్రము 4

ంతః ప్రసూతా జగతః ప్రసూతీ తోయేన జీవాన్వ్యచసర్జ భూమ్యామ్ |
ందోషధీభిః పురుషాన్పశూగ్ంశ్చ వివేశభూతానిచరా చరాణి||

ంతిపదార్ధము

యతః = దేనివలన, ఎవరివలన

జగతః = జగత్తులయొక్క

ప్రసూతీ = ప్రసవించబడినట్టి

ప్రసూతా = వ్యక్తమగు చున్నదో, సృష్టింపబడుచున్నదో

తోయన = జలములచే

జీవాన్ = జీవులను

భూమ్యామ్ = భూమియందు

వ్యచసర్జ = విశేషముగా సృష్టించెనో

యత్ = ఎట్టి

ఓషదీభిః = ఓషదులను కలిగి

పురుషాన్ = మానవులను

పశూగ్ శ్చ =(పశూః+చ)= మరియు, పశువులను

భూతాని =భూతములను

చరాచరాణి =కదలునవి, మరియు కదలనివి అన్నింటిని

వివేశ = ప్రవేశించెను

ాత్పర్యము

ఏచైతన్యము వలన సృష్టి వ్యక్తమగుచున్నదో, ఏది జలముల నుండి
వులను భూమియందు సృజించెనో దేనివలన ఓషదులు మున్నగునవి
ానవులు, పశువులు, కదలునవి మరియు కదలనివి అన్నింటి యందును
వేశించునో (అట్టి చైత్యమును) మొదట సృష్టించెను

వరణ

''జగత్తులయొక్క సృష్టి'' జగత్తులు వేరు సృష్టి వేరు సృష్టికి
ార్వము జగత్తులన్నియూ 'ముద్రలు' Moulds గా నున్నవి
ిటిననుసరించి సృష్టి జరుగుచుండుట అనగా అవి ఈ భౌతికమయినట్టి

(ద్రవ్యమయమైనట్టి) ప్రపంచమునకు సంబంధించిన ముద్రలు (అచ్చుల వంటివి) సృష్టికి పూర్వము ఇవి సూక్ష్మమయిన స్థితి యందు అనగా ప్రాణమయ లోకమునందుండును దీనినే అంతరిక్షలోకమని అందురు అట్లు అంతరిక్ష లోకమందలి ముద్రలననుసరించి ఈద్రవ్యమయమైన ప్రపంచము ఏర్పడుచున్నది అయితే, అంతరిక్షలోకమునందు ఈ ముద్రలు దేనివల్ల నేర్పడుచున్నవి? కేవలము ప్రజ్ఞ (Consciousness) వలన నేర్పడుచున్నవి కనుక, జగత్తునకు ప్రజ్ఞ యొకటియున్నది మానవునకు తనశరీరమెట్లు జ్ఞాపకముండునో అట్లే భూమికినీ తానొక గోళముగా జ్ఞాపకముండును ఇట్లు తనను గూర్చిన జ్ఞాపకములు లేక మానసిక రూపములే''ముద్రలు'' అని చెప్పబడినవి నిజమునకు ఇవి సూక్ష్మదేహమునందలి ప్రాణమయ కోశమునందున్న ఆకారములే మొత్తము చోటు నందున్న ప్రాణ శక్తియందు ఈ ముద్రలు తేలుచుండును ఈ ముద్రలు క్రిమికీటకాలు నుండి, మానవ దేహములు మాత్రమే కాక గ్రహ గోళముల వరకు అన్నింటికి కలవు మన శరీరమునందు మనమున్నట్లు భూగోళము నందు భూగ్రహ ప్రజ్ఞ యున్నది అట్లే సూర్యునికి తన తేజస్సు శరీరముగా నుండును అట్లే బ్రహ్మ ఈ సృష్టి యొక్క మొత్తముగా నున్న ఒక మహావెలుగు వంటి రూపముగా నుండును దానిననుసరించియే ప్రాణకోశమునందు రూపములు కట్టుకొనును వాని ననుసరించి భౌతికమైన రూపమేర్పడును ఇట్లు సృష్టి మూడు దశలలో జరిగినది ఒకటి జీవ ప్రజ్ఞ రెండు పంచేంద్రియములతో కూడిన మనస్సు మరియు ప్రాణ మయకోశము మూడు భౌతిక ద్రవ్యములతో లేక పంచ భూతములచే నేర్పడిన భౌతిక దేహము

మొదటగా బీజరూపమైన సృష్టి అనగా పైన చెప్పబడిన ముద్రలతో కూడిన సృష్టి జరిగినది బీజరూప సృష్టి (ఎచట నుండి వచ్చిన దనగా) అంతర్యామి నుండియే వచ్చును ప్రతి వ్యక్తికినీ ''తాను'' అనగానే తన శరీరము, ఆకారము, జ్ఞప్తికి వచ్చును ఆ ఆకారమే ''తాను'' అను దృష్టి లేదా బావముగా వుండును అదియే సృష్టియొక్క ముద్రగా పనిచేయును ఆముద్రననుసరించి అంతరిక్షలోకమునందు ఒక రూపము ఏర్పడును అనగా అల్లిక చేయబడును అట్లు చేయబడిన అల్లిక ననుసరించి భౌతిక .ుయిన అణువులు దాని చుట్టూ చేరుటవలన భౌతికమయిన ాపమేర్పడుచున్నది ఉదాహరణకు మట్టితో వినాయకుని బొమ్మలు చేయువానిని గమనించినచో, అతని వద్ద చెక్కతో చేయబడినటువంటి

ముద్ర (లేక అచ్చు) ఒకటి యుండును అట్టి ముద్రపై మట్టినిపైనొక్కి తీసినచో, బొమ్మ వచ్చును ఆ వ్యక్తి ముద్ర నెట్లు చేసెననగా, అంతకుముందు ఆ బొమ్మను తన మనస్సు నందు బావన చేసెను అదియే మొదటి బీజము (Seed principle) దానిననుసరించి చెక్కముద్రను, మరల దాని నుండి మట్టి బొమ్మలను తయారుచేయుచున్నాడు అదే విధముగా మన మనస్సునందున్న సంకల్పములను అనుసరించియే మనకు శరీరము లేర్పడుచున్నవి ఇట్టి సంకల్పములు మన మనస్సులలోనికి రాకపూర్వము అవి తనయందే ఉన్నవి తననుండియే వచ్చినవి ఎట్లనగా సముద్రమున అలలు ఎచ్చటనో కాక సముద్రమునందే, అందలి బాగముగనే ఉన్నవి అవి సముద్రమునుండి వేరుగా పైకి వచ్చిననూ తిరిగి సముద్రమునందే కలియుచున్నవి అట్లే తన నుండియే తన ఆలోచన వేరుగా వచ్చుచున్నది అప్పుడు తాను, తన ఆలోచన అనునవి రెండుగా ఉండును ఆలోచన వేరుగా రాకపూర్వము అది తన యందే తానుగానే యున్నది కావున మన యందు "నేను" అనునది ఎచ్చట నున్నదో అచ్చట నుండియే ఈ సమస్త సృష్టి వచ్చినది అది తిరిగి "నేను" యందే లయ మగును అట్లు ఈ సృష్టి వ్యక్తమగుట ఉత్తరాయణమనియు, తిరిగి అవ్యక్తములోనికి లయము చెందుట దక్షిణాయనమనియు అందురు పరమాత్మ యొక్క శ్వాసగా ఈ ప్రపంచమంతయు వ్యక్తమై తిరిగి ఆయన శ్వాసగా ఆయనలోపలికి వెళ్ళిపోవును ఇట్లు నారాయణుడొకపర్యాయము శ్వాసను వదలి, పీల్చినచో ఇంతటి సృష్టియూ వ్యక్తమై తిరిగి ఆయన యందే కలిసి పోవును ఇది పరమాత్మ యొక్క ఒక శ్వాస ఇది మన శ్వాస క్రమమునకు విలోమముగా (opposite) నుండును అనగా అంతర్యామి మొదట శ్వాసను వదలి తర్వాత లోపలికి పీల్చుకొనును ఆయన శ్వాస వదలగా సృష్టి వ్యక్తమై మరల ఆయన శ్వాస లోపలికి తీసుకొనగా సృష్టిలయమయ్యెను ఇవి రెండును రెండు రెక్కలవంటివి అందువలననే ఆయనను "సుపర్ణుడు" అని అనిరి రెండు రెక్కలను కలిగి యున్న ఆ సుపర్ణుడు తన యొక్క రెక్కలపై ఈ ప్రపంచమును వ్యక్తస్థితిలోనికి తీసుకొని వచ్చి తిరిగి, అంతర్యామి లోనికి తీసుకొని పోవుచున్నాడు నారము అనగా నీరు అనియూ, నరుడు (మానవుడు) అనియు అర్థములు కలవు నారాయణుడనగా జీవులయందు అవ్యక్తముగా నుండువాడు అనియే కాక వ్యక్తమైన సృష్టి గా సహితముతానే ఉన్నాడు నీటిపై మంచు గడ్డలున్నపుడు మంచు గడ్డలయందునూ, నీటి యందును, అట్లే నీటి ఆవిరి

యందును నీరు ($H_2O$) అనే ఒకే పదార్థము వివిద స్థితులయందు, వివి
రూపములతోనున్నట్లు, ఆ నారాయణుడే ఈ బౌతికమయిన సృష్టిగను
జీవులుగను, వారి సంకల్పముగను, జరుగుచున్న పనులుగను యున్నాడు
సూర్యుని యొక్క బింబమును చెదరిన నీటి కెరటముల యందు చూచినచో
సూర్యబింబము తునకలు తునకలుగా కన్పించును అట్టి తునకల
సూర్యునికి సంబందించినవి కాక, నీటికి సంబందించినవియగును అట్లే
నారాయణుడు మన యందు బింబ ప్రతిబింబ న్యాయముగా
వ్యక్తమగుచున్నను మనము ఆయనను తోటి జీవులగను, పరిస్థితులుగను
ఇష్టమయినవారిగను, అయిష్టమైన వారిగను, కోపముగను, ద్వేషముగను
బయముగను, ప్రేమగను అనేక విదములుగా దారణచేయుచున్నాము
ఇట్లు మొత్తముగానున్నది తానే(నారాయణుడే)

ఈ సృష్టి చేయుటకు నారాయణుడు ప్రజాపతిగా చరించుచున్నాడు
కుమ్మరి వాడు వాని మనస్సు నందున్నట్టి కుండ యొక్క రూపమున
బౌతికమైన కుండగా చేయుటకు వాని చేతులు పనిచేయునట్లే,
నారాయణుడే మరల ప్రజాపతిగా పనిచేయుచున్నాడు కనుక ఓషదులతో
కూడి మానవులను, పశువులను, ప్రజాపతి సృజించెను ఓషదులనగా
పంటరాగానే నశించు మొక్కలు (వరి, జొన్న, గోదుమ మొదలైన దాన్యపు
పంటలు) సృష్టి ప్రారంబమైన మొదటి దశలో జీవులు పుట్టిరి కాని వారి
కింకను బౌతిక దేహము లేర్పడలేదు కనుక వారికి ఆహారము అవసరము
లేకపోయెను Souls do not require food అటు పిమ్మట కొన్ని
మన్వంతరముల కాలము బౌతిక దేహములు లేకయే సృష్టి కొనసాగెను
అప్పటిస్థితిలో జీవులకు బౌతికదేహములక్కరలేకపోయెను అటు పిమ్మట
అనగా ప్రస్తుత వైవస్వతమన్వంతర ప్రారంబమున జీవులకు, బౌతిక
దేహము లేర్పడినవి అట్టి దేహము లేర్పడుటకు ముందుగా వారి దేహముల
కొరకు కావలసిన వాతావరణము, ఆహారము మున్నగునవి
కల్పింపబడెను అట్టి పరిణామ దశలో బూమిపై మొదట వృక్షసంతతి
గడ్డిగా ప్రారంబమై క్రమేణా విస్తృతి చెందిన తరువాత, కొంతకాలమునకు
పశువులు, మానవులు ఒకేసారి సృష్టింపబడిరి వాస్తవమునకు సృష్టి
ప్రారంబమున సనత్కుమారుడు మొదలైన మహర్షులు శుక్రగ్రహము
నుండి బూమి మీదకు దిగి వచ్చిరి అనగా మొదట అపరిపూర్ణ జీవులతో
పాటు పరిపూర్ణజీవులుకూడ దిగి వచ్చిరి ప్రారంబస్థితిలో నున్న జీవులకు
ఈ సనత్కుమారాదులే మొదటి గురువులుగ నేర్పడిరి వారే ఆ ప్రారంబ

స్థితిలో నున్న జీవులకు (The first group of souls) ఈ భూమిపై నెట్లు జీవించవలెనో, పంటలెట్లు పండించుకొనవలెనో నేర్పిరి ఆ మొదటి జీవులు గురువులుగా పరిపూర్ణత చెంది, తరువాతి జాతులవారికి నేర్పిరి ఇట్లు పూర్వకల్పమందుండి దిగి వచ్చిన పరమ గురువులచే వీరు మొదటి గురువులుగా తరువాతి మానవజాతికి అందింపబడిరి

పురుషుడు అనగా శరీరమునందున్నట్టి పరమాత్మఅంశ (Monad) వశువులనగా ఇంద్రియములు ఇంద్రియములతో కూడిన పురుషుని సృష్టి జరిగిన పిమ్మట ఆహారము యొక్క అవసరమేర్పడుట వలన పరమాత్మ ఓషదులను సృష్టి చేసెను అంతే కాక పురుషుడనగా పురము (దేహము) నందుండు వాడు అని అర్థము అట్లే ప్రపంచము అనగా పంచేంద్రియసృష్టి అని అర్థము ఇట్లు సృష్టిలోనికి దిగువచ్చు పరమాత్మను "పరమ పురుషుడని" అందురు అతడే అంతర్యామి భగవంతుడు అని పిలవబడుచున్నాడు చరాచరాత్మకమగు (కదలునది, కదలనిది అగు) సృష్టియంతటను పరమాత్మ సమానముగా ప్రవేశించి (అనగా వ్యాపించి) యుండును ఇచ్చట చరాచరాత్మకములనగా చేతనములు, అచేతనములు అనియే అర్థము కాని ప్రాణమున్నవి, ప్రాణములేనివి అని అనుట సరికాదు సృష్టించబడిన వాటన్నిటి యందు ప్రాణముండును వాస్తవమునకు అన్నిటి యందును ప్రాణము యొక్క వర్తనమున్నది (రాళ్ళ యందు కూడ అణువులు వర్తించుచున్నవి కదా!)అట్లే ఆ మహాజలములపై ఈ భౌతిక మయినట్టి (Physical and tangible creation) జగత్తంతయు తేలుచున్నది ఇందలి ఒక్కొక్క సౌరమండలము ఒక్కొక్క చిన్న గ్రుడ్డువలె తేలుచున్నది ఈ మహా సముద్రము పైకి కొన్ని కోడిగ్రుడ్లను పడవైచినట్లు ఈ సౌరమండలములన్నియూ చోటునందు తేలుచున్నవి

**మంత్రము 5**

**అతః పరంనాన్య దణీయసగ్ంహి పరాత్పరం యన్మహతో మహాన్తమ్**
**యదేక మవ్యక్త మనన్త రూపం విశ్వం పురాణం తమసః పరస్తాత్**

ప్రతిపదార్థము

యత్ = ఏవస్తువయితే

పరాత్ = కనుపించనటువంటి భువర్లోక, సువర్లోకములకన్ననూ, మనస్సు, బుద్ధి కన్ననూ

పరమ్ = అతీతమైయున్నదో (Beyond Physical Manifestation)

మహతః = మహత్తుకంటెను (మహత్తనగాచోటు యందంతటనూ)
నిండి యుండి పనిచేయుచున్నట్టి మహా ప్రజ్ఞ Cosmos Intelligence)
మహాన్తమ్ = గొప్పదో
యత్ = ఏదయితే
ఏకం = ఒక్కటియై (ప్రతి ఒక్కరి యందును ఒకే నేనుగా)
అవ్యక్తమ్ =కనుపించనిదై
అనంతరూపమ్ = అంతులేని రూపమై లేక రూపము, అంతము
అను పరిదులు లేనిస్థితియే తన రూపమై (Beyond form State)
విశ్వం = విశ్వమునకు రూపమై, విశ్వమే తన రూపముగాగల
పురాణం = అన్నిటికన్ననూ మొదటిదై
తమసః = తమస్సు కన్నను, లేక చీకటి కన్నను
పరస్తాత్ = అతీతమై, అందనిదై
అతః = దీనికన్నను
అన్యత్ = మరియొకటి
అణీయసం = మిక్కిలి సూక్ష్మమైనట్టిది
న = లేదు

**తాత్పర్యము**

కంటికి కనిపించని అంతర్లోకములైన శక్తిమయ ప్రజ్ఞామయ లోకములకన్న ఏది అతీతమై యున్నదో, మహత్తు అని చెప్పబడు విశ్వము నందు నిండి యుండు ప్రజ్ఞ దేని వలన వ్యక్తమగుచున్నదో, ఏది ఇంద్రియములకు అతీతమై అందని స్థితిలో నున్నదో ఏది అనంతమైన శాశ్వతమైన స్థితియే తన రూపముగా గలిగియున్నదో ఏది అన్నిటికిని మొట్టమొదటిదై యున్నదో ఏది చీకటికతీతమైన స్థితిగా యున్నదో, (దాని కన్న మరియొకటి సూక్ష్మమైనది మరియు శ్రేష్ఠమైనది లేదు)

వివరణ

మహత్తనగా చోటునందు పనిచేయుచున్న మహా ప్రజ్ఞ (Intelligence) మన శరీరము పరిమిత స్థితిలో నుండుటచే ఈ మహత్తు శరీరము ద్వారా పరిమితముగా పనిచేయును అట్టి స్థితిలో దీనిని "బుద్ధి" అందురు తెలివిజను మన యింటియందే కాక ఎచ్చట పెట్టినను బొమ్మ వచ్చునట్లు

ఈ బుద్ధి లేదా మహత్ అనునది చోటు అంతటా పనిచేయుచున్నది ఇది మన యందు వ్యక్తిగతముగా పనిచేయదు ఆత్మగతముగా పనిచేయును మన సమస్యలకు పరిష్కారమిచ్చునది ఈ ఆత్మగతబుద్ధియే

ఉదాహరణకు ఆహారము ఆవశ్యకమైనపుడు మాత్రమే తీసుకొనవలెనని బుద్ధి చెప్పును రుచియైనది ఆకలియున్నను లేకున్నను తినుటకు మనసు ప్రేరేపించుచుండును కాని బుద్ధి మాత్రమే తిన్న ఆహారము జీర్ణమైన తరువాతనే ఆకలిని ప్రేరేపించును కనుక బుద్ధి శరీరమునకు ఏది ఆవశ్యకమో దానిని ప్రేరేపించును కాని యిష్టాయిష్టములననుసరించి కాదు

మహత్తు సూర్యరశ్మి వంటిది అది అంతటా ఒకే విధముగా వెలుగునిచ్చుచుండును ఎండ మన ఇంటిలోనే పడుచున్నదనుకొనుట ఎట్లో మహత్తు మన యందు మాత్రమే బుద్ధిగా పనిచేయుచున్నదని అనుకొనుటయు నట్లే భ్రాంతి యగును మహాంతమ్ అనగా మహత్తున కంటె వెనుకగా అతీతముగా నున్నట్టిది దీనినే సముద్రమనిరి అన్ని వ్యవహారములను ఈ మహత్తే నిర్వర్తించుచున్నది అనగా ఎందరు జీవులున్నను, అందరియందును, వేర్వేరుగా కాక ఒక్కటిగా "నేను" గా నున్నది ప్రతి ఒక్కరు తనను తాను "నేను" అని అనవలెనే కాని "నీవు" అనుటకు వీలు లేదు కదా కావున అన్ని "నేను" లు లేవు ఇట్లు అందరి శరీరములందు వుండు "నేను" (ఏకం, ఒక్కటిగా ఒకే నేను గా పనిచేయుచున్నది) ఇదియే ఏకము, అనంతము అయినట్టి రూపము ఈ నేను ప్రతి ఒక్కరికి తనకు తానుగా తెలియబడుచున్నది మంచు గడ్డలనేకముండినను నీరు ఒక్కటిగనే యుండును కాని "నీరులు" వుండవు కదా! ఇట్లు ముందుగా (Projected world) బాహ్యజగత్తును గుర్తించుచు తిరిగి దీని కన్నను, వెనుకగా అతీతముగా నుండు బుద్ధిలోనికి ప్రవేశించవలెను (Tracing Back) అట్టి దానినే ' పరాత్పరము' అని చెప్పిరి అనగా యిది వ్యక్తమైనట్టి బుద్ధికిని దానికి వెనుకగా అతీతముగా నున్న అవ్యక్తమునకు పరమైనది అది ఎవరి వలన పనిచేయుచున్నదో, అనగా ఎవరు దాని కాధారముగా నున్నాడో అట్టి వానిని తెలిసి కొనవలెనన్నచో ఇట్లు ధ్యానము చేయవలెను అది "నేను", నా ఊహాలకు, నాబుద్ధికి "నేను"ఆధారముగా వున్నాను అట్లే ఈ సమస్తమునకు ఆధారమయినది "నేను ఈ నేను అనునది ఉన్నట్లుగా తోచును కాని కనిపించదు అనగా మనస్సులో నున్నపుడు మనస్సుగనే యుండును కాని "నేను" గా

వుండదు అట్లే అది నేనుగా నుండునపుడు మనస్సుండుటకు వీలు లేదు అది కరిగి పోవును జ్ఞానులలో అది బుద్ధియందున్నను, మనస్సు నందున్నను వాటిచే కట్టుబడక నేను గానే వుండును ఇట్లు "నేను"గా వుండు స్థితి యందు దృష్టి నిలుపుట కొరకే బగవాన్ శ్రీరమణ మహర్షి మీకు వచ్చు ఆలోచనలు మున్నగునవి ఎచ్చట నుండి వచ్చుచున్నవో, ఎవరికి కలుగుచున్నవో గమనించమనెడివారు అట్టి "నేను' అనునది సత్యము దాని ఆదారముగనే మనస్సు, బుద్ధి మొదలగునవి పనిచేయుచున్నవి ఇట్లు మనస్సుకు, బుద్ధికి, వెనుకగా అవ్యక్తముగా నున్నట్టి దానిని ద్యానించవలెను అట్టి "నేను' అను దానికి పరిదిని (Boundary) నిర్ణయించుట వీలుకాదు 'నేను" యొక్క రూపము ఎట్టి పరిది లేనట్టి అనంత రూపము ఈ నేను అనునది అన్నిటికిని మూలకారణమయిన ఒక మహా వెలుగు దాని నుండియే మనము చూచు రూపములన్నియు దిగి వచ్చు చున్నవి గనుక దాని రూపము అంతులేనిది అనగా కొలతలకంతులేనిది మన కొలతలన్నియు దాని నుండియే పుట్టినవి మనమేది కొలచిననూ కాలము (Time) దేశము (Space) అనువాని ననుసరించి కొలువవలయును ఇవి రెండును దేనినుండి పుట్టినవో దానిని అనగా ఆనందము నెట్లు కొలవ గలము ? కనుక దాని రూపమనంతము

విశ్వమనగా "నేన ' ను మహా వెలుగు నుండి మనము చూచుచున్న వ్యక్తరూపముగా దిగివచ్చినది అనగా విశ్వమంతయు తానుగా నున్నట్టి స్థితి అట్టి ఆ "నేను' అనునదే "నా శరీరము" నందు ఇమిడి వ్యక్తమగుచున్నది కావున నేననగా నా శరీరము గాక, ఈ శరీరమే నాయందొక బాగము అని గుర్తించవలెను అందున్నట్టి అంతర్యామి శరీరము ద్వారా వ్యక్తమగుచున్నాడని గ్రహించవలెను

అట్లే చీకటి అనగా మన అజ్ఞానము మనకు తెలియనట్టిది కావున చీకటి యనగా మన మనస్సు, కన్ను మున్నగు వానికి అందనిస్థితియే గాని ఏమియు లేని శూన్యమని అర్థము కాదు గదిలో గాఢముగా నిద్రించువానికి ఆ గదిలోని వస్తువులు లేవు కాని మేలుకొని వున్న వానికి వున్నవి కదా! కనుక తమస్సు అనగా ఏమియు లేదని అర్థము గాక మనబుద్ధికందని స్థితియని అర్థము అంతే గాక తమస్సనగా బౌతిక తత్త్వమునకు దిగివచ్చినది జడమైనట్టిది అని కూడా అర్థమున్నది అనగా నీరు మొదలయిన Physical Tangible creation గా దిగి వచ్చినది అని అర్థము ఈ బౌతిక మైన వస్తువుల యొక్క స్థితికి వెనుకగా అతీతముగా లేక

ఆదారముగా నున్న దానియందు ఇవి అన్నియు నీటి యందు మంచు గడ్డలవలె వున్నవి అనగా ఈ బౌతికమైన పదార్థములన్నియు చోటునందు వ్యాపించి యున్న అంతర్యామి యందే నిలిచియున్నవి ఇట్టి ఈ అవ్యక్తమయిన మొత్తమునే సముద్రమని పిలిచిరి సముద్రము అనగా సృష్టి యొక్క ముద్రలతో కూడుకొని యున్నదని అర్థము బౌతిక రూపములకన్నింటికిని మూలమగు ముద్రలన్నియు దీని యందు కరిగియున్నవి అందువల్లనే ఇచ్చట అనంతరూపమనగా అర్థము రూపమునకు అతీతమగుస్థితి (Beyond form State, Formlessness) ఇట్లు మనము 'ఇది' 'అది' యని దేనిని పిలుచుచున్నామో అది అణువులు, పరమాణువులు మున్నగు నవి యున్నస్థితి కన్న అతీతమయిన స్థితి దీనిని "విరజము" అని కూడా అందురు రజస్సు అనగా అణువులతో కూడిన దూళి విరజము అనగా ఇవి దేని నుండి పుట్టునో అట్టిస్థితి అట్లు వెనుకగా చీకటి యను రూపమున నున్న పరమాత్మ మొదటి వెలుగుగా అనగా "నేను" అను ప్రజ్ఞగా మేల్కొనును ఇది ఈయన మొట్టమొదటిస్థితి కనుక పురాణమని చెప్పబడినది కావుననే శ్రీ విష్ణుసహస్రనామము యొక్క ప్రారంబమున ఈ విశ్వమునందున్న ప్రతి పరమాణువును అంతర్యామి యొక్క రూపముగా ద్యానము చేయుట వున్నది (విశ్వం విష్ణుః వషట్కారః) తానున్నానను స్థితికి కారణముగా నున్న వానిని వషట్కారుడందురు ఇతడు ఈ సృష్టి అంతటను తానుగ వ్యాపించియుండువాడు

ఈ విదముగ కంటికి కనిపించని అంతర్లోకములైన శక్తిమయ ప్రజ్ఞామయలోకములకన్న ఏది అతీతమైయున్నదో మహత్తు అని చెప్పబడు విశ్వమునందు నిండి యుండు ప్రజ్ఞ దేని వలన వక్తమగుచున్నదో, ఏది యింద్రియములకు అతీతమై అందని స్థితిలో నున్నదో, ఏది అనంతమైన, శాశ్వతమైన స్థితియే తన రూపముగా నున్నదో, ఏది ఈ విశ్వమే తన రూపముగా కలిగియున్నదో, ఏది అన్నిటికన్నను మొట్టమొదటిదై యున్నదో, ఏది చీకటి కతీతమైన స్థితిగా యున్నదో, దాని కన్నను, సూక్ష్మమైనది మరియు శ్రేష్టమయినది మరియొకటి లేదు

ఇక్కడ చీకటి యనునది ఏర్పడుటకు ముందు సహజముగా వెలుగేయుండును వెలుగున్నచోట చీకటి ఉండునని అందురే గాని చీకటి ఎచటి నుండి వచ్చును? ఏదైనను బౌతికమయిన వస్తువు అడ్డుగా నున్నపుడే చీకటి ఏర్పడును మొత్తము వెలుగుగానే యుండగా ఆ వెలుగు

యందు బౌతిక సృష్టి ప్రారంభమైనపుడు చీకటి అనునది పుట్టును అనగా ఉన్నదంతయు వెలుగే కాగా బౌతిక సృష్టిగా తమస్సు దిగి వచ్చినది కాని ఈ వెలుగు మన కంటికి అందునది కాదు అనగా ఆత్మ చేత దర్శింపవలసినదే కాని, మనస్సు చేత, యింద్రియముల చేత దర్శింపకలిగినది కాదు కనుక దీనిని మనము చీకటిగా బ్రాంతి పడుదుము అనగా మనస్సు యింద్రియములు సృష్టింపబడిన వెనుక ఈ వెలుగు చీకటిగ చూడబడినది అట్టి తమస్సునకు అతీతముగ నుండు స్థితిని గూర్చి ఈ మంత్రమునందు చెప్పబడినది



# అనువాకము - 2

## మంత్రము 1

**తదేవర్తం తదుసత్త్యమాహు స్తదేవ బ్రహ్మ పరమం కవీనామ్|**
**ఇష్టాపూర్తం బహుదాజాతం జాయమానం విశ్వంబిభర్తిభువనస్యనాభిః|**

## ప్రతిపదార్థము

తదేవ= అదియే

ఋతం=ఉచ్చరింపబడిన వాక్కు లేక వెలుగు

సత్యమ్ = వాక్కు ఉచ్చరించబడుటకు పూర్వమున్న స్థితి

(ఇది ఇట్లుండవలెనను జ్ఞానము)

తత్ + ఉ = అదియే

కవీనాం=కవులకు (సృష్టికర్తలకు)

పరమంబ్రహ్మ= పరమాత్మ

ఇష్టాపూర్తం = కోరి చేయబడినపనులు (అనగా కోరికల ననుసరించి చేయుపనులు(కర్మలు)

బహుదా= అనేక విదములుగా

జాతం=పుట్టినట్టి

జాయమానం=పుట్టగల

విశ్వం=విశ్వమును

భువనస్య=సమస్తలోకములకును

నాభిః=కేంద్రమైన పరమాత్మ

బిభర్తి=భరించుచున్నాడు

## తాత్పర్యము

అదియే ఋతము అదియే సత్యమని చెప్పిరి సృష్టిని కల్పించు దేవతలకు పరమమైన బ్రహ్మ అతడే సమస్తము నిండియున్నదనియు, అనేకవిదములుగా పుట్టి మరియు పుట్టబోవు లోకములతోనిండినది మున్నగు విశ్వమునకు ఈ పరమాత్మయే కేంద్రము

## వివరణ

ఋతము అనగా వాక్కు ఋక్కునుండియే వాక్కు అను పదము వచ్చినది ఋతమనగా వెలుగనికూడ అర్థము కలదు ఇట్లు రెండర్థములున్నవి యన్నచో ఇవి కేవలము మనము గ్రహించుటకొరకు సౌకర్యార్థము చేసికొన్నవే కాని వాస్తవమునకు వెలుగే వాక్కు వాక్కే వెలుగు భౌతికమయిన వాక్కునకు ముందుగానున్నది వెలుగే ఈ వెలుగే వాక్కుగా వచ్చును అభివ్యక్తమయిన స్థితిని అనుసరించి దానిని Light అనియు లేక Sound అనియు మనము పిలుచుచున్నాము టేపురికార్డరు తీసుకొన్నచో దానియందు విద్యుత్తు (Electricity) అను వెలుగు పనిచేయుట వలననే కదా దానినుండి శబ్దము పుట్టుచున్నది అనగా The Electrical energy is being converted into the terms of sound వెలుగు వలననే వాక్కు అనునది సృష్టిలోనికి (సృష్టివలె/గా) వ్యక్తమగుచున్నది

ఉదా చోటుయందు ఉరుములు ఉరిమినప్పుడు దానికి కారణమగు మెరుపులను మనము చూచుచుంటిమి కదా! Light is every where and capable of producing sound i e the generation of sound from light Sound comes from light అట్లే ఈ వాక్కు అనునది ఒక భౌతికమయిన వస్తువు నాదారముగా చేసికొని వ్యక్తమగును ఉదా మనలోనున్న 'నేను'అను వెలుగు ఏమి చేయవలెనన్న మన భౌతిక శరీరమును ఆదారముగా (Medium గా) చేసికొనుచున్నది కదా! (Even electricity has to pass through the medium of filaments of the wires in a bulb to give light)

అట్లు ఈ ఋతము ఉచ్చరింపబడుచున్నది అనగా సూర్యుని, సూర్యునిచే, సూర్యునియొక్క వాక్కులవలె ఈ సృష్టిఅంతయు ఉచ్చరింపబడుచున్నది సూర్యునియొక్క వెలుగే సూర్యునియొక్క వాక్కుగా, భూమి మొదలయిన గ్రహములుగా సౌరమండలమునందు ఉచ్చరింపబడుచున్నది అట్లుచ్చరింపబడిన ఋతమునే సత్యమని చెప్పిరి "తదు సత్యమ్" అనగా అదియే సత్యము అని ఋషులచే చెప్పబడినది అనగా ఋతమునే మరియొక స్థితియందు సత్యమని చెప్పిరి ఇట్టి సత్యమను స్థితినే సత్యలోకమందురు సత్యలోకమనగా ఇది ఇట్లుండవలెనను జ్ఞానము అట్టి జ్ఞానమంతయునొక ప్రజ్ఞగా నూహించినచో ఆప్రజ్ఞనే బ్రహ్మ అందురు మట్టివృక్షము విత్తనమునందు జ్ఞానముగా నున్నది దీనినే బ్రహ్మ అనికూడ అందురు ఇట్టి

మఱ్ఱిగింజయందున్న జ్ఞానము మన మనస్సునకును, బుద్ధికిని, అందనిది అతీతమైనది కనుక అదియే పరమము అని చెప్పబడినది

కావున ఈ సృష్టిఅంతయు బ్రహ్మయందు సత్యముగానున్నది దానినే ఆయన వ్యక్తపరచినాడు సత్యముగానుండుట అనగా The one eternal and higher principle గా నుండుట అనగా సృష్టికి బీజరూపుడై యుండుట దీనినే సత్యమందురు

ఉదా మఱ్ఱి విత్తనమునందు మఱ్ఱివృక్షమునకు సంబంధించిన దర్మములన్నియు నున్నవి అవి దానియందు సత్యముగా నున్నవి అందు వలననే ఆ బీజము నాటినచో మఱ్ఱివృక్షమే వచ్చును కాని వేరొక వృక్షమేదియును రాదు ఎందువల్లననగా మఱ్ఱివృక్షమెట్లుండవలెనో, ఆకులెట్లుండవలెనో ఊడలెట్లుండవలెనో వీటన్నిటియొక్క విజ్ఞానము విత్తనమునకుండును అనగా ఆ మఱ్ఱివృక్షముయొక్క Biological and Structural formula అన్నియు ఆ విత్తనమునందున్నట్లే కదా! Hence we should agree that there is a Biological Professor or a Botony Professor in that seed దీనినే సత్యమందురు దీనిని దర్శనము చేసినవారు వ్రాసినపుడు అది శాస్త్రమగుచున్నది వీరే సత్యద్రష్టలు అనగా వీరు సృష్టియందలి అంతర్యామి వ్యక్తమగు విదానమును చక్కగా గమనించి, దర్శించి ద్రష్టలై మనకు విజ్ఞానమునిచ్చుచున్నారు

కనుక ఋతమనగా ఉచ్చరింపబడినట్టి వెలుగు మనము మన వ్రేలితో దేనినైనను చూపుచు అది, ఇది, అనునపుడు అట్టి ఊహ మనలో ఎచ్చటనుండి బయలుదేరి వచ్చుచున్నదో గమనించినచో అదియే ఋతమని తెలియును దానిని ద్యానముచే తెలుసుకొనుట సత్యమగును అట్టి ద్యానమునకు కారణమైన వెలుగునందు మనము లయమైనచో అది ఋతము ఇదియే అంతర్యామిగా చెప్పబడెను అనగా జీవులు ఎవరికి వారు సృష్టిని ఉచ్చరించుచున్నారు అట్లుచ్చరించుటచే వారు అంతర్యామియగు పరమాత్మనే ఉచ్చరించినవారగుచున్నారు అనగా సృష్టిని ఉచ్చరించుచున్నామనుకొనుచు అంతర్యామినే ఉచ్చరించుచున్నారు కావున అంతర్యామి దర్శనమనగా మనము దేనిని ఉచ్చరించుచుంటిమో అదియే అంతర్యామిగా తెలియవలెను మనము మన మనస్సునందు దేనిని సంకల్పించుచున్నామో అదియే అంతర్యామి ఇట్లుచ్చరింపబడుటకు ముందున్నది సత్యమనియు అదియే ఉచ్చరింపబడిన పిమ్మట ఋక్కు అగుననియు చెప్పబడినది "ఆహుః' అనగా ఇట్లు ప్రతి ఒక్కరును తమ

సంకల్పముగా మరియు వాక్కుగా పరమాత్మనే ఉచ్చరించుచున్నారు అనగా పరమాత్మనే సత్యముగా, ఋతముగా, వాక్కుగా, పదములుగా నుచ్చరించుచున్నారు

"కవీనాం" అనగా కల్పనము చేయుమనము అంతర్యామిని మన ఊహలుగా కల్పనము చేయుచున్నాము మన మాటలు, ఊహలు, మున్నగునవన్నియు పరమాత్మనుండియే వచ్చుచున్నవి అట్టి పరమాత్మనే ఊహలుగా మనముచ్చరించుచున్నాము ఉచ్చరించుటకు ముందున్న వెలుగు ఋతమనియు, ఉచ్చరించు సంకల్పము సత్యమనియు చెప్పబడినవి

ఉదా కుమ్మరివానిచే కుండ ఉచ్చరింపబడెను యనగా కుండను తయారు చేసినాడని అర్థము అట్లే బ్రహ్మ సృష్టిని ఉచ్చరించెను యనగా సృష్టించెనని అర్థము కుమ్మరివాడు వేరొక బౌతికమైన పదార్థమునుపయోగించి చేయును కాని బ్రహ్మ తనయందున్న 'తాను' అను పదార్థముచేతనే ఈ సమస్తమును సృష్టించెను అనగా తనను తానే సృష్టిగా ఉచ్చరించెను అనగా సృష్టిగా తానే ఈవలకు వచ్చెను ఎట్లనగా మనమొక యూరికి పోవలెనని సంకల్పించినపుడు ఆ ఒక్క విషయమే మనస్సునందు మెదలుచుండును అనగా మనమచ్చటివారితో సంబాషణ చేయుచున్నట్లు, ఆ పరిసరములు మొదలగువాటితో కూడిన దృశ్యమంతయు మనకు తోచును మరి అది సత్యమా, అసత్యమా యన్నచో మనకది సత్యమేకాని దానికది ఒక ఉహాయే అగును సత్యము కానేరదు (అనగా అసత్యమగును) మనకును అది తాత్కాలికముగనే సత్యమగును ఎందువల్లననగా మనము దానిని మనకంటె వేరుగా గుర్తించుచున్నాము అట్టి వ్యవహారములో మనమున్నపుడే మనకది సత్యమగును ఇట్లు వ్యవహరించుట మానసిక స్థితి (Mental Level) యందు జరుగును అనగా తనను తాను వేరుగా గుర్తించు (Identity) స్థితి మరియు తాను వేరుగానుండి, తానువేరు, ఎదుటివారు వేరు, అన్న బావనతో వారితో వ్యవహారములు, లావాదేవీలు, ఇచ్చిపుచ్చుకొనుట మొదలగునవి నిర్వర్తించు స్థితినే మనస్సందురు

అట్టి మనస్సునకు, కాలమునకు సంబందమున్నది ఈ రెండును ఒకేసారి పుట్టును Actually time is mind Time and mind both are interdependent అంతర్యామినుండి ఈరెండును పుట్టుచున్నవి అనగా ఒకే స్థితినుండి రెండుగా చీలును అట్లు చీలినవానిలో ఒకదానిని కాలము

అనియు, ఒకదానిని మనస్సనియు అనిరి కనుక అంతర్యామిని మనము చేరవలెనన్నచో ఈ రెండింటిని వెనుకకు Trace back చేయవలెను అనగా మనయందు ఈ రెండును ఎచటనుండి పుట్టుచున్నవో గమనించవలెను అట్లుచేసినచో ఈరెండును Timelessness అను స్థితిలోనికి పోవును అనగా ఇచ్చట The Birth of 'mind' or the 'birth of time' ఈ రెండింటిలో ఏదియో ఒకదానిని Traceback చేయవలెను మనయందు time అనునది ఎచ్చట పుట్టుచున్నదనగా శ్వాసనుండి (Respiration) పుట్టుచున్నది కావున దానిని గమనింపవలెను అచ్చటినుండియే అనగా ఆ శ్వాసనుండియే మనస్సనునది పుట్టుచున్నది కావున మనము కొద్ది సమయము శ్వాసను గమనించినచో మన మనస్సు తాత్కాలికముగా శ్వాసయందు లయమగును (Disappear) కనుకనే శ్వాసయందు మనస్సు నిలిపినపుడు మనస్సు, శ్వాసయను రెండును పనిచేయవు కనుక ఆకొద్ది సెకనుల ''కాలము'' మనకు తెలియదు కాని మనస్సు లయముచెందెనను ఊహకలిగినంతనే అచ్చట మనస్సుండును ఎందువల్లననగా మనస్సుగాని, కాలముగాని లయము చెందినపుడు అట్లు లయము చెందెనని మనకు తెలియదు తెలియుట అనునది మనస్సుయొక్క ప్రవృత్తి కనుక తెలుసుకొనుట యున్నంతకాలము మనస్సుండుట, మనస్సులేనిచో తెలియుట యుండదు కావున అది తెలుసుకొనవలెను ఇది తెలుసుకొనవలెను అనిపించునది మనస్సునకే

ఉదా సంగీతమును నేర్చుకొనవలెనన్నచో ఒక మంచి సంగీతవిద్వాంసుని సమీపించి అయన వద్దనే కూర్చుని ఆయన సంగీతము నాలపించునపుడు ఆయనతోపాటు సంగీతమునందు మనముకూడ లీనము కావలెను అట్లు చేసినచో సంగీతమును గానము చేయునపుడు ఆయన ఏస్థితియందు, ఎచ్చటనుండునో, అచ్చటనే మనమును ఉండగలుగుదుము ఆయన ఆస్థితియందుండి గానము చేయునుగాన సంగీతమే ఆయననునరించును కాని ఆయన సంగీతముననునరించుట యుండదు అట్లు కాకపోయినచోనది సంగీతమునుపాసించుట కానేరదు అట్టి స్థితియందాయన తాను సంగీతమునాలపించుచున్నాడని కాక తానే సంగీతమునందుండును అపుడు తాను, సంగీతము అను రెండు నుండవు దానియందు తాను లీనమై పోవును అచ్చట తన కస్థిత్వముండక సంగీతమునందుండు రసము, ఆనందము మొదలగువానియందిమిడి యుండును కనుకనే అచ్చట

ఆయననుసరించియే సంగీతముండును ఇతరులకు సంగీతముండునుకాని ఆయనకు మాత్రము సంగీతముయొక్క అనుభవమైన రసానందమే ఉండును కాని సంగీతముండదు సంగీతమును సాధన చేయునపుడు అట్టి స్థితియందుండవలెను

శిష్యరికము చేయుట అనగానిదియే గురువును శిష్యుడనుసరించుట యనగా నిదియేకాని గురువుయొక్క తెలివితేటలను బేరీజు వేయుటవలన ప్రయోజనముండదు ఈ తెలివితేటలు మున్నగునవి సూర్యకిరణముల వంటివి సూర్యునికన్నా సూర్యకిరణములెక్కువ కాదుకదా! కనుకనిచ్చట సూర్యుడే ముఖ్యుడు, గ్రాహ్యుడును సంగీతము మొదలగునవేకాక ఏవిద్యయైనను మనము వానియందుండుట వలననే అవి సాధ్యమగును ఇదెట్లు సాధ్యపడుననగా గురువు శిష్యుని తానుండునట్టి స్థితిలోనికి తీసుకొని పోవును అదియే గురువు శిష్యునికి ఇచ్చు అభయ హస్తము అందువలననే పరమగురువులైన మాస్టరు CVV గారు 'ప్రణతనిజజనాన్ స్వాత్మతుల్యాన్ కరోతి' అనిరి అనగా తనకెవరు ప్రణామము చేయుదురో అట్టివారిని తనంతవారిగా చేయుదునని అర్థము అయినను ఇది ఎదుటివారియొక్క అర్హతననుసరించి దానంతటదియే జరుగును వాస్తవమునకు పరమాత్మ దేనినీ తాను సంకల్పించి ఉచ్చరింపడు ఎదుటివారి ఆవశ్యకతననుసరించియు, వారియొక్క పరిపూర్ణత ననుసరించియు, ''వరములు 'గా దిగివచ్చును అంతేకాని ఆయనకు యిష్టాయిష్టములు, సంకల్పములుండవు ఆయనకు వారిపట్ల 'ప్రేమ' తప్ప మరియొక భావమేమియు నుండదు ఇదెట్లనగా తల్లి తన బిడ్డకేది ఆవశ్యకమో దానినే ఇచ్చునుగాని అన్యమును గాదు

కావున పరమాత్మ మన శ్వాసయందుండి కాలముగా, శ్వాసగా ఈవలకు వచ్చుచున్నాడు దీనిని మనము Trace Back చేయుచు ధ్యానము చేయవలెను మనస్సనగా సంఘటనలను గమనించుచుండు స్థితి (It records Various incidents in life) కనుక మనస్సు పని చేయునప్పుడు గమనిక యనునది యుండక మనస్సు కాలము యనునవి తనయందే కరగి యుండును అట్టి స్థితియందు మనమున్నచో పనులన్నియు మన ప్రయత్నములేక వాటంతట అవియే జరిగిపోవుచుండును

ఇట్లు ఋతమనగా తననుండి ఉచ్చరింపబడునదని (That which is expressed out from within) అర్థము ఈ సృష్టి అంతయు బ్రహ్మయందు సత్యముగా నుండి బ్రహ్మచే ఉచ్చరింపబడినది దానినే ఋతమనిరి

అంతర్యామి తానుగా నున్నపుడు సృష్టి లేదు ఋతమనగా తనను తానుచ్చరించుకొనునపుడు తననుండి తానేవేరుగా దిగి వచ్చును ఒకే బంగారమునుండి వేరువేరు బొమ్మలు, వస్తువులు తయారుచేసినట్లు అంతర్యామినుండి ఈ సృష్టి వేరుగా వచ్చును ఇట్లు వేరుగా వచ్చుటయే 'ఋచ్' లేక 'ఋక్' అను శబ్దముచే సంకేతింపబడినది ఇదియే రేపము దీనినుండియే ఋషభము అను పదము వచ్చినది కనుకనే అంతర్యామి అయిన పరమేశ్వరునకు ఋషభము వాహనముగా చెప్పబడినది

తదేవ బ్రహ్మ పరమం కవీనామ్'' దీనినే బ్రహ్మమని పిలిచిరి కవి తన మనస్సులోనున్న విషయమును తన రచనలద్వారా గ్రంధరూపమిచ్చి అందరి దృష్టిలోకి తెచ్చునట్లు, బ్రహ్మ ఈసృష్టినంతటిని అల్లికచేసి, బౌతికమైనట్టి స్థితిలోనికి తీసుకొని వచ్చుచున్నాడు కనుక ఆయనను కవులలోకెల్ల పరమమైనవానినిగా కీర్తించిరి ఆయన తననుండి తనను తానే ఈ సృష్టిగా ఉచ్చరించుచున్నాడు సృష్టిచేయుటలో బ్రహ్మకు ప్రజాపతులు సహాయపడుదురు అట్టి ప్రజాపతులకు చంద్రుడదిపతిగా నున్నాడు అందువలననే (1) జ్యోతిశ్శాస్త్రము Astrology (2) సాముద్రిక శాస్త్రము Palmistry లందు చంద్రుడున్న స్థితినిబట్టి జాతకుడు కవి యగునా లేదా తెలియును అట్లే బౌతికమైన సృష్టికి చంద్రుడదిపతి యగుటచే స్త్రీలయందు ఋతుక్రమము మొదలగునవి ఏర్పడుచున్నవి పితృదేవతలు చంద్రలోకమునందుందురు వారు చంద్రునిద్వారా భూమిపైకి వచ్చెదరు పితృదేవతలకును చంద్రుడే అదిపతి అనగా Mental levelలో కవులలోని సృజనాత్మక శక్తి (Creativity)గను, అంతకన్నను పైస్థితులందు బ్రహ్మయొక్క బౌతికమైన సృష్టి, అల్లికగను యున్నాడు అట్లే మనస్సునందు ఊహననుసరించి వస్తువులను బొమ్మలను తయారుచేయుటకూడ సృష్టికర్తయొక్క ఒక సూక్ష్మమైన స్థితియే అట్లే తండ్రి కుమారునిగా ఉచ్చరించును అనగా తనలోని ప్రజ్ఞయే కుమారునిగా ఉచ్చరింపబడి వచ్చుచున్నది దీనినే 'ఆత్మావైపుత్ర నామాసి' అని చెప్పిరి

'ఇష్టాపూర్త అనగా ఇష్టమై చేయబడినట్టి పనులు ఇవి 'బహుదాజాతమ్' అనేకములు అనగా జీవులు వారియొక్క కోరికల ననుసరించి చేయుచున్న పనులుగా వ్యక్తమగుచున్నవి ఏవ్యక్తియైనను తాను ఇష్టపడిన పనులనే చేయును కాని ఇష్టములేని పనులను చేయడుకదా! కావుననే జీవులందరును తాము చేయవలెనని సంకల్పించిన

పనులనే చేయుచున్నారు కావున ఎవరు ఏపని చేయుచున్నను వారి ఇష్టము ననుసరించియే పూర్తి చేయుచున్నారు ఎవరి ఇష్టము వారికి వేరుగా పని చేయుచున్నను, వారివారి ఇష్టములననుసరించి చేయుచున్న పనులన్నియు సృష్టి ప్రణాళికలోని బాగములే దాంపత్యము, సుతులన పోషించుట, వృత్తులు మున్నగునవన్నియును ఎవరికి వారు వేరువేరుగా నిర్వర్తించుకొనుచున్నను అవియన్నియు కలిపి సృష్టికార్యక్రమములో బాగములే యగుచున్నవి అనగా ప్రతియొక్కడును తన యిష్టముగా సృష్టిప్రణాళికలోని తనవంతు బాగమును నిర్వర్తించుచున్నాడన్న మాట

అంతకుముందు ఏకముగా నున్నట్టి అవ్యక్తమే ఇపుడనేకముగా వ్యక్తమగుచున్నది మఱ్ఱిచెట్టునకు అనేక మఱ్ఱిపండ్లు ప్రేలాడుచుండినను అవియన్నియును ఒక మఱ్ఱిగింజనుండియే వచ్చినవను విషయమును విస్మరించరాదు జీవులందరును తాము వేరు, ఎదుటివారు వేరు, నీవు వేరు, నేను వేరు అని అనుకొనుటయును, అట్లే ఒక అగ్నిజ్వాలనుండి ఎగిరి వచ్చుచున్న నిప్పురవ్వలు వేరువేరుగానున్నను వాటియందున్న జీవ శక్తి యొక్కటియే గదా। In essence and quality they are one though they are seperate in form ఇట్లు వేరువేరుగా నుండునట్టి రవ్వలనే "ఆత్మలు' (Souls) అందురు అట్లుగాక అన్నిటియందును ఉన్న సామ్యము (Common Factor)ను దర్శించునపుడు దానినే అంతర్యామి లేదా పరమాత్మ అందురు ఇట్టి ఈ సామ్యలక్షణములనే జ్ఞాపకముంచుకొనవలెను గాని బిన్నత్వమునుకాదు ఇట్లు అనేకములుగా చూచుట వలననే "పుట్టుట" అనునది వచ్చును అందువలన నశించుట యనునది ఉండును వాస్తవమునకు ఈ రవ్వలన్నియు తాత్కాలికముగా వేర్వేరుగా నున్నను ఒకే అగ్నిజ్వాలనుండి పుట్టుచున్నట్లు ఒకే పరమాత్మనుండి అనేక ఆత్మలు పుట్టుచున్నవి ఇట్లు పుట్టుటనే "బహుదాజాతం జాయమానం చయత్" అని చెప్పిరి జాయమానం అనగా పుట్టవలసినటువంటిది "జాతం' అనగా పుట్టునటువంటిది 'ఇష్టాపూర్తమ్' అనగా ఇష్టముచే పూజింపబడునది అని అన్యాపదేశముగా సూచింపబడుచున్నది అనగా అంతర్యామిగానున్న పరమాత్మ జీవులలో ఇష్టము అనురూపముగా నున్నాడు మరియు పుట్టుదానిలో కూడ ఇష్టముగా తానే యున్నాడు ఈ జగత్తునంతటికిని నాభియై కేంద్రముగా పరమాత్మయే యుండి బరించుచున్నాడు అనగా దీనిని నడుపుచున్నటువంటివానిగా ఆదారముగా నున్నాడు i e, He is the sustainer of this whole world అనగా ఆయన వలననే పుట్టుట పుట్టబడుట

మున్నగునవన్నియు జరుగుచున్నవి ఈ ప్రపంచము వ్యక్తమగుట యనగా ఒక పూవు వికసించుట వంటిది పూవునుండి కాయ, కాయనుండి పండు, దానినుండి గింజలు, ఆ గింజలనుండి తిరిగి వృక్షము, పూలు, కాయలు, పండ్లు మొదలగునవి వచ్చుచుండును జాతం అనగా పండ్లు పుట్టుట వంటిది జాయమానమనగా అందు మరల పుట్టబోవు గింజలవంటిది ఇక్కడ ఒక విచిత్రము మనము గమనింపవలెను భూమిపై జీవులు, వృక్షములు, ఎప్పటికప్పుడు గుంపులు గుంపులుగా పుట్టుచుందురు అందరును ఒకేసారి పుట్టినచో ఈభూమి సరిపోదు ఎప్పుడును కొందరు పుట్టుచుండగా మరికొందరు చనిపోవుచుందురు అట్లు చనిపోయినవారు మరల పుట్టుటకై వేచియుందురు ఇట్లు భూమిమీద ఎప్పుడును పుట్టువారును, పుట్టబోవువారును వుందురు అట్లే వృక్షములు సహితము ఒకేసారి పుష్పించి, కాయలు కాచి ఒకేసారి పండి చెట్లు ఎండిపోవుట జరుగదు చెట్టునందు ప్రతిదినము కొన్ని పండ్లు పండి తినుటకు సిద్ధమగుచుండగా మరికొన్ని తరువాతి దినములలో పండ్లు అగుచుండును ఇట్లు చెట్టునందెప్పుడును నేటి పండ్లతో బాటు రేపటి పండ్లు కాయలుగను, తరువాతి పండ్లు పిందెలుగను, ఇంకను పూవులుగను, మొగ్గలుగను ఉండును ఇట్లు పరమాత్మ సృష్టియందు కొన్ని పుట్టినవియుండగా మరికొన్ని పుట్టుటకు సిద్ధముగా నుండును అనగా పరమాత్మయే విత్తనమునందు మొలకెత్తు స్వభావముగా పనిచేయుచు సృష్టి యొక్క దర్మము నిర్వర్తించుచున్నాడు కావున మనమట్టి పరమాత్మను ద్యానించవలెనన్నచో సృష్టియందలి దర్మములుగా నున్నట్టివానిగా నుపాసించవలెను

ఉపాసన యనునది ఎల్లప్పుడును సగుణమే అనగా ఈసృష్టియందు పుట్టినట్టి గుణము, పుట్టబోవునట్టి గుణము ఈ రెండును కలిసియుండును Everv atom ıs a future unıverse, every soul ıs a future Solar system Such ıs the process of evolution ın this universe There ıs Cosmos and there ıs also a future Cosmos ın atom జాయమానమనగా అదియే Every seed ıs a tree ın ıts future manıfestation It ıs all a Geometrıcal Progression ఇట్లు జాతము జాయమానమునైన ఈ సమస్త విశ్వమునకు పరమాత్మయే కేంద్రమై భరించుచున్నాడు He ıs the sustaıner for the entıre creatıon by standıng as ıts background consciousness అనగా ఆయనయందు ఈ సమస్త ప్రపంచము తేలుచున్నది ఈ విశ్వమునందుండి మరల ఒక

భవిష్యద్విశ్వము దిగి వచ్చుటయను స్వభావముగా కూడ ఆయనయే ఉన్నాడు ఇట్లు తాను సృష్టిగా దిగివచ్చుటయే కాక మరల సృష్టియందున్న ప్రతి అణువునందును అనేకములైన విశ్వములుగా రూపొందు ఏర్పాటుగా తిరిగి తానే పనిచేయుచున్నాడు

భువనస్యనాభి - ఇట్లు ఈ విశ్వమంతటికిని కేంద్రముగానుండి భరించుచున్నాడనగా ఇందున్నట్టి అనేకలోకములుగా ఆయా లోకాధిపతులుగా కూడ తానైయున్నాడని అర్థము అట్లే భువనములనగా మనయందున్న మనస్సు, బుద్ధి యను లోకములకును 'నేను' అను అధిపతిగా తానే వున్నాడు సౌరమండలమున సూర్యుడు కేంద్రమై మిగిలిన గ్రహములను అందలి జీవులను నడుపుచున్నాడు, మరియు భరించుచున్నాడు ఇంకను ఈ మొత్తము విశ్వమునకు కేంద్రముగా తానుయను ప్రజ్ఞగానుండి ఇన్ని సౌరమండలములను, నక్షత్రమండలములను, తారాపుంజములను (Nebulae) నడుపుచు వాటి పరిణామములకు కారకుడైయున్నాడు

మంత్రము - 2

తదేవాగ్నిస్తద్వాయుస్తత్సూర్యస్తదు చంద్రమాః।
తదేవశుక్రమమృతం తద్బ్రహ్మ తదాపస్స ప్రజాపతిః॥

ప్రతిపదార్థము

తత్ + ఏవ=అదియే

అగ్నిః=అగ్ని లేక ప్రజ్ఞ అను బిందువు

తత్ + ఏవ=అదియే

వాయుః=వాయువు

తత్=అదియే

సూర్యః=సూర్యుడు

తత్ + ఉ=అదియే

శుక్రమ్=శుక్రుడను తేజస్సు

అమృతమ్=మృత్యువు లేనట్టి స్థితి

తత్బ్రహ్మా=అదియే బ్రహ్మ

తత్ఆపః=అదియే నీరు

సః=అతడే

ప్రజాపతిః=సృష్టికర్తయైన వెలుగు

## తాత్పర్యము

అదియే అగ్ని, అదియే వాయువు, అదియే సూర్యుడును, చంద్రుడును, అదియే మృత్యువులేని శుక్రమును, బ్రహ్మయును, ఆపస్సులును, మరియు అతడే ప్రజాపతి

## వివరణ

ఇంతకుముందు మంత్రమున పరమాత్మ సృష్టియందున్నట్టి అనేక దర్మములుగా, స్వబావములుగా తానేయుండి పనిచేయుచున్నాడనియు, అట్లే కేంద్రస్థానమునందుండి ఈ విశ్వమంతటిని బరించుచున్నాడనియు తెలుసుకొంటిమి ఈమంత్రము నందు ఆ పరమాత్మయే అగ్నిగను, వాయువుగను, సూర్యచంద్రులగను, మృత్యువులేని శుక్రముగను బ్రహ్మగను, జలములులేక ఆపస్సులుగను మరియు ప్రజాపతిగను తానే ఉన్నాడని చెప్పబడుచున్నది

''అదియే'' అగ్నిగా పనిచేయుచున్నది అగ్ని అనగా సృష్టి మొత్తమునందున్న అవ్యక్తమైన వెలుగు (The Fire that is unmanifested or the consciousness which is awakened) యని అర్థము నేనను ప్రజ్ఞగా విశ్వమునందు మేల్కొన్నట్టి దీనినే మరియొకచోట 'విష్ణు వను పదముతో చెప్పిరి ఇచ్చట అగ్నిఅనగా వెలుగని అర్థము కాని నిప్పు అని అర్థము గాదు It is the Cosmic Fire నిప్పు అనగా వెలుగుయొక్క బౌతికస్థితి (The Physical Fire) చోటుయందున్నట్టి ఒక మహావెలుగును అగ్ని అని పిలిచిరి అనగా విశ్వమంతను కేంద్రమై బరించుచున్న పరమాత్మనే ఇచ్చట అగ్నిఅని పిలుచుచున్నారు He is the higher Consciousness, అనగా మనలో నున్నట్టి ''నేను'' అను ప్రజ్ఞ మనకు శరీరమునందున్న చిన్ననేను ''నేను'' అనునది చిన్ననేను శరీరముతో సంబందము లేకుండ వెలుగుచున్న ''నేను'' అను వెలుగు ''పెద్దనేను'' దీనిని యిచ్చట 'అగ్ని' అని పిలచుచున్నారు ఈయనయే మొత్తము చోటునందు కూడ'నేను' అను ప్రజ్ఞగా వెలుగుచున్నాడు (ఈ రెండు 'నేను'లు ఎటువంటివనిన ఒకటి చెరువులోని నీరువంటిది (పెద్దది) రెండవది ఆ చెరువునుండి మన ఇంటిలోని గొట్టముద్వారా సరవరా చేయబడిన నీరువంటిది (చిన్నది) ఈ గొట్టమునందున్న నీటికి తుప్పుపట్టుట మొదలగు గొట్టముయొక్క

గుణములు కూడ కలియును) ఈ ప్రజ్ఞను మనయందు గుర్తించవలె నన్నచో, నేను వినుచున్నాను, నేను చూచుచున్నాను, నేను భోజనము చేయుచున్నాను, అనునప్పుడు ఎవరు భోజనము చేయుచున్నారో, ఎవరు చూచుచున్నారో, ఎవరు వినుచున్నారో, ఎవరు మాట్లాడుచున్నారో గమనించవలెను దీనినే ''సాక్షిః'' అనిరి విష్ణుసహస్రనామములలో భగవంతునికి'సాక్షి' అనునొక నామము కలదు సాక్షి అనగా చూచునట్టివాడు స + అక్షి అనగా కన్నులలో నుండి కన్నుగా (కన్నుద్వారా) చూచుచున్నవాడు అనగా సమస్తమును గమనించుచున్నవాడే నీలో ఉండి వినుచున్నాడు, చూచుచున్నాడు అనగా సాక్షిగనే యున్నాడు He is neither interfering, nor commenting It is mind that comments and judges upon situations మనయందు 'నేను' అను ప్రజ్ఞ సూర్యునిగా పనిచేయుచున్నను మనస్సను మేఘముల కారణముగా సూర్యుని ప్రకాశము తెలియవచ్చుట లేదు కాని ఈ మనకయనునది మేఘములకు సంబంధించినది కాదు మనలోనున్న అట్టి వెలుగునే అగ్ని అనిరి అనగా ఈయన మనయొక్క భౌతిక ప్రజ్ఞగా, బహిర్ముఖ ప్రజ్ఞగా పనిచేయుచున్నాడు

అట్లే ఈయనయే వాయువుగా నున్నాడనిరి ఇచట వాయువనగా''మహాచైతన్యము' అను అర్థము గ్రహింపవలెను ఆ మహాచైతన్యమే సప్తమరుత్తులుగా పనిచేయుచున్నది (The seven nodes of Vibrations) చోటులోని మహాశక్తి 7 తరంగములుగా విశ్లేషణము చెంది ఏడురకములైన శక్తులుగా పనిచేయుచున్నది The air is the First stimulation of thought పరా, పశ్యంతి, మధ్యమా, వైఖరీయను వాక్కుయొక్క నాలుగు స్థితులలో మొట్టమొదటిదైన పరావాక్కు అను స్థితినే ఇచ్చట వాయువని చెప్పుచున్నారు It is the first impulse to createఅనగా cosmos యందు ఏర్పడునట్టి మొట్టమొదటి stimulationను అనుసరించియే మిగిలిన తరంగాత్మకములైన Vibrations ఏర్పడి సృష్టియంతయు ప్రారంభ మయినది

అనగా మొత్తము సృష్టికంతటికిని కేంద్రముగా (Cosmic centre)నొక సూర్యుడున్నాడు ఆయన వద్దనుండి తరంగాత్మకములైన సంకల్పము Vibrations ప్రారంభమయినపుడు దానిననుసరించి, దానికి ప్రతిస్పందనముగా సూర్యగోళములు, గ్రహములు అను ప్రజ్ఞలు చోటునందేర్పడినవి వీటన్నిటికి కేంద్రముగానున్నట్టి ఒక మహాసూర్యుడు అవ్యక్తముగా నున్నాడు ఆయనయే సృష్టికి కేంద్రముగను,

అంతర్యామిగను వున్నాడు సృష్టియంతయు ఆయన వద్దనుండి ప్రారంబమయినట్టి తరంగాత్మకమయిన చలనముననుసరించియే బౌతికమైన వెలుగుగా మిగిలిన సూర్యులు వచ్చిరి అట్టి చైతన్యము వలన సూర్యుడను ప్రజ్ఞ పుట్టినది అట్టి సూర్యప్రజ్ఞ ఏర్పడిన తరువాత ఆయన చుట్టును ఒక తేజోవంతమైన తరంగములతో కూడుకొనినట్టి తేజఃపుంజము ఏర్పడును ఈ తేజఃపుంజమే తరువాత బౌతికమైన వెలుగుగా రూపొంది సూర్యగోళముగా వ్యక్తమగుచున్నది 'సౌరశక్తి' సూర్యునిచుట్టును ఎంతవరకు వ్యాపించియుండునో అంతవరకు 'సౌరమండలము' అని అందురు ఇది ఒక Solar orbit గా గుడ్డువలె ఏర్పడియున్నది

సూర్యుడు మన సౌరమండలమునకు సృష్టికర్త గనుక ఆయనను సవిత్రుడు అందురు అనగా (సృష్టిని) ప్రసవించువాడు అని అర్థము అట్టి సూర్యునిచుట్టును వెలుగుచున్న ప్రాణశక్తినే వాయువనిరి

ఈ ప్రాణశక్తులు అనేకముగానున్నను స్థూలముగా ఏడుశక్తులున్నవి వాటినే సప్తమరుత్తులు అందురు ఈ మరుత్తులు కశ్యపుని కుమారులని పురాణగాద కశ్యపునికి దితి, అదితి అని ఇద్దరు బార్యలు వారిలో దితికి మొదట హిరణ్యాక్ష, హిరణ్యకశిపులు జన్మించగా వారిని ఇంద్రునికోరికపై మహావిష్ణువు వదించెను అప్పుడా దితి ఇంద్రునిజయింపగల కుమారుడు తనకు కావలెనని కశ్యపుని కోరెను కశ్యపుడు నీవు పదివేల సంవత్సరములు తపస్సు చేసినచో అది సాద్యమగునని చెప్పి, ఉదయపర్వతమున తపమునకై వెళ్ళెను దితి అట్లు తపము చేయుచుండగా ఇంద్రుడొక బాలకుని రూపమున వచ్చి, ఆమె గర్భములోని పిండమును సంహారించుటకై వేచియుండెను ఒకనాడామె అసురసంధ్యవేళ నిద్రించుచుండగా ఆమె శ్వాసద్వారా లోనికి ప్రవేశించి గర్భముననున్న పిండమును తన వజ్రాయుదముచే ఏడు ముక్కలుగా నరకెను అప్పుడా పిల్లవాడు ఏడ్చుట ప్రారంబించగా ఇంద్రుడు ''మా రుద'' ఏడ్వకుము అని పలికెను కనుకనే వారు మరుత్తులైరి ఇంద్రుడు వారిని ఏడుముక్కలు చేసి మరల ఒక్కొక్కదానిని ఏడుముక్కల చొప్పున 7x7 = 49 ముక్కలు చేసెను వారు తరువాత ఇంద్రునకు అనుచరులైరి దీని అంతరార్థమేమనగా ఇచ్చట సృష్టిప్రారంబమున విశ్వగోళమేర్పడి అందు మహాచైతన్యము ఏడు తరంగములుగా విబాగముచెంది, ఏడులోకములకు కారణములైన చైతన్యతరంగములుగా రూపొందెను అందొక్కొక్కటి

మరల ఏడు తరంగములయ్యెను ఏడు సూక్ష్మలోకములయ్యెను ఇట్లొక్కొక్క లోకమునందు ఏడులోకములంతర్లీనముగా నుండగా ఏడు స్థూలలోకములుగా మొత్తము 49 సూక్ష్మలోకములుగా రూపొందెను

అట్లే తల్లి గర్భమున పిండమేర్పడగా జీవప్రజ్ఞ తల్లి శ్వాసద్వారా లోనికి ప్రవేశించి, అందు వెన్నెముక వెంబడి కుండలిని శక్తిగా, అందలి ఏడుకేంద్రములుగా రూపొంది పిల్లవాని శరీరమునందు 49 అంతర్లోకముల నిర్మాణము పూర్తి చేయును దీనికి కారణమైన మహాచైతన్యము జీవుని శ్వాసరూపమున ఓంకారముగా నుచ్చరింపబడుచుండును దీనికి ప్రతీకగనే పిల్లవాడు పుట్టగానే ఏడ్పుటతో శ్వాసప్రక్రియ ప్రారంభమై ఏడు ప్రాణ ప్రవృత్తులు, వాటి సూక్ష్మప్రవృత్తులతో కూడి శిశువునందు స్థాపితములగును

ఈ చోటుయందున్నట్టి ప్రాణశక్తికిని, సూర్యుని చుట్టును ఉన్నట్టి ప్రాణశక్తికిని బేదమున్నది సూర్యునిచుట్టును ఉన్న ప్రాణశక్తికిని, భూమిచుట్టును ఉన్న ప్రాణశక్తికిని బేదమున్నది అట్లే భూమిచుట్టును ఉన్నట్టి ప్రాణశక్తికిని, మానవునిచుట్టును ఉన్నట్టి ప్రాణశక్తికిని బేదమున్నది ఇట్లనేక రకములైనట్టి ప్రాణశక్తులున్నవి (This is a purely technical subject It is a super science ఈ వేర్వేరు ప్రాణశక్తులయొక్క differentiation detailedగా కావలెనన్నచో Alice-A-Bailley రచించిన "A treatise on cosmic fire" అను గ్రంధమును చదువుకొనవలెను) ఇట్లు అనేక ప్రాణశక్తులు చోటుయందు పనిచేయుచున్నవి వేటి తరంగవేగము (Frequency) వాటికుండును అనగా ఒకదాని కంటెను ఒకటి Higher Frequencyని కలిగియుండును వేటి తరంగములు వాటియందుండును కాని ఒకదానియందుంటున్నది, వేరొకదానిలో నుండదు దేని స్థితి (Plane)లోనది పనిచేయుచుండును ఈ మొత్తమునకు కావలసినటువంటి ప్రాణశక్తి అంతయు విశ్వమునకు నేత్రముగానున్న సూర్యుని(Sun) నుండి పుట్టుచున్నది (generate అగుచున్నది) దీనినంతయు నిర్వహించువానినే విష్ణువనిరి ఈయననే బౌద్ధులు Fohat (ఫోహాట్) అని పిలిచెదరు

తదుచంద్ర మాః - ఆయనయే చంద్రుడు అనగా ఆయననే వేర్వేరు Plane లలో వేర్వేరుగా చెప్పుచున్నాము విశ్వమునందు ఆయనను సోముడనియు, సౌరమండలమునందు ఆయననే చంద్రుడనియు అందురు చంద్రుడనగా Lord of Reflective Consciousness It is the Reflective energy అనగా నేను అను సూర్యునివలన మనస్సను చంద్రుడు ప్రతిబింబముగా

నేర్పడినాడు ఇట్టి చంద్రుని వెన్నెలవలన ప్రతిబింబమేర్పడుట అను న్యాయ మేర్పడినది అనగా అసలునుండి నకలు తీయుట సూర్యుడు జీవుల మొదటి పుట్టుకకు కారణమైనచో చంద్రుడు ఆజీవులనుండి మరల జీవులు పుట్టుటకు కారణమయ్యెను చంద్రుడు ప్రజాపతుల అంశగా పనిచేయును అనగా చంద్రునిద్వారా ప్రజాపతుల అంశలు మనభూమియందు రూపములనుండి మరల ప్రతిరూపములను పుట్టించుచున్నారు

''తదేవశుక్రమమృతమ్'' శుక్రము అనగా తెల్లనిది అనగా సూర్యునియొక్క అనేక కిరణములలో తెల్లని కిరణముగా భూమికి దిగివచ్చినది దీనినే భృగువు అందురు లేదా భృగువంశమునకు చెందినవాడే శుక్రుడు తెల్లని సూర్యకిరణములలో వెలుగులయినటువంటి భృగువులను మహర్షులు పనిచేయుచున్నారు వారు సూర్యునిలో నున్నటువంటి తెల్లని కాంతికదిపతులుగా నున్నారు వారు మనలోనున్నటువంటి బుద్ధిని ప్రచోదనము చేయుదురు ''దియోయోనః ప్రచోదయాత్'' 'భర్గులగు' వారు మన మనస్సుని, బుద్ధిని ప్రచోదనము చేయు దేవతలు తెల్లని రంగు అనునది ఎల్లప్పుడును ఊర్ధ్వమార్గమునకు చెందినట్టిది నలుపు రంగు అదోమార్గమునకు చెందినట్టిది శుక్లపక్షము, కృష్ణపక్షమనగా నివియే The ascending path and the descending path అందువలననే శుక్లయజుర్వేదమున సృష్టిని గురించిన వివరణ యుండును కృష్ణ యజుర్వేదమున సృష్టియొక్క అంతర్లీనత ప్రళయస్థితి మున్నగునవి చెప్పబడును అట్లు సృష్టి జరిగిన విదానమంతయు శుక్లము లేక తెల్లని కిరణమునకు సంబందించినది సూర్యుని వద్దనుండి బయలుదేరి వచ్చు తెల్లని కిరణము సృష్టికి కారణమగుచున్నది కావున నిది సృష్టికి అదిపతి అయినట్టిది అనగా సూర్యునిలోనుండి సూర్యునియొక్క సృష్టి ప్రణాళికను భూమిమీదకు తీసుకొని వచ్చి, భూమిని జీవవంతము చేసి, భూమిద్వారా ఈ సృష్టిని కొనసాగునట్లు చేయుచున్నది కావున దానిని అమృతమనిరి అనగా ఈభూమి నశించినను తిరిగి మరల మరియొక భూమిని సృష్టించును (మనముండు భూమియే మొట్టమొదటి భూమి కాదు ఇప్పుడు చంద్రుడు ఒకప్పటి భూమి) ఈ సృష్టికి కారకులైనట్టి వారు భర్గులను దేవతలు శుక్రుడు భృగువంశీయుడనగా అర్ధమేమనగా ఆ వెలుగు నుండి దిగివచ్చినట్టి తేజస్సు ఒక గ్రహముగానేర్పడి అదియే శుక్రగ్రహమయినది అందువలననే శుక్రగ్రహము తెల్లగా నుండును ఈయన సృష్టియొక్క అమృతత్వమను స్థితికి కారకుడగుటచే

అమృతుడనిరి సూర్యునినుండి సృష్టిని, ప్రాణశక్తిని, జీవశక్తి భూమిమీద తీసుకొని వచ్చి భూమిద్వారా ప్రతిఫలింపచేయుచున్నవా భర్గులనబడిరి వీరే శుక్ర సంతతి అనగా మానవుల దేహావ నశించుచున్నను తిరిగి క్రొత్త దేహములను సృష్టించుచున్నారు మ సౌరమండలమునకు సంబందించినంతవరకు మానవ జాతికదిపతి శుక్రుడు పనిచేయుచున్నాడు జీవశక్తిలో కూడుకుని ప్రాణమయ శరీరమ సూర్యునినుండి వచ్చును దానికి భౌతికమైన అణువులతోకూడిన శరీరమ చంద్రుడు సమకూర్చును ఇచ్చట ప్రజాపతులు పనిచేయుదురు వీ గర్భదారణము, బీజమునుండి అంకురములుగా మొక్క పుట్టించుటయను కర్తవ్యములను నిర్వర్తించుచున్నారు ఇ చంద్రునియందలి ప్రజాపతుల అంశలనే పితౄదేవతలందుర మానవదేహ నిర్మాణమునకు సంబందించినట్టి ఒక Miniature Programm sheetను కలిగియున్న Human sperm (రేతస్సు, శుక్రమను దాతువు)న పురుషని దేహమునుండి స్త్రీ దేహములోనికి ప్రవేశింపచేసినప్పుడచ్చట దానిననుసరించి ప్రజాపతులు అణుమయమైనట్టి భౌతికధేహముయొక్క నిర్మాణము చేయుదురు అందువల్లనే పిల్లవానిలో తండ్రిపోలికల Hereditary Features మొదలైనవి వచ్చును They are the reproductive forces tha are functioning/working in the reproductive system of a woman అ దేహనిర్మాణముననుసరించి ఏర్పడును గనుక తండ్రిగా చనిపోయి కుమారునిగా పుట్టుచున్నాడని వేదములయందు కీర్తింపబడుచున్నది మొట్టమొదట సృష్టిని బ్రహ్మ చేసినచో ఈ బ్రహ్మ సృష్టిననుసరించి మర అవే రూపములను పుట్టించు శక్తులను ప్రజాపతులందురు దీనినే పురాణములయందు సప్తఋషులు పడవలో ప్రయాణము చేయుచు పోవుచున్నారని చెప్పబడినది మానవునియొక్క రేతస్సునందు సప్తఋషుల యొక్క అంశలుండును ఇవి ఏడు లోకములకును సంబందించినట్టివి

ఇట్లు శుక్రమను దాతువువలన సృష్టియందలి రూపములు అనగా మానవజాతి, పశుజాతి, వృక్షజాతులు నశింపక శాశ్వతముగా నిలిచియున్నవి అందుచే శుక్రమమృతమని చెప్పబడినది అట్లే శుక్రుడను మహర్షి అసురులకు గురువు ఆయన తన మృతసంజీవిని విద్యచే చనిపోయినవారిని మరల బ్రతికించును జీవునియందలి కామము అసురగుణము అనగా అధోలోకములకు సంబందించిన ప్రవృత్తి గనుక

రాక్షసుల రాజని చెప్పబడినది రాక్షసులనగా భౌతిక జగత్తుయందు పనిచేయుచున్న శక్తులు ఇట్లు దేహములుగా లేక భౌతికరూపములయందు పనిచేయుచున్న రాక్షసులకు మరల దేహనిర్మాణము కలిగించి శుక్రుడు వారిని బ్రతికించుచున్నాడు ఇట్లు పరమాత్మయే శుక్రునిగా పనిచేయుచున్నాడు (తానే యున్నాడు )

తద్బ్రహ్మ అనగా మొత్తముచోటునందు ఈయనే సృష్టికర్తయైన బ్రహ్మగా పనిచేయుచున్నాడు అంతర్యామియైనట్టి పరమాత్మయే శుక్రునిగా, అమృతత్వమును కలిగించువానిగా పనిచేయుచున్నాడని తెలసికొంటిమి కదా! బ్రహ్మ ఏమి చేయుచున్నాడనగా శుక్రమునందున్నట్టి Human programme లేదా formula ను decode చేసి, దానిననుసరించి దేహములయొక్క నిర్మాణమును చేయు శక్తిగా పనిచేయుచున్నాడు అందువలననే ఈయనను (పరమం కవీనాం') అనిరి బీజముగా నున్నట్టి శుక్రమును, కల్పనము చేయుచున్నాడు అనగా జగత్తులను, లోకములను, ఇట్లే దేహములను కల్పనము (సృష్టి) చేయునట్టి శక్తిగా అంతర్యామియైన పరమాత్మయే బ్రహ్మగానున్నాడు

తదాపః అనగా అపస్సులు, మహాజలములు అనగా దేనియందు సమస్తము కరిగియుండునో దానినే అపస్సులందురు సూర్యుడు మున్నగు వారందరును దీనియందే తేలుచున్నారు అట్టి తరంగాత్మకమైన చోటును సముద్రమనికూడ పిలచెదరు అదియే చోటునందు మహత్తు అను స్థితిగానున్నది అట్లు అన్ని అనుభవములు కరగి ఒకే అనుభవముగానున్నట్టిది అనుభవైక వేద్యమేకాని వివరించుటకు, చెప్పుటకు అందునది కాదు ఎందువల్లననగా అది 'తాను' అను ప్రత్యేకత నశించిన స్థితి కావున ఆస్థితియందుండవలసినదే కాని దానినిగూర్చి తెలుసుకొన యత్నించుట సరి 'కాదు' పంచదారను గూర్చి తెలుసుకొనుట వేరు, తిని దాని తియ్యదనమును అనుభవించుట వేరు తినని వానికి ఎంత తెలుసుకొన్నను తిన్నవాని తియ్యదనము లభింపదు కదా! It is the experience plane which is very high and above the intellectual plane తెలుసుకొనుట, తెలియబడుట అనునవి మానసిక స్థితికి చెందిన లక్షణములు (Mental features )

సప్రజాపతి అనగా ఆయనయే (ఆపరమాత్మ అయిన అంతర్యామియే) మానవ దేహనిర్మాణమునకు కావలసినట్టి శక్తులుగా

అదిపతులుగా పనిచేయుచున్నాడు అనగా బీజములయందు, వృక్షములలో మొలకెత్తుట, పెరుగుటయను లక్షణముగా పనిచేయు చున్నాడు అట్లు వీరందరిగను, వీరందరిలోను పనిచేయుచున్నది ఆ అంతర్యామియైన నారాయణుడే ఆ నారాయణుడే ఇన్నిరూపములుగా ప్రవర్తనలుగా వ్యవహరింపబడుచున్నాడు కావున ఆయన సత్యము వీరందరు అసత్యము అనగా వీరందరును ఇంతమందిగాక వీరందరిలోను ఒకే నారాయణుడు పనిచేయుచున్నాడనునది ఒక మహా సత్యము ఇట్లు ఈ మంత్రార్థమును ధ్యానించవలెను

మంత్రము - 3
సర్వే నిమేషా జజ్ఞిరే విద్యుతః పురుషా దధి|
కలా ముహూర్తాః కాష్ఠాశ్చాహోరాత్రాశ్చ సర్వశః||

ప్రతిపదార్థము

విద్యుతః= మెరుపు లేక వెలుగుగా ఉన్నవాడైన

పురుషాత్= పురుషునినుండి

సర్వే= అన్నియూ

నిమేషా= నిమేషములు (లేకరెప్పపాటు కాలము)

కలా=కళలు

ముహూర్తాః =ముహూర్తములు

కాష్ఠాః + చ=కాష్ఠలు

అహః + రాత్రాః + చ = అహోరాత్రములు

సర్వశః= అన్నివిదములుగా

అదిజజ్ఞిరే= పుట్టినవి

తాత్పర్యము

నిముషములు, కళలు, ముహూర్తములు, కాష్ఠలు, అహోరాత్రములు మున్నగునవన్నియూ వెలుగుగానున్న పురుషుని నుండి పుట్టినవి

వివరణ

పరమాత్మనుండియే కాలమనునది పుట్టినది అట్లు పుట్టుటకు పూర్వము కాలమనునది అంతర్లీనముగా నుండును పుట్టిన పిదప

కాలమునకు ప్రవర్తనమనునది వచ్చును అంతర్లీనముగా నున్నపుడు వానినే నారాయణుడనుచున్నాము పుట్టిన పిదప దానినే కాలమనుచున్నాము ఇట్లు కాలమున కదిపతియైన పరమాత్మనే మహాకాలుడనుచున్నాము అనగా చోటులోనున్నటువంటి నారాయణుడే కాలముగా పుట్టినపుడు నిమిషములు మున్నగునవిగావచ్చును వీటి గణనము ఇట్లున్నది 18నిమిషములు 1కాష్ట,13కాష్టలు 1 కళ, 30 కళలు, క్షణము, 12 క్షణములు 1 ముహూర్తము, 30ముహూర్తములు, 1 పగలు, రాత్రి ,(దినము), 15 దినములు 1పక్షము, 2 పక్షములు 1 మాసము, 2 మాసములు 1ఋతువు, 6ఋతువులు 1సంవత్సరము కాలములోని ఈ ఖండములన్నియు నారాయణ రూపములే ఇట్లు చీకటినుండి మెరుపు పుట్టుచున్నట్లు పరమాత్మనుండి కాలము నిమేషములు, కాష్టములు మున్నగునవి పుట్టుచున్నవి ఇచ్చట నిమేషమనగా రెప్పపాటు కాలము ఇట్టి రెప్పపాటు వలన చూచువానికి ఆ స్వల్పకాలము చీకటి యగును పగలు, రాత్రి, శుక్లపక్షము, కృష్ణపక్షము, ఉత్తరాయణము, దక్షిణాయనము మున్నగునవిగా కాలమేర్పడుచున్నది ఈకాలమంతయు చూచువానికే గాని దానికి లేదు ఆచూచువానినే పశ్యకుడందురు తూర్పునుండి పడమటివరకు బోర్లించిన మూకుడు వలె కన్పించుచున్న ఆకాశము Horizon)ను కశ్యపుడు అని పిలుతురు ఈ కశ్యపునకిద్దరు భార్యలు వారు అదితి, దితి అనగా సూర్యోదయము సూర్యాస్తమయము ఈ సూర్యోదయమునకు కారకులగు శక్తులనే ఆదిత్యులందురు అట్లే సూర్యాస్తమయమును కలిగించు శక్తులను దైత్యులందురు ఇట్లు నిమేషములుగా ప్రారంభమైన కాలము సంవత్సరములుగా, యుగములుగా, మన్వంతరములుగా మరియు కల్పములుగా కల్పింపబడుచున్నది

ఈ కాలము పరమాత్మ స్వరూపము అందువలననే భగవద్గీత యందు''కాలోస్మిలోకక్షయకృత్'' అని భగవానుడు స్వయముగా చెప్పియున్నాడు పరమాత్మ కాలముగా చోటులోనికి దిగివచ్చినపుడే దానికి ప్రవర్తనమనునది ఏర్పడుచున్నది గాని, అంతకు పూర్వము లేదు ఎట్లనగా చోటులో Electricityకి ప్రవర్తనముండదు అది ప్రవర్తన కతీతమైన స్థితిలో నుండును కాని ఒక వస్తువుద్వారా మనము ఉపయోగించినపుడు దానికి ప్రవర్తనమేర్పడుచున్నది Current వలన lights వెలుగును కాని Electricity చోటులో నున్నపుడు దానికిట్టి ప్రవర్తనము (Function) లేదు

కాలమునకతీతముగా వెనుకనున్నట్టి పరమాత్మనే మహాకాలుడందురు అనగా కాలమను తన్మాత్రగా చోటులో అంతర్లీనముగా నుండువాడు (The consciousness which exists as time) ఇట్లు మనకు తెలిసియున్నట్టి స్థితి కాలముకాగా, మనకు తెలియనట్టి స్థితి లేక అంతకు పూర్వమున్నట్టి స్థితియె నారాయణుడు

విద్యుతః అనగా తనంతట తాను వెలుగునట్టి వెలుగు చోటులో వెలుగుగా, మెరుపుతీగెగా, విద్యుత్తుగా లేక ప్రాణశక్తిగా నున్నట్టి పరమాత్మ ఆయననుండియే కాలము పుట్టినది ఈకాలము ఎచ్చట పుట్టుచున్నది? భూమియందు 24 గంటలలో తనచుట్టూ తాను ఒక పర్యాయము తిరగవలెనను ప్రజ్ఞ లేక Consciousness ఎచ్చట పనిచేయుచున్నదో అదియే నారాయణుడు అనగా భూమి అట్లు తిరగవలెనని దానియందు నియమింపబడి యుండుటచే లేక Programme చేయబడి యుండుటచే అట్లు తిరుగుచున్నది అట్లే ఒక Tape recorder లో నుండు Cassette ఎంత వేగముతో తిరగవలెనన్నది దానియందు Programme చేయబడి యుండుట వలన అది అట్లు తిరుగును కాని దానంతట అది తిరగదు అట్లే సృష్టియందేదియు తనంతట తాను వచ్చుట జరుగదు ఎవరో ఒకరు సృష్టిచేయుట వలననే జరుగును అట్లు ఈ సమస్తమును తయారుచేయువానినే నారాయణుడని పిలచుచున్నారు ఆయనయే సూర్యునకు, భూమికి, చంద్రునకు, ఇతర గ్రహములకు ఒక్కొక్క ప్రణాళికను ఇచ్చుచు, తిరిగి వాటియందు వాటి దర్మముగా తానే మేల్కొనుచున్నాడు అట్లే భూమి తిరుగుటకు కావలసిన కక్ష్యను ఏర్పరచినాడు-all this is decided by him ఇట్లు చోటులో కాలమను స్వరూపముతో పనిచేయుచు జీవులయందు, మానవులయందు అనేకవిదములైన స్థితులలో పనిచేయుచున్నాడు అనగా జీవులందరిలోనుండి శ్వాసించుచున్నవాడు, మాటలాడుచున్నవాడు, ప్రవర్తించుచున్నవాడు, ఆలోచించుచున్నవాడు తానే అయియున్నాడు మనలో ఆలోచన (Thought) అనునది ఆయననుండియే పుట్టుచున్నది ఇది అందరియందునూ సత్యము కావున ఇట్లు మనయందు శ్వాసను, నారాయణుడు పుట్టునటువంటి చోటుగా ఉపాసనచేసి ధ్యానము చేయవలెను మనలో శ్వాస-నిముషమునకు ఇన్నిమారులు జరుగవలెనని నిర్ణయించునది కూడ ఆ పరమాత్మయే గదా। ఇట్లు అన్నిటియందును పనిచేయుచున్నట్టి ప్రజ్ఞలన్నిటిని కలిపి నారాయణుడని పిలిచెదరు

## మంత్రము - 4

అర్ధమాసామాసాఋతవస్సంవత్సరశ్చ కల్పన్తామ్|
సఆపః ప్రదుఘే ఉభే ఇమే అన్తరిక్షమదో సువః||

## ప్రతిపదార్థము

అర్ధమాసాః= పక్షములు
మాసాః= మాసములు
ఋతవః= ఋతువులు
సంవత్సరశ్చ= సంవత్సరములు కూడా
కల్పన్తామ్= కల్పించబడినవి
సః= ఆపరమాత్మ
ఆపః= జలములను
అంతరిక్షమ్= అంతరిక్షమును
అదః= మరియు
సువః= సువర్లోకమును
ఇమే= ఈ
ఉభే= రెండింటిని
ప్రదుఘే= పిండెను

## తాత్పర్యము

పక్షములు, మాసములు, ఋతువులు, సంవత్సరములు ఆపరమాత్మచేతనే కల్పించబడినవి అతడే జలములనుండి అంతరిక్షమును, సువర్లోకమును పిండెను

## వివరణ

అర్ధమాసమనగా నొక పక్షము రెండు పక్షములొక మాసమగును ఈ పక్షము, మాసము మున్నగువాటి జ్ఞానము (Consciousness) మనకెట్లు కలుగుచున్నది? ఎచ్చటనుండి వచ్చుచున్నది? ఇది మనము చేసుకొంటిమా? కాదు ఇది మనకు చంద్రునినుంచి వచ్చుచున్నది అనగా చంద్రుని గమనమువలన కలుగుచున్నది మాసమనగా 30 దినములు కాదు మాసమనగా30 తిదులు అనగా ఇది చంద్రుడు భూమిచుట్టును ఒక పర్యాయము తిరుగుటకు పట్టుకాలము అటులనే ఋతువనగా 2 మాసముల కాలము 6 ఋతువులు కలసి ఒక సంవత్సరమేర్పడును ఇది

భూమి, సూర్యుని చుట్టు ఒక పర్యాయము తిరుగుటకు పట్టుకాలము చంద్రమాన సంవత్సరమునకు, సౌరమాన సంవత్సరమునకు మద్యనున్న బేదమును పూరించుటకు నాలుగు సంవత్సరములకొకసారి అదికమాసమను పేర సర్దుబాటు చేయుదురు

సృష్టికి పూర్వము పరమాత్మ అంతర్యామిగా తనయందు తానుగా నుండెను ఏమియు లేనట్టి ఆ స్థితినుండియే ఆపస్సులను అనగా జలములను కల్పించినాడు అనగా అవ్యక్తముగా నున్నట్టి తానను ప్రజ్ఞనుండి జలములు అను స్థితిని కలిగించినాడు i e , the first fluid formation వీనినే మహాజలములందురు అదియే ప్రాణశక్తి, అదియే మూలప్రకృతి అనగా చోటులో నున్నట్టి సమస్తమును జలములుగా పిండినాడు ప్రదుషే-బాగుగా పితికినవాడయ్యెను అనగా పాలగ్రందులలో పాలు ఎట్లేర్పడుచున్నవో అట్లే చోటులో ఈ వస్తువులన్నియు నేర్పడుచున్నవి (ఆవు తీసుకొను ఆహారము వలన పాలగ్రందులలో పాలు ఏర్పడుచున్నవిగాని ఆ గ్రందులను కోసిచూచినచో పాలుండవు గ్రందులద్వారా పాలు ఏర్పడుచున్నవి అట్లే సమస్తమైన వస్తువులును చోటులో ఏర్పడుచున్నవి) అంతరిక్షమనగా The plane of forces సువర్లోకమనగా-ప్రజ్ఞామయమైన లోకము అనగా అంతకు పూర్వమున్నట్టి అవ్యక్తమను స్థితినుండి వ్యక్తమను స్థితిలోనికి పాలగ్రందులలోనుండి పాలను పితుకుతున్నట్లు, చోటును జలములుగా పిండినాడు ఈ రెండులోకములను పిండుటచేతనే, అంతవరకు ఉన్నట్టి ఏకము (ఒకటి) యను స్థితినుండి రెండవది అను స్థితి లేక బావము ఏర్పడినది అనగా The First (sense of) seperation అనునది ఏర్పడినది అనగా తాను, ఇతరము అనునవి రెండు ఏర్పడినవి అవి కర్త, కర్మలుగా నేర్పడగా వాటిమద్య సంబంధముగా క్రియయను మూడవది వచ్చినది ఇవియే త్రిమూర్తులుగా చెప్పబడినవి First triangle, The triad or trio అచ్చటినుండియే మిగిలిన సృష్టియంతయూ వచ్చినది ఆతరువాత కాలము, దేశము (Time and space) అనునవి ఏర్పడినవి ఈకాలము అనునది మూడవ axis-అనగా మనకు తెలిసినట్టి x-axis, y-axisకాక, z - axis or time-axis ఇట్లు అంతరిక్షము మరియు సువర్లోకము అను రెండు లోకములు నేర్పడెను అనగా మొదట జీవులకు ప్రజ్ఞలు (Consciousness) ఏర్పడి, ఆతరువాత చుట్టునున్నట్టి శక్తిమయమైన లోకములు, శక్తులు ఏర్పడినవి

## మంత్రము - 5

నైనమూర్ధ్వం నతిర్యఞ్చం నమద్యే పరిజగ్రభత్|
నతస్యే శేకశ్చ నతస్యనామ మహద్యశః||

## ప్రతిపదార్ధము

ఏనం= వీనికి

ఊర్ధ్వం= పైన

కః + చ= ఎవ్వరునుకూడా

న= లేరు

మద్యే= మద్యలో

తిర్యంచ= వెడల్పుకూడ (అడ్డముగాకూడ)

పరిజగ్రభత్= గ్రహించుటకు

న=సాద్యముకాదు

తస్య= ఆయనను

కశ్చన= ఎవరును

ఈశే=శాసించలేరు

తస్య= అతనియొక్క

నామ= నామము

మహద్యశః= మహత్తుతన యశస్సుగా కలవాడు, లేక వ్యాపనముగా కలవాడు

## తాత్పర్యము

పరమాత్మకు పొడవు, వెడల్పు మధ్య అనునవి లేవు ఆయననుగూర్చి ఇట్టికొలతలతో తెలుసుకొనుట సాద్యముకాదు ఆయనను గొప్ప యశోవంతునిగా తెలుసుకొనగలమే గాని మరియొక విదముగా ఎవరును తెలుసుకొనలేరు

## వివరణ

పరమాత్మ యొక్క వ్యాపనము అనగా ఎత్తు, వెడల్పు మద్య లేక ప్రక్కల అనునవి మనము తెలుసుకొనలేము నిజమునకు మనలో వీనినిగూర్చి అవగాహన పరమాత్మవలననే ఏర్పడుచున్నది మనకు

తెలిసినంతలో ఎత్తు అనునది ఒక ప్రమాణమునననుసరించి నిర్ణయింతుము అతడందరికన్నా పొడవయినవాడు అని చెప్పుటలో సాధారణ మానవులు ఎత్తు ఇంతయుండవలయునని మనము నిర్ణయించుకొని దానిననుసరించి ఇతరుల ఎక్కువ తక్కువలు నిర్ణయింతుము అట్లు నిర్ణయింపగల శక్తి మనకు పరమాత్మననుసరించియే పుట్టుచున్నది మనమెంత ఎత్తైనవి యూహించుకొనిననూ అవి యన్నియు పరమాత్మలోని బాగములే కనుక ఆయన అందరికన్నను ఎత్తైనవాడు, అట్లే వెడల్పు మున్నగునవి మధ్య అని చెప్పుటలో కేంద్రమనికూడ సూచితము ఈ సృష్టియందలి వస్తువులన్నిటికిని పరమాత్మయే కేంద్రముగా నున్నాడు సూర్యునినుండి భూమివరకు అట్లే మానవుని యందును, జీవులయందును, అణువులయందును నేననుకేంద్రముగా వానికాదారమయి యున్నాడు అట్టి యాదారమునుగూర్చి తెలుసుకొనుట యనగా అదియే తానగుట తాను మనస్సుగా నుండుట మాని తానుగా నుండుట వలన మాత్రమే ఇది సాద్యమగును తెలుసుకొనుట యనునది మనసుయొక్క ప్రక్రియ మనసు లేనిచో తెలుసుకొనుట ఎట్లు? కనుకనే పరమాత్మయందు ఐక్యమగుటయే గాని వానినిగూర్చి తెలిసికొనుట ఎవరికిని సాద్యముగాదు వానినిగూర్చి మనము తెలుసుకొనునవి అన్నియు వాని గుణములేకాని వాడుకాదు

నియమించుట లేక వశమగుట యనగా ఒకరికింకొకరు లోబడియుండుట ఈసృష్టియందు అందరును పరమాత్మకు వశమై యుందురేకాని ఆయన ఎవరికిని వశముకాడు ఈలోకమునందు ఒకరు ఇంకొకరికి వశమగుచున్నారనగా అది దనమునుగూర్చిగాని, అదికారమునుగూర్చిగాని, పనులనుగూర్చిగాని కావచ్చును ఇట్లు ఈకోరికలరూపమున పరమాత్మయే యున్నాడు గనుక అందరును పరమాత్మకు వశమై యున్నారేగాని పరమాత్మ ఎవరికి వశముగాదు అనగా ప్రతివారు తమ కోరికలకు వశమయి యుండిరేగాని, కోరికలు తమ వశమునందుండవు చివరకు మోక్షము పొందవలెననుకొనుట, ఇతరులను సేవించవలెననుకొనుట, అందరిలో పరమాత్మను చూడవలెననుకొనుట మున్నగునవన్నియు కోరికలే జీవులందరు ఎవరి కోరికననుసరించి వారు ప్రవర్తింతురే గాని తమ కోరికకు వ్యతిరేకముగా ఎవరును చెయలేరు కాకరకాయ కూరను ఇష్టపడువాడు అది తనకు యిష్టముకాకుండ చేసికొనగలడా! కనుక పరమాత్మ ఎవరికిని వశముగాడు

మహాద్యశః యనగా గొప్ప కీర్తి కలవాడు అని అర్థము ఇది ఆయన నామముగా చెప్పబడినది నామము యనునది జీవులొకరినొకరు గుర్తించుకొనుటకేర్పడినది ఇట్లు జీవులు ఒకరినొకరు గుర్తించుకొనుటలో తమలో గల గుర్తు అను పేర పరమాత్మనే చూచుచున్నారు అనగా మనలో గుర్తించుకొనుట, జ్ఞాపకము తెచ్చుకొనుట అను లక్షణముగా పరమాత్మయే యున్నాడు ఇట్లు సమస్త జీవులలోను గుర్తించుకొనుట అనులక్షణముగా పరమాత్మయే యున్నాడు ఇట్లు అందరియందు తానే యశస్సుగా వ్యాపించియున్నాడు యశస్సు అను పదమునకు వ్యాపించుట అని అర్థము ఇట్లు అందరికన్నా ఎక్కువ యశస్సు తానేయైనవాడు కనుక నారాయణుడు మహాద్యశుడు



# అనువాకము - 3

## మంత్రము - 1

నసందృశే తిష్ఠతి రూపమస్యనచక్షుషా పశ్యతి కశ్చనైనమ్|
హృదామనీషా మనసాభిక్లుప్తోయ ఏనంవిదురమృతాస్తేభవంతి||

## ప్రతిపదార్థము

అస్య= ఈయనయొక్క
రూపమ్= రూపము
సందృశే= చక్కగా గమనించుటకు (వీలుగా)
నీతిష్ఠతి= నిలువదు
కఃచన = ఎవ్వరును
ఏనమ్= వానిని
చక్షుషా= కన్నులచేత (చర్మ చక్షువులచేత)
నపశ్యతి= చూడలేరు
యః= ఎవడైతే
ఏనం= వానిని
హృదా= హృదయముచేత
మనీషా= ఉత్తమ మానసిక కక్ష్యయందు
మనసా= మనసుచేత
అభిక్లుప్తః= స్థిరముగా నిలుపుట (సాదించి)
విదుః= తెలియుచున్నారో
తే= వారు
అమృతాః= మరణము లేనివారుగా
భవంతి= అగుచున్నారు

## తాత్పర్యము

ఈయన రూపము చూపులకు అందునది కాదు మరియు గమనికకు నిలుచునది కాదు హృదయముచేత, మనస్సుచేత, ఉత్తమ మానసిక కక్ష్యయందు ద్యానముచేసి దారణ చేయవలసి యుండును అట్టివారు అమృతత్వమును పొందుదురు

## వివరణ

ఈయనయొక్క రూపము చూపులకు అందనిది బౌతికముగా కనిపించుచున్న రూపములన్నియు తాత్కాలికమేగాని సత్యముగాదు మంచు, మేఘములవలెనే, అణువులు ఒకదానిప్రక్కనొకటి పరిభ్రమించుచు, ఒకచోట కట్టుబడి వాటిలోనున్న ఆకర్షణశక్తిచేత తాత్కాలికముగ నొకచోట నిలబడియున్నవి గాలియొక్క విసురువల్ల దుమ్ములేచినపుడు ఒక ఆకారముగ కనిపించినను అది ఎట్లు సత్యము కాదో అట్లే మనము చూచునదంతయు సత్యము గాదు మహావేగముతో అణువులు పరిభ్రమించునపుడు ఆవేగమునకు అణువులు ఒకచోట స్థిరముగా నున్నట్లు కనిపించును అట్లే ఒక చక్రము వేగముగా తిరుగుచున్నపుడు దూరమునుండి చూచువారికి తిరుగనట్లే కనిపించును అట్లే వస్తువులు బౌతికరూపములేర్పడుచున్నవి అణువుల సముదాయములు ద్రవ్యము (Matter) గా నేర్పడుచున్నవి కనుక మనదృష్టిలోనున్న భ్రమ తప్ప నిజమునకు మనము చూచుచున్న రూపము సత్యము గాదు అందువలననే 'న సందృశే తిష్ఠతిరూపమస్య' అనగా ఆయన రూపము గమనికకు అందదని చెప్పబడినది ''న చక్షుషా పశ్యతి'' అనగా ఒకరూపముగా కట్టుకొనిన బౌతికమయిన స్థితిని గమనించగలముగాని, ఆవెనుకనున్న శక్తిమయమైన ఉనికి లేక స్థితి మన దారణకు సాద్యముగాదు ఎవరైనను బౌతికమయిన కనులతో దానిని చూచుట సాద్యముగాదు వానిని దర్శించు విదానము ''హృదామనీషా మనసా అబిక్లుప్తః''అనగా మనస్సును బుద్ధియందు లగ్నము చేయవలెను దానికి హృదయమును'ఉపకరణము'గా నుపయోగింపవలెను హృదయమునందు మనస్సును దారణచేయవలెను అనగా మొదట కన్నులు మూసుకొని ద్యానము చేయవలెను హృదయముయొక్క చలనమును మనసుచేత గమనింపవలెను అట్లు గమనించుటకు ముందు ఉచ్ఛ్వాస నిశ్వాసములను మనసుచేత గమనించుటకు ప్రయత్నము చేయవలెను క్రమముగా అబ్యాసము చేయుటచే మనస్సు శ్వాసయందు లయమగును అపుడు మనసునకు ప్రవృత్తియుండదు కనుక మనస్సును శ్వాసయందు లగ్నము చేయుటచేత అప్రయత్నముగ హృదయమునందు లయమగును అనగా బుద్ధిమయలోకములందు మనస్సు ప్రవేశించును ''మనోహృదినిరుద్యంచ'' అని బగవద్గీతలో శ్రీకృష్ణునిచే చెప్పబడినది ఇదియే మనము సాదారణముగా ఇతరులకు ఏపనైనను చేయునపుడు

దానివలన కలుగు లాభనష్టములను దృష్టిలో నుంచుకొని చేయుదుము కాని ఇష్టము కలవారికి, మన పిల్లలకు అప్రయత్నముగా హృదయముతో పనులు చేయుచుందుము ఇతరులకు పనిచేయునపుడు అట్లుకాక మనసుతో చేయుదుము అనగా మనము పనులు చేయుచున్నపుడు హృదయము ప్రదానముగా నుండవలెను, కాని మనసు ప్రదానముగా నుండరాదు ప్రత్యేకముగ మనసును, హృదయముతో కలుపు ప్రయత్నము చేయరాదు యోగజీవనము అనగా హృదయము అప్రయత్నముగా మేలుకొని యుండుట యోగసాదన ఒక సర్కసు వంటిది ఏమాత్రము తేడావచ్చినను పడిపోవుటకు అవకాశము కలదు కనుక మనసుచేత ప్రయత్నించి హృదయమునందు నిలబడుటకాక హృదయము తనంతట తాను మేలుకొనవలెను సకలజీవులలోనున్న అంతర్యామిని ద్యానముచేసి వానికి సమర్పణముగా పనులు చేయుచున్నచో మనసు లయమయి, హృదయము మేలుకొని యుండును దీనికి కొద్దిపాటి సన్యాసము, సమర్పణబుద్ధి యుండవలయును మనకేమియు ఉపయోగము కలుగదని తెలిసినను కష్టములలో నున్నవారికి మనము చేయగలిగిన ఉపకారము చేయుచున్నచో క్రమముగా వానియందు ప్రేమ, అబిమానము అప్రయత్నముగ కలుగును కొంతకాలమునకు మనకు ఉపయోగములేనివారికి కూడ ప్రేమతో, హృదయముతో పనులు చేయుట అబ్యాసమగును "ఏనం విదురమృతాస్తే భవంతి" అంతర్యామియైన నారాయణుడు లేని ప్రదేశము లేదు హృదయములోను, మనసులోను కూడ కలడు అట్టి నారాయణుని ఎవరు తమ హృదయమునందు ఈసాదనద్వారా తెలుసుకొనుటకు ప్రయత్నము చేయుదురో వారు అమృతత్వము పొందుదురు "అమృతాస్తే భవంతి' అనగా అప్రయత్నముగా అమృతత్వము అను స్థితిలోనికి చేరుదురని అర్థము మోక్షముకొరకు కాక, అప్రయత్నముగా దానియందుండుట సాదన చేయవలెను సంతోషముగ ఉండుటకు ప్రయత్నము చేయుట, లేదా కోపమురాకుండుటకు ప్రయత్నము చేయుట అనునవి అర్థరహితములు అప్రయత్నముగ దానంతట అది పొందబడు స్థితి అమృతత్వస్థితి ప్రేమచేత జీవింపగలిగినవారు అప్రయత్నముగ ఆస్థితిలో ఉండగలరు "హృదామనీషా మనసాభిక్లుప్తో" అనగా ఎవరైతే ప్రేమతో పనులు చేయుచున్నారో వాడు అమృతత్వస్థితిలో నుందురు ఇచ్చట

తెలుసుకొనుట అనగా అనుభవించుట అని అర్ధము పంచదార తీయగా ఉండునని చదివినను లేదా చేదుగా ఉండునని ఎవరైనా చెప్పినను, తిననిగాని రుచి తెలియదుగదా! తిననవారికి ఎవరూ చెప్పకనే తెలియును ఎన్నో విషయములు తెలుసుకొనుట వేరు ఒక్క విషయమైనను అనుభవపూర్వకముగా తెలుసుకొనుట వేరు తేనె తియ్యదనమును, పువ్వుల పరిమళములను వ్రాతలతోను, మాటలలోను అనుభవమునకు తీసుకురాలేము కనుక ప్రతివిషయమును అనుభవపూర్వకముగనే తెలుసుకొనవలెను తేనె నోట్లో వేసుకొనినవానికి అప్రయత్నముగా దాని తియ్యదనము లభించినట్లు నారాయణుని ధ్యానము చేయుచున్నవారు నారాయణునియొక్క లోకమునందు లేక అమృతత్వమునందు అప్రయత్నముగా నుందురు

మంత్రము - 2
అద్భ్యస్సంభూతో హిరణ్య గర్భ ఇత్యష్టౌ|

హిరణ్యగర్భసూక్తము 1
హిరణ్య గర్భః సమవర్తతాగ్రే భూతస్య జాతః పతిరేక ఆసీత్|
సదాధార పృధివీం ద్యాముతేమాంకస్మై దేవాయ హవిషా విధేమ||

ప్రతిపదార్ధము

అగ్రే= మొట్టమొదట

హిరణ్యగర్భః హిరణ్యగర్భుడు

సమవర్తతః= వర్తించెను (లేక ప్రవర్తించెను)

జాతః= పుట్టినవాడు

భూతస్య= పంచభూతములకు లేక సకలప్రాణులకు

ఏకః= ఒక్కడే

పతిః= ప్రభువు

ఆసీత్= అయ్యెను

సః= అతడు

పృధివీం= భూమిని

ఉత= మరియు

ఇమాం= ఈ

ద్యౌః= అంతరిక్షమును

దాదార= దరించెను

కస్మై= ఎవరికొరకు

హవిషా= హావిస్సులను

విదేమ= దరించెదమో|

## తాత్పర్యము

మొట్టమొదట హిరణ్యగర్భుడు కలడు ఆయన సకలభూతములకు ఒకేప్రభువై జన్మించెను ఆయన పృదివి మరియు అంతరిక్షమును దరించెను హావిస్సులను అట్టి దేవునికొరకు వహించుచున్నాము

## వివరణ

హిరణ్యగర్భః సమవర్తతా'' అనగా మొట్టమొదట సృష్టి ప్రారంభమున సృష్టియొక్క సంకల్పముగా వచ్చినవాడు హిరణ్యగర్భుడు ఆయన బంగారపు వర్ణముతో కూడిన ఒక అండముగా వచ్చినాడు 'హిరణ్యవర్ణాం' అనగా సూర్యకిరణములకు మూలకారణ మైనటువంటి రంగు అందువలననే సూర్యోదయ సమయమున సూర్యునియొక్క మొదటి కిరణములను ' హిరణ్యవర్ణామ్' అందురు సూర్యునియొక్క కిరణములవలన భూమిలో బంగార మేర్పడుచున్నది ఆదిత్యహృదయములో ఇట్టి మంత్రములు ఈయబడినవి సూర్య కిరణములను ఒక పదార్ధములోనికి ప్రసరింపచేసి బంగారము తయారుచేయు విదానము అందు చెప్పబడినది

పరమాత్మయొక్క మొట్టమొదటి శ్వాసగా సృష్టి సంకల్పము ప్రారంభమగుచున్నది శ్వాసలో ఉచ్ఛ్వాసమునకు సంబందించిన శబ్దము'సో'నిశ్వాసమునకు సంబందించిన శబ్దము 'హ' దీనినే మనము 'సోహం' గా ధ్యానము చేయుచున్నాము శ్వాసక్రియలో మనము మొదట శ్వాసను లోనికి తీసుకొని తరువాత బయటకు వదులుదుము కాని పరమాత్మ తొలుత శ్వాస బయటకు వదలి తరువాత లోనికి తీసుకొనును కనుకనే నారాయణుడు తన శ్వాసగా సృష్టిని బయటకు వదలెను ఈసృష్టి మొత్తము ప్రకృతి, పురుషుడు అను రెండింటియొక్క మహాచైతన్యముగా వచ్చినది బ్రహ్మ తనయొక్క సంకల్పముగా ఈ సృష్టిని వ్యక్తము చేసెను అదియే 'ర'కారముతో కూడిన మొదటిరేపము శ్వాస బయటకు వదలుటకు

వలసిన శక్తి తరంగములు హృదయకోశమునుండి బయల్దేరును అది
'అను శబ్దము ఆత్మగతముగా నుచ్చరింపబడుటవలన మేల్కొని
)చేయును అట్టి ప్రాణమయ తరంగములచే శ్వాసకోశము ప్రబావితమై
)చేయును 'హ' అను శబ్దముచే కదలింపబడిన శ్వాసకోశ ప్రవృత్తులు
్వాసగా రాగా కంఠమునందలి స్వరపేటికద్వారా వాయువు
యాణించుచు అందలి పొరలతో రాపిడిచెంది, "హృ" అను
ప్రవృత్తిగా వ్యక్తమగుచున్నది ఇది గర్భకోశమందలి
బిస్థానమునుండి బయల్దేరు ప్రాణశక్తులచే ముడిపడియుండుటచే ఈ
త్తము స్వరూపము "హిరణ్యగర్భుడు" అను తేజోమయరూపముగా
క్తమగుచున్నది కంఠమునందలి స్వరపేటికయందున్న ఉచ్చరించుట
మశక్తి బ్రహ్మయొక్క ప్రబావమువలన పనిచేయును కనుకనే ఇందలి
శుద్ధి చక్రము బ్రహ్మయొక్క స్థానముగా చెప్పబడినది ఈచక్రము
)త్వము, కల్పన, పదకములు, ప్రణాళికలు, ఊహలు, ఆలోచించుట
ున్నగు శక్తులకు ఆదిపత్యము వహించును కనుక ఈ బ్రహ్మయే
రణ్యగర్భుడుగా చెప్పబడినాడు

అనాహత, విశుద్ధి చక్రములతో కలసి ఉచ్చరింపబడిన పదము
వర్ణము సువర్ణమనగా చక్కగా ఉచ్ఛరింపబడినదని కూడ అర్థము
రణ్యవర్ణాం' అనగా వెలుగు ముద్దఅని అర్థము దీనినే పురుషపదముగా
పు ్పనపుడు 'హిరణ్యగర్భః' అనిరి అట్లు సృష్టి మొట్టమొదటి
పముగా వచ్చిన హిరణ్యగర్భుని నుండి సమస్తమయిన రూపములు
చ్చినవి సూర్యకిరణములనుండి సమస్తమయిన సృష్టి దిగివచ్చినది
విబౌతిక కిరణములుగా వ్యాపించునపుడు చోటులో పొదగబడి
ొక్కచోట ఒక్కొక్క అండముగా ఏర్పడి మనచుట్టు వున్న
హములన్నియు వచ్చినవి సూర్యునిచుట్టు ఉన్న వెలుగు లేక తేజస్సు
కృతిగా ఏర్పడినది ఒక్కొక్క గ్రహముపై ఆయా గ్రహములకు
ంబందించిన జీవులు జన్మించిరి భూమికి సూర్యునికి కలసి పుట్టినవారు
ామిపై జీవులుగా వచ్చిరి భూమి తల్లిగా, సూర్యుడు తండ్రిగా వీరు దిగి
చ్చిరి అటులనే బుదునికి, సూర్యునికి జన్మించినవారు బుద్ధిమయమయిన
వులు వీరు బుదలోకమున ఉందురు జీవులు ఆయాలోకములనుభట్టి
ాపములను పొందుదురు

'సమవర్తత' అనగా వర్తించుట మొదట హిరణ్యగర్భునిగా వచ్చిన
రువాత అయనయొక్క ప్రకృతి విశ్వమునందు విస్తరించినది

ఈ హిరణ్యాగర్భు ననుసరించి పంచభూతములు మొదట పంచతన్మాత్రలుగా(Principles) పుట్టినవి అనగా మొదట దర్మములుగా లేక సత్యములుగా వచ్చిన పిదప వానికి రూపములేర్పడును అట్లే తినుట అను ప్రవృత్తి ఏర్పడిన పిదప దాని ననుసరించి బౌతికలోకమున జీవులకు ఆహారము పుట్టెను ఇట్లు మొదట సత్యములు (Principles) పుట్టి, వానివలన ధర్మములేర్పడును అట్టి దర్మములననుసరించి, బౌతిక దర్మము లేర్పడుచున్నవి ఇవన్నియు ఒకదానికొకటి ఆదారము బౌతికమైన పదార్థములకు వాని ధర్మములు ఆధారము దర్మములకు సత్యములు ఆధారము ఈ సత్యములకు సత్యలోకమునకదిపతియైన బ్రహ్మ అనగా సృష్టికర్త లేక హిరణ్యాగర్భుడు (The Womb of Cosmos) ఆదారము కనుకనే హిరణ్యాగర్భుడు మొట్టమొదట పుట్టెనని చెప్పబడెను ఇట్టి హిరణ్యాగర్భుని నుండి దిగివచ్చిన సృష్టివలన జీవులకు ఆత్మ, మనసు, బౌతిక దేహము మూడు స్థాయిలుగా ఏర్పడుచున్నవి ఇట్టి జీవులందరకు హిరణ్యాగర్భుడే ఆదారము జీవులలోనున్న 'నేను' అను వెలుగు హిరణ్యాగర్భునిలోని బాగమే ఇది బంగారము ఉన్నవాని దగ్గరనుండి కొంతబంగారము అప్పు తెచ్చుకొని వచ్చి దానితో యొక ఆబరణము చేసి దరించుట వంటిది జీవ ప్రజ్ఞయందలి 'నేను' ఈ ఆబరణము ఇది హిరణ్యాగర్భుని యందలి బాగము కనుక మనము ఏదిచేసినను హిరణ్యాగర్భునియందే ఆయన ఇచ్చిన దేహాది ఉపకరణములతో బౌతికద్రవ్యములతో చేయవలయును ఇది మొత్తము ఒక మహా యజ్ఞముకాగా ఆ యజ్ఞమునందలి హావిస్సులే మన దేహాదులు, బౌతిక ద్రవ్యములు మున్నగునవి మనము ఏపని దేనికి చేసినను ఆపని తాలూకు సంకల్పములు ఆయనలోని బాగములే కనుక మనము చేయు పనులన్నియు మనకు తెలియకుండగనే ఆయనను గూర్చియే చేయుచున్నాము అనగా ఈ దేహాది ఉపకరణములు, సమస్త ద్రవ్యములు హావిస్సులగుచుండగా అట్టివానిని మనము ఆయననుగూర్చియే దరించి పనిచేయుచున్నాము కనుకనే పైన ''కస్మై దేవాయహావిషావిదేమ'' అని చెప్పబడినది

హి సూ 2

యః ప్రాణతో నిమిషతో మహిత్వైక ఇద్రాజా జగతో బభూవ|
య ఈశే అస్యద్విపదశ్చతుష్పదః కస్మై దేవాయ హావిషావిదేమ||

## ప్రతిపదార్థము:

యః= ఎవడు

ప్రాణతః= చరించుచున్నట్టి

నిమిషతః= రెప్పపాటుకలిగినట్టి

జగతః= ప్రపంచముయొక్క

మహిత్వ= మహిమగలవాడు

ఏకః= ఒక్కడే

ఇతి= అని

రాజా= ప్రభువు

బభూవ= అయ్యేను

యః= ఎవడు

అస్య= ఈజీవియొక్క

ద్విపదః= రెండుపాదములు కలిగినట్టివాడు (మానవుడు)

చతుష్పదః= నాలుగు పాదములు గలవి

ఈశే= ప్రభువుగా వర్తించువాడు

కస్మైదేవాయ= అటువంటి దేవునికొరకు

హవిషా= హవిస్సులను

విదేమ=వహించుచున్నాము

## తాత్పర్యము :

ఈ ప్రపంచమునందు ప్రాణము కలవి, రెప్పపాటుకలవి అయిన జీవులకు తానొకడే రాజైనవాడును మరియు ద్విపదములు, చతుష్పదములకు అదిపతియైనవాడును అయిన దేవుని కొరకు మేము హవిస్సులను వహించుచున్నాము

## వివరణ:

రెప్పపాటు కాలమును సూచించును రెప్పపాటులేని ఎడల కాలము లేదు జగతః అనగా ప్రపంచము కాలము వలన పుట్టినది ప్రపంచము మహిత్వా అనగా, ఇచ్చట ''వ్యాపించుట'' అని అర్థము ఈ జగత్తుయందు ఒకచోట రాజు, ఒకచోట ఈశుడు, ఒకచోట ప్రభువుగ

పరమాత్మ తానే ఉన్నాడు రాజు అను శబ్దమునకు రజస్సుల పుట్టుకకు కారణమైనవాడు అని అర్థము అనగా సృష్టించుట అనునది రజోగుణమునకు సంబందించినది బ్రహ్మ రజోగుణమునకు అదిపతి శివుడు తమోగుణమునకు, విష్ణువు సత్వగుణమునకు అదిపతులు జీవులను సృష్టించుట, తరువాత వానికి ఆకారాదులను ఏర్పరచుట మొదలైనవి రజోగుణమునకు సంబందించినట్టివి మహిత్వా అనగా వ్యాపనము లేక విస్తారమునందుట, అనగా ఎవరియొక్క రజస్సు లేక కర్తవ్యమునందు సృష్టియొక్క విస్తారత ఏర్పడినదో, ఎవరి సంకల్పముచే సృష్టి అంతయు నేర్పడినదో అట్టి సృష్టికి కర్తగా ఆనారాయణుడే పనిచేయుచున్నాడు అతడే రజస్సునకు అదిపతిగా వున్నాడు సృష్టిలో రజస్సు లేకుండా కర్తవ్యము (Activity)ఉండదు వస్తువులలోని చలనము, మార్పులు అన్నియును రజస్సునకు సంబందించినవి తమస్సు జడము (Static), No movement, రజస్సు చైతన్యము (Dynamic) సత్వము అనగా సామ్యము (Equilibrium) చోటులోనున్న ప్రాణశక్తివలన సృష్టికి చైతన్యమేర్పడినది చైతన్యము ప్రాణశక్తియొక్క మొట్టమొదటి ప్రవృత్తి ప్రాణశక్తిని ఒకేపదముగా ఉపయోగింతుము కాని అది పంచప్రాణములుగా అనగా five layersలో ప్రాణశక్తి పనిచేయును ప్రతిలోకమునందును ప్రాణశక్తి కలదు ఒక్కొక్క లోకమున ప్రాణశక్తి ఒక్కొక్క విదముగ పనిచేయును అన్నింటిలోనున్న ప్రాణశక్తి ఒక్కటికాదు ఒక్కొక్కచోట ఒక్కొక్క planeలో ఉంది, వేరువేరు ప్రవృత్తులు కలిగి ఉండును మానవ దేహమున, హృదయమున, మనస్సున వేరువేరు ప్రవృత్తులతో పనిచేయుచుండును ఈ ప్రాణశక్తి దేహమున ఏడు కేంద్రములలో (Seven centres) ఏడు types of vibrationsలో పనిచేయును ఈ ఏడింటికి మూలమయిన ప్రాణశక్తినే మొట్టమొదటి రజస్సు అనిరి బ్రహ్మనుండి మొట్టమొదటి చైతన్యముగ ప్రకృతి విస్తరించినది ఈ చైతన్యము వలననే కాలము వచ్చినది మొట్టమొదటి చైతన్యమునే ప్రాణశక్తి అందురు

నిమిషతః అనగా నిమేషము లేక రెప్పపాటు అను కాలమానము ఈ మొత్తము సృష్టి పరమాత్మయొక్క ఒక్క రెప్పపాటుగా చెప్పుచున్నారు ఆయన కన్ను తెరచునంతలో ఈ సృష్టి మొత్తము బయటకు వచ్చినది. మరల కన్ను మూసినప్పటికి సృష్టి ఆయనలోనికి పోయినది ఒక రెప్పపాటుగా ఈ మొత్తము సృష్టిని చెప్పిరి అట్టిరెప్పపాటునుండి కాలము

పుట్టినది అట్లు నిమేషములు అను కొలమానము కలిగినట్టి జగత్తుయొక్క, సృష్టిగా విస్తరించుకొనుటయను ప్రవృత్తియందు ఆయన రాజుగా పని చేయుచున్నాడు

ప్రాణతః అను పదమునకు అర్థము ప్రాణులు అనగా వృక్షజాతితో కూడిన మొత్తము (Organic) జీవసృష్టి అంతయు అని అర్థము కాలముననుసరించి చెట్లు పుట్టుట, చిగిర్చి పుష్పించుట, ఫలించుట, పంటనిచ్చుట మున్నగు ప్రవృత్తులు ప్రాణశక్తియొక్క ప్రవృత్తులే వీటివలన మిగిలిన జీవులకు ఆహారమేర్పడి సృష్టి నిలుచును

నిమిషతః అను పదమునకర్థము రెప్పపాటు కలవి అని చెప్పబడినది జలచరములయిన చేపలకు రెప్పపాటు లేదు మిగిలిన వానికన్నిటికి రెప్పపాటు కలదు అనగా కనులు మున్నగు అవయవములు కలిగిన ప్రాణిసృష్టి అని అర్థము ప్రాణులలో వృక్షములు కదలనివి జలచరములు, భూచరములు, మానవులు మున్నగువారు కదలికగలవారు కనుక ఇచ్చట నిమిషతః అనగా కన్నులు మున్నగు అవయవములు కలిగిన చలనము కలిగినట్టి జీవసృష్టి అని అర్థము అనగా నిమిషతః అను పదమునకు జలచరములతో ప్రారంభమైన జీవసృష్టియని అర్థము పరమాత్మ భూమిపై మొదట వృక్షజాతిని సృష్టించి పిదప జలచరములను, భూచరములను, మానవులను సృష్టించెను

చతుష్పదః అనగా నాలుగు పాదములు కలిగినట్టివి లేక జంతువులు ద్విపదః అను పదమునకు రెండు పాదములు కలిగినట్టి జీవులు, ప్రధానముగా మానవులు ఇచ్చట ద్విపదః చతుష్పదః అని చెప్పుటలో మరియొక విశేషమున్నది చతుష్పాత్తులైన జీవులు తిర్యక్కులు అనగా భూమికి అడ్డముగా అనగా సమాంతరముగా నున్న (Horizontal to earth) దేహము కలవి అనగా పూర్తిగా భౌతిక జీవితమేగాని మనోవికాసము లేనట్టివి అని అర్థము ద్విపదః అనిచెప్పుటలో భూమిపై నిట్టనిలువుగానున్నట్టి జీవులని అర్థము భూమికి సమాంతరముగా నుండుట ప్రకృతి లక్షణము భూమికి నిలువుగా నుండుట, మనసు మేలుకొని ప్రకృతినదిగమించి ఊర్ధ్వముఖమగుటను సూచించును ఇట్లు భూమిపై వృక్షజాతిగా జీవచైతన్యము మేలుకొని మానవునిగా మనోవికాసము నొందుట నారాయణుని యొక్క ప్రవృత్తియే ఇట్టి ప్రవృత్తికి కారణముగా సృష్టియందలి రజస్సు అను గుణము పనిచేయుచున్నది

హి సూ 3

యఆత్మదాబలదాయస్యవిశ్వఉపాసతే[ప్రశిషంయస్యదేవాః|
యస్యచాయామృతం యస్యమృత్యుః కస్మై దేవాయ హవిషావిదేమ||

## ప్రతిపదార్థము :

యః= ఎవడు

ఆత్మదా= ఆత్మను ఇచ్చువాడు

బలందా= బలమును ఇచ్చువాడు

యస్యవిశ్వ=ఎవరియొక్క విశ్వమును

ప్రశిషం= ఆజ్ఞను

దేవాః=దేవతలు

ఉపాసతే= ఉపాసించుచున్నారో?

యస్యచాయామృతం= ఎవరియొక్క నీడ అమృతము

యస్య= ఎవరియొక్క

మృత్యుః= మరణము

## తాత్పర్యము :

ఎవడు ఆత్మను, బలమును ఇచ్చుచున్నాడో ఎవని వెలుగు విశ్వమునందు దేవతలచే ఉపాసింపబడుచున్నదో, ఎవని నీడ అమృతమనియు, మృత్యువనియు తెలియబడుచున్నదో, అట్టి దేవత కొరకు మేము హవిస్సులను దరించుచున్నాము (అట్టి నారాయణుని మేము ద్యానించుచున్నాము)

## వివరణ :

ఎవడు ఆత్మను ఇచ్చుచున్నాడో అనగా మనలో ''నేను'' అను ప్రజ్ఞను ఇచ్చుచున్నాడో, లేదా నేను, తాను అను ప్రజ్ఞలకు ఎవరు కారణమగు చున్నారో, బౌతికమైన, శారీరకమైన బలము ఎవరివలన లబించుచున్నదో అని అర్థము పరమాత్మ బౌతికమైన వస్తువులు, వృక్షములు, దాన్యములు, ఖనిజములు, పండ్లు ఇట్లు మనము తీసుకొనవలసిన ఆహారముగ తానే వచ్చి, మన శరీరమున తానే బలముగా వ్యక్తమగుచున్నాడు జీవులయందు ప్రాణశక్తిగా ప్రవేశించి, ప్రాణశక్తిద్వారా జీవులలోని ఆత్మను ఉద్దీపనముచేసి, తద్వారా

జీవులయందు ఆత్మవికాసము కలుగుటకు కారణమై మరల జీవునిగా తనయందు తానే తిరిగి ప్రయాణము చేయుచున్నాడు ఇట్లు ఒక చక్రముగా పైనుండి క్రిందకు, క్రిందనుండి పైకి ప్రయాణించుచున్నాడు

దీనినే ఉత్తరాయణము, దక్షిణాయనము అని చెప్పిరి ఇవియే దూమమార్గము అనగా పొగతో కూడిన మార్గము లేదా తమస్సుకు సంబంధించిన మార్గము అర్చిర్ మార్గము లేక సత్యమైన మార్గము అని రెండు మార్గములుగా చెప్పబడినవి ప్రజ్ఞ బౌతికమైన లోకములలోనికి దిగివచ్చిన మార్గము ఒకటి అట్టి బౌతిక లోకములలోనికి వచ్చిన ప్రజ్ఞ మరల బౌతికము అను పరిమితత్వము తొలగించుకొని అంతర్యామి యందు మరల లీనమగుట రెండవది, అనగా అర్చిర్ మార్గము, ఈరెండును కలిసి వృత్తాకార గమనముగా ఏర్పడుచున్నవి ఈ వృత్తాకార మార్గమును పరమాత్మయొక్క పరిభ్రమణము లేక చక్రాకారమైన గమనము అని అనుచున్నారు దీనియందు వర్తించువాడు కాబట్టి ఆయనను చక్రవర్తి అనిరి అనగా ఈచక్రాకార గమనమునందు వర్తించువాడని అర్థము అందువలననే సూర్యుని చక్రవర్తి అనిరి వృత్తాకారమైన గమనములో తిరగకపోయినను సూర్యుడు చక్రవర్తియే కాని భూమి తిరుగుచున్నను భూమిని చక్రవర్తి అనరు కారణమేమనగా, సూర్యుని కిరణములనుండి దిగివచ్చిన భూమి, మొదలైన గ్రహములన్నియు సూర్యుని చుట్టును చక్రాకార గమనములో సూర్యుని శక్తిచే తిరుగుచున్నవి కాని తమయొక్క స్వంత శక్తి వలనకాదు కనుక జీవులలో వ్యక్తిగతమైన ఆత్మ ఏర్పడుటకు సూర్యుని శక్తి కారణమమగుచున్నది అదే అంతకుముందు అంతర్యామిగా నున్నపుడు చోటులో శక్తిగా పనిచేయుచున్నది లలితా సహస్రనామములో అమ్మవారిని "సుప్తా ప్రాజ్ఞాత్మికా తుర్యా" అన్నారు సుప్తా అనగా నిద్రిస్తున్నది ప్రాజ్ఞాత్మికా అనగా తాను పలానా అని పనిచేయు ప్రజ్ఞగా ఉన్నది, తుర్యా అనగా సమాదిస్థితిలో నున్నట్టిది

నేను అను అంతర్యామిలో నిద్రించి, వ్యక్తిగతమైన జీవప్రజ్ఞగా మేలుకొనుట సృష్టి జీవప్రజ్ఞ మొత్తము చోటులో మహాప్రజ్ఞగా నున్నపుడు సూర్యుడు మొదలైనవారుండరు మీరు కూడ పరమాత్మలో కలిసియుందురు కనుకనే పరమాత్మ ఆత్మకు కారణమగుచున్నాడు "బలదా" అనగా బలమును ఇచ్చువాడు అనగా జీవులలో వున్న బౌతికమైన శక్తికి కారణమయినవాడు జీవప్రజ్ఞ(Consciousness) భూమిమీద వృక్షములు, ఖనిజములుగా దిగివచ్చి మానవులకు భౌతికమైన శక్తిగా ఉపయోగపడుచున్నది

ఆ ప్రాణశక్తి ఒక్కొక్క స్థితిలో ఒక్కొక్క శక్తిగా అనగా మనస్సు, బుద్ధి మున్నగునవిగా పనిచేయుచున్నది

''ప్రశిషం యస్యదేవాఃవిశ్వ'' - అంతర్యామియొక్క ఆదేశమును వారివారి సంకల్పములుగా దేవతలు ఉపాసించుచున్నారు జీవులయందున్న ఆలోచనలు, ఊహాలు మొదలయినవి అంతర్యామి నుండి దిగి వచ్చినవి అట్లే చోటులో వున్న సూర్యుడు, చంద్రుడు, వాయువు మొదలైన దేవతలు అంతర్యామియొక్క ఆదేశము ప్రకారము తమతమ దర్మములను నిర్వర్తించుచున్నారు ''యస్య ఉపాసతే చాయా అమృతం యస్యమృత్యుః''అనగా ఎవరియొక్క చాయ లేక నీడ అమృతమని, మృత్యువని రెండువిదములుగా చెప్పబడుచున్నవో?

పుట్టుక, జీవించియుండుట, నశించుట అనునవి మూడును త్రిగుణాత్మకమైన స్థితులు అవియే సత్త్వము, రజస్సు తమస్సు అను మూడు లోకములుగా చెప్పబడినవి అవియే త్రిమూర్తుల లోకములు సత్త్వము అనగా విష్ణువు లేదా విష్ణులోకము, రజస్సు అనగా బ్రహ్మ లేక బ్రహ్మ లోకము అందురు అటులే తమస్సు అనగా శివుడు లేక శివునియొక్క లోకముగా చెప్పబడినది ఈ మూడు గుణములు ఒకే వెలుగునుండి దిగి వచ్చినవి ఆవెలుగే నారాయణుడు కనుక ఈపుట్టుట, చనిపోవుట అనునవి దేహాదులలో నిర్వర్తింపబడుచున్నప్పటికి ఇవి అంతర్యామిని ఉపాసించుటకు ఏర్పడిన మార్గమేకాని ఇతరము కాదు

యస్యచాయామృతం-యస్యమృత్యుః-పరమాత్మయొక్క వెలుగు అది శాశ్వతమయిన స్థితికి సంబందించినది అది పుట్టుట, మృత్యువు, మృత్యువు లేకుండుట మున్నగువానికి సంబందించినది కాదు అవి జీవునకు సంబందించినవి అనగా ఆత్మకు సంబందించినవని అర్థము ఇచ్చుట ఆత్మవేరు, పరమాత్మ వేరు జీవులు, దేవతలు ఆత్మస్వరూపులేకాని పరమాత్మ వీటికన్న పైవాడు ఆయననుండి దేవతలు మానవులు దిగిరాగా వారిలో దేవతలకు జన్మమృత్యువులు లేని తేజశ్శరీరములు ఉపాదులుగా ఏర్పడినవి మానవులకు అట్టి తేజశ్శరీరములతోబాటు జన్మమృత్యువులు కలిగిన బౌతిక శరీరముకూడ ఏర్పడి యోగాబ్యాసమునకు ఉపకరణమైనది ఎవరయినను యోగాబ్యాసము చేయవలెనన్నచో బౌతిక శరీరము దరించి తీరవలెను అట్లు యోగాబ్యాసము వలన సంస్కరింపబడిన జీవులు బౌతిక శరీరముతో సంబందములేని సూక్ష్మశరీరము (జీవాత్మ) కలిగియుందురు వారికి బౌతిక శరీరము అట్టి

స్థితిలో తప్పనిసరి కాకున్నను ఆవశ్యకత ననుసరించి దరింపవలసి యుండును కాని దేవతలకు మాత్రము భౌతిక శరీరము అక్కరలేదు అగ్ని, వాయువు మొదలగు శక్తుల రూపమున పనిచేయుచున్న దేవతలు, భౌతిక శరీరమక్కరలేకయే చోటులోను, జీవులలోను పనిచేయుచుందురు వీరు అంతర్యామి నుండి దిగివచ్చి సృష్టి అంతమున మరల అంతర్యామిలోనికి ప్రవేశింతురు అట్టి వీరు అమృతత్వము అనబడు స్థితిలో నిరంతరము నుందురు ఇట్లు జీవులు, దేవతలు పరమాత్మయను వెలుగునుండి వానిచాయగా లేక నీడగా దిగిరాగా అట్టి నీడయందు మార్పులేర్పడుచున్నవి ఈమార్పులే మృత్యువు అమృతత్వము మొదలగునవి ఇవి విగ్రహములకు బంగారమునకు ఉన్న సంబందము వంటివి బంగారముతో చేసిన విగ్రహములకు రూపముండును అనగా విగ్రహములను పోతపోయుట మరల కరగించుట మున్నగునవి యుండును కాని బంగారమునకు అవిలేవు ఇందు బంగారము శాశ్వతమైన స్వచ్ఛమైన స్థితికాగా విగ్రహములు పోతపోయుట, కరగించుటయను పరిమిత స్థితులకు చెందియున్నవి ఇవియే చావు పుట్టుకలవంటివి ఇందు పరమాత్మ బంగారమువలె శాశ్వతునిగా నున్నాడు

హి సూ 4

యస్యేమే హిమవన్తో మహిత్వా యస్య సముద్రగ్ం రసయా సహాహుః|
యస్యేమాః ప్రదిశో యస్య బాహూ కస్మై దేవాయ హవిషా విదేమ||

ప్రతిపదార్థము

యస్య + ఇమే= ఎవరి
హిమవన్తః= మంచు పర్వతము
మహిత్వా= వైభవము
రసయా సః= జలములతో కూడిన
సముద్రగ్ం= సముద్రము
యస్య= ఎవనియొక్క
సః ఆహుః= వారు పలికిరి
యస్య= ఎవరికి
ఇమాః= ఈ దిక్కులు
ప్రదిశః= విదిక్కులు
బాహుః= హస్తములో

## తాత్పర్యము

మంచుతో కూడిన ఉన్నతములైన పర్వతములు, చాల లోతైన సముద్రములు, దిక్కులు అన్నియు ఎవరిని కీర్తించుచున్నవో, ఎవరి అస్తిత్వమును తెలియజేయుచున్నవో ఆయననుగూర్చి కర్తవ్యమను హావిస్సులను సమర్పించుచున్నాము

## వివరణ

హిమవంతః అనగా మంచుతో కూడియున్నట్టి హిమాలయములు అని అర్థము ఈ హిమాలయముల యందు అపారమైన జలము మంచుగా గడ్డకట్టియున్నది ఈమంచు కరగి జలములుగా, నదులుగా ప్రవహించుచు జీవులకు కావలిసిన నీటిని అందజేయు చుండును త్రాగుట, పంటలు పండించుట, విద్యుదుత్పాదనము మున్నగు అత్యావసరమయిన పనులకు కావలసినపుడెల్ల నీరు లభించు ఏర్పాటు ఇచ్చట కలదు నీరంతయు ఒకేసారి కరగి ప్రవహించుట కాక ఎప్పటికప్పుడు కొంతకొంతగా కరగి ప్రవహించుచుండుట వలన సంవత్సరమునందు అన్ని దినములు జీవులకు నీరు లభించు ఏర్పాటు ప్రకృతిచే చేయబడినది అట్లు ప్రవహించు నీరు వ్యర్థముగా సముద్రమున కలసిపోవుచున్నదనగా మానవుడెంత నిష్ప్రయోజకుడో తెలియును పాశ్చాత్య దేశములలో నదులన్నియు ఫ్యాక్టరీలనుండి వచ్చు రసాయనిక మలినములతో కలుషితమై పోయినవి అందుచేత అచ్చటి నదులలోని నీరు పంటలకుగాని త్రాగుటకుగాని పనికిరాదు మన బారతదేశమునందు సైతము నదులలోని నీటికి క్రమేణా అదేగతి పట్టుచున్నది పులినిజూచి నక్కవాత పెట్టుకొనుట అనగా నిదియే ప్రకృతి సంపదలైన గాలిని, నీటిని, వనములను పవిత్రముగా చూచుచు వాటిని కలుషితము కాకుండ చూచుకొనుచు నద్వినియోగము చేసికొనుట ప్రాచీన భారతీయ సంప్రదాయము, ప్రజలకు వాటియందు అట్టిభావము చెదరనీయకుండుటకై పెద్దలు వాటికి దేవతలని పేరుపెట్టిరి జలదేవతలు, నదీదేవతలు, వనదేవతలు, సముద్ర దేవతలు మున్నగు పేర్లతో వాటిని పూజించుచు కాలుష్యము చెందకుండ కాపాడుకొనిరి నాగరికత పెరిగిన నేటి మానవుడు తన వైజ్ఞానికాభివృద్ధిని ఇట్టి కాలుష్యములతోనే ప్రారంభించెను ఇట్లు నదులు, వనములు మున్నగునవి దేవతలుగా నర్చింపబడుట పాశ్చాత్యదేశములయిన గ్రీకు, ఈజిప్టు మున్నగు దేశములయందు కూడ కలదు కాని నీరు కేవలము

పానీయము మాత్రమేకాక యోగజీవితమునకు ప్రదాన ఆలంబనమను విషయము వారు విస్మరించి నేటికి శతాబ్దములైనది అంతకు పూర్వము నేటి బారతదేశమునందు వలెనే వారును నీరు స్నాన సంద్యాదులందు అభిషేకములందు ఎక్కువ ఉపయోగించెడివారు

'యస్య ఇమే మహిత్వా హిమవంతః' అని చెప్పుటలో ఈ నారాయణుని యొక్క మహత్తు లేక ఔన్నత్యము హిమాలయ పర్వతమువలె ఎత్తైనది మరియు స్వచ్ఛమై తెల్లని నిర్మలస్థితిలో నున్నదని అర్ధము ఔన్నత్యమనగా పరిస్థితులవలన బాదపడక, గర్వపడక, ఈర్ష్యపడక మనసును స్వచ్ఛముగా నిర్మలముగా ప్రశాంతముగా నుంచుకొని ఉత్తమగుణములైన ధైర్యము, స్థిరత్వము, జాలి కలుగుట, సానుభూతి కలిగియుండుట మున్నగు లక్షణములను వదలుకొనరాదని బావము "ధైర్యేణ హిమవానివా" అని శ్రీరాముడు వాల్మీకి మహర్షిచే స్తోత్రము చేయబడినాడు ఇట్టి లక్షణములు గల వారినే మహత్తునందున్న వారు లేక మహాత్ములు అని అందురు

యస్య రసయా సముద్రమ్ అనగా జలములతో కూడియున్న దానినే సముద్రమందురు సముద్రము లోతు గంబీరమునకు గుర్తు కనుక పరమాత్మ అట్టి లక్షణములు గలవారి యందుండునని అర్ధము లోతైన మనస్సు గలవారికి ఇతరుల నర్ధము చేసికొనగల లక్షణముండును జీవులలో అట్టి లక్షణములు నారాయణుడే

ఇట్లు హిమవత్పర్వతమువలె ఎత్తైన, ఉన్నతమైన మహత్తు గలవాడును సముద్రమువలె లోతైన మనస్సు గలవాడును నారాయణుడని పెద్దలు చెప్పిరి ఆయన దిక్కులే తన బాహువులుగా కలవాడు అన్ని దిక్కులయందు వ్యాపించియున్నవాడు తూర్పున సూర్యుడుదయించుట, పడమర అస్తమించుట మున్నగునవన్నియు నారాయణుని ప్రవృత్తులే

హి సూ 5

యం క్రందసీ అవసా తస్త బానే అభ్యైక్షేతాం మనసా రేజమానే
యత్రాది సూర ఉదితావ్యేతి కస్మై దేవాయ హవిషా విదేమ

ప్రతిపదార్ధము

క్రందసీ = రోదనమునకు హేతుబూతములయినట్టియు

అవసా= బందింపబడనట్టి

తస్తభానే= స్థితిని కలుగజేయునవియును
రేజమానే= ప్రకాశించుచున్నవై
మనసా= మనస్సుచేత
యం= ఎవని
అభ్యైక్షేతాం= అంతట చూచుచున్నావో
యత్ర= ఎచ్చట
సూరః=సూర్యుడు
ఉదితః=ఉదయించినవాడై
అదివ్యేతి= కప్పియుంచు చున్నాడు లేక పొరలుగా చుట్టుచున్నాడు
కస్మై=ఏ
దేవాయ= దేవునికొరకు
హవిషా= హవిస్సులను
విదేమ= సేవించెదము

## తాత్పర్యము

రోదనముచే బంధింపబడనట్టి స్థితిలో మనస్సుచేత ప్రకాశించున్న మరియు స్థితిని కల్పించునవియై సమస్తమును ఏవి చూచుచున్నవో ఎచ్చట సూర్యుడు ఉదయించినవాడై (శరీరములను లేక లోకములను) పొరలుగా చుట్టుచున్నాడో అట్టి దేవునికొరకు సమిదలను సమర్పించుచున్నాము

## వివరణ

క్రందసీ యనగా రోదనమునకు లేక శబ్దము పుట్టుటకు కారణమైన శక్తి చోటులో శబ్దము నిది పుట్టించును శబ్దము పుట్టుటకు మనస్సు కారణము అనగా చోటునందు మొట్టమొదట మనస్సు ఏర్పడి దానియందు శబ్దములే వాక్కు పుట్టినది అట్టి శబ్దము వలన చోటు పుట్టుచున్నది మన సౌరమండలమునందు సూర్యుడు ఈ కార్యక్రమమును నిర్వహించు చున్నాడు అంతర్యామియైన పరమాత్మచే "నేను" అను శబ్దము ఉచ్ఛరింపబడగా అది సూర్యప్రజ్ఞయైనది అనగా సూర్యుని అస్థిత్వమునకు కారణమైనది సూర్యుని చుట్టు చోటు ఏర్పడి ప్రాణమయ తరంగములచే (The Vital energy or space energy which is understood as electricity) నింపబడి మానవ అస్తిత్వమునకు కారణమైనది ఇట్టి

యీప్రక్రియ సూర్యకిరణములచే నిర్వహింపబడుచున్నది చోటునందు సూర్యకిరణములు వ్యాపించునంతమేర సౌరమండలముగా నేర్పడి జీవోత్పత్తికి కారణమైనది అందుచేతనే రేజమానే(Radiatory forces) అని చెప్పబడినది అనగా వెలుగుచున్నట్టివి అని అర్థము అనగా సూర్యకిరణములందలి శక్తులవలన కదలుట పరిభ్రమించుట మున్నగు మార్పులు ఏర్పడినవని అర్థము మరియు గుండె కొట్టుకొనుట, శ్వాసించుట మున్నగు ప్రక్రియలు జీవుల దేహములను నడుపుచున్నవని అర్థము ఇంకను తస్తభానే అనగా నిలచియుండుటకు, అస్తిత్వమునకు కారణమైన శక్తులు అని అర్థము అనగా జీవప్రజ్ఞలకు అస్తిత్వములేర్పరచి వేరువేరు ప్రజ్ఞలుగా నిలుపుటయేగాక శరీర నిర్మాణముచేసి వానియందు గుండె కొట్టుకొనుట, శ్వాసించుట మున్నగు అత్యంత ప్రదానమైన కర్తవ్యములు నిర్వహించుచు, జీవుని శరీరము నిలబెట్టియుంచుచున్నవని అర్థము మరియు 'అవసా' అనుటచే జీవులకు స్వతంత్రతను, స్వేచ్ఛను ఇచ్చుచున్నవని అర్థము అభ్యైక్షేతాం అనుటలో జీవులకు (చూపులకు కారణమైన) కన్నులను కల్పించుచున్నవని అర్థము జీవలక్షణములైన కన్నులు గుండె, శ్వాస అను మూడు కీలకమైన ప్రవృత్తులు సూర్యకిరణములద్వారా సూర్యునిచే పర్యవేక్షింపబడుచున్నవి మరియు ఇట్టి సూర్యుడు ఉదితః అనగా ఉదయుంచుచున్నవాడు అగుచున్నాడు అనగా భూమికి పరిభ్రమణము కల్పించి భూమి తనచుట్టు తాను తిరుగుట వలన ఉదయ అస్తమయములను కల్పించుచున్నాడు ఇట్లు భూమిని సూర్యుడు చుట్టుచున్నట్లు ప్రవృత్తి నేర్పరచుట వలన జీవులకు దేహము లేర్పడుచున్నవి అంతేకాక అందు ప్రాణమయ కోశము మనోమయకోశము, అను పొరలుకూడ ఏర్పడి వానిని భౌతిక శరీరము చిట్టచివరి పొరగా చుట్టియున్నది అట్టి హిరణ్యగర్భుడను దేవతకు మేము మా శరీరములనే సమిదలుగా సమర్పణము చేయుచున్నాము (జీవునియందలి అంతర్యామియైన పరమాత్మను జూచి వాని నిర్దేశము ప్రకారము జీవించుట వలన శరీరములు పరమాత్మయొక్క సృష్టి యజ్ఞమునందు సమిదలుగా నగుచున్నవి)

**హి సూ 6**

ఏనద్యౌ రుగ్రా పృదివీచ దృడీ ఏన సువః స్తభితం ఏననాకః
యో అన్తరిక్షే రజసో విమాన కస్మై దేవాయ హవిషా విదేమ

## ప్రతిపదార్థము

ఏన= ఏ పరమాత్మ చేత

ఉగ్రా=శక్తిమంతమైన

ద్యౌః=ద్యులోకము లేక ఆకాశము

పృదివీచ= భూమియు

దృఢీ= దృఢములుగా చేయబడిన వానియందు

ఏన= ఏపరమాత్మచేత

సువః= సువర్లోకము

స్తబితం=స్థిరమైనట్టిది

నాకః= పాపములకు పైనున్నట్టి స్థితి

యః= ఏపరమాత్మ

అంతరిక్షే= భువర్లోకమునందు

రజసః=రజస్సులు లేక అణువులు

విమానః=మానములు లేక కొలతలకందనిది

కస్మై= ఏ

దేవాయ= దేవునికొరకు

హావిషా= హావిస్సులను

విదేమ= దరించుచున్నామో

## తాత్పర్యము

ఏ పరమాత్మ చేత భూమ్యాకాశములు శక్తిమంతములై దృఢములుగ నిలుపబడినవో, ఎవనిచే సువర్లోకము, ఆదిత్య మండలమ అంతరిక్షమునందు నిరాదారముగా నిలువబడినవో ఎవనివల కొలతలకందని అణువులతో కూడిన ఈ అంతరిక్షలోకమ నిలచియున్నదో అట్టి దేవుని కొరకు మేము హావిస్సులన దరించుచున్నాము

## వివరణ

ద్యౌః పృదివీచ అని చెప్పుటలో ద్యులోకము మరియు భూలోకమ అను రెండును ఒకదానికొకటి కార్యకారణ సంబంధము కలిగియున్నవ

౦చింపబడుచున్నది కనుకనే ద్యౌః ఉగ్రయనియు పృదివీచ దృఢీ
నియు చెప్పబడినది ఉగ్ర అను పదమునకు తీవ్రశక్తి కలది యని అర్థము
దు అనగా భూమి దృఢముగా నిలచియుండుటకు ద్యులోకమందలి
ుగు కారణమగుచున్నది ఇచ్చట ఉగ్ర అను పదము తీక్ష్ణమైనది
బావితము చేయునది అను నర్థమున నుపయోగింపబడినది అదికాక
్యులోకము మరియు భూలోకము అను రెండింటిని కలిపి ఉగ్ర అని
ప్పబడినది గట్టిదనము, ఆకారము, స్పర్శ మొదలగునవి కలిగిన భూమి
ప్పడినది ఈ రెండింటి కలయిక వలన ఈ భౌతిక తత్వమునందు తీవ్రత,
ంపలేకుండుట, బాదలు, కష్టమును మొదలగునవి ఏర్పడుచున్నవి
వర్లోకము జీవునియందలి మనస్సు, ఇంద్రియములు, బుద్ధి అనువానిని
్మాణము చేయును భౌతిక శరీరము భూతత్వమునకు సంబందించినది
వులకు ఈరెండిటి కలయిక వలననే కష్టసుఖములననునవి ఏర్పడి ఆత్మ
ంస్కారమునకు దారి తీయుచున్నవి

సువః అనగా వెలుగుల లోకము, మంచి పనులు చేయువారుండు
కములు అనికూడ అర్థము కలదు ఆకాశమునందలి తారలన్నియు ఇట్టి
ుగులే లేక దేవతలే అట్లే గ్రహాదేవతలు కూడ వీరందరును చోటునందు
ాదారముగా పరస్పర ఆకర్షణ వికర్షణాదులచే (Equilibrium of forces)
్తుల సామ్యముచే నిలబడి యున్నారు మరియు అవి పరస్పరము
ిభ్రమించుచు తమ నియమిత కక్ష్యలయందు విహరించుచున్నవి కనుక
భితం అని చెప్పబడినది

నాకః పుణ్యము చేసినవారు వానియొక్క ఫలితములననుభవించు
టు అనగా సువర్లోకము, భూలోకము అను రెండు లోకములందు
వుల విభజనము ఈలోకమున జరుగును సువర్లోకమునందు పరిపూర్ణ
వులును, భూలోకమునందు శిక్షణ పొందుచున్న జీవులును ఉందురు

ం సూ 7

**పోహాయన్మహతీ ర్విశ్వమాయం దక్షం దదానా జనయన్తీ రగ్నిమ్**
**తో దేవానాం నిరవర్తతా సురేకః కస్మై దేవాయ హవిషా విధేమ||**

**ంతిపదార్థము**

ఏకః= అద్వితీయుడైనట్టి, ఒక్కటిగానున్నట్టి
దేవానాం= బ్రహ్మాది దేవతలకు
అసుః= ప్రాణభూతుడైనట్టి పరమాత్మ

యత్= ఏ ప్రజాపతియొక్క
తతః= ఆయన వలన
మహతీః= పూజ్యమైనట్టి, గొప్ప పరిమాణము గలట్టియు
ఆయం= శుబావహమైనట్టియు
దక్షం= సమర్ధమైనట్టియు
విశ్వం = ప్రపంచమును
దదానాః= దరించుచున్నట్టియు
అగ్నిం= అగ్నిని
జనయన్తీః= పుట్టించుచున్న
ఆపః= ఉదకము
నిరవర్తతాః= వర్తించుచున్నాడు కదా
కస్మైదేవాయ= ఏ దేవుని కొరకు
హవిశా= హవిస్సులు గల యజ్ఞముచేత
విదేమ= మేము విదుల ననుష్ఠింతుమో

## తాత్పర్యము

సమస్తము నందును తానొక్కడే యున్నట్టి ప్రజ్ఞగా దేవతలకు ప్రాణముగా నున్నట్టి నారాయణుడు మొదట నీరుగా పుట్టెను అట్టి ఆపస్సు అను దేవత సృష్టియందు సమర్ధవంతునిగా దరించి యున్నట్టివానిగా వర్తించునట్టి అగ్నిని పుట్టించెను అట్టి పరమాత్మకొరకు మేము హవిస్సులను దరించున్నాము

## వివరణ

ఇచ్చట దేవతలకు తానొక్కడే ప్రాణబూతుడైనట్టివాడు, ఆపస్సులు అను స్థితిలోనున్న పరమాత్మగా చెప్పబడినది ఈయననే మనము నారాయణుడని చెప్పెదము అనగా నీరే తన మార్గముగా గలవాడు నీరు ఆవిరిగా మారుట మరియు మంచుగా గడ్డకట్టుట అను రెండు బిన్నమైన స్థితులను పొందుచున్నది అట్లే నారాయణుడు సృష్టిగా వచ్చి మరల అవ్యక్తముగా లీనమగుచున్నాడు సృష్టిని పుట్టించుట దానిని నిర్వహించుట మున్నగు వాటికి కారణమైన అగ్నియను దేవతను మొట్టమొదటగా పుట్టించుచున్నాడు ఈ అగ్ని సృష్టియందలి

మొట్టమొదటి దేవత ఆయన ననుసరించి సోముడు, సూర్యుడు అను ఇద్దరు దేవతలు పుట్టిరి అందు అగ్ని సమస్త సృష్టికి కారణమైన 'నేను' లేక 'తాను' అను ప్రజ్ఞగా జీవులందును (Souls) కణముల యందును (Cells)మరియు అణువుల యందును (Atoms) మేల్కొనుచున్నాడు సృష్టి పుట్టుటకు ఇదియే మొట్టమొదటి కారణము మరియు ఆయన సమస్త దేవతలయందు వారి ప్రాణశక్తులుగా తానే యున్నాడు సూర్యుడు, చంద్రుడు, భూమి, తారలు మున్నగువానియందు పనిచేయుచున్న ప్రాణశక్తి నారాయణుడే అట్టి ప్రాణశక్తి జీవులయందు పనిచేయుటకు మరల బీజము (Nucleus)గా ఏర్పడుచున్నది ప్రజ్ఞ (Consciousness) శక్తుల (Energy) సమ్మేళనముచే పదార్థము (Matter) పుట్టుచున్నది ఇట్టి ప్రజ్ఞయే అగ్నియని పిలువబడినాడు అట్టి అగ్ని దక్షము అనగా సమర్దవంతునిగా చెప్పబడినాడు ఈ దక్ష శబ్దమునుండియే దక్షః, దక్షుడు అను దేవత పుట్టినాడు ఇతడే జీవప్రజ్ఞలో నున్న అహంకారము అనగా తనకు తాను సమర్ధవంతునిగా తెలియుటలేక కర్తవ్యమునకు సంబందించిన ఊహాలు మేల్కొనుట అనునది అగ్నిస్వరూపమే ఈ అగ్నియే విశ్వమును దరించుచున్నాడు అనగా అగ్నివలన ప్రపంచము నిలబడి తన దర్మమును ప్రవర్తింపజేయుచున్నది జీవునివలన శరీరము నిలబడినట్లుఇది యున్నది ఇట్టి అగ్ని సమస్తమునకు తానే ఆదారముగా నున్నాడు

**హ సూ 8**

**యశ్చిదాపో మహినా పర్యపశ్యద్దక్షందదానాజనయన్తీరగ్నిమ్।**
**యో దేవేష్వది దేవ ఏక ఆసీత్ కస్మై దేవాయ హవిషా విదేమ॥**

## ప్రతిపదార్థము

యః= ఎవరయితే

చిత్= జ్ఞానమును

దక్షం= సామర్ధ్యము కలిగినటువంటి

అగ్నిమ్= అగ్నిని

జనయంతి= పుట్టించినటువంటి

దదానా= దరించియుండి

ఆపః= జలములు

మహిమా= మహిమచేత

పరి అపశ్యత్= చూచుచుండెనో
యః= ఎవడు
దేవేషు= దేవతలను
అది= అధిష్ఠించినటువంటి
దేవః= దేవుడు
ఏకః= ఒక్కడే
ఆసీత్= ఉండెనో

## తాత్పర్యము

ఎవరు మహత్తుచేత చైతన్యము, అగ్ని పుట్టింపగలిగిన సామర్థ్య కలిగినట్టి జలములను చూచెనో, ఎవరు దేవతలకు అధిపతియైన దేవుడైయుండెనో అట్టి దేవుని (హిరణ్యగర్భుని) కొరకు మే హవిస్సులను దరించుచున్నాము

## వివరణ

ఈ హిరణ్యగర్భుడు అనగా సృష్టియందు వ్యక్తమైన బ్రహ్మయె స్వరూపుడు ఈయన సృష్టికి మొదటివాడు గనుక దేవతల కంద అదిపతి ఈయన నుండియే సమస్త దేవతలు పుట్టిరి అట్లు పుట్టినవా అగ్ని మొదటివాడు కనుకనే సృష్టికర్తయైన బ్రహ్మచేత సృష్టింపబ ధేవతలలో అగ్ని మొదటివాడని వేదములు కీర్తించినవి అంతక ముందు జలములు సృష్టించబడెను ఈ జలములే సమస్త సృ ఆధారమైన జీవరసములు ఇట్టి జలములనే అమృతత్వమని ఆనందమయ స్థితియనియు తన్మయత్వమనియు మనము పేర్కొందు అనగా అట్టి స్థితిలోనున్న జీవుడు మహాజలములయ తాత్కాలికముగా లీనమగును అందువలననే ఆనందము పరవశత్వము కలిగిన సమయములందు తనకు తానుండును మనస్సు, ఇంద్రియములు, దేహప్రజ్ఞలు తాత్కాలికముగా ఆనందవ అట్టి జలముల యందు కరగిపోవును అట్టి జలములను హిరణ్యగర్భు సృష్టించెను హిరణ్యగర్భుడనగా బంగారమును తనయ దరించినవాడని యర్థము అనగా బంగారు వర్ణముగల సూర్యతేజస్సు గర్భమున ధరించినవాడని యర్థము అనేక వేలమంది సూర్యు తమయందు పుట్టుచుండగా అట్టి విశ్వమను, అండాకారమైన వెలుగే హిరణ్యగర్భుడు ఈయన గ్రీకు పురాణమునందు జూస్(Zews) ఆ

దేవతగా పేర్కొనబడినాడు ఈయన నుండియే మిగిలిన దేవతలందరు సృష్టింపబడిరి దాదాపు దేవతలందరు ఈయన పుత్రులుగను, మనుమలుగను, మునిమనుమలుగను పేర్కొనబడిరి సృష్టికర్తయైన బ్రహ్మకు పితామహుడను పేరు కలదు కదా! అట్లే ఈజిప్షియన్ పురాణములందు సహితము సృష్టికి కారణము ఒక గుడ్డుగా చెప్పబడినది ఖెప్రి (Khaphri) అను దేవత బంగారు వర్ణములో నున్న సృష్టిగోళమును మోసుకొని వచ్చుచున్నట్లు చెప్పబడినది ఈ ఖెప్రి అను దేవతయే సువర్ణుడుగా సువర్ణసూక్తములందు వర్ణింపబడినది మరియొక చోట "తోత్" అను దేవత సృష్టి గోళమును బాతురూపమున మోసుకొని వచ్చినట్లు వర్ణింపబడినది

"చిత్" అను పదమునకు జ్ఞానమనియు, చైతన్యమనియు అగ్నియనియు అర్థములున్నవి ఇట్టి చైతన్యస్వరూపుడైన అగ్ని బ్రహ్మచే మొట్టమొదటి సృష్టిగా సృష్టిలోనికి దిగి వచ్చెను ఈయనయే జీవులలోనున్న 'నేన'ను ప్రజ్ఞ ఈయనగూర్చియే లలితా సహస్రనామ స్తోత్రమునందు "చిదగ్నికుండ సంభూతా" యని లలితాదేవి స్తోత్రము చేయబడినది ఇచ్చట కుండయనగా శరీరము మరియు సృష్టిగోళము నేనను ప్రజ్ఞ మొదటి చైతన్యమై సృష్టియందు మేల్కొనగా దాని ప్రాణప్రవృత్తియే దానిచుట్టు గోళాకారమై నిలబడెను అప్పుడు అట్టి గోళాకారముగా నున్న చైతన్యమునందు ప్రకృతి పుట్టును అట్టి ప్రకృతివలన విశ్వమునందు భౌతిక గోళము లేర్పడి సృష్టి కొనసాగుచున్నది మరియు దీనికి మరియొక అర్థము కూడ కలదు 'చిత్' అనగా జీవికి భౌతికలోకమున కలిగిన అనుభవముల ననుసరించి ఏర్పడిన జ్ఞానముయొక్క స్వరూపము లేక బీజము అట్టి అగ్నికుండము వంటి జ్ఞానము మనస్సును ఇంద్రియ ప్రవృత్తులతో కూడిన జీవుని దహింపగా అట్టి దహనము వెనుక జీవునికి కలిగిన నిజమైన ప్రేమానుభూతియే లలిత అనుపేర వర్ణింపబడినది కామదహనము జరిగిన వెనుక పార్వతి తపస్సునకు శివుడనుగ్రహించి పార్వతిని వివాహమాడుట దీనినే సూచించును భౌతిక దేహముల యందును, వస్తువుల యందును కలిగిన ఆకర్షణ ఇట్టి "చిత్" అను జ్ఞానముచే, దహింపబడవలెను అట్లు ఇంద్రియ ప్రవృత్తులు దహింపబడిన వెనుక జీవుని ఆత్మ పరిశుద్ధమై నిజమైన స్వచ్ఛమైన, స్వార్థరహితమైన ప్రేమకై ఆర్తి చెందును అట్టి జీవులననుగ్రహించి ప్రసన్నుడై అట్టివారియందు పరమాత్మ యుండుటయే

ఈ పార్వతి పరమేశ్వర కళ్యాణ కథగా పురాణములయందు ముఖ్యముగ
భాగవతమునందు రసవత్తరముగా వర్ణింపబడినది

## మంత్రము - 3

**ఏషహి దేవః ప్రదిశో ను సర్వాః పూర్వోహి జాతస్స ఉగర్భే అన్తః।**
**సవిజాయమానస్స జనిష్యమాణః ప్రత్యఙ్ముఖాస్తిష్ఠతి విశ్వతోముఖః॥**

## ప్రతిపదార్థము

ఏషః దేవః హి= ఈ స్వప్రకాశకుడగు పరమాత్మయే
అనుప్రదిశః సర్వాః=దిక్కులుగానున్న ఈ సమస్తమునకు ఆశ్రయమైనట్టివాడు
గర్భేఅన్తః= బ్రహ్మాండ రూపమగు గర్భమునందు
సః ఉ= అతడే యున్నాడు
పూర్వఃహి= ముందుగానే (తూర్పుదిక్కుయందే)
జాతః= పుట్టియుండెను
సః=అతడే
విజాయమానః= ఇపుడు పుట్టుచున్నవాడును
జనిష్యమాణః = పుట్టగలవాడును
సః ఉ= అతడే
ప్రత్యఙ్ముఖాః = పడమటి దిక్కునోరుగా గలవాడు
విశ్వతోముఖః= విశ్వమే ముఖముగా గలవాడు
తిష్ఠతి= నిలచియున్నాడు

## తాత్పర్యము

ఈ పరమాత్మయే సమస్తమునకు ఆశ్రయము ఈయనయే దిక్కులు. ఈ విశ్వమునందు తానే పుట్టియున్నాడు అంతేకాక ఇప్పుడు పుట్టుచున్నవి, తిరిగి పుట్టబోవునవి తానే ఈయన పడమటి దిక్కునే తన నోరుగా కలిగి విశ్వమే తనముఖముగా కలిగియున్నాడు

## వివరణ

పరమాత్మ ఈసమస్తమునకు ఆశ్రయమై అన్ని దిక్కులయందు వ్యాపించియున్నాడు అట్టి ఆయనయే ఈ విశ్వమునందు జీవులుగా

జన్మించుచున్నాడు అనగా ఈ సృష్టికి కారణమైన అసలు వెలుగు నారాయణుడే నీటినుండి మంచుగడ్డ పుట్టి మరల అందే లీనమగునట్లు ఈసృష్టి నారాయణునియందే పుట్టి మరల ఆయనయందే లీనమగుచున్నది "గర్భే అంతః" అనుటలో నారాయణుని ఉదరమునందు ఈ సృష్టిగోళమున్నదని మరియొక అర్థము "పూర్వోహిజాతః" అనగా ఇచ్చట ఇంతకుముందే పుట్టియున్నాడు అని అర్థము "విజాయమానః" అనగా ప్రస్తుత సృష్టిగా ఆయనే ఉన్నాడని అర్థము మొత్తము ఈచోటునందు గోళములుగా, నక్షత్రములుగా అనేకమంది సూర్యులుగా ఆయనయే పుట్టుచున్నాడు "జనిష్యమాణః" అనగా ముందు ముందు లోకములుగాను, జీవులుగాను తానే పుట్టబోవుచున్నాడు నారాయణుడే ఈ సృష్టిలో ఇన్నిరూపములుగాను నున్నాడనియు జరిగిన కల్పములు, జరగబోవు కల్పములు బీజములై ఆయనయందే ఇమిడియున్నవనియు అర్థము

పుట్టుట అను ప్రక్రియకు బ్రహ్మ ప్రతినిదిగా నున్నాడు ఈ పుట్టిన లోకమంతయు ఆయనచే నిర్వర్తింపబడుచున్నది "విశ్వతోముఖః" అనగా విశ్వమే తన ముఖముగా కలిగినవాడు అనగా సృష్టిలోని జీవులు స్వీకరించు ఆహారముగా తానే అయియున్నాడు పుట్టిన ప్రతిజీవికి ఆహారము ఆవశ్యకము పుట్టిన బిడ్డ తల్లి వద్దనుండి పాలు ఆహారముగా స్వీకరించును మానవులు జంతువులను, జంతువులు వృక్షములను ఆహారముగా తీసుకొనుచున్నవి ఈవిధముగా సృష్టిలోనున్న జీవులు పరస్పరము ఒకదానినొకటి తినుట అనునది ఏర్పాటు చేయబడినది అనగా ప్రాణశక్తి ఒకదానినుండి మరియొకదానికి ప్రసరించుచున్నది నారాయణుడే ప్రాణశక్తిగా జీవులలో నున్నాడు నారాయణునికి పడమటి దిక్కు నోరుగా చెప్పబడినది (ప్రత్యఙ్ముఖః) బగవద్గీత విశ్వరూప సందర్శన యోగమున శ్రీకృష్ణుని విశ్వరూపము దర్శించిన అర్జునుడు సంభ్రమాశ్చర్యములతో స్తోత్రము చేయుచు, శ్రీకృష్ణుని కాలస్వరూపునిగా దర్శించినవాడై ఆయన నోటియందు బీష్మద్రోణాది సకల జనులు ప్రవేశించు(మృతిచెందు)చున్నారని వర్ణించెను

"వక్త్రాణితే త్వరమాణా విశంతి

దంష్ట్రా కరాలాని బయానకాని| (శ్లో|| 27)

సూర్యుడు తూర్పున పుట్టి పడమట అస్తమించును కనుక పడమటి దిక్కు మృత్యువును సూచించును అట్టి పడమటి దిశను నోరుగా

కలిగినవాడనగా జీవులను మృత్యువనుపేర మరల తనలోనికి స్వీకరించుచున్నాడని యర్థము

"పూర్వోహిజాతః" అనగా తూర్పుదిక్కునందు పుట్టుచున్నాడని అర్థము తూర్పున పుట్టి పడమట అస్తమించుచున్నాడనగా సూర్యునికి చావు పుట్టుకలు లేవు ఈపుట్టుట మొదలగునవి భూమియందలి జీవులకు మాత్రమే సూర్యోదయ సమయమున ప్రాణమయ తరంగములు భూమిపైకి ప్రసరించును అట్టి తరంగముల చేతనే జీవుడు నిద్ర యను మృత్యుస్థితినుండి మేల్కొనుచున్నాడు లేక పుట్టుచున్నాడు ఇదియే పురాణములయందు"సావిత్రీ సత్యవంతు"ల కథగా చెప్పబడినది సవిత్రుడనగా సూర్యుడు సూర్యునినుండి సృష్టిని పుట్టించు జీవతరంగములు భూమిని మొట్టమొదటగా తాకుటలో భూమిపై జీవనము ప్రారంభమగుచున్నది జీవుడు సత్యవంతుడయి మరల జీవించును సూర్యుని మొదటి జీవన తరంగ కిరణమే సావిత్రి సూర్యుడస్తమించుటయే జీవులు నిద్రించుట, చనిపోవుట బృహదారణ్యకోపనిషత్తునందు చెప్పబడినట్లు ఉషస్సే ఈసృష్టియను యజ్ఞపురుషునికి శిరస్సు

"గర్భే అంతః" అనగా స్త్రీ గర్భకోశమని అర్థము గర్భమునందు పిండము ఏర్పడి అవయవములేర్పడుట ఈయనవలననే జరుగుచున్నది ఇట్టి కర్తవ్యమును నిర్వహించునపుడు ఈయన 'ప్రజాపతి' అని చెప్పబడుచున్నాడు

## మంత్రము - 4

విశ్వతశ్చక్షురుత విశ్వతోముఖో విశ్వతోహస్త ఉతవిశ్వతస్పాత్|
సంబాహుభ్యాంనమతి సంప్రతత్రైర్ద్యావా పృథివీజనయన్దేవ ఏకః||

## ప్రతిపదార్థము

ద్యావాపృదివీ= భూమి, ఆకాశము,

సంజనయన్= సృష్టించువాడు

ఏకః= ఒకడే

దేవః= దేవుడు

విశ్వతః + చక్షుః= విశ్వమే కన్నులుగా కలిగినవాడు

ఉత= మరియు

విశ్వతః + ముఖః= విశ్వమే ముఖముగా కలవాడు

విశ్వతః+ హస్తః = విశ్వమే హస్తములుగా గలవాడు
ఉత= మరియు
విశ్వతః + పాత్= విశ్వమే పాదములుగా కలవాడు
బాహుబ్యాం= హస్తములచేత
సంపతత్త్రైః= పాదములచేత
సంనమతి= చక్కగా శాసించుచున్నాడు

తాత్పర్యము

భూమి, ఆకాశములను సృష్టించు దేవుడొకడే ఆయన విశ్వమే న్నులుగా, ముఖముగా, హస్తములు మరియు పాదములుగా కలవాడు ఇంకను ఆయనయే చేతులచేత నమస్కరించుచున్నాడు

వివరణ

ఏకః దేవః అని చెప్పుటలో ఒకడే వెలుగుగా నున్నాడని సూచింపబడుచున్నది దేవః అను శబ్దమునకు వెలుగు అని అర్థము ఈసృష్టియందు ఎన్ని వెలుగులున్నను, వెలుగన్నది ఎచ్చట నున్నను ఒకటియే గనుక, ఒక్కటే వెలుగని చెప్పబడినది చూపునకు వెలుగే ఆదారము కనుక సూర్యుడు చూపునకు మరియు కంటికి అదిపతిగా చెప్పబడినాడు. విశ్వమే కన్నుగా కలిగినవాడు అనుటలో విశ్వమునందు చూచుట అను లక్షణము పుట్టినదని అర్థము చూచుట అను ప్రక్రియ భౌతికమైన స్థితికి సంబంధించినది కన్ను ఇంకొక దానిని చూచును కాని తన్ను తాను చూచుకొనగలదా? ఎదుటివాని కన్నును చూచును అట్లే చూపు అనునది తనకంటే వేరు అయిన దానిని చూచుటకొరకు, గమనించుట కొరకు ఏర్పడినట్టిది అనగా నేనుకాక ఇంకొకటి యున్నది అను ఒక మాయపొరవలె మనలో నేర్పడును ఈ మాయవలన తననుండి ఇతరముగా చూచుట అను ప్రవృత్తి జీవులలో ఏర్పడుచున్నది దానికి కన్ను అధిపతిగా నుండును బౌతికలోకములకు అధిపతి చూపు ఆచూపు అనునది ప్రధానముగా జీవులకు కలిగించువాడు సూర్యుడు అందువలననే జాతక చక్రమున సూర్యుడు afflict అయినవారికి దృష్టిలోపము ఉండును Ist houseలోగాని IInd houseలోగాని తీవ్రముగా afflict అయినచో అందుడగు అవకాశము కలదు కుడికన్నునకు సూర్యుడు, ఎడమ కన్నునకు చంద్రుడు అదిపతులు ''విశ్వతః చక్షుః''

అనగా విశ్వము కన్నుగా కలవాడు సూర్యుడు చోటునకు కన్నువంటివాడు "చక్షోః సూర్యో అజాయత" అనగా విరాట్పురుషుని కన్నునుండి సూర్యుడు పుట్టెనని పురుషసూక్తమున చెప్పబడినది అనగా విరాట్పురుషునకు కన్నుగానున్నవాడు సూర్యుడు మొత్తము చోటునందు చూచుట అను ప్రక్రియ (మొదటగా) ఏర్పరిచిన సూర్యుడు సౌరమండలమునకు అదిపతి

విశ్వతోముఖః - విశ్వము ముఖముగా కలవాడు ముఖము అనగా ఇక్కడ నోరు అనికూడ అర్ధము ఒక మనిషికి representation ముఖము మనము ఎవరితోనైనను మాట్లాడునపుడు ముఖము చూసి మాట్లాడుదుము కాని ఇతరములు చూసికాదు ముఖమును చూసి మనిషిని గుర్తు పట్టుదుము దీనివలననే జీవులను ఎవరికి వారుగా ప్రత్యేకించడము అనునది సాద్యమగుచున్నది ముఖముద్వారా ఒకరితో నొకరు సంబందబాందవ్యములు ఏర్పరుచుకొనుచున్నారు ఈ identityను establish చేయుచున్నవాడు నారాయణుడు

విశ్వతః హస్త ఉతవిశ్వతః పాత్-విశ్వమే హస్తములుగా, పాదములుగా దరించియున్నాడు అనగా సృష్టియందలి కదలికలు, పనులు చేయుట అనువానికి అదిపతిగా నున్నాడు కురు అనగా చేయుట హస్తములద్వారా చేయుట అను ప్రక్రియను ఏర్పరచినాడు ఈ చేయుశక్తి, సంకల్పముకూడ నారాయణుని వలన నేర్పడినది మన తెలివితేటలతో కాదు చోటులో ఇట్టి arrangement ఉన్నది గనుక మన ద్వారా పనులు జరుగుచున్నవి శ్వాస తీసుకొనుటద్వారా జీవులు జీవించగలుగు చున్నారు Earth Gravity లేనిచోటుకు తీసుకొని వెళ్ళి అక్కడ నడవమన్నచో చోటులో తేలటమే కాని నడచుట యుండదు That means you are conditioned by environment మనని conditionచేయునవి పరిస్థితులు, కాని మనము పరిస్థితులను condition చేయలేము

అటులనే విశ్వతఃపాత్ అనగా విశ్వమే తనపాదముగా కలిగినవాడు పాదోస్యవిశ్వాభూతాని అనగా బౌతికమయిన విశ్వమంతయును ఆయనయొక్క పాదముగా నున్నది

బౌతికముగా జరుగు పనులన్నియు, జీవులు, పశుపక్ష్యాదులు, వృక్షములు మున్నగునవన్నియును పరమాత్మయొక్క అవతారములుగా ద్యానము చేయవలెను ఈమొత్తము పరమాత్మయొక్క పాదముగా

# అనువాకము - 1

## మంత్రము 1

**అంభస్యపారేభువనస్యమధ్యే నాకస్యపృష్ఠేమహతోమహీయాన్|**
**శుక్రేణ జ్యోతీగ్ంషిసమను ప్రవిష్టఃప్రజాపతిశ్చరతి గర్భే అన్తః||**

## ప్రతిపదార్థము

అంభస్య + అపారే = అపారమైన జలముల యందు
భువనస్యమధ్యే = లోకములమధ్య (కేంద్రమున),
నాకస్యపృష్ఠే = నాకము లేక దేవలోకము వెనుక,
మహతఃమహీయాన్ = మహత్తుకన్న అతీతమైన వాడైన,
ప్రజాపతిః = సృష్టికర్త,
శుక్రేణ = శుక్రునిచేత,
జ్యోతిగ్ంషి = వెలుగులయందు
సమనుప్రవిష్టః = ప్రవేశించెను
గర్భేఅన్తః = ఈసృష్టి గర్భములోపల,
చరతిః = చరించుచున్నాడు

## తాత్పర్యము

అపారమైన ఈ సృష్టి జలములయందు లోకములన్నింటికి మధ్య లేక కేంద్రమున దేవలోకమునకు వెనుక (ఆదారమైన) మహత్తునకు కూడా కారణమైనట్టి ప్రజాపతి శుక్రుడు అను బీజముగ (తారలుగా నున్న) వెలుగుల యందు ప్రవేశించి ఈ (ప్రకృతి యొక్క) గర్భకోశమునందు చరించుచున్నాడు

## వివరణము

ఈ సృష్టికి ప్రారంబమున అంతయు జలములుగా నుండెను జలములనగా బౌతిక జలములుకాక, సమస్త సృష్టి దేనియందు కరగియుండునో అట్టి మహాజలములేక సముద్రము దానియందు వస్తువులు, జీవులు, ప్రాణులు, గ్రహగోళములు, దేవతలు మున్నగునవి కరగియుండి సృష్టి ప్రారంబమగుచున్నపుడు నీటిపై మంచుగడ్డలవలె వ్యక్తమగుచున్నవి ఇట్టి జలములే తన మొదటి రూపముగా దిగివచ్చువాడు

నారాయణుడు నారములనగా నీరు జలములు తన మార్గముగా లే అయనముగా గలవాడు గనుక ఆయన నారాయణుడని చెప్పబడినాడు

అంబస్ శబ్దమునకు నీరనియు తల్లి యనియు అర్థములున్నవి అనగ ఈ మహాజలములే సృష్టికి మొదటి కారణమై, సృష్టిని తమయందు తల్లి గర్భకోశమునందువలె దరించి యున్నవి అట్టి ఈ జలతత్త్వమునే సృష్టి కారణమైన మూల ప్రకృతియని కూడా పిలుతురు మహాజలములక అనుభవమనియు, ఆనందమనియు కూడా అర్థములున్నవి ఇవి ఒ వస్తువునకు గల రంగు, రుచి, వాసన వంటి లక్షణములు ప్రవహించుట కరగుట, తనలో కలుపుకొనుట మున్నగు లక్షణములు జలములక సహజములు ఆనందమునకును లేక అట్టి అనుభవమునకును ఈ లక్షణములే గలవు ఆనందముగా నున్నవానికి మనస్సు, బుద్ధి ఇంద్రియములు మున్నగునవి తాత్కాలికముగా పనిచేయవు వాని ప్రవృత్తులన్నియు, ఆనందమునందే లీనమగును చక్కని సినిమాన చూచుచున్నవానికి చూచుచున్నంతసేపు తన చుట్టును ఉన్న మిగిలిన విషయములు మనస్సు నాకర్షింపవుకదా। చూచుచున్నంతసేపును వాని మనస్సు సినిమా యందే యుండును గాని, మిగిలినది గమనించడు చివరకు కాలముకూడ మనస్సు నుండి జారిపోవును ఇంతసేప చూచితిమా। యనిపించును కనుక అట్టి అనుభూతికి తమ చుట్టూ నున్నవానిని తమలో కలుపుకొను లక్షణము గలదు అట్టి జలములే పై లోకములయందు ప్రేమ యను లక్షణమును తెలియజేయును అందుచేతనే జగన్మాతను గూర్చి స్తోత్రము చేయు లలితా సహస్రనామస్తోత్రము 'శ్రీమాతా యని ప్రారంభమగును అనగా ఈసృష్టి మొత్తము అకారణము, అవ్యాజము, నిర్మలమూనైన మాతృప్రేమపై నాధారపడియున్నది అట్టి తల్లి జీవునికి, పరమాత్మకు మద్యగా నుండి పనిచేయుచున్నది తన పుట్టుకకు తండ్రి కారణమైనను పుట్టగానే మొదట తాను చూచునది తల్లినే కదా। ఇట్టి ఈ తల్లి అను లక్షణమే సృష్టికి కారణముగా పనిచేయును అట్టి ఈ మహాజలములే క్రింది లోకములయందు ఆవేశాత్మకమైన మనః ప్రవృత్తులుగా పనిచేయు చున్నవి కనుకనే కామక్రోదాత్మకమైన ఆవేశములయందు చిక్కిన వారికి బుద్ధిమున్నగునవి పనిచేయవు

ఈ జలములకు అతీతముగా నున్నట్టి పరమాత్మ ఈ జలముల లోనికి ప్రవేశించెనని చెప్పబడినది అనగా తండ్రి తానే కుమారుడై తల్లి

# విన్నపము

'ఓం కారము ఈ సృష్టికి బీజముకాగా దానినుండి వేదము నారాయణుని అంశగా వ్యక్తమైనది అట్టివేదమే బ్రహ్మాయనికూడ సంకేతింపబడినది అట్టి వేదము మరల నారాయణుని ప్రవృత్తులైన సృష్టిదర్మములుగా అనేకములుగా విస్తరించినది సృష్టి సంకల్పమే'ఓం'కారముగానున్న మొట్టమొదటి బీజము అదియే ఈ సృష్టికాదారమైనట్టి విశ్వశ్రేయస్సు అనుపేర పరమదర్మముగా తెలియబడుచున్నది అన్ని దర్మములునూ దీనిపైననే ఆదారపడియున్నవి వేదము ఈసృష్టికి కారణమైన మొట్టమొదటి వెలుగు కాగా దానినుండి వెలుగులనేకములు దిగివచ్చినవి అవియే, యిప్పుడు మనకు తెలిసిన వేదములు ఈ మొట్టమొదటి వేదము సృష్టియందంతర్లీనమై యుండి ప్రకృతిద్వారా వ్యక్తమగుచుండగా దానిని దర్శించిన ద్రష్టలు (Seers) తమకు అందినవిదమున అందినంతవరకు బీజాక్షరముల రూపమున సంపుటీకరించి తమకు తెలిసిన బాషలో మానవ సమాజమునకు వేరువేరు కాలములలో అందించుచుండిరి ఇట్లు సృష్టి ప్రారంబమైన నాటినుండి నేటివరకు అట్లు దర్శించుట, అందించుట, అందుకొనుచుండుట జరుగుచునే యున్నది ఇంత జరిగిననూ వేదము మానవులకు పరిపూర్ణముగా అందినదని చెప్పలేము ఎంత అందిననూ అందుకొనవలసినది మరింతగా మిగిలిపోవుచునే యున్నది కనుకనే వేదము అనంతమని చెప్పబడినది

మహర్షులనేకులు తాము దర్శించిన వేదమంత్రములను, సూక్తములను పేర తమ శిష్యులకు అనుగ్రహించి యిచ్చియున్నారు నేటికి ఐదువేల సంవత్సరములకు పూర్వము వేదవ్యాసుడను మహర్షి అప్పటికే తామరతంపరగా పెరిగిపోయి జనబాహుళ్యమునందు విస్తరించియున్న వేదసూక్తములను, మంత్రములను సంహితలుగా కూర్చి స్థూలముగా నాలుగు విబాగములు చేసి సంపుటీకరించెను అవియే సామవేదము, యజుర్వేదము, ఋగ్వేదము, అదర్వణవేదము కానీ యిట్లు వేదము మంత్రముల స్వరూపమున దర్శనమిచ్చుట ఒక్క భారతదేశములోనే కాక ప్రపంచమునందు అన్ని దేశములయందును జరిగినది పాతాళదేశమని పూర్వము పిలువబడిన నేటి అమెరికా దేశమునందును, యవనదేశమునందు, ఈజిప్టు దేశమునందు ఇంకను పెక్కుచోట్ల యిట్లు మంత్రములు దర్శించుట మానవజాతి కందించుట జరిగినది కాని పెక్కు దేశములయందు అవి సమగ్రముగా తరువాత తరములవారికి అందించుట జరుగలేదు అదృష్టవశమున బారతదేశమందు కొంతబాగము ఖిలమైననూ ఎక్కువబాగము ప్రస్తుత తరములవరకు అందింపబడినది కానీ

వేదములు నవీన సమాజమునందు ఎక్కువ ఆదరింపబడకపోవుటచే నేటి బారతీయులలో చాలామంది దానియందు అనాదరము వహించుచున్నారు దీనిని ప్రకృతి మరియొక విచిత్రమైన మార్గమున పరిష్కారము చేసినది జర్మనీ, బెల్జియం, స్విట్జర్లాండ్ మొదలగు అనేక దేశములలో ప్రజలకు వేదమునందు అబిమానము పెరిగి వేదసంహితలను వారివారి బాషలలో కూర్పు చేసుకొని అచ్చువేసుకొనుచున్నారు ప్రస్తుతము మనకు బారతదేశమున లబ్యముకాని వేదసంహితల పారములు కొన్ని జర్మనీదేశమున లబ్యమగుచున్నవన్నచో బారతీయుల దురదృష్టమేమని చెప్పవచ్చును।

ఈ ప్రస్తుతము గ్రందము మహానారాయణోపనిషత్తు అని పిలువబడు ఉపనిషద్భాగము ఇది కృష్ణ, యజుర్వేదమునందలి తైత్తిరీయారణ్యకము నందలిది వేదములయందలి కొన్ని ప్రదాన బాగములు ఉపనిషత్తులను పేర కూర్పు చేయబడినవి వీనియందు మంత్రములు పెక్కుబాగము నిత్యజీవితమునందు సామాన్యులకెక్కువ ఉపయోగించునట్లు కూర్పు చేయబడినవి అనగా యోగసాదనకు సంబందించిన రహస్యములు, మంత్రములు, ద్యాన పద్ధతులే కాక స్నానము, బోజనము, జలపానము, ఇతరులతో వ్యవహారము మున్నగు సమయములందు తానుండవలసిన విదానములనుగూర్చి, అందు దోషములున్నచో తొలగించుకొను విదానములు మున్నగువానితోబాటు ఆహారదోషములు, జలదోషములు నిర్మూలనమగుటకు కావలసిన మంత్రములుకూడ వివరింపబడినవి దీనినిబట్టి వేద ఋషులు ప్రతిపాదించిన మార్గము పూర్తి శుష్కవైరాగ్యము కాదనియు, బౌతిక సుఖములు సాదించుకొనుచునే యెగసాదన చేసుకొనవచ్చుననియు, అదియే యోగజీవనమనియు తెలియుచున్నది ముఖ్యముగా ఈ నారాయణోపనిషత్తునందు అట్టి మంత్రములన్నియూ విశేషముగనూ, సమగ్రముగనూ వ్యక్తీకరింపబడినవి

నారాయణునిగూర్చి తెలుపబడు ఈ సూక్తమునందు నారాయణుని పేరు మిక్కిలి తక్కువగా కనుపించును నారాయణునితోబాటు సృష్టికి కారణములైన దేవతలనుగూర్చి వారి ప్రవృత్తులనుగూర్చి విశేషముగా వివరింపబడినది ముఖ్యముగా అగ్ని, ఇంద్రుడు, వరుణుడు, రుద్రుడు, ఆదిత్యుడు, బ్రహ్మ, ప్రజాపతి, వసువులు, దుర్గ, షణ్ముఖుడు మొదలగు దేవతలనుగూర్చి, వారి ప్రవృత్తులనుగూర్చి చెప్పబడినది అనగా నారాయణుడే ఈ సమస్త సృష్టిగా దిగివచ్చెననియు, ఈ చెప్పబడిన దేవతలందరూ ఆయనలోని భాగములేయనియూ వీరందరినిగూర్చి చెపుఎట యనగా నారాయణునిగూర్చి

చెప్పుటయేయగుననియు ఇందలి బావము దీనిని గుర్తించుకొనకున్నచో ఇది వేరు వేరు దేవతల మంత్రముల సంపుటి యగును కాని ఇందలి నారాయణు అంతర్యామిత్వము స్ఫురింపదు

ఈ మహానారాయణోపనిషత్తు వ్యాఖ్యానమునకు నన్ను పురికొల్పినవారు సుహృన్మిత్రులైన శ్రీ J కృష్ణ సోమయాజులుగారు నేను ప్రతిదినము వ్యాఖ్యానము చేయుచుండగా ఆయన రికార్డు చేయగా అది మొత్తము 88 క్యాసెట్లయందు వచ్చినది దానిని పునఃపరిశీలనము చేసి గ్రందరూపమున కూర్పు చేయవలసినదిగా ఆయన కోరిరి ఆయన ద్వారా మాష్టరుగారి ఆదేశమును గ్రహించి నేను అట్టి ప్రయత్నమునకు పూనుకొంటిని ఈ ప్రస్తుత గ్రందముతోబాటు మరియొకబాగముగా గాని మరి రెండు బాగములుగా గాని ఈ వ్యాఖ్యానము పూర్తికాగలదని నాబావన గురుదేవులైన కులపతి ఎక్కిరాల కృష్ణమాచార్యగారి (Master E K) శుశ్రూషచే నాకు లబించిన విజ్ఞానము ఈగ్రందరూపమున వ్యక్తీకరించితిని ఆ గురుదేవుని వెలుగే నాకు నిరంతరము మార్గదర్శకముగానున్నది ఈ ప్రదమబాగములోనే పాఠకుల సౌకర్యార్థం మూలమంత్రములు సస్వరంగా అందించబడుచున్నది

ఈగ్రంద రచనయందు నాకుసహాకరించిన సోదరీ సోదరులు అనేకులు వారి సహాకారమే లేనిచో నేను దీనిని ప్రకటించుట మిగుల కష్టసాధ్యమై యుండెడిది నాయీ వ్యాఖ్యానమును, అర్థతాత్పర్యాదులను పరిశీలించి తగు సవరణలు చేసియిచ్చిన పెద్దలు శ్రీ TKV రాఘవన్ గార్కి, శ్రీ M సత్యనారాయణమూర్తిగార్కి, నా కృతజ్ఞతలు ఈ గ్రందప్రచురణకు ఆర్థిక సహాయముచేసిన దాతలకు నాకృతజ్ఞతలు ఇట్లు అనేకవిధముల నాకు సహాకరించి, ప్రోత్సహించిన పెద్దలు, పిన్నలు ఎందరో కలరు అట్టివారందరికిని నారాయణ స్వరూపులైన మాష్టరుగారు ఆయురారోగ్య ఐశ్వర్యములనిచ్చి సదా సుఖశాంతులతో వర్థిల్లచేయుదురు గాక!

ఇట్లు

విధేయుడు

పిడూరు జగన్మోహనరావు

ధ్యానము చేసినపుడు పైచెప్పిన పరమాత్మయొక్క రూపము అవగాహనలోనికి వచ్చును 'విశ్వతః పాత్ సంబాహుభ్యాంనమః' ఆయన చేతులతో నమస్కారము చేయుచున్నాడు తాను, ఇతరము అని రెండుగా ఏర్పడిన తరువాత లౌకికవ్యవహారములు, ఒకరు ఇంకొకరికి పరస్పరము పనులుచేసి పెట్టుకొనుట, గౌరవించుట అనునవి ఏర్పడినవి ఇదికూడ ఈయనలీలయే లోక వ్యవహారములను గౌరవించవలసినదే. ఏలననగా వీనిద్వారా కూడా పరమాత్మ తెలియబడును మనకు పనిచేసి పెట్టినవాడు నారాయణుడే వానికి నమస్కరించుట ద్వారా నారాయణునికి నమస్కారము చేసినవాడగుచున్నాము ఎవరయినను మనకు నమస్కారము చేసినపుడు వానిలోని నారాయణుడు చేతులెత్తి నమస్కారము చేయుచున్నాడని గుర్తుంచుకొనవలెను పిల్లలు పెద్దలను గౌరవించుట, తల్లిదండ్రులను గౌరవించుట వలన సంప్రదాయము స్థాపన చేయబడుచున్నది

పతనము చెందినవారు పడిపోయినవారు అనగా పైలోకములలో అంతర్యామియందు నారాయణునిగానున్న స్థితినుండి భౌతికమయిన లోకము లోనికి జీవులుగా పతనము చెందిరి అని అర్థము వారికోసమై లోకములు కల్పనము చేయుచున్నాడు పతనము చెందినవారియందు కుడా నారాయణుడు కలడని మరచిపోరాదు "నేను చాలా పాపము చేసినాను", అని ఎవరైనను అన్నపుడు వానియందున్న నారాయణుడు అట్లు మాట్లాడుచున్నాడని జ్ఞాపకముండవలెను

మనము కొంతమందిని మంచివారుగా, కొంతమందిని చెడ్డవారుగా చూచుచున్నామము సామాన్యులయిన సాంసారిక జీవులు మంచి, చెడు అనునవి చేయు పనులనుబట్టి నిర్ణయింతురు మన దర్మము ప్రకారము జీవులు నడచుకొనవలెను కనుక దుర్మార్గులయిన వారిలోని దుష్టత్వము శిక్షింపబడవలెను వాడు నారాయణుడు, కనుక శిక్షింప రాదనుకొని వదలి వేయరాదు కదా! వానిలో క్షాళన కావలసినట్టి స్థితి ఉన్నది కనుక వారిని శిక్షించుట జరుగుచున్నది అటుల కొన్ని జన్మలు జరుగునప్పటికి వానిలోని దుష్టత్వము నశించును వానిని సరిదిద్దకపోయినచో మరికొంతమంది మంచి వారిని బాధించును కనుక శాయశక్తులా వానిని దిద్దవలెను అప్పుడుకూడ వానిలోని నారాయణుని ద్యానము చేయుచు వానియందు దయ, ప్రేమ చూపుచు వానిలో పరివర్తన తీసుకొని రావలెను

మంత్రము -5

వేనస్తత్ పశ్యన్విశ్వాభువనాని విద్వాన్ యత్రవిశ్వంభవత్యేకనీళమ్|
యస్మిన్ని దగ్ం సంచవి చైకగ్ం స ఓతః ప్రోతశ్చ విభుప్రజాసు||

ప్రతిపదార్థము

యత్ర= ఎచ్చట

విశ్వం= విశ్వము

ఏకనీళమ్= ఒక్కటిగా

భవతి= అగుచున్నదో

తత్= దానిని

వేనః= వేనుడు

విశ్వాభువనాని= విశ్వమునందలి లోకములను

విద్వాన్= తెలిసినవాడై

యస్మిన్= ఎవరియందు

ఇదం= ఈప్రపంచము

సంచవిచ, ఏతి= పుట్టి మరల లీనమగుచున్నారో

ఏకః= ఒక్కడు

సః= అతడు (ఆపరమాత్మయే)

తాత్పర్యము :

ఈ జగత్తు ఎచ్చట ఏకత్వము పొందుచున్నదో దానిని చూచినవ (ఎరిగినవాడై) ఎవరియందు ఈ ప్రపంచము పుట్టి లీనమగుచున్న ఆపరమాత్మ తానొక్కడే సృష్టి వైభవముగా లేక అదివ వ్యాపించినవాడై ఈ జీవసృష్టియందు పడుగు పేకగా అల్లు యున్నవాడిని ఎరిగినవాడయ్యెను

వివరణ :

ప్రపంచము అనగా పంచేంద్రియములద్వారా తెలియబడున ఏకనీళము అనగా ఏకత్వమునందున్నది లేక ఒక్కటిగా నున్నది నీ అనగా ఆకాశమునందు కనిపించు నీలవర్ణమని అర్థము ఈ నీలవర్ణమ నున్న ఆకాశములోనికి ప్రపంచమంతయు లీనమై మరల దానిన

వచ్చుచుండును కనుక నీలవర్ణమే అంతటను నిండిన ఒకే వర్ణముగా నున్నది The blue is the all absorbing colour కనుక మొట్టమొదటి వర్ణము నీలము దానినుండియే తెలుపు లేక సూర్యకిరణము పుట్టినది

దానినుండియే మిగిలిన వర్ణములు వచ్చినవి కనుక ఈనీలములోనికి మొత్తమన్నియు లీనమగుచున్నవి కనుక ప్రపంచమంతయు దేనియందు లీనమగుచున్నదో దానిని ద్యానము చేయుమని చెప్పుచున్నారు ఎత్తయిన ప్రదేశమున ప్రశాంతముగ కూర్చొని ఆకాశమువైపు చూచుచు ద్యానము చేయవలెను మనకు కన్పించుచున్నట్టి సృష్టి అంతయు దానినుండియే దిగి వచ్చినది అంతర్యామియొక్క వ్యక్తమైన రూపముగా నీలవర్ణమును ద్యానము చేయవలసినదని చెప్పుచున్నారు నీలమైన దేహము కలవాడనగా ఆకాశమే తనయొక్క వర్ణముగా కలవాడని అర్థము ఇవి అన్నియును ద్యానమునకై ఇచ్చిన తాళపు చెవులు అట్లు ఆకాశమును చూచుచు, ద్యానించుచు కూర్చొనవలెను సూర్యోదయము, సూర్యాస్తమయము ఆకాశమునందు పుట్టుచున్నవి నమకమునందు ''నమస్తామ్రాయచ అరుణాయచ'' అని చెప్పిరి సూర్యోదయ సూర్యాస్తమయ సమయాలయందు సూర్యుడు రాగి రంగు కలిగి ఉండును సూర్యోదయమగుచున్నపుడు మరల సూర్యాస్తమయమగుచున్నపుడు రుద్రుని తామ్రవర్ణముగా ద్యానము చేయమని చెప్పిరి వాస్తవమునకు సూర్యోదయ సూర్యాస్తమయ సమయములకు చెరువు దగ్గరకో నది దగ్గరకో పోయి స్నానము చేసి సూర్యుని చూచుచు అర్ఘ్యమునిచ్చి ధ్యానము చేయమని సంద్యావందనమున నియమము మద్యాహ్న సమయమున సరిగా 12గంటలనుండి 12గంటల నాలుగు నిమిషములకు $90^{O}$ లో ఉన్న సూర్యకిరణములు సూటిగా మన శిరస్సుపై పడును అపుడు కనులు మూసుకొని ద్యానము చేయవలెను దానిని అభిజిత్ లగ్నమని అందురు అది పరమ పవిత్రమైన సమయము ఆసమయమున ఏపనియైనను నిర్విఘ్నముగా నెరవేరును దానికి ముహూర్తము, వర్జ్యము ఏమియూ చూడనక్కరలేదు

సూర్యోదయము, సూర్యాస్తమయము, అబిజిత్ లగ్నము ఈ మూడును ద్యానమునకు ఇచ్చిన సమయములు ఈమూడింటితోపాటు అర్ధరాత్రి, తెల్లవారుఝామున నాలుగు గంటలుకూడా ద్యానమునకు ఇవ్వబడినవి ఈ ఐదు సమయములను Meditation నకు focal points గా ఇచ్చిరి ఈ ఐదు రోజులోనున్న ఇవే 5 Nodes ఈ అయిదు సమయములందు

మనకు ఆచరించుట వీలు కాకపోవచ్చును వీనిలో మనకు అనుకూలమై కొన్ని సమయములందు ద్యానము చేసుకొనవలెను

సూర్యోదయ, సూర్యాస్తమయ అబిజిత్ లగ్న సమయములయంద అర్థరాత్రి12 గంటలకు, తెల్లవారుఝామున 4 గంటలకు పంచముద్రల నిలచి పంచాక్షరీ మంత్రమైన ''ఓం నమశ్శివాయ'' అని ద్యానమ చేయవలెను

వేనుడనగా ఈసృష్టి సంకల్పము లేక కోరిక ఇతడే గందర్వుని చెప్పబడినాడు గందర్వులనగా సంగీత, లయ, తాళములకు అదిపతుల అనగా రాగము, తాళము, లయగా పనిచేయువారు ఈ వేనుడు తన వీణతో సంగీతము నాలపించుచున్నాడు ఈయన వీణకున్న ఏడుతీగ ఏడురాగములు ఈయన తన వీణతో సంగీతము నాలపించుచు జీవులక తన్మయత్వము కలిగించుచున్నాడు అట్లు తన్మయత్వము కలిగించు ద్వారా జీవులకు కర్మవిమోచనము కలిగించుచున్నాడు ఈయ జీవులయందు నాదాత్మకుడుగా ఉన్నాడు ఈనాదము పరమాత్మనుం పుట్టినది ఇదియే మొట్టమొదటి శబ్దము ఇదియే ఓంకారము ఈ ఓంకారమను చైతన్యమే నాదరూపమైన సంగీతముగా పుట్టి, జీవునియంద మరియు సృష్టియందు ఏడురాగములుగా ఏడు కిరణములుగ ఏడుపాయలై ప్రవహించుచున్నది ఈ ఏడురాగములతో శృతిచేయబడిన సంగీతమే నాదస్వరూపము ఈనాదమునకు కారణమైన చైతన్యమ జీవునియందు మేల్కొని నిరంతరము ఆలపింపబడుచున్నది దానిని మహానాదమని అందురు జీవునకట్టి స్థితి కలిగించువాడు ఈ వేనుడన గందర్వుడు

''గందారయతీతి గందర్వః'' అను అర్థముననుసరించి నాదమున తనయందు దరించువాడు గనుక వేనుడు మొట్టమొదటి గందర్వుడైనాడు అట్టి నాదమును లేక ఓంకారమును ఉచ్చరించుచు ద్యానము చేయుచున్నపుడు ఆనాదమే మనము అగుదుము అనగా ఆక్షణమునందు మనము వేనుని యందుందుము అట్టి నాదములనుండి ఈ ప్రపంచము ఏడురాగములుగా ఏడు స్వరములుగా దిగి వచ్చినది అట్లే సూర్యునినుండి తెల్లని కిరణములు ఏడు రంగులుగా వచ్చినవి వేనుడనగా సూర్యుడనియు, ఇంద్రుడనియు అర్థములు గలవు అనగా సూర్యప్రజ్ఞకు కారణమైన మహానాదము లేక గానము ఇదియే సామగానమని కూడ చెప్పబడినది అన్ని నాదములను తనయందు ఒకేనాదముగా లేక గానముగా లయము

చేసికొను ప్రజ్ఞను 'సోముడు' అందురు ఈసోముడు గందర్వరాజు ఈయననుండియే సామగానము లేక సామవేదము పుట్టినది అట్టి సృష్టి కతీతమైన ఒకే గానమునుండి సృష్టియందలి వేర్వేరు ప్రజ్ఞలకు కారణమైన నాదములను రాగములుగా విశ్లేషించి పలికించువాడు వేనుడు ఈయనయొక్క గానముగా సూర్యప్రజ్ఞ అవతరించగా అట్టి సూర్యునికి బౌతికదేహమైన గోళమేర్పడినది మొట్టమొదట ఏడువర్ణములుగా, వాటి ప్రజ్ఞలుగా, రాగములుగా దిగి వచ్చినవారే సప్తర్షులు అట్టి సప్తర్షులనుండి ప్రసరించు కిరణములు సూర్యునిద్వారా సౌరమండలమందు వ్యాపించి మరల సూర్యుని చుట్టును ఏడుగోళములుగా కట్టుకొన్నవి అవియే సప్తగ్రహములు ఈ ఏడు గ్రహములు ఏడు విధములైన శక్తులను కలిగించును అనగా ఏడువిధములైన ప్రాణప్రవృత్తులుగా మానవునియందు పనిచేయును వానివలన ఏడు రకముల ప్రజ్ఞాకేంద్రములేర్పడి మానవునియందు పనిచేయును ఇదికాక చోటునందు ఏడువిధములైన కిరణములు మానవజాతికి కేంద్రములై పనిచేయుచున్నవి అట్టి ఏడు కిరణములవలన ఏడు జాతుల మానవులు పుట్టుచున్నారు ఈ ఏడు జాతులకు అదిపతులుగా ఏడుగురు మహర్షులు బూమిపై మానవజాతికి గురువులై పనిచేయుచున్నారు వీరు సప్తర్షి మండలమునుండి ప్రసరించు శక్తి ప్రసారములకు వాహికలై మానవజాతికి ఆ వెలుగులను లేక శక్తులను పంచిపెట్టుచున్నారు

ఇట్లు తనయందు పుట్టు నాదమును తాను గమనించుట లేక చూచుట అను ప్రవృత్తియే వెలుగుగా పుట్టి బౌతిక ప్రపంచమునకు మొట్టమొదటి అస్తిత్వము లేక ఉనికిగా నిలచినది ఈమొదటి వెలుగే సూర్యుడు కనుక వేనుడను పదమునకు సూర్యుడు అను అర్థము కూడా కలదు మరియు ఇట్లు శబ్దము లేక వెలుగు తననుండి పుట్టుటయే ''ఋక్కు'' అని చెప్పబడినది ఇదియే ''ఋగ్వేదము'' ఇచ్చట ఋక్కు అను పదము వాక్కు అను పదము సమానార్థకములు కనుకనే ఈసృష్టి పరమాత్మనుండి పుట్టిన మొదటి వెలుగనియు, ఆవెలుగే ''హిరణ్యగర్భుడు'' (బంగారు గుడ్డు) అనియు చెప్పుదురు మరికొన్నిచోట్ల ఈసృష్టి బ్రహ్మచే వాక్కుగా నుచ్చరింపబడినదని చెప్పుదురు కనుక వేనుడు దానిని చూచినవాడై సమస్త బువనములను తెలియుచున్నాడని చెప్పిరి అనగా మొదట సూర్యుడను వెలుగు పుట్టగా, వానిచుట్టును ఇతర లోకములుగా గ్రహగోళములు, వాటి పరిదులు

ఏర్పడినవని అర్థము మరియు ఈవేనుడు విశ్వమంతయు ఒక్కటియే అయిన స్థితిగా అనగా నీలవర్ణముగా నుండగా, దానియందు కరగియున్న లోకములను చూచెను (వ్యక్తపరచెను) నీలము అనగా సూర్యుడు, గ్రహములు కరిగి (అంతర్లీనముగా)యున్న ఆకాశము, దానియందు తారలు, గ్రహములు పుట్టుచుండగా ఇన్నింటితో కూడిన విశ్వము మాత్రము ఒక్కటియే అనగా ఈగ్రహగోళములన్నియు విశ్వములోని భాగములేగాని విశ్వమునుండి వేరుకావు అట్టి విశ్వమునందు పగలు, రాత్రులను తెలుపు, నలుపు దారములతో పడుగుపేకగా అల్లబడిన ఈసృష్టియే కాలమనుపేర పరమాత్మనుండి వ్యక్తమగుచున్నది అట్టి పరమాత్మ పుట్టుట మరియు లీనమగుట అను ప్రవృత్తులను దరించియున్నాడు అట్టి ప్రవృత్తులద్వారా అతడు జీవులకు సంరక్షకుడగుచున్నాడు అనగా మృత్యువు మన జీవుల శరీరములు నశించుచుండగా మరల పుట్టుకయనుపేర జీవులకు శరీరములు కల్పించుచున్నాడు కనుక ఆయన సంరక్షకుడై ఉన్నాడు

ఈ వేనుడే గ్రీకు పురాణములయందు ''అపోలో'' (Apollo) అను దేవతగా చెప్పబడియున్నాడు ఈ అపోలో అను గందర్వుడు సంగీతమునకు, కవిత్వమునకు, బాషకు అదిపతి ఈగందర్వులనే గ్రీకు బాషయందు (Muses) 'మ్యూసెస్' అని పిలుతురు ఈ అపోలో వీణ దరించి సంగీతము నాలపించుచు తిరుగుచుండును మర్సియస్(Marsyas) అనునొక యక్షుడు (Satyn) గొర్రెకొమ్ములు, కాళ్ళు కలిగి వనమునందు చరించువాడు ఔలోస్(Oulos) అను నొక విచిత్రమైన పిల్లనగ్రోవిని దరించివచ్చి అపోలో దేవతను గానమునందు పోటీకి పిలుచును పోటీయందు ఇద్దరును సమఉజ్జీలుగా ఏర్పడగా చివరకు అపోలో వీణను తలక్రిందులుచేసి వాయించెను మర్సియస్ తన పిల్లనగ్రోవిని అట్లు చేయలేక పోయెను చివరకు అపోలో గెలిచినట్లు ప్రకటింపబడెను అప్పుడు అపోలో 'మర్సియస్'ను శిక్షగా ఒకచెట్టుకు కట్టివేసి, వాని తోలు ఒలిపించెను ఇచట ఒక చిత్రమయిన సంకేతమున్నది మర్సియస్ దరించిన వేణువు 'గార్గన్ మెడ్యూసా (Gorgon Medusa)' అను రాక్షసియొక్క ముగ్గురు చెల్లెళ్ళ స్వరములననుసరించి నిర్మాణము చేయబడినట్టిది అనగా ఈమూడు స్వరములే కంఠమునందలి మూడు స్థాయిలు మరియు దేహమునందలి ఆత్మ, బుద్ధి, మనస్సు అను మూడు ప్రవృత్తులు పిల్లనగ్రోవియే బౌతికదేహము మర్సియస్ అను యక్షుడే దేహాబద్ధుడైన జీవి అనగా రాశి

చక్రమనబడు కాలచక్రముచే పరిపాలింపబడువాడు ఈరాశి చక్రము గొర్రెతో ప్రారంభమగును కనుక ఇతనికి గొర్రెకొమ్ములు, గొర్రెకాళ్ళున్నట్లు చెప్పబడినది అట్టివానికి గానమనగా జీవితమునందు పరిస్థితులవల్ల కలుగు తాత్కాలికమైన సుఖానుబూతియే అపోలో (వేనుడు) శాశ్వతమైన ఆనందమునకు, నాదాత్మకమైన గానమునకు అదిపతి వారిద్దరు గానమునందు సమ ఉజ్జీలయిరి అనగా అపోలో గానము జీవునకు తాత్కాలికమైన సుఖముగానే తెలియుచున్నదికాని అందు అంతర్లీనముగానున్న దైవస్పర్శ అందుటలేదని బావము అపుడు అపోలో తన వీణను తల్లక్రిందులు చేసివాయించెను జీవుని వెన్నెముకయే ఈవీణ తల్లక్రిందులు చేసి వాయించుట అనగా మూలాదారమునందు దేహాగతమై పనిచేయుచున్న అంతర్యామిప్రజ్ఞను క్రిందినుండి పైకి ఊర్ధ్వగమనము చేయించుట ద్వారా శిరస్సునందలి సహస్రారమునకు చేర్చుట అట్టి దివ్యగానమునకు మర్సియస్ ఓడిపోయెననగా దైవప్రజ్ఞ యందు జీవప్రజ్ఞ లీనమయ్యెనని బావము ఇట్టి దివ్యగానము సామగానమను పేర జీవుల శ్వాసయందు అనుబవింపబడుచుండును మర్సియస్ జీవసృష్టికావశ్యకమగు కామమును ప్రధానముగా కలిగి ఉండును వీణను తలక్రిందులు చేయుట అనగా అట్టి కామమును హృదయమునందలి సామగానముగా మార్చుకొనుట మర్సియస్ చెట్టుకు కట్టబడి చర్మము ఒలువబడెననగా జీవప్రజ్ఞ కామవాసనలను తొలగించుకొని సృష్టియను వృక్షమునకు మూలమైన అంతర్యామి యందు లీనమగుట ఇట్టి సాధన (వృక్షమును ధ్యానము చేయుట) బగవద్గీత పురుషోత్తమ ప్రాప్తి యోగమునందు వర్ణింపబడినది

మంత్రము 6
ప్రతద్వోచే అమృతంను విద్వాన్గన్ధర్వోనామ నిహితం గుహాసు|

# అనువాకము 4

మంత్రము 1
త్రీణిపదా నిహితా గుహాసు యస్తద్వేద సవితుః పితాసత్||

ప్రతిపదార్థము :

గన్ధర్వోనామ= గందర్వుడు అను పేరుగలవాడు వేనుడు
తత్= ఆ
అమృతం= అమృతమును
ప్రవోచే= చెప్పెను
ను= కదా
గుహాసు= గుహయందు
త్రీణిపదా= మూడు పదములు
నిహితా= ఉంచబడినవి
యః= ఎవరైతే
తత్= దానిని
వేద= తెలుసుకొనుచున్నాడో
సః= అతడు
సవితుః= సూర్యునకు
పితా= తండ్రి
సత్= అగుచున్నాడు

తాత్పర్యము :

గందర్వుడను పేరుగల అతడు మూడు పదములుగానున్న అమృతము తనయందు దాచి యుంచబడుటను గూర్చి తెలిసినవాడై దానిని ఉచ్చరించుచున్నాడు అట్లుచ్చరించుట వలన అతడు సవితునకు లేక సూర్యునకు తండ్రి అగుచున్నాడు

వివరణ

గందర్వోనామ అనగా గందర్వుడను పేరుగలవాడని అర్ధము అనగా జీవుడు గందర్వుడైనాడని ఆర్ధములేక తనయందు నాదము కలవాడని అర్ధము ఇట్టి నాదము జీవియందలి పరమ పురుషుని అంశనుండి వ్యక్తమగుచున్నది ఇట్టి పరమపురుషుని అంశనే పురుషుడు అని వ్యవహారింతురు పురుషునినుండి నాదము నాలుగు స్థితులలో వ్యక్తమగును నాలుగవ స్థితియందు బౌతికమగు శబ్దముగా ఉచ్చరింపబడును అంతకు ముందు మూడు స్థితులు జీవులందు మూడు వాక్కులుగా ఇమిడి ఉన్నవి కనుక మొత్తము నాలుగు వాక్కులు ఇవియే పరా, పశ్యంతీ, మద్యమా, వైఖరీ వాక్కులను నాలుగు వాక్కులు ఇట్టి వాక్కులు తననుండి ఉచ్చరింపబడుచుండగా వాటిని గమనించి, తనయందట్టి వాక్కు పుట్టు స్థానమును తెలియవలెను అట్లు తెలియవలెనన్నచో మొదట తనయందు తానుండుచోటు తెలియవలెను అనగా తనను తాను తెలియవలెను తనయందు తానుండుటయే తెలియుట ఇదియే అమృతత్త్వము అనగా మృతిలేని చోటు మృత్యువు అనగా తాను మనస్సుగా, ఇంద్రియములుగా, బౌతిక శరీరముగా చెదరిపోవుట అట్టి మృత్యువు నుండి తాను రక్షింపభడవలెనన్నచో ఇవి అన్నియూ తనయందలి బాగములే అనియూ, తననుండి ఇవన్నియు పుట్టుచున్నవనియు తెలియవలెను నీటినుండి మంచుగడ్డ పుట్టినను నీరు మంచుగడ్డ కాదు కదా! దీనిని తెలియుటయే అమృతత్త్వమును తెలియుట జీవప్రజ్ఞ మనస్సు ప్రాణమయకోశము-అను మూడును మూడు పదములు ఇట్టి మూడు పదములు లేక స్థితులు గుహాయందున్నవి అనగా తనయందు రహస్యముగా ఇమిడియున్నవి రహస్యముగా నుండుట యనగా మనకు కనుపించుచున్నను గమనింపలేకపోవుట, భౌతికశరీరము ఒక్కటియే పైకి కన్పించును మిగిలిన మూడు శరీరముల్లు పైకి కనుపించునవి కావు అనగా ఉన్నట్లు గమనించి తెలుసుకొనవలసినదే గాని కంటికి కనుపించునవి కావు నాల్గవ వాక్కుగా జీవుడు తన్న శరీరమును తానుచ్చరించును ఇదియే 'ప్రవోచే' అని చెప్పబడినది

అమృతత్త్వము నుండి బౌతికస్థితి వరకు సృష్టి వ్యక్తమగుటయే నాలుగు వాక్కులుగా చెప్పబడినది అందు "పరా" వాక్కు సమస్తము

తానుగా నుండు స్థితిని తెలియజేయును దేహము, ఇంద్రియములు మనస్సు బుద్ధి మున్నగునవి తననుండి వ్యక్తమగుటకు పూర్వము తనయందే కరగియుండును ఇది నీటియందు మంచుగడ్డ కరగియుండునట్టి స్థితి వంటిది అనగా మనస్సు, ఊహాలు, సంకల్పములు, బావములు అబిప్రాయములు, ఆవేశములు, అనుభవములు లేక కేవలము నేనుగా నున్నట్టి స్థితి అనగా వాటన్నిటికి ఆదారమైన మొట్టమొదటి స్థితి రెండవది ''పశ్యంతీ'' వాక్కు అని చెప్పబడినది ఇందు సంకల్పము మాత్రమే ఉండును అనగా తాను చేయదలచుకొన్న లేక చెప్పదలచుకున్న విషయమును గూర్చిన ఊహ దీనినే ఉద్దేశ్యము అనికూడ అందురు ఇది పరమాత్మయందు సృష్టి సంకల్పము అనుపేర వ్యక్తమగును సముద్రమునుండి కెరటము తాత్కాలికముగా వేరయినట్లు తననుండి తన సంకల్పము వేరుగా వచ్చును మరల అట్టి సంకల్పమునకు ఆదారము తానే అగును ఇక మూడవ స్థితి ''మద్యమావాక్కు'' సంకల్పములే ఊహ ననుసరించి మిగిలిన విషయములు అనగా భాష, మనసు, ఇంద్రియముల మున్నగువానిగా కట్టుకొనుచున్నవి తాను చెప్పదలుచుకున్న ఊహననుసరించి దానికి సంబందించిన వివరములు వాక్యములు తనకు తెలిసిన బాషలో తన మనస్సులో రూపు కట్టుకున్నట్లు పరమాత్మయందు సృష్టి సంకల్పముననుసరించి దాని దర్మములు, వాటికి సంబంధించి, వేరువేరు ప్రజ్ఞలు, వాటి ప్రవృత్తులు రూపు కట్టుకొనును మన దేహము, మనస్సు, ఐదు కర్మేంద్రియములు, ఐదు జ్ఞానేంద్రియములు మున్నగువాని లక్షణములుగా ఈమూడవస్థితి వ్యక్తమగును అయస్కాంత క్షేత్రము ఏర్పడిన తరువాత దానియందు అయస్కాంతము బౌతికముగా వ్యక్తమగునట్లు నాలుగవస్థితియైన 'వైఖరి వాక్కు పుట్టుటకు ముందు ఇది ఏర్పడినది ఈ మద్యమావాక్కు ననుసరించియే వైఖరీవాక్కు లేక మనము పైకి ఉచ్చరించు శబ్దము వెలువడుచున్నది అట్లే బౌతిక దేహానిర్మాణము బౌతికసృష్టి(Tangible creation) జరుగును ఇట్లు వైఖరీవాక్కునకు కారణమై మూడు వాక్కులను తనయందే లీనమై యుండును కనుక 'త్రీణిపదానిహితా గుహాసు'' అని చెప్పబడినది ఇట్టి నాలుగు స్థితులతోకూడిన సృష్టినిర్మాణమే బ్రహ్మయొక్క శరీరముగా పైనాలుగు

స్థితులు నాలుగు వాక్కులుగా బ్రహ్మయొక్క నాలుగు ముఖములుగా చెప్పబడినది

అట్లు జీవుడు తనను తానుచ్చరించుకొనుటయేగాక తననుండి తన కుమారునిగా తనను తాను ఉచ్చరించుకొనుచున్నాడు కనుక జీవుడు తండ్రియగుచున్నాడు అతడుచ్చరించునది తనయందలి పురుషునే కనుక కుమారుడుగా దిగివచ్చిన పురుష ప్రజ్ఞకు తాను తండ్రియగుచున్నాడు కనుకనే ''సవితుః పితాసత్'' అని చెప్పబడినది సవితుః అనగా సూర్యుడు అతడే జీవులయందు పురుషుడుగా నున్నాడు సవితుః అను శబ్దమునకు ప్రసవించుట అని యర్థము ఇక్కడ ప్రజాపతియని అర్థము ప్రజాపతి అనగా జీవసృష్టికి కారణమైనవాడు కనుక పరమాత్మ జీవసృష్టిని సంకల్పించి జీవుడుగా దిగిరాగా, అట్టి జీవుడు తనయందలి పరమాత్మయను పురుషప్రజ్ఞనే తనకుమారునిగా నుచ్చరించి మరల వానికి తండ్రియగుచున్నాడు

మంత్రము 2
సనోబన్ధుర్జనితాస విదాతా దామానివేద భువనానివిశ్వా|
యత్రదేవా అమృతమానశా నాస్తృతీయే దామాన్యధ్యైరయన్త॥

ప్రతిపదార్థము·

యత్ర= ఎవరివల్లనైతే

తృతీయే=మూడవ స్థానమందు

దేవాః= దేవతలు

అమృతమ్= మృతిలేని స్థితిని

ఆనశానాః= పొందినవాడు

దామాని= తమస్థానములను

అధ్యైరయన్త= పొందిరో (అటువంటి)

సః=అతడు

నః = మాకు

బంధుః= బంధించువాడు లేక చుట్టమువంటివాడు

జనితా= పుట్టించువాడు

సః= అతడు
విదాత= నియమించువాడు
విశ్వాభువనాని= లోకములన్నింటికి
దామాని= స్థానములను
వేద= తెలిసియున్నాడు

**తాత్పర్యము :**

ఎవరివలన (ఎచట) దేవతలు మూడవస్థితియందు అమృతము అను మూడవలోకమును తమ స్థానమును పొందిరో అట్టి వేనుడు అను గంధర్వుడు మాకొరకు బంధువై మరియు బందించుచున్నవాడై పుట్టుకకు కారకుడై, సమస్తమును నియమించువాడై విశ్వమునందలి లోకముల స్థానములు తెలిసినవాడై యున్నాడు

**వివరణ:**

బంధుః అను పదమునకు బందించువాడు అని అర్థము 'బద్నాతి ప్రీతిమితి బంధుః' అని చెప్పబడినది ప్రీతిచేత బందించువాడు బందువు పరమాత్మ ఈ సృష్టినంతనూ తన ప్రేమచేత బందించి నిలిపి యుంచినాడు కనుకనే ఈ సృష్టి సమస్తమునకును ఆయనయే బంధువు మరియు జీవుల యుత్పత్తికి ఆయనయే కారణము గనుక ప్రతి జీవికినీ మొట్టమొదటి బందువు ఆయనయే కదా! ఇట్టి సంప్రదాయము ననుసరించియే పరమాత్మను తన వానిగా చూచి ఆరాదించు సంప్రదాయమేర్పడినది తండ్రిగా, అన్నగా, కుమారునిగా, భర్తగా వివిద బాంధవ్యములతో ఆయన నారాధించి ఆయనయందు ఐక్యమై, అంతేకాక మనము మన బందువులను మన బందువులుగా చూచువారి యందును సహితము ఆయనయే యున్నాడు ఆయన వలననే జీవులకొకరియందొకరికి ప్రేమ ఏర్పడుచున్నది దీనిని గమనించినవారికి సృష్టియందలి సమస్తజీవులును బందువులే యగుచున్నారు

'జనితా' యనగా పుట్టించువాడని అర్థము ప్రతి జీవికిని పుట్టుటకు కారణము కావలెను కారణము లేనిదే ఎవరికిని జన్మరాదు ఈ జన్మలో పేదరికముచే బాదపడువాడు దనమును గూర్చిన కోరికచే మరుసటి

జన్మమునందు దనవంతుడై పుట్టును అట్లే పదవిని గూర్చియు, అదికారము గూర్చియు రకరకములైన తీర్చుకొనలేని వ్యామోహములచే బాదపడువారు మరుసటి జన్మమునందు వారి కోరికలు నెరవేరు జన్మల నెత్తుదురు దనము లేనివారికి అదియొక్కటియే సమస్యయైనచో ధనమున్నవారికి అదితప్ప మిగిలినవన్నియు అంతకు మించిన సమస్యలే అట్టి సమస్యలతో విసిగి వేసారిన వారు ఇట్టి సమస్యలు లేని జీవితమును కోరుదురు అందుచే పేదవారై జన్మింతురు ఇటుల కొన్ని జన్మల తరువాత సమస్యలు దనముండుట, లేకుండుట వలన గాక ఆయా పరిస్థితులయందు సమన్వయము చెందగలుగు సామర్థ్యము తనకుండవలెనని గ్రహించి అట్టి సాదన చేయుదురు దానినే యోగసాదన అందురు ఇట్లు జీవుల పుట్టుకకు కారణములు కల్పించి దానికి తగిన జన్మమునిచ్చువాడు నారాయణుడు

అతడు విదాత యనగా నియమించువాడు ఈసృష్టి యందు ఎవరెచ్చట పుట్టవలెనో మరియు యుండవలెనో నియమించువాడు పరమాత్మయే మరియు వారి కార్యక్రమములను యనగా జీవిత ప్రణాళికలను తానే నిర్ణయించును ఇట్లు ఒకరి జీవిత ప్రణాళికల వలన మరియొకరికి కర్తవ్యములేర్పడు చుండగా ఇందరి ప్రణాళికలను నియమించువాడు నారాయణుడు ఆయన వలన ఈ విశ్వములకు లేక లోకములకు దామములు లేక స్థానములేర్పడుచున్నవి మూడు లోకములు, ఏడులోకములు మున్నగులోకముల వరుసను నియమించి ఈ విశ్వమునందు వాటి వాటి స్థానములనేర్పరిచినవాడు నారాయణుడే అన్నిలోకములకు కారణమైన అమృతత్వము అనబడు స్థితిని దేవతలకు లోకముగా కల్పించి వారచ్చటనుండి పనిచేయునట్లు నియమించెను అట్టి అమృతత్వమే మూడవస్థితిగా చెప్పబడినది మొదటిది బూలోకము అనగా బౌతికసృష్టి రెండవది శక్తిమయలోకము మూడవది దేవలోకము ఇట్టి ఈ దేవలోకమునందుండి పనిచేయుచున్న దేవతలు సృష్టి ప్రారంబమునుండి చివరవరకు మృత్యువులేని స్థితిలోనుండి లోకములను పాలించుచున్నారు ఈ దేవతలను నియమించువాడు నారాయణుడే

## మంత్రము 3

పరిద్యావా పృదివీయన్తి సద్యః పరిలోకాన్పరిదశః పరిసువః
ఋతస్య తన్తుంవితతం విచృత్య తదపశ్య తద బవత్ప్రజాసు ||

## ప్రతిపదార్థము

సద్యః = తక్షణమే
ద్యావా = ద్యులోకము లేక వెలుగుల లోకము
పృదివీ = భౌతికలోకము
పరియన్తి = పొందుచున్నారు
లోకాన్ = లోకములను
సువః = సువర్లోకము
పరి (యన్తి) = పొందుచున్నారు
ఋతస్య = ఋతము యొక్క
తంతుం = తంతువును
వితతం = విస్తీర్ణముగా
విచృత్య = సంపూర్ణముగా భావించి
తత్ = ఆ పరమాత్మనే
అపశ్యత్ = చూచును (చూడగలుగును)
సః = అతడు
సద్యః = వెంటనే, తక్షణమే

## తాత్పర్యము

(ఆదేవతలు) భూమ్యాకాశములను తక్షణమే పొందుచున్నారు అన్ని లోకములకు వ్యాపించు చున్నారు దిక్కులుగా నేర్పడుచున్నారు సువర్గము అనులోకమును పొందుచున్నారు ఋతము లేక సత్యము అను స్థితిలో వ్యక్తమై పరమాత్మ అట్టి తన యొక్క తంతువుచే లేక దారముచే విశాలముగా (ఈసృష్టిని) బహిర్గతము చేసి దానినే జీవులుగా చూచెను మరియుతానే ఆది అయ్యెను 'ద్యావాపృదివీ అనగా దేవతలలోకము మరియు భూలోకము ఈ దేవతల లోకమునే వెలుగులలోకము అందురు It is called the plane of awakening of first self awareness అనగా తనకు తానున్నానని తెలియు మొట్టమొదటి స్థితి అట్టి స్థితినే వెలుగులలోకము

అందురు అటువంటి స్థితిని మనలో మేలుకొలుపు ప్రజ్ఞనే ఉషస్సు అందురు ఈమెనే దేవతల తల్లియైన అదితిగా సంకేతించిరి అట్టి దేవలోకమునుండి, మిగిలినలోకములు పుట్టగా చిట్టచివరిదైన బౌతిక పదార్ధము (matter) పృదివి అని సంకేతింపబడినది ఇట్లు దేవతల లోకమునుండి బౌతికలోకము వరకు గల లోకములన్నియు తక్షణమే అనగా పరమాత్మ సంకల్పించిన క్షణముననే సంబవించుచున్నవి (దీనికి ముందు శ్లోకమునందు) దేవతలు అమృతము అనబడు మూడవలోకమునుండి సృష్టిలో తమ తమ స్థానములు పొందియున్నారని చెప్పబడినది అనగా వారు సృష్టియందున్నను, సృష్టిని అంటక నిలచియున్నారని అర్థము అట్టివారు దేవలోకమునుండి బౌతికలోకమువరకు తమ తమ స్థానములలోనుండి పని చేయుచున్నారు (The law of creation assumed their respective positions which extend from the plane of Light, Magnetism, Electricity etc to Dense matter)మరియు యిచ్చట ద్రవ్యలోకమనగా (ద్యావా) అణువునందలి కేంద్రగత స్థానము (nucleus) ఈ అణుకేంద్రము ప్రజ్ఞామయలోకములందుండగా దానిచుట్టును గల electronsమున్నగునవి శక్తిమయ జగత్తునకు సంబంధించియున్నవి They belong to the plane of energies వీటి సముదాయముచే నేర్పడు అణువు (atom) మరికొన్ని అణువులతో చేరి molecule అను మొట్టమొదటి కణముగా నేర్పడుచున్నది ఇట్టి కణమే బౌతికద్రవ్యము

ఇట్లే మానవ దేహము కూడా నేర్పడుచున్నది జీవాత్మ కేంద్రముగా మనస్సు బుద్ధి దానిచుట్టు పొరలుగా నుండగా చిట్టచివరి పొరగ భౌతిక దేహముకలదు మానవ దేహమునందు జీవాత్మ అదృశ్యముగా పనిచేయుచున్నట్లు అణువునందు అణుగతమైన nucleus పని చేయుచున్నది దీనినే Theosophical గ్రంధముల యందు Monad అను పదముతో సంకేతించిరి Monad అనుపదమునకు Unit అని అర్థము దీనినే మనము జీవప్రజ్ఞ అని వ్యవహరింపవచ్చును అట్టి జీవప్రజ్ఞయే మనువు అని పురాణములయందు చెప్పబడినది ఇట్టి మనువుండు లోకము, మనస్సు అనులోకము మనస్సనగా సృష్టి యందలి ప్రణాళికను, దర్మములను తన యందు కలిగి యున్నట్టిస్థితి మఱ్ఱి విత్తనములో మఱ్ఱిచెట్టు యొక్క ప్రణాళిక అంతర్లీనముగా నున్నదికదా! లేనిచో మఱ్ఱి గింజనుండి అదే వృక్షము ఎట్లు వచ్చును? ఇట్టు సృష్టి ప్రణాళికను తనయందిముడ్చుకొని యున్న ఈలోకమునే మనస్సని చెప్పెదురు ఇట్టి

మనస్సునకు అది పనిచేయుచున్న స్థితిని బట్టి దానిచుట్టూ ఒక ఆవరణము లేక కవచము ఏర్పడును (Ring pass not) ఈ ఆవరణ అణువునకును ద్రవ్య కణమునకును, జీవకణమునకును (Biological cell), వృక్షములకును, జంతువులకును, అట్లే మానవులకును మాత్రమే గాక భూమికిని, సూర్యునకును తుదకు విశ్వమునకును కలదు కనుకనే అట్టి ఆవరణము ఇచ్చట పరి అను శబ్దముచే సూచింపబడినది ఇట్టి లోకములన్నియు తక్షణమే ఏర్పడుచున్నవి

అట్టి సృష్టి ప్రణాళిక యంతయు ఋతువు అనుతంతువులచే అల్లబడి యున్నది ఋతమనగా పరమాత్మ వ్యక్తమగుచున్న మొట్టమొదటి వెలుగు లేక కిరణము ఇదియే తరువాత ఋక్కుగాను, వాక్కుగాను అయినది ఋతము అనగా అంతర్యామి సృష్టికి కారణమైన మొదటి వెలుగు అట్టి వెలుగునే ఋక్కు అందురు అట్టి ఋతమనబడు తంతువు లేక దారముచే ఈ సృష్టి మొత్తము అల్లబడియున్నది అట్లు అల్లబడిన అల్లిక మిక్కిలి విస్తారముగ అన్నిలోకములకు వ్యాపించినది ఇట్లు విశేషముగా అల్లబడుటయే వితతం అను శబ్దముచే సూచింపబడినది

మరియు ఋతస్య తంతుం అనుటలో ఇంకొక అర్థముకూడ వున్నది తంతువునకు అల్లికలేక ప్రణాళిక అను అర్థము కలదు 'సూత్రేమణిగణాయివ అని గీతలో చెప్పినారు హారములో సూత్రంగావున్నది continued consciousness "పరిధి యందు పనిచేసే మనసుగా కాకుండా లోపల పనిచేసే నేను అనేప్రజ్ఞగ వుంటున్నాను ఇది ఒక జన్మనుండి ఇంకొక జన్మకు కొనసాగవలెను దానినే సూత్రము అన్నారు దానినే తంతువు అన్నారు ఇట్లు దారముగా ఏర్పడిన ఇది అన్ని జన్మలకు continue అవుతున్నది దీన్నే ఆత్మ అన్నారు ఈ జన్మలో సాధించినది మరుజన్మలో సాధించవలసినది record అయివుంటుంది చెట్టు నుండి గింజ మళ్ళీనాటినప్పుడు, ఏంచెయ్యాలో దానికి తెలుసు ఇట్లు చెట్టునుండి గింజలోనికి వచ్చు ప్రజ్ఞయే మరల చెట్టుగా మొలచును అట్లే ఒక జన్మనుండి మరియొక జన్మలోనికి జీవప్రజ్ఞ కొనసాగుచుండును ప్రతివానికిని ఆత్మగతముగా తానెవరో, ఎందుకు పుట్టెనో, తానెట్టి జన్మసంస్కారములుపొందవలసి యున్నదో, క్రిందటి జన్మలో ఎటువంటి సంస్కారములు పొందియుండెనో అనునవి చెట్టునుండి గింజవలె జన్మనుండి జన్మకు ఆత్మగతముగా దిగి వచ్చుచుండును ఇవియే స్వభావములు, గుణములు అను పేర తెలియబడును ఒక వ్యక్తి యొక్క

స్వభావమును బట్టి క్రిందటి జన్మ ఎట్లుండెనో ఈ జన్మలో ఎటువంటి సంస్కారములు పొందగలడో చెప్పవచ్చును Alice A Bailey రచించిన Rays and initiations అను గ్రంథము చదివిన వారికి వీనిని గూర్చిన కొన్ని వివరములు తెలియును జాతక చక్రము శ్రద్ధగా పరిశీలించినచో ఇట్టి విషయములు సవిస్తరముగా తెలియవచ్చును

జీవప్రజ్ఞ ఒక జన్మనుండి మరియొక జన్మవలె, ఒక స్థితినుండి మరియొక స్థితికి కొనసాగుచుండును అణువులనుండి గింజలోనికి, గింజనుండి జంతువులోనికి, జంతువునుండి మానవ ప్రజ్ఞలోనికి ఈ జీవప్రజ్ఞ కొనసాగుచుండును అట్లు కొనసాగుచున్నపుడు ఒక్కొక్క జన్మనుండి మరియొక జన్మలోనికి పోవుచున్నపుడు ప్రజ్ఞ విస్తారము చెందుచుండును అంతేకాక అణువు అను స్థితినుండి కణము (Biological cell)అనుస్థితిలోనికి వచ్చుసరికి ప్రజ్ఞ మరికొంత విస్తారత చెందును ఇట్లు ఒక్కొక్క స్థితినుండి మరియొక స్థితిలోనికి పోవునరికి విస్తారత పెరుగుటయేకాక ఆత్మ బహిర్గతమగుచుండును విచృత్య అను పదమునకు బహిర్గతమగుట అని అర్థము అంతర్లీనముగా నున్న ప్రజ్ఞ క్రమేణా బహిర్గతమగుచున్న కొలది ఇంద్రియములు, మనస్సు మున్నగు ఉపకరణములను సంపాదించుకొనును ఈ ఉపకరణముల ద్వారా బాహ్యప్రపంచముతో సంబంధ మేర్పరుచుకొనును అట్లు ఏర్పరుచుకొనుట వలన క్రమేణా ఆత్మవికాసము ప్రారంభమగును ఇట్టి ఆత్మవికాసము అంతర్యామి యందు లయమగువరకు కొనసాగును

అట్టి ఋతమే తరువాత సృష్టి ప్రణాళికగా జీవసృష్టిలోనికి దిగివచ్చినది వృక్షములయందు, జంతువులయందు, మానవులయందు, భౌతిక రూపమును కల్పించుటకు కారణమిదియే అయినది అనగా దీవినలననే జీవుల మధ్య ఆకర్షణ, కామము అను పేర నేర్పడి తద్వారా భౌతిక దేహములు కల్పింపబడినవి ఇట్టి భౌతిక దేహములకు కారణమైన శుక్రమును, రేతస్సు అని కూడా అందురు అనగా ఋతము అను శబ్దమునకు భౌతిక వికృతిగా రేతః అనుస్థితి పుట్టినది కనుకనే అట్టి ఋతము ప్రజాపతులను మొట్ట మొదటగా కల్పించినది ఈ ప్రజాపతులు గర్భదారణకు, సంతానమున కధిపతులైన దేవతలు అనగా పరమాత్మ జీవులకు దేహమును కల్పించుట, దానివలన జీవులొకరి నొకరు చూచుకొనుట, మాట్లాడుట మున్నగునవి ప్రారంభమయ్యెను

## మంత్రము 4

పరీత్యలోకాన్పరీత్య భూతాని పరీత్య సర్వాః ప్రదిశోదిశశ్చ ।
ప్రజాపతిః ప్రథమజా ఋతస్యా త్మనాత్మా నమభి సంబభూవ ॥

## ప్రతిపదార్థము

ఋతస్య = ఋతము యొక్క, వెలుగు యొక్క
ప్రథమజా = మొట్టమొదట పుట్టినవాడు
ప్రజాపతి = సృష్టికర్త
లోకాన్ = లోకములను
పరీత్య = వ్యాపించి
భూతానీ = పంచభూతములను
పరీత్య = వ్యాపించి
ప్రదిశః = దిక్కులకు కారణమయి నట్టివానిని
దిశశ్చ = దిక్కులను
సర్వాః = అన్నింటిని
ఆత్మనా = తనచేత
ఆత్మానాం = ఆత్మ స్వరూపులగు జీవులను
అభిసంబభూవ = అయ్యెను

## తాత్పర్యము

పరమాత్మ యొక్క వెలుగుచే మొట్టమొదట పుట్టిన ప్రజాపతి లోకములన్నింటి యందు వ్యాపించి (సృష్టించి) పంచభూతములను సృష్టించి, దిక్కులకు కారణమయిన వెలుగులను(దిక్పాలకులను) మరియు దిక్కులన్నింటిని సృష్టించి జీవులందరి యందు తానను వెలుగుగా వ్యాపించెను

## వివరణ

పరమాత్మ నుండి పుట్టిన మొదటి వెలుగు బ్రహ్మ అతడే ప్రజాపతి ఆయన అంతర్యామియైన నారాయణుని నుండి వెలువడిన మొట్టమొదటి కిరణము అప్పటివరకు ఆనందమను ఒక్కటే వెలుగుగా నున్న స్థితినుండి తానను తెలివి వేరుగా పుట్టినది ఇతడే బ్రహ్మ ఈ పుట్టుట ఎట్టిదనగ

నీటినుండి మంచుగడ్డ పుట్టినట్లు సముద్రము నందు కెరటము పుట్టినట్లు ఈయన సమస్తసృష్టిని సంకల్పించెను అనగా నేను ఎవరు ? ఎచ్చటనున్నాను ? నాచుట్టు ఏమిఉన్నది ? మొదలగు బావములు పుట్టినవి అనగా ఆనందమను స్తితినుండి పతనమయిన స్థితి బావములులేక మనస్సు అట్టి మనస్సునందలి బావములుగా సమస్తలోకములు బ్రహ్మాయొక్క సంకల్పములుగా దిగి వచ్చినవి అయితే ఇది నారాయణుని సంకల్పము కనుక బ్రహ్మాకు పతనము లేదు బ్రహ్మానుండి ఇట్టి బావములు పుట్టుచుండగా అవి వేరు వేరు లోకములుగా సిద్ధించెను అట్లే పంచబూతములు కూడా పుట్టెను ఇంకను దిక్కులకు అదిపతుల (కారణము)యిన ఇంద్రుడు, యముడు, వరుణుడు, కుబేరుడు మున్నగు దిక్పాలకులందరు పుట్టిరి ఇందు ఇంద్రియముల కదిపతియైన ఇంద్రుడు తూర్పు దిక్కును పరిపాలించెను బౌతికమయిన వెలుగుకు కారణమైన అగ్ని ఆగ్నేయమును పరిపాలించెను జననము, మృత్యువు అను రెండు సంమటనలచే జీవులను శిక్షించి అదుపులో పెట్టి నియమించుచున్న యముడు దక్షిణ దిక్కున కదిపతి నిర్రృతి అను పేరుతో అణువుల యందు పనిచేయుచున్న శక్తి నైరుతి దిక్కున కదిపతి ఆవరించుట లేక వ్యాపించుట అను లక్షణముల కదిపతి యైన వరుణుడు పడమటి దిక్కునకదిపతి సంకోచ వ్యాకోచములు, తరంగములుగా చలించుట మున్నగు ప్రవృత్తులు గలిగిన వాయువు వాయువ్యదిశకు అదిపతి జీవులయందు ఉత్తమ సంస్కారములు కల్పించుటకు కారణమయిన కుబేరుడు ఉత్తర దిక్కున కదిపతి మానవునియందు దైవత్వమును మేలుకొల్పగలిగిన, బృగుమద్యమునకు అదిపతియైన ఈశానుడు ఈశాన్యదిశ కదిపతి ఇట్లు దిక్కులకు కారణములైన వెలుగులు మొట్ట మొదట బ్రహ్మాయందు వాని యూహాలుగా మేలుకొనగా బౌతికమయిన చోటు పుట్టిన వెనుక అవియే దిక్కులయ్యెను మరియు ఈబ్రహ్మాయే జీవులుగా దిగి వచ్చెను అనగా జీవులయందు తానున్నానని తనకు జ్ఞాపకమున్నంత కాలము సృష్టి లక్షణము వానియందు పని చేయుచుండును ఇది తొలగి పోవలెనన్నచో పైన చెప్పబడిన సమస్తమును నారాయణుని స్వరూపముగా తెలుసుకొని వాని యందే జీవించి యుండవలెను అట్టివాడు బ్రహ్మాలోకమును దాటి నారాయణలోకమునందు ప్రవేశింప కలుగును

ఇచ్చట లోకము అనగా తానున్నట్టి స్థితియే తానెట్టి స్థితియందుండునో ఆలోకమునందు తానుండును కాని ఇది బ్రహ్మా

యందు పనిచేయదు ఎందులకనగా బ్రహ్మ నారాయణుని యనుజ్ఞచే సృష్టిలోకములలోనికి దిగి వచ్చెను గనుక ఆయన లోకములందున్నను దాని కతీతుడైన నారాయణుని యందుండును

## మంత్రము 5

సదసస్పతి మద్భుతం ప్రియమిన్ద్రస్యకామ్యమ్।
సనింమేదామయా సిషమ్॥

## ప్రతిపదార్థము

అద్భుతం = ఆశ్చర్యము కలిగించునట్టి వానిని
ఇంద్రస్య = ఇంద్రునకు
ప్రియం = ప్రియమైన వానిని (నారాయణుడు)
కామ్యమ్ = కోరదగినట్టి (మనలో కోరికగానున్నట్టి) వాడు
సనిం = సత్తునకు అదిపతియైన వాడును
మేదాం = మేదస్సుగా నున్నట్టి వానిని
సదసస్పతిం = అవ్యక్తమైన స్థితికి అదిపతి అయినవానిని
అయాసిషమ్ = పొందితిని

## తాత్పర్యము

ఇంద్రునకు ప్రియమైనట్టివాడును, అద్భుతమైనట్టి వాడును, (జీవులచే) కోరదగినట్టివాడును మరియు సమస్తమును ఇచ్చువాడును, (మనయందు) మేదస్సుగా నున్నట్టివాడును, సత్తు అనుస్థితికి అదిపతియైనట్టి వాడును, అట్టివానిని నేను పొందదగియున్నాను (లేక పొందుచున్నాను)

## వివరణ

అద్భుతము అనగా ఆశ్చర్యము కలిగించునటువంటిది మనస్సు పనిచేయుట ఆగిపోయినపుడు అద్భుతం అనే పదము ఉపయోగబడుతుంది అంటే మనస్సునకు అందనటువంటి స్థితి ఆశ్చర్యవత్ పశ్చతికశ్చిత్' అని బగవద్గీతలో వచ్చును అంటే ఒక్కొక్కడు ఆశ్చర్యంగా చూస్తున్నాడట ఇంకొకడు ఆశ్చర్యంగా వినుచున్నాడుట ఇక్కడ చూడటం అంటే మనము దేని ద్వారా చూచుచున్నాము ? కంటి ద్వారా చూచుచున్నాము కాని, కన్ను మాత్రమే చూడటానికి ఉపయోగపడేది అనేది సత్యము అయితే కన్నులోని

బాగములు (Retina, Optic nerve, Eye ball) బాగుగనే యున్ననూ కొం
చూపు కనిపించదు వైద్యుడు కారణము తెలియదనును బహుశ Optic
paralyse అయివుండవచ్చుననును అనగా వైద్యునకు కారణం తెలిం
లేదు అని అర్థము వైరులో current రావటం ఆగిపోతే fan తిర
మానేస్తుంది మెకానిజములో తేడా ఉండకపోవచ్చు దానిలో ఉ
ప్రాణశక్తి తాత్కాలికంగా లోపిస్తుంది మనకు మనము దేని
మాట్లాడగలుగుచున్నామో తెలియదు మనసులోని బావవ
వాక్కులుగా వచ్చుట అందరికీ తెలియుచున్నది బావాలకు వాక్కు
మద్య ఏమి జరుగుతోందో ఎవరికి తెలియదు వినికిడి కూడా అంతే
శబ్దములను బాషలోనికి మార్చే (interpret) ప్రజ్ఞ ఒకటి మ
పనిచేయుచున్నది జంతువులకు బోదపడనిది మనకు బోదపడుచున
చూచుట కూడ అంతే ఒక మానవుడు ఒక దున్నపోతు ఉన్నచోట న
కట్టలుపెట్టినచో మానవుడు చూచును దున్నపోతు కూడా చూచ
దున్నపోతు పట్టించుకొనదు మనకి మాత్రము దానిని గురించి చ
ఆసక్తి యుండును చూచుట అనునది ఇద్దరిలోను సమానమే ఈచూచ
వినుట, శ్వాసించుట మనలో ఎట్లు జరుగుచున్నవో ఎవరికీ తెలియ
అందుకే అద్భుతము అనుపదమును ఉపయోగించినారు ఎక్కడం
మనస్సు పనిచేయుట ఆగిపోవునో ఆస్థితిలో (అంతర్యామి) యుండ
ఆయననే 'ఇంద్రః అన్నారు మనలోని పంచేంద్రియములకు అది
ఇంద్రుడు ఇతడు జీవాత్మకు, బౌతిక ప్రపంచమునకు మద్య అనుసంధ
కర్తగా పనిచేయుచున్నాడు అటువంటి ఇంద్రుడు చేయు పనులన్నిం
అశ్చర్యకరముగా నుండును కన్నులు ఎట్లు చూచుచున్నవో, చెవులె
వినుచున్నవో, శ్వాసెట్లు శ్వాసించుచున్నదో, తీసుకున్న ఆహారము ఎ
అరగింపబడుచున్నదో ఎవరికీ తెలియదు మనలో జరుగుచున్న
ప్రక్రియలకు మనకు సంబంధముండుట లేదు కనుకనే ' ఆశ్చర్య
పశ్యతి ' అన్నారు మన ఊహకు, calculation కు perceptionకు పరమా
అందేవాడు కాదు ఇంద్రునకు నారాయణుడనిన యిష్టము అనగా మన
ఇష్టము అనే లక్షణముగా పని చేయువాడు

ఇచ్చట నారాయణుని ద్యానము చేయుపద్ధతి చెప్పబడు చున్న
ఆయన ఇంద్రునికి ప్రియమైనవాడు శరీరమందలి ఇంద్రియము
మనకిష్టమైన వాటికొరకు పనిచేయును మనకు ఇష్టమయిన వస్తువ
తిందుము ఇష్టముకాని వస్తువును తినలేము మన పంచేంద్రి

ప్రవృత్తుల వెనుక ఇష్టం అనునది పనిచేయుచున్నది దానినే ప్రియం అని అందురు ఈ ప్రియమైనటువంటిది అంతర్యామి యొక్క ఆస్తిత్వం ఈ అంతర్యామి ప్రియమైన వస్తువులందు ఇష్టంగా, మనయందు పనిచేసి, మనచేత బౌతిక ప్రవృత్తులందు ప్రవర్తించేటట్లు ఏర్పాటు చేయును మనకు ఇష్టం ఏర్పడుట చేత మాత్రమే పనులు చేయగలము లేనిచో పనులు చేయలేము నావాళ్ళు అనుకోబట్టే బార్యాబిడ్డల కోసము పనిచేస్తాం ఆఇష్టం ఎట్లు వచ్చిందో తెలియదు అది ఊహకు అందనిది కనుకనే అది అద్భుతము ఇంద్రుడు మనయందు ప్రియం అనేటటువంటిదిగా పనిచేయుచున్నాడు అదేనారాయణుడుగా చెప్పబడుచున్నది మనలో ప్రియమైన స్థితిగా చెప్పబడేటటువంటి వాడు అతడే కామ్యమ్ అంటే మనకు సంబందించని కోరిక కోరుట అనుస్థితి సృష్టి అంతటికి సంబందించిన కర్మ ఒకటివున్నది దానిని సృష్టికర్మ అంటారు సృష్టికర్మ individualised అయినపుడు వ్యక్తి కర్మగా పనిచేయును వ్యక్తిగత కర్మ, సృష్టికర్మ రెండూ ఒకటే గోదావరిలోకి వెళ్ళి ఒకచెంబుడు నీళ్ళు ఇవతలకు తీసుకున్నచో, గోదావరి లోనినీరు, చెంబులోని నీరు ఒకటి అయినట్లు, మనింట్లోకి తెచ్చుకున్నతర్వాత నీరు ఒకటి అయినా మన చెంబులో వుండటము చేత మన నీరు అవుతున్నది అంతర్యామి అయిన పరమాత్మ వ్యక్తులలో పని చేయుట మొదలుపెట్టి వ్యక్తిగతమైన కోరికలుగా, ఇష్టంగా వ్యక్తమైనపుడు అక్కడ వ్యక్తుల వాసన వుంటుంది దాని వలన సత్త్వము, రజస్సు తమస్సు అను త్రిగుణములు పనిచేయటం చేత ఒక దూమము ఏర్పడుతుంది అది త్రిగుణములు పంచేంద్రియములలో పనిచేయటము చేత ఏర్పడిన మలినంవంటిది ఒక మిషను పనిచేస్తున్నపుడు మడ్డిపడుతుంది ఈ మడ్డి పని వలన పుట్టింది అదే మిషన్‌ను వాడకుండా అలానే వుంచితే మడ్డి పట్టే ప్రసక్తి లేదు అది వాడితేనే మడ్డిపడుతుంది అంటే అది function నకు సంబందించినది అట్లే సృష్టి జరుగుచున్నపుడు సృష్టి లోనికి పరమాత్మ దిగివచ్చినపుడు, జీవుడుగా వ్యక్తమైనపుడు, త్రిగుణములందు జీవిగా వర్తిస్తున్నపుడు ఆత్రిగుణముల తాలూకు ఫలితము ఆయనయందు, ఈ జీవులందు పనిచేయును దానినే మలినము అన్నారు అవేత్రిగుణములుగా తెలియుచున్నవి (తమస్సు రజస్సు మొదలగునవి) మడ్డి పట్టకుండా మిషను పనిచేయటము కుదరదు అది శుభ్రము చేయకుంటే function కుదరదు అదే మనంచేయు సాదన పనిమాత్రం చేయకుండా మానలేము చేయుదుము

ఎంతవేదాంతం చెప్పినా ఆకలేస్తే తినకుండా మానలేంకదా! అలాగే ఇది మనకు సంబంధించినది గాదు పైనుండి ఇవన్నీ పని చేయుచున్నవి ఆకలి శరీరము నిలబడటానికి అవసరమైనది అదిలేనిచో శరీరము పడిపోవును కనుక భగవంతుడు ఆకలి అనునది పెట్టెను ఆకలి వలన శరీరమునిలబడి ఉండును అందుకే ఆకలిని గౌరవించాలి నిరసించగూడదు అంటే ఎక్కువ తినమని అర్థముకాదు ట్రాఫిక్ పోలీసును గౌరవించాలి అంటే కనబడి నప్పుడల్లా ఆగిపోయి మాట్లాడుతూ కూర్చోమనికాదు, ట్రాఫిక్ రూల్సు జాగ్రత్తగా follow అవమని అర్థము అలాగని ఎదురు తిరిగితే అతడు పట్టుకుంటాడు అట్లే ఆకలిని గౌరవించడమంటే వేళకు ఆహారము తీసుకొనడము, వేళకు నిద్రపోవడము మొదలగునవి చేయటం మిషన్ పనిచేస్తున్నపుడు కొంతమలినం వచ్చినట్టు శరీరంలో వస్తే దానిని disease లేదా జబ్బు అన్నారు Master D K గారు Esoteric Healing అనే పుస్తకములో origin of tissues and their cure మీద అద్భుతమైన వివరణ ఇచ్చారు దానిలో causes of disease ఇచ్చారు అందరుcause of of disease అంటే infection అనుకుంటారు అది చాలా పొరపాటు దోమలవల్ల మురికి వస్తోంది అనుకొనుట ఎంత సత్యమో bacteria వలన జబ్బు వచ్చు చున్నది అనుకొనుట కూడా అంతే సత్యము శరీరములోని functioning affect అయితే by product గా ఈ జబ్బు result అవుతుంది ఇది ఎవరి కర్తవ్యాచరణ వారు చేసేటప్పుడు ఆకర్తవ్యంతో identityఅయి చేసే దానిపై ఆదారపడి ఉంటుంది

Bank లోని క్యాషియరు ఎవరి బ్యాంకు అకౌంటులోని డబ్బునివారు అడిగినంత ఇవ్వగలడు డబ్బు ఎక్కువ Draw చేసినవానికి ఒక గౌరవం, తక్కువ Draw చేసినవానికి ఒక గౌరవం ఇవ్వబడదు 10 వేలు draw చేసినా ఒక్కరూపాయి draw చేసినా అతనికి ఒక్కటే మన Daily life లో కూడ అదే జరుగుతుంది పనులు మనద్వారా జరుగుతున్నపుడు వాటిలో మనం కష్టమయిన పనులు చేయవచ్చు ఇష్టం, కష్టం అనేవి మనము ఏర్పరుచుకున్నవే ఒకడిని 10 రూపాయలు అడిగితే ఇవ్వలేదంటే మనకు కోపము వస్తుంది వాడికి కుదరలేదేమో ఇవ్వలేదు ఏంఉంది అందులో అంటాడు అది సత్యం అడగటము, ఇవ్వకపోవటము సత్యము మద్యలో కోపం రావటము మనము తెచ్చిపెట్టుకున్నది That is called diseaseఅంటే జబ్బు అనునది మనలో By product గా వస్తుంది

సనిం అంటే కావలసిన వరములను ఇచ్చేటటువంటివాడు మేఘములకు అదిపతి యైన ఇంద్రుడు జీవులలో కోరికలు తీరుస్తాడు చోటులో వుండే మేఘములకు అదిపతి ఇంద్రుడు మేఘముల వల్ల వర్షము, వర్షము ద్వారా పంటలు, పంటలద్వారా జీవులకు అవసరమైన ఆహారము మొదలగునవి లభ్యమగుచున్నవి ఆహారమును తీసుకొనిన జీవుడు తృప్తిని, సంతోషమును పొందుతున్నాడు ఈతృప్తి లేక సంతోషమువలన మనలో వికసించే పుష్పం -'ఆనందము ఈ ఆనందమునకే ఇంద్రుడు అదిపతి కనుకనే 'ప్రియమిన్ద్రస్య కామ్యమ్' ఆ విదముగా ఆయన వరములను, కోరికలను తీర్చే వాడుగా వున్నాడు

సనిం మేదామయాసిషమ్ ఇంకా కోరికలు తీర్చేవాడుగా ఆయననే మనం ఉపాసన చేయుచున్నాము అంటే మనకు కోరికలు ఏవిదముగా తీరినా మనకు అది తీరవలసిన అవసరమున్నపుడు మాత్రమే తీరుతాయి

మనలో ఉన్న మేదా శక్తిచేత మిగిలిన అన్ని Plans పరిపాలింపబడు చున్నవి మేదాశక్తి అనగా The plane of comprehension4 అంటే రుచి, శబ్దము మొదలగునవి తెలియబడే శక్తి ఆPlane ను మేదస్సు అంటారు తల్లికి బిడ్డ యందు ప్రేమ కలుగుతున్నది ఆ ప్రేమ హృదయం వలన కలుగును ఆ ప్రేమ గురించి తెలియడమే మేదస్సు అది intellectual planeలోనికి convert అయినపుడు మేదస్సు అంటాం Affections లోనికి convert అయినపుడు Heartఅంటాం ఒకస్థితి దాటినాకరెండూకలుస్తాయి ఆ కలసిన centre నే ఆజ్ఞా చక్రము అంటారు విడిపోయిన centre ను Heart centre, Throat Centre అంటారు ఈ కంఠబాగములోని కేంద్రములో pure knowledge వుంటుంది హృదయ క్షేత్రములో ప్రేమ వుంటుంది ఈ రెండూ కలసిన క్షేత్రము ఆజ్ఞా చక్రము అని అంటారు ఆ రెండిటికీ point of origin గా ఇది ఉంటుంది

మేదాశక్తి అంటే తెలివి తేటలు, విజ్ఞానము అనే అర్థంకాదు మేదాశక్తి అనగా Plane of Practical experience వంట ఎలాచేయాలో వాడికి తెలుసు అంటాం దాన్ని మేదస్సు అంటే విజ్ఞానమయ కోశము అంటారు అక్కడ మనిషికి జ్ఞానము, అనుబవము రెండూ (Knowledge and experience unite) కలిసి వుంటాయి అట్టి స్థితిని నేను పొందుదును గాక।

### మంత్రము 6

**ఉద్దీప్యశ్వ జాతవేదో పఘ్నన్నిర్ ఋతంమమ ॥**

## అనువాకము 5

### మంత్రము 1

**పశూ గ్శ్చ మహ్యమావహ జీవనంచ దిశోదిశ ॥**

### ప్రతిపదార్థము

జాతవేద = ఓ జాతవేదుడా

మమ = నాయొక్క

నిర్ ృతిం = పాపమును

అపఘ్నన్ = నశింపజేయుటకు

మహ్యం = నాకొరకు

ఉద్దీప్యశ్వ = చక్కగా ప్రకాశింపుము

పశూన్చ = పశువులను కూడ

ఆవహ = తీసికొని రమ్ము

జీవనం = జీవనమున

దిశః చ = దిశలను కూడ

దిశ = చూపుదువు గాక

### తాత్పర్యము

ఓ జాతవేదుడా । మాయందలి నిర్ృతి అను చీకటిని పోగొట్టుటకై ప్రకాశించుము మాకు జీవనమును మరియు పశువులను ఇమ్ము ఇంకా (మాచుట్టును) దిక్కులను చూపించుము

### వివరణ

జాత వేదుడు అనగా సూర్యుడు ఈ సూర్యుని వలన సృష్టియందలి జీవులకు జీవత్వము(Life impulse) ఏర్పడుచున్నది అనగా సూర్యుడు జీవించుటకు కావలసిన ప్రాణ శక్తి ఇచ్చువాడు ఈ ప్రాణశక్తి సూర్యునినుండి భూమికి, భూమినుండి మానవులకు చేరుచున్నది సూర్యునినుండి ప్రసరించు ప్రాణమయ తరంగములు (electro magnetic

waves) భూకేంద్రమును తాకుచున్నవి కొన్ని భూమి ఉత్తర ద్రువమునుండి దక్షిణ ద్రువమునకు ప్రయాణము చేయుచూ భూమికి పరిభ్రమణమును ఏర్పరచుచున్నవి అంతేగాక ఈ ప్రాణమయ తరంగములు భూమి చుట్టూ అయస్కాంత క్షేత్రమును ఏర్పరచుచున్నవి దాని వలన భూమిచుట్టు ఏర్పడిన అట్టి అయస్కాంత క్షేత్రము చోటు నందలి మహాశక్తిని కదలించి వాయువుగా మార్చుచున్నది దాని వలన భూమిచుట్టూ వాతావరణ మేర్పడి జీవశక్తి(vegitation or Biological life) వృక్షజాతి జంతు జాతులుగా మేల్కొనుచున్నది ఇట్టి ప్రాణ ప్రవృత్తులు మరియు జీవత్వము మేల్కొనుటకు సూర్యుడు కారణమగుచున్నాడు కనుక అట్టి సూర్యుడు తనలో ఊర్ధ్వ ముఖుడై (ఉత్ + దీప్యస్య) వెలుగుటచేత మనలో నిర్రృతి అను స్థితిని తొలగించుచున్నాడు నిర్రృతి అనగా సత్యమునకు దూరమగుట

ఆకాశమున వెలుగునట్టి సూర్యుడు మనలో జాతవేదుడుగా మేల్కొనుచున్నాడు అట్టి జాతవేదుని గుర్తింపులేని స్థితియే నిర్రృతి ఈ జాతవేదుని వలననే మనలో ప్రాణ ప్రవృత్తులు మేల్కొని ఆకలి దప్పులు కలిగి దానివలన శరీరము నిలచి యుండుటకు కారణమగుచున్నవి కనుకనే ఈజాతవేదుడు మనకు పశువులను ఇచ్చుచున్నాడు పశువులనగా ఇంద్రియములు మనలో ఇంద్రియ ప్రవృత్తులు (Sensation ) ప్రాణశక్తిపై(vitality) ఆదారపడి యున్నవి కనుక ఈ ప్రాణ శక్తి మనయందు మేల్కొనుట వలన ఇంద్రియములు ఏర్పడుచున్నవి పశువులనగా కిరణములని అర్థము సూర్యకిరణములకు గోవులని పేరు ఇట్టి ప్రాణశక్తి తన కిరణముల ద్వారా జీవులకు ప్రసరింపజేయు సూర్యుడినే రుద్రుడు అని వేదములలో కీర్తించినారు ఈ రుద్రునికి పశుపతి అని పేరు కూడా కలదు

ఈ సూర్యుని వలన మనకు దిశలేర్పడుచున్నవి సూర్యుడు జీవుల ంటి చూపుకు అదిపతిగా కూడ వున్నాడు కనుకనే జాతకములో సూర్యునికి కేంద్రవేధలు కలిగిన ఎడల దృష్టి దోషము ఏర్పడును

జాతవేదుడనగా వేదములు తనయందు పుట్టినవాడు అనగా అగ్ని ఆయనయే మనయందు మేల్కొన్న జీవప్రజ్ఞ (awakened consciousness) గా ని జేయుచున్నాడు వేదములు ఈ సృష్టికి కారణములయిన మహాసత్త్వములు అవియే ప్రకృతిలోనికి దర్మముగా దిగివచ్చినవి ఈ ృష్టి దర్మము (Creative principle) ననుసరించి సమస్త సృష్టియు గివచ్చినది ఇట్లు సృష్టియందు దాని దర్మముగా పనిచేయుచున్నవాడు

జాతవేదుడు వెలుగుట అను మొట్టమొదటి ధర్మముగా ఈయన చోటులో పుట్టి సూర్యునిగా భౌతిక సృష్టిగా మేల్కొనినాడు అట్టి సూర్యు ననుసరించి ప్రకృతియు అందలి దర్మములు ఏర్పడగా జీవులుగా పనిచేయుచున్నవాడు జాతవేదుడే

నిర్ఋతి యనగా ఋతమునకు విరుద్ధము అయినవాడు ఋతమనగా సృష్టి పుట్టుట, వికసించుట, జీవించుట మున్నగు అర్థములున్నవి నిర్ఋతి యనగా సృష్టిలయమగుట, మరణించుట, నశించుట అని అర్థములు అపఘ్నన్ అనగా సంహరించుట, పోగొట్టుట అని అర్థము జాత వేదుడు సృష్టి దర్మములను వికసింపజేయుట వలన అంతకుముందు లయమయి వున్న ప్రకృతిని మరల చీకటినుండి ఉద్ధరించి వెలుగులోనికి తెచ్చుచున్నాడు అనగా అవ్యక్తమునుండి వ్యక్త స్థితిలోనికి తెచ్చుచున్నాడు అగ్ని జాతవేదుడై సృష్టిని చీకటి కోణములనుండి ఉద్ధరించుచుండగా నిర్ఋతి వ్యక్తమైన స్థితిని మరల అవ్యక్తములోనికి లయము చేయుచుండును అట్లు నిర్ఋతిచే లయముచేయబడిన స్థితిని జాతవేదుడు మరల మరల వ్యక్త స్థితిలోనికి తెచ్చుచుండును భౌతిక సృష్టిలో సహితము నిర్ఋతి పాపమును, వ్యాదిని, మృత్యువును కలిగించుచుండగా జాతవేదుడు అట్టివారికి పుణ్యము, ఆరోగ్యము, జీవనము మున్నగునవి కలిగించుచుండును

**మంత్రములు 2, 3**

**మానో హిగ్ంసిజ్ఞాత వేదో గా మశ్వం పురుషం జగత్|**
**అబిభ్రదగ్న ఆగహి శ్రియామా పరిపాతయ||**

**ప్రతిపదార్థము**

జాతవేదః = ఓ జాతవేదుడా

నః = మాయొక్క

గాం = గోవులను

అశ్వం = అశ్వములను

పురుషం = పురుషులను

జగత్ = జగత్తును

మాహింసిత్ = హింసింపకుము

అగ్నే = ఓ అగ్ని

అబిభ్రత్ = దరింపని వాడవై (ఆపియుంచుకొననట్టి వాడవై)

ఆగహి = రమ్ము

మా = నన్ను

శ్రియా = దన దాన్యాది సంపద చేత

పరిపాతయ = అంతట పొందింపుము

## తాత్పర్యము

ఓ జాతవేదుడా ! మాయొక్క గోవులను, అశ్వములను, పురుషులను పుట్టించినట్టి జగత్తును హింసింపకుము సంపదచే మమ్ములను పాలింపుము ఈ సంపదలను నీయందు దాచి పెట్టని వాడవై రమ్ము

## వివరణ

జాతవేదుడనగా శరీరములో ఉన్న అగ్ని అని అర్థము I am ' (నేను) అని మనలో పనిచేయుచున్న వెలుగును కూడ జాతవేదుడని అందురు ఈయన పుట్టిన వారియందు మెలకువ (awareness) అను ప్రజ్ఞగా పనిచేయుచున్నాడు

ఇంతకు ముందు శ్లోకమున చక్కని జీవితమును, పశువులను, ఇంద్రియములను ఇవ్వవలయునని ప్రార్థించినారు ఈ శ్లోకమున అట్టి జీవితమును అనుబవించుటకు కావలసిన సంపదలను గురించి చెప్పబడుచున్నవి గాం అనగా ఆవులు అని మాత్రమే గాక కిరణములు, వెలుగు లేక విజ్ఞానము అను అర్థములు గూడ గలవు సూర్యుని వద్దనుండి వచ్చు వెలుగునకు విజ్ఞానమని అర్థము కలదు ఓ జాతవేదుడా అట్టి చక్కని విజ్ఞానమయమైన స్థితిని మాకు యివ్వవలసినది నీవద్దనుండి మాకు చక్కటి కిరణమయమైన వారది లేక వంతెనను నిర్మించుము, అని ప్రార్థన దీనినే మాష్టరు C V V గారు (Higher Bridge) అంతః కరణ శరీర నిర్మాణము అని చెప్పిరి

అంతఃకరణ శరీర నిర్మాణము వలన luminous body నిర్మాణమై మనకు పరమాత్మతో సూటియైన సంబందమేర్పడును ఆ క్షణం నుండి ఒక వెలుగు మన జీవితానికి దారిచూపును అట్టివాడు ఎట్టి పరిస్థితులలోను మొహమాటము లేకుండా పని చేయగలుగును సాదారణముగా చుట్టూవున్న వాతావరణము ద్వారా జీవి సంస్కారములపై గ్రహములు ప్రబావము చూపును నిజమునకు ఈ ప్రబావము వాతావరణమునకు,

అతనిలోనున్న సంస్కారములకు మధ్య కలిగిన సంఘర్షణయే తప్ప వేరుకాదు ఈ సంఘర్షణనే మనము గ్రహముల ప్రభావముగా గుర్తించుచున్నాను నిజమునకు గ్రహములకు వాతావరణముపై ప్రత్యేకమైన ప్రభావము ఏదీ వుండదు ఈ ప్రభావము మనస్సు ద్వారా ప్రసరించుట వలన కలిగినది మాత్రమే సూర్య కిరణములు సూటిగా భూమి మీద పడుటకు, ఒక గాజు పట్టకము ద్వారా పడుటకు గల తేడా వంటిదే యిది మనస్సుఅనే గాజు పట్టకం ద్వారా గ్రహముల ప్రభావము ప్రసరించునపుడు అవి మనస్సులో దాగి ఉన్న సంస్కారములను కదలించును ఆ సంస్కారములననుసరించి మానవుడు చూపే ప్రవర్తనము వలన భౌతిక జీవితములో ఫలితములేర్పడును అట్లు సంస్కార రూపమైన సంఘర్షణ మనస్సులో లేకుండ ఉండవలయునన్న ముందు చెప్పబడిన వెలుగే ఆధారము అట్టి వెలుగునే జాతవేదుడు అని అందురు జాత వేదుడు అనగా జీవులలో పనిచేయు విజ్ఞానము (వేదము) అను వెలుగు ఈ వెలుగు తమలో నున్న అంతర్యామి యొక్క స్పర్శగా వ్యక్తమై విజ్ఞానమను కాంతిగా బయటకు ప్రసరించును ఇదిగాఢాంధకారములో పాదచారియై నడచిపోవు ప్రయాణీకుని చేతిలోని కరదీపిక (Torch light)వంటిది ఇట్టి వెలుగు త్రోవ యెంత కావలయునో అంతయే చూపించును తాను ముందుకు అడుగు వేయుటకు సరిపడు వెలుగును మాత్రమే చూపించును అడుగు ముందుకు వేసిన గాని తరువాతి దారి కనిపించదు ఎట్టి యోగసాధకునికైనను ఇంతియే కర్తవ్యమును ఆచరించుచున్నకొలది తరువాత చేయవలసినది ఎప్పటికప్పుడు మనస్సులో స్ఫురించుచుండునే గాని మొత్తము ఒకేసారి కనిపించదు ఇట్లు మానవునికి ఎప్పటికప్పుడు తక్షణ కర్తవ్యముగా స్ఫురించునట్టి వెలుగు నిరంతరమై జీవితమంతయు ఆనందమను సూర్యకాంతిలోనికి నడిపించుకొని పోవును

ఈ జాతవేదుడను వెలుగు జీవుని లోపల నుండి పని చేయుచున్నాడు సూర్యుని నుండి ప్రసరించు విజ్ఞానమును స్వీకరించి మిగిలిన వారికి పంచిపెట్టు విధానమొకటి కలదు అదియే గవామయమైన యజ్ఞము లేక గోవుతోచేయు యజ్ఞము

అశ్వములను ఈయవలసినది అనగా ప్రాణశక్తిని ఈయవలయునని అర్థము వేద సంప్రదాయములో అశ్వము అను పదమును ప్రాణశక్తి అను అర్థములో ఉపయోగింపబడినది అశ్వమేధయాగము అనగా

గుఱ్ఱమును చంపి చేయు యాగము అను దురర్థము వున్నది దీనికే అశ్వములను పెంచి పోషించి చక్కగా సద్వినియోగము చేయుట అని మరియొక అర్థముగలదు అనగా తనయొక్క శరీరములోని ప్రాణశక్తి సరిగా పనిచేయునట్లుగాను, ప్రాణ ప్రవృత్తులకు తాను అడ్డు రాకుండవుండుట అని అర్థము చక్కగ ప్రాణమును దానిలోనున్న శక్తికి సద్వినియోగముచేసి ఆ ప్రాణశక్తి వలన మన శరీరమును, ఇంద్రియములను ప్రపంచమునకు ఉపయోగ పడునట్లు చేయవలయును ఇట్లు భగవంతుడు మనకు యిచ్చిన సంపదను సద్వినియోగము చేయ వలయును గాని సొంతము చేసికొనరాదు ఇచ్చట ప్రాణ ప్రవృత్తులనగా శరీరములో ఇంద్రియముల ద్వారా పనిచేయుశక్తులు మరియు శరీరము నిలబడి యుండుటకు పనిచేయు శక్తులు (Vital Pulsations) ఈ ప్రాణ ప్రవృత్తుల వలననే మన శరీరము లోని అన్ని భాగములు పనిచేయగలుగుచున్నవి అనగా గుండె కొట్టుకొనుట శ్వాసపీల్చుట మొదలగు అవయవ ప్రవృత్తులు అశ్వములనబడుచున్నవి వీనిని సక్రమముగా నడిపించుటకు తాను చేయు జీవన విదానమే ఒక యజ్ఞము ఇదియే భౌతికముగ గోవులను, అశ్వములను పెంచి పోషించి వానిని సేవించుచు, వాని సేవల వలన సద్వినియోగమొనర్చుట మొదలగునవి గవామయము, అశ్వమేదము అను పేర్ల వేదముల యందు చెప్పబడినది ఇట్టి అశ్వములను గోవులను హింసింపకుము అని ప్రార్థన చేయబడుచున్నది అనగా కోపము కలుగుటచే జ్ఞానము నశియించి ఎదుటి వారిపై రాగద్వేషములు చూపించుట, ఎదుటివారిని కష్టపెట్టుట, తాను కష్టపడుటయే గోవులను హింసించుట

దురభ్యాసములకు లోనై ఆరోగ్యము పాడుచేసికొనుట వలన శరీర భాగములు వ్యాది గ్రస్తమగుటయే అశ్వములను హింసించుట యగును వీనివలన జీవుడు లేక పురుషుడు హింసింపబడుచున్నాడు అట్టి హింస జరుగకుండవలయునన్నచో వానియందలి జాతవేదుడు చక్కగా తన వెలుగును ప్రసరింప జేయవలయును కనుక ఓ అగ్ని' అట్టి నీ వెలుగును దాచి యుంచకుము అని ప్రార్థించుచున్నారు జాతవేదుని వెలుగుచే భౌతిక సంపదతో పాటు జీవికి సంతృప్తి అను నిజమైన సంపదచేకూరును దాని వలన జీవుడు తరగిపోని సంపద కలవాడగుచున్నాడు

సృష్టి యందలి ఈ తరగిపోని సంపదయే శ్రియము అనుపేర పిలువబడుచున్నది ఈ అంశములే రుద్రసూక్త శ్రీసూక్తములలో ఈ విదముగా ప్రస్తావింపబడినది

"శివాంగిరిత్రతాంకురుమాహిగ్ంసిః
పురుషం జగత్" రుద్రసూక్తము

"తాం మ ఆవహ జాతవేదో లక్ష్మీ మనపగామినీం
యస్యాం హిరణ్యం విందేయం గామశ్వం పురుషానహం"
- శ్రీసూక్తము

## మంత్రము 4

ఓం పురుషస్య విద్మ సహస్రాక్షస్య మహాదేవస్య దీమహి తన్నో రుద్రః ప్రచోదయాత్॥

## ప్రతిపదార్థము

పురుషస్య = పురుషుని

విద్మ = తెలుసుకొనుచున్నాము

సహస్రాక్షస్య = అనేక నేత్రములు కలిగినటువంటి వానిగా

మహాదేవస్య = మహాదేవునిగా

దీమహి = ద్యానము చేయుదుముగాక

తత్ + రుద్ర = ఆరుద్రుడు

నః = మమ్ములను

ప్రచోదయాత్ = ప్రేరేపించుగాక

## తాత్పర్యము

ఈ సృష్టి సంపద (మా ఇంద్రియములు మున్నగునవి) పురుషునివిగా (పరమాత్మవిగా) తెలుసుకొనుచున్నాము (ఇవి) అనేకవేల కన్నులు గల మహాదేవునిగా ద్యానము చేయుదుము గాక। ఆ రుద్రుడు మమ్ములను ప్రేరేపించును గాక।

## వివరణ

ఈ మంత్రము గాయత్రిని ధ్యానము చేయు మంత్రములలో నొకటి మొత్తము 12 గాయత్రి మంత్రములు ఇచ్చట వివరింపబడుచున్నవి ఈ 12 మంత్రములు 12గురు విశ్వేదేవతలను స్తోత్రము చేయునట్టివి వీనిని ధ్యానము చేయుట వలన, అనగా చోటునందు పనిచేయుచున్న మహాశక్తులను (cosmic energies and forces) లేక దేవతలను ద్యానము చేయుటవలన వారు మనయందు మేల్కొనుదురు ఇన్ని శక్తులకు మూలకారణమయిన ఒకే శక్తి అన్ని శక్తులకును అదారముగా మరియు కారణముగా పనిచేయుచున్నది అట్టి ఒకేశక్తి మహాజలములుగా ప్రవహించుచుండగా అట్టి జలములను కాలువలుగా తీసి మనము ఉపయోగించుకొనునట్లు వేరువేరు శక్తులుగా (ప్రకృతి) ఉపయోగ పడుచున్నది అట్టి ఒకేశక్తిని 'నారాయణుడు' అందురు నారములనగా జలములు, అట్టి జలములే తనమార్గముగా గలవాడు ఇది జ్ఞావకముండనిచో ద్యానము చేయుట వ్యర్థమే యగును వీరందరిని అనగా ఇకముందు చెప్పబడు రుద్రుడు, గరుడుడు, షణ్ముఖుడు మున్నగు దేవతలందరు వేరువేరు శక్తులుగా భ్రమ పడువాడు చెట్టునందలి కొమ్మలను, ఆకులను, కాయలను, పండ్లను, గింజలను ఒకదానికొకటి సంబంధము లేనట్టివిగా భ్రమపడి, ఇవియన్నియు కలిపినచో చెట్టు అగుననియు, ఇవి చెట్టుఅను ఒక మహాస్వరూపమందలి బిన్నరూపములే ననియు, వీటి కన్నింటికిని గల సంబంధములే మనము చెట్టుగా గమనించుచున్నామనియు తెలియు సత్యమును విస్మరించిన వాడగును నిజమునకు నారాయణుడను ఒకమహాస్వరూపమందలి వేరువేరు రూపములే ఈ దేవతలనియు, వీరందరి సమాహారమైన ఒకే శక్తినే మనము నారాయణుడని పిలుచుచున్నామని తెలిసికొనవలెను

ఈ 12మంది దేవతలను విశ్వమునందును, మన శరీరమునందును ద్యానము చేసికొని ఒకదానికొకటి సమన్వయము చేసికొను విధానము వివరింపబడుచున్నది

ఈ మొదటి గాయత్రి మంత్రమునందు, గాయత్రి రుద్రుడను శక్తిగా ఉపాసింపబడుచున్నది ఇచ్చట పురుషుడనగా పురమునందున్న వాడని అర్థము అనగా జీవిగా నున్న పరమాత్మ అంతర్యామిగా సమస్త జగత్తునందు విస్తరించియున్న, పరమాత్మ ఒకచోట బిందువుగా లేక

కేంద్రముగా మేలుకొనుచున్నాడు ఇది ఎట్టిదనగా ఒకతెల్లని కాగితముపై ఒక బిందువును గుర్తుపెట్టినచో అంతవరకు ఒకటిగానున్న కాగితము నందలి తెల్లని స్థలము, బిందువును గుర్తుపెట్టుట వలన, బిందువు, దానిచుట్టునున్న కాగితము అనిరెండగుచున్నవి బిందువు గుర్తుపెట్టుటకు పూర్వము అచట బిందువు అన్నది లేదా యనినచో బిందువుకూడ చోటులోని బాగముగా ఉన్నది ఆ బిందువుచుట్టు ఒక వృత్తము గీసినచో ఒక్కటిగా నున్న స్థలము ఇపుడు వృత్తములోపలి స్థలము, వృత్తము వెలుపలి స్థలములుగా ఏర్పడుచున్నవి ఇవి నిజమునకు రెండు కావు కానీ రెండుగా నున్నట్లు అన్పించును అటులనే జీవిగానే మేల్కొన్న పరమాత్మకు, జీవిగా నున్నంతకాలము సమస్తముగా నున్న తనకు, తాను కేవలము శరీరము గానే నున్నట్లు, మిగిలిన ప్రపంచమంతయు తననుంచి వేరుగానున్నట్లు అనిపించును ఇదియే పరమాత్మ జీవునిగా మేల్కొనుట అనగా పరమాత్మగా నుండుట మాని జీవునిగా పుట్టుచున్నాడు కనుకనే బాగవతమున ప్రదమస్కంధమునందు శ్రీకృష్ణుని నిర్యాణము చెప్పబడినది అట్లు చనిపోయినట్లుగా చెప్పెడు పరమాత్మ మరల దశమస్కందమునందు శ్రీకృష్ణుని జననము, వాని దివ్యలీలా విశేషములు వర్ణింపబడుట ద్వారా మరల పుట్టుచున్నట్లు వర్ణింపబడినాడు ఇదియే 10 అనబడు సంఖ్యయందలి అవతారతత్వము కృతయుగము నందు నాలుగు పాదములు (Four periods) త్రేతాయుగమునందు మూడు పాదములు, ద్వాపరయుగమునందలి రెండు పాదములు, కలియుగము నందలి ఒకపాదము కలిసి మొత్తము 10 పాదములు (ten periods) అగును ఇవియే 10 అంగుళములుగా పురుషసూక్తమునందు చెప్పబడినవి 'అత్యతిష్ట ద్దశాంగుళమ్' ఈ పది, జీవి పరమాత్మగా నెదుగుటలో పొందునట్టివి ఒకటి (1) నుండి ప్రారంబమైన అంకెలు 9 తరువాత, మరల 1 వచ్చి, పూర్ణముతో కలిసి 10గానేర్పడుచున్నవి ఒకటి పుట్టుటకుముందు 'సున్న కలదుకదా। దీనినే పూర్ణమందురు ఈ పూర్ణము సృష్టిప్రారంబము కాక ముందున్న స్థితిని లేక పరబ్రహ్మమును సూచించును ఒకటి (1)జీవుని సూచించును చివరగల 10 సంఖ్య పరమాత్మగా పునరుత్థానము చెందిన జీవుని సూచించును కనుక ఇచ్చట పురుషుడనగా జీవిగానున్న పరమాత్మ అతడు దేహదారిగా నున్నపుడు దేహిగానే నుండును

వానికున్న సృష్టించుశక్తి వాని దేహమునకే పరిమితమై వుండును కనుకనే జీవికి ఇంద్రియము లేర్పడుట, అవయవములు మున్నగునవేర్పడుట, అవి పెరుగుచుండుట జరుగుచుండును (ఇవియే ముందు శ్లోకములో వర్ణింపబడినవి)

అట్లు జీవిగా నున్న పరమాత్మను ద్యానము చేయవలెనన్నచో తన ఇంద్రియములను, అవయవములను తనవిగా కాక తనయందలి పురుషునివిగా ద్యానము చేయవలెను వానివలన తనకు ఇంద్రియములు, శరీరబాగములు ఏర్పడుచున్నవని తెలియును అట్లే మనస్సు, బుద్ధి మున్నగునవి వాని ప్రబావములే అతడే తనయందు శ్వాసగా మేల్కొని శరీరము రక్షించుచున్నాడు ఇదియే పురుషునిగా తెలియుట ' పురుషస్య విద్మహే' అనగా అర్థమిదియే కనుక పురుషునిగా తెలియుట అనగా పురుషుడు తానేయని తెలియుట తన దేహముగను, ఇంద్రియాదులుగను తానేయున్నాడు ఇది తెలియుట ఊహ చేత గాక అనుబవము చేతయని తెలియవలెను

సంగీతము వినవలెననుకొనుట, దానినిగూర్చి ఊహించుట వేరు, సంగీతము వినుట వేరు సంగీతమువినుట అనుబవమునకు సంబందించినది అట్లే పురుషుని తెలియుట అనుబవముగా నుండవలెను కాని అట్టి అనుబవమునకు సహితము మొదట కొంత యూహ కల్గుట ఆవశ్యకము ఎట్లైనను అది తెలియుటయే యగును అట్టి దేహమునందు మనస్సు, బుద్ధి, ఇంద్రియములు మున్నగు వేరువేరు శక్తులు పనిచేయుచున్నవి ఇవియే రుద్రుని శక్తులు అవి తనయందే తనవలననే పనిచేయుచున్నవని తెలిసినవాడు రుద్రుడగును ఇట్టి రుద్రశక్తులు తనయందు మేల్కొని పనిచేయుచున్నవి ఇట్లు మేల్కొనుచున్న శక్తులను గమనింపవలెను అనగా ఎట్లు మేలుకొనుచున్నవో చూడవలెను ఇట్లు శరీరమునందు అంతర్యామి మేల్కొనుటను గూర్చి ఉపాసన చేయుటయే గాయత్రి ఉపాసన ఇది చోటునందలి సూర్యుడు ఉదయించుటతో అనుసంధానము చేయుటవలన రుద్రాత్మకుడైన సూర్యుడు మనయందు మేల్కొనును సూర్యోదయము వలన చోటునందు ప్రాణశక్తులు మేల్కొనుచున్నవి అనగా సూర్యుడే జీవుల యందు ప్రాణశక్తిని మేల్కొలిపి ప్రకృతిని జీవవంతము చేయుచున్నాడు ఇట్లు ప్రకృతియందు పనిచేయుచున్న శక్తులు సహితము రుద్రశక్తులని పిలువబడినవి అట్టి రుద్రశక్తులుండులోకము అంతరిక్షలోకమని చెప్పబడినది ఇట్లు

అంతరిక్షలోకములందు పనిచేయుచున్న రుద్రుడు సూర్యుడై మమ్ములను మేలుకొలుపును గాక

అట్టి రుద్రుడు సహస్రాక్షుడనియు, మహాదేవుడనియు మనము ద్యానము చేయుచున్నాము సహస్రాక్షుడనగా వేయి కన్నులు కలవాడు, అనగా ఇంద్రుడు ఇచ్చట వేయికన్నులనగా వేల కన్నులని అర్థము జీవుల రూపమున సమస్తము తానే చూచుచున్నాడు కనుక సూర్యుడు సహస్రాక్షుడు సూర్యుడు అనేక అక్షములు లేక కిరణములు కలవాడు జీవులలోని చూపునకు సూర్యుడదిపతి సూర్యుని వలన చూచుటయను శక్తి మనలో పనిచేయుచున్నది జ్యోతిష శాస్త్రమున చూపునకు సూర్యుడు అదిపతిగా చెప్పబడినాడు సకల జీవులకు చూచుటయను శక్తిని కలిగించుచున్నాడు కనుక సూర్యుడు సహస్రాక్షుడు సహస్రారము అనగా శిరస్సునందు పనిచేయుచున్న ప్రజ్ఞామయకేంద్రము చోటునందు అనందముగానున్న పరమాత్మను బౌతిక దేహమునందలి పరిమితత్వము లోనికి బందించు ద్వారమిది ఈ సహస్రారము ఏజీవి యందు మేల్కొనునో అతడు సహస్రాక్షుడు మహాదేవుడనగా అందరి కన్నా గొప్పదేవుడు లేక, ఈ దేవతలందరు ఎవరినుండి పుట్టిరో అతడు మహాదేవుడు సహస్రారమను వెలుగు అన్ని కేంద్రముల వెలుగులకు సమానమైనట్టిది మరియు అట్టి వెలుగులను తనలో ఇముడ్చుకొని తానొక్కటే వెలుగుగా వ్యక్తీకరణమగును దేవతలనగా వెలుగులు మహాదేవుడనగా సమస్తమునకు కారణమైన మహత్తు అను పెద్దవెలుగు అట్టి మహాదేవుని ద్యానించుచున్నాము

## మంత్రము 5

**ఓం తత్పురుషాయ విద్మహే మహాదేవాయ దీమహి।**
**తన్నోరుద్రః ప్రచోదయాత్॥**

## ప్రతిపదార్థము

తత్ + పురుషాయ = ఆ పురుషుని (కొరకు) గూర్చి

విద్మహే = తెలుసుకొందుము గాక।

మహాదేవాయ = మహాదేవుని గూర్చి

దీమహి = ద్యానము చేయుదుము గాక।

తత్ = ఆ

రుద్రః = రుద్రుడు

నః = మమ్ములను
ప్రచోదయాత్ = ప్రేరేపించును గాక

## తాత్పర్యము

మేము ఆ పరమ పురుషుని గూర్చి తెలుసు కొందుము గాక। మహాత్తునకు అదిపతి అయిన దేవుని ద్యానింతుము గాక। అట్టి రుద్రుడు మమ్ములను ప్రేరేపించును గాక।

## వివరణ

ఇంతకు ముందరి శ్లోకమున యిచ్చిన వివరణయే దీనికినీ వర్తించును

## మంత్రము 6

**తత్పురుషాయ విద్మహే వక్రతుణ్డాయ దీమహి।**
**తన్నో దన్తి ప్రచోదయాత్।**

## అర్థము

వక్రతుండాయ = వంకరయైన తొండము కలిగినట్టి వానిని గూర్చి

దన్తి - దంతము గలవాడు (వినాయకుడు)

(మిగిలిన పదములకు పై శ్లోకములయందు ఇచ్చిన అర్థము అన్వయము)

## తాత్పర్యము

వంకరయైనట్టి తొండము గల్గిన వానిని దారణ చేయుచున్నాము అట్టి పురుషుని తెలుసుకొనుచున్నాము అట్టి దంతము గల్గిన దేవుడు మమ్ములను ప్రేరేపించును గాక।

## వివరణ

వినాయకునకు వక్రతుండము గల స్వామియనియు, దంతియనియు పేర్లు కలవు వినాయకుని రూపము విచిత్రమైన గొప్ప సంకేతము కలిగినట్టిది ఏపనులు ప్రారంబించుటకైననూ, చివరకు పూజలకైనను మొట్టమొదట ఈ దేవుని ద్యానింపవలెనని అనాదిగా నియమము గలదు దానికి కారణము తెలుసుకొనవలయునన్నచో మొదట వినాయకుడన నెవరో తెలుసుకొనవలయును విఘ్నేశ్వరునకు ఏనుగు శిరస్సునందు వలె పొడుగైన తొండము, ముక్కు, చాటలంత చెవులు, పెద్ద బొజ్జ వుండి

మరుగుజ్జు రూపము నుండును ఇట్టి వినాయకుని రూపము ద్యానము చేయవలయునన్నచో దీని సంకేతము గమనింపవలయును

అన్ని మంత్రములకు మూలమైన మంత్రము లేక బీజము 'ఓం కారము ఇట్టి ఓం కారము సుదీర్ఘముగా ఉచ్చరింపవలెను ద్యానమునకు కూర్చున్నపుడు కనులు మూసుకుని సుదీర్ఘముగా ఓం కారము ఉచ్చరింపవలయును ఇట్టి ఉచ్చారణ శ్వాసకు జత చేయవలయును అనగా 'ఓం కారము నెమ్మదిగా దీర్ఘముగా ఉచ్చరించుచూ, శ్వాసను తీసుకొనుచు వదలుచుండవలెను మొదట మానసికముగా ఓంకారమును ఉచ్చరించుచు శ్వాస లోనికి తీసుకొనవలయును ఇది ప్రశాంతముగా నెమ్మదిగా చేయవలయును అట్లు చేయుటలో శరీరమునకు, మనస్సునకు, ఊపిరితిత్తులకు శ్రమ కలుగకుండ చూసుకొనవలయును అనగా తానెంత పీల్చగలుగునో అంతవరకే శ్వాస పీల్చవలయును అదికముగా పీల్చుటకు శ్రమపడరాదు అట్లే శ్వాస బయటికి వదలునప్పుడు ఓంకారము పైకి ఉచ్చరించుచు నెమ్మదిగా శ్వాస వదలవలయును ఇట్లు పైకి ఉచ్చరించుచున్నపుడు తానుచ్చరించు శబ్దమును తాను వినుచుండ వలయును ఇదియే ఓంకారమును ద్యానము చేయుట ఇట్టి ఓంకారము యొక్క బౌతిక రూపమే విఘ్నేశ్వరుడు శ్వాసను సుదీర్ఘముగా నుచ్చరించుటకు సూచనయే పొడుగాటి తొండము శ్వాసను వినుటకు సంకేతమే పెద్ద చెవులు సంస్కృతమున ఓంకారము అను అక్షరము యొక్క రూపమే విఘ్నేశ్వరుని శరీర రూపముగా చిత్రింపబడినది ఓంకారమునుచ్చరింపనిదే మరియు దారణ చేయనిదే ఎట్టి మంత్రములు, ద్యానములు, పూజలు మరియు ఎట్టి కార్యములు పలవంతము కావు అట్టి ఓంకారమును దారణ చేసి ద్యానము చేయవలయును

## మంత్రము 7

తత్పురుషాయ విద్మహే చక్రతుణ్డాయ దీమహి।
తన్నో నన్దిః ప్రచోదయాత్।

## ప్రతిపదార్థము

చక్రతుణ్డాయ = చక్రాకారము గల తుండము (గంగడోలు) గలవానిని
నన్దిః = నంది

## తాత్పర్యము

చక్రాకారము గల గంగడోలు లేక మెడ కలిగినటువంటివాడు నంది ఆయనను మేము దారణ చేసి తెలుసుకొనుచున్నాము ఆయన మమ్ములను ప్రేరేపించును గాక।

## వివరణ

చక్రాకారమైన మెడ, ముఖము కల్గినది వృషభము ఈ వృషభము శివుని వాహనమైన నంది శివుడు ఈ వృషభము నెక్కి ప్రయాణము చేయును ఈ శివుడే ముందు శ్లోకమునందు మహాదేవుడు లేక మహత్తు అను పేరుగల ఆకాశమునందలి ప్రాణశక్తిగా అనగా రుద్రుడుగా చెప్పబడినాడు ఈ రుద్రుడను ప్రాణశక్తియే ఓంకారమను శబ్దముగా ఉచ్చరింపబడుచున్నది అట్టి ఉచ్చారణ బౌతికముగా వ్యక్తమగుట గొంతు, నోరు మున్నగు వానివలన జరుగును

హృదయమునుండి బయలుదేరిన సంకల్పము నాదరూపమున వ్యక్తమై మరల వినువానిద్వారా వాని హృదయమును చేరి అందు లయమగుచున్నది అనగా ఎచటినుండి ప్రారంబమైనదో అచటికే చేరుచున్నది ఇదియే చక్రాకారమైన మార్గము వృషభము పురుషశక్తికి అనగా సంతాన శక్తికి సంకేతము ఇది సృష్టియందు తండ్రి నుండి కుమారుడుగా వచ్చి మరల అతడు తండ్రియగుటగా సంకేతింపబడెను ఇట్టి వృత్తాకారమైన మార్గమునకు వృషభము సంకేతము రాశి చక్రమున రెండవ రాశి వృషభము ఇది ముఖము మెడలకు సంకేతము

నంది అనగా ఆనందము కలిగించువాడు అని అర్థము ఈ నంది శివుని వాహనము అనగా పరమాత్మ అనందము ద్వారా జీవులయందు వర్తించునని అర్థము ఇంకనూ వృషభము వాక్కునకు, ఉచ్చారణకు సంకేతము కనుక మానవుడు సంబాషణ, వ్యవహారము మున్నగువాని చేత ఆనందము పొందునని అర్థము

మన బారతదేశమునందే కాక ఇతర దేశముల పురాణములలో కూడ జంతువులు వృక్షములు పూజింపబడుట కలదు గ్రీకు, ఈజిప్షియన్ పురాణములలో వరాహము మకరము, వృషభము, హంస, శునకము, నక్క, గ్రద్ద, పాము, పద్మము, కలువలు మున్నగునవి అర్చింపబడిన విషయము ఆయా దేశ పురాణములను గమనించినచో తేట తెల్లమగును ఈజిప్షియను బాషయందలి కొన్ని విషయములు ఇంకనూ శాస్త్రజ్ఞులకు

అందలేదనుట తేట తెల్లము రాశి చక్రము, తారల సమూహములు (constellations)మున్నగు వాటిని గూర్చిన అవగాహనతో బాటు యుగముల లెక్కలు, ఆద్యాత్మిక సంఖ్యా శాస్త్రము (Spiritual numerology) మరియూ రేఖాగణితము (Geometry) వారికి చక్కగా తెలుసునను విషయము పిరమిడ్స్, వాటి నిర్మాణము యందలి కొలతలు, లెక్కలు పరిశీలించిన వారికి తెలియును పిరమిడ్స్ లోపలనున్న రహస్యమార్గములు, లోపలి గదులు గమనించినచో అవి యోగవిద్యయందు కొన్ని దశలు దాటిన వెనుక కొన్ని రహస్య విషయములను ద్యానముచేయుటకు కావలసిన పద్ధతిలో నిర్మించిన ద్యానమందిరములని గుప్తవిద్యను, అందలి రహస్యములను అధ్యయనము చేసిన వారికి మాత్రమే తెలియును

అసమగ్రములైన నేటి శాస్త్రజ్ఞుల లెక్కల ప్రకారము అట్టి యోగవిద్య మూడు నాలుగువేల సంవత్సరముల పూర్వమే ప్రబలముగా నున్నదని తెలియుచున్నది ప్రపంచమునందలిఅతి ప్రాచీన ఖండములైన ఆసియా ఐరోపా మరియు అమెరికా ఖండములయందు ఇట్టి నాగరికతతో కూడిన ఆద్యాత్మిక ఆరాదనా మార్గము లన్నియూ, వీటిని అప్పటి వారికి బోదించి అనుష్ఠింపచేసినవారు ఈ సృష్టిరహస్యములు సమస్తము తెలిసిన విజ్ఞానవేత్తలు, గురువులు అనియూ ఈ భూమిపై ఎవరెచ్చట ఉపదేశము పొంది అనుష్ఠించుచున్ననూ, అది వీరివద్దనుండి మాత్రమే పొందబడినదనియూ తెలియుచున్నది కాలక్రమేణా ఆచార వ్యవహారములలోను, బాషా సంప్రదాయములందు, మార్పులేర్పడిననూ, ముఖ్యాంశము లట్లే యున్నవి కాని దురదృష్టవశమున చాలాచోట్ల అట్టి మార్గముల ఆచరణీయత తొలగిపోయి, ఆడంబరములు, మూడాచారములు, అక్కరలేని పట్టుదలలూ మిగిలి పోయినవి మన దేశమునందు సహితము ఇట్టి వేదాంత ప్రతిపాదికమయిన అవగాహన నశించి, ఆచారభేదములు, సిద్ధాంత బేదములు దేవుళ్ళను గూర్చిన కలహములు పెరిగి పోయినవి వృషభము దాదాపు అన్ని సాంప్రదాయములయందునూ మనకు కనిపించును ఈజిప్షియన్ సంప్రదాయమునందు ఏపిస్ (Apis) అనుపేర వృషభము పూజింపబడినది దీనినే హాపి (Hopi) అనికూడ అందురు ఈ వృషభము చంద్రకిరణములనుండి పుట్టినదనియు ప్థా (Ptah) అను దేవునకు వాహనమనియు ఆయన భార్య శక్మెట్ అనునామె (శక్తిమాత) అనియూ ఆమెకు సింహపు శిరస్సుండుననియూ వర్ణింపబడినది ఈమెనే మనము

దుర్గామాతయనియు, పరమేశ్వరి యనియు ఆరాదించుచున్నాము ఈ వృషబము బీజశక్తికి, పంటలు పండుటకు సంకేతము అంతేగాక వీరికి ఇంకొక సంప్రదాయము కూడ కలదు నల్లని వృషబము ముఖమున త్రికోణాకారపు తెల్లని మచ్చ గలిగి తోక చివర రెండుగా చీలినట్లున్న వృషబం వీరికి ప్రత్యేకముగా పూజనీయమైనది అటువంటి వృషబమును వెదకి పెంచి పోషించి 27నం నిండిన తరువాత 28నం న చక్కగా ఊరేగించి ఒక క్రతుకాండ జరిపి దానియందు ఆవృషబమును బలియిత్తురు తరువాత దానికి మరల పూజలుచేసి దహనము చేయుదురు అపుడు మరల అట్టి వృషబము కొరకు అన్వేషణ కొనసాగింతురు

వృషబము చంద్రకిరణముల నుండి దిగివచ్చెనని చెప్పుటలో చంద్రుడు జీవోత్పత్తికి, పాడి పంటలకు (Fertilisation and Germination) అదిపతి అనియు అనగా పితృదేవతలు (Lords of Reproduction and Fertilisation) చంద్రుని ద్వారా పనిచేయుదురనియు, వృషబము బీజశక్తికి, పితృదేవతలకు సంకేత మనియు కనుకనే Apis అన్న వృషబము చంద్రకిరణములనుండి భూమికి దిగివచ్చినదనియు చెప్పబడినది మన భారతీయ పురాణములందు, వేదములందు ఇవే విషయములు ప్రతిపాదింపబడినవి 27 నక్షత్రముల విబాగము చాంద్రమానము ననుసరించి ఏర్పడినది అందు సూర్యుడు చరించుటకు ఒక సంవత్సరము పట్టును ఈ 27 నక్షత్రములందు సూర్యుడు చరించుటను గూర్చియే 27 నం తరువాత అసిరిస్ అనబడు సూర్యదేవత మరణించుననియు, అతడు పైలోకములందు జీవించియే యుండుననియు చెప్పబడెను ఈ అసిరిస్ అను ఈజిప్షియన్ దేవుని యొక్క సంకేతము వృషబమే అంతే కాక వేదములలో కొన్ని ఋక్కులయందు సూర్యుడు వృషబరూపుడుగా లేక వృషబవాహనుడైన రుద్రుడుగా వర్ణింపబడెను మరల కొత్త సంవత్సరము ప్రారంబమయిన పిదప సూర్యుడు కొత్తగా ఉదయించుట అను క్రతుకాండకు సంబందించిన ఒక విచిత్ర యజ్ఞ విదానమునందలి బాగమే ఈ వృషబమును వదించుట ఇదియొక పొడుపు కద వంటిది ఇటువంటి రహస్యము అర్థము కానివారు నిజముగ జంతువులను బలి యిచ్చెదరు కాని నిజమునకు బలి పెట్టవలసినది తనలోని జంతు ప్రవృత్తియైన కామమునే కాని వృషబమును కాదు కామవాసనలేని దాంపత్య దర్మమును అందలి రహస్యములను అన్ని దేశములవారితోబాటు బారతీయులుకూడా పోగొట్టుకొనిరనుట తేటతెల్లమే కదా ! గ్రీకు

సంప్రదాయమునందు సహితము ఈ వృషభము మిక్కిలి ప్రాధాన్యము వహించును Taurus (వృషభము) అను పదము గ్రీకు పదమే రాశి చక్రభాగమును పాశ్చాత్యులలో ప్రాచీనులయిన గ్రీకులు పోగొట్టుకొనక పక్కగా అట్టిపెట్టుకొనిరి వారి పురాణములందు రాశి చక్రమును గూర్చియు, నక్షత్రమండలము గూర్చియు, వారి యోగ రహస్యములను తెలియచేయు అనేక చిత్రవిచిత్రములైన కథలున్నవి

ప్రతి కథయును యోగాభ్యాసము నందలి కొన్ని రహస్యములను బోధించును జ్యోతిర్వేదము (spiritual Astrology) తెలిసిన వారికి మన పురాణములందలి కొన్ని జ్యోతిశ్శాస్త్రరహస్యములు అనేకములు గ్రీకు పురాణములయందు విస్తృతముగా కనిపించును దీనినిబట్టి కొన్నివేల సంవత్సరములకు పూర్వమే నేటి శాస్త్రజ్ఞులకు అంతుపట్టని ఖగోళశాస్త్రవిషయము దాదాపు అన్నిదేశముల వారికి తెలియునని తెలియుచున్నది ఈ వృషభమును గూర్చి గ్రీకు పురాణముల యందొక కథకలదు క్రీటు(crete) దేశము రాజగు 'మినోస్' (Minos) భార్య ఒక తెల్లని వృషభమునుచూచి ప్రేమించి వ్యామోహమున పడెను ఆమెకు, ఆ వృషభమునకు మినోటోర్ (Minotaur) అను ఎద్దు ముఖము కలిగిన, రాక్షసుడు పుట్టెను

మినోస్ రాజు అతని యందలి పుత్రవ్యామోహముచే ఒక చిక్కుదారులు కల రహస్య గృహమున అతనిని దాచియుంచెను దాని లోపలకు వెళ్ళుటయేకాని బయటకు వచ్చు విధానమెవ్వరికిని తెలియదు వానికాహారముగా అనుదినము ఏడుగురు యువకులను, ఏడుగురు యువతులను పంపుచుండెడివాడు ప్రజలందరు తమపిల్లలను వంతుల ప్రకారము పంపునట్లు శాసనము చేసెను "పెరిష్యూస్' (Pereseus) అను నొక యోధుడు ఈ అన్యాయమును గమనించి రాజుతో నీకుమారుని కూడ ఏలపంపవు అని అడుగగా అతడు రాజకుమారుడు గనుక వానికి శాసనము వర్తింపదని మినోస్ బదులు చెప్పెను అతడు ఏడుగురు యువకులలో తానొకడుగా వారితో కలసి బయలుదేరెను మినోస్ రాజకుమార్తె పెరిష్యూస్‌ను చూచి, అతనిని ప్రేమించి తన ప్రేమకు సూచకముగా అతను ఆచిక్కు గృహమునుండి బయటకు వచ్చు సులువు కొరకు అతనికొక దారపు వుండనిచ్చెను నీవులోనికి ప్రవేశించునపుడు ప్రవేశ ద్వారమునకు దీనిని కట్టి లోపలకు పోయినచో ఆదారము వెంట వెనుకకు రాగలవని చెప్పెను పెరిష్యూస్ అట్లే ఆ దారపు ఉండతో మిగిలిన వారితో

కలసి చీకటి చిక్కు గృహమున ప్రవేశించెను లోపల అంతయు గాఢాంధకారము ఎవరెచటనుండిరో ద్వారము లెటులున్నవో ఎటుపోవుచున్నారో తెలియదు ఎటునుండివచ్చిరో కూడా తెలియదు మినోస్ కుమార్తె "అరియాడ్నె" (Ariadne) చెప్పినట్లు పెరిష్యూస్ దారపుఉండ కొనను ప్రవేశ ద్వారమునకు కట్టిన పిదప దారపుఉండతో లోనికి ప్రవేశించెను ఆ చీకటిలో అంతకుముందు మినాటోర్ చే హతమార్చబడిన మానవుల అస్థిపంజరములను దాటుకొనుచు లోపలి గదులలోనికి ప్రవేశించెను లోపలిగది మధ్యబాగమున కూర్చునియున్న 'మినాటోర్ ను సమీపింపగా అతడు అప్పుడే వచ్చిన యువకులలో ఒకరిని చంపబోవుచుండెను అపుడు పెరిష్యూస్ వానిపై బాణము వేయగా అది వానిని గాయపరచలేక పోయెను పెరిష్యూస్ తన పిడికిలినే ఆయుదముగా మినాటోర్‌పై తీవ్రముగా ఒక్క దెబ్బ కొట్టగా అతడు చనిపోయెను మరల పెరిష్యూస్ తోటివారిని తీసికొని దారము వెంబడి జాగ్రత్తగా బవనము వెలుపలికి రాగలిగెను అతడు తిరిగి తోటివారితో కలసి ఒక పడవలో వెనుకకు బయలుదేరి వచ్చుచూ ఒక ద్వీపమున మినోస్ కుమార్తె అరియాడ్నేను వదలివైచెను ఆమె అచ్చట నిరీక్షించుచుండగా ఒక చక్కని సంగీతము వినిపించెను తరువాత ఆ సంగీతము గ్రీకు దేవతయైన 'డియోనిసస్ (Dionysus) దని తెలిసెను ఆమె ఆయనను ప్రేమింపగా అతడామెను వివాహాముచేసికొని దేవలోకమున నిలిపెను ఇందు మొదటి తెల్లని వృషభము వృషబరాశికి సంకేతము వృషభరాశి తెలుపు వర్ణమునకు స్వచ్ఛతకు, అందమునకు, ప్రేమకు సంకేతము మినోస్‌భార్య పేసిపే (Pasi phae)వృషబమును చూచి ప్రేమించి కామమును పొందెను అనగా స్వచ్ఛమైన ప్రేమ, అందము వృషభరాశి లక్షణములుగా స్త్రీయందు సౌందర్యము ప్రతిపాదించుచుండగా జీవులట్టి సౌందర్యమును కామముగా వ్యామోహాపడిరని భావము వృషభరాశికి ఎదురుగా దాని కేడవ రాశియగు వృశ్చికరాశి యుండును అది పశుకామమునకును, దాపరికమునకును, వ్యామోహామునకును సంకేతము దాని వలన మానవునిలో దుష్టప్రవృత్తులు చెలరేగి తన సుఖమునకై ఇతరులను బాదించు కౄరలక్షణములుండును ఇది మినోటోర్ అను రాక్షసునిగా సూచింపబడినది వృశ్చికరాశి ఇట్టి లక్షణములను కలిగియుండును వృషబరాశికి ఏడవదియగుటచే దాంపత్యమును సూచించును కనుక Pasipahae వృషబముతో కామ సంబంధము కలిగియుండుట చెప్పబడినది

ామమునకు ఫలితముగా మినోటోర్ అను రాక్షసుడు పుట్టెననియు
ు చీకటి గృహమున దాచియుంచబడెననియూ అది చిక్కుదారి
యూ అచటికి ప్రవేశించినవారు వెనుకకు రాలేరనియూ, అచటికి
ినవారందరు వానిచే చంపబడిరనియు చెప్పబడినది వృశ్చికరాశి
మునకు సంకేతము సంతతియందు అభిలాష లేకుండా
ామముతో వ్యామోహపడువారు అట్టి కామమునకు చిక్కి
ంచుకొనలేక చివరకు సంసారబంధము తోనే మరణింతురు
క్రమున వృశ్చికరాశి ఎనిమిదవరాశి యగుట వలన మృత్యువును
ంచును అనగా సాంసారిక మానవులకు భౌతికదేహమే
త్యుస్థానము అందుచిక్కినవారు దానియందే నశించుట తప్ప
కకు రాగలుగుట వుండదు పెరిష్యూస్ అనువాడు యోగసాదనకు
తము అతడు ఏడుగురు పురుషులతోను, ఏడుగురుస్త్రీలతోను
లో బయలుదేరెనని చెప్పబడినది ఆ నావయే మానవదేహము
గురు పురుషులు షట్చక్రములను, సహస్రారమును సూచింపగా
ులి శక్తులు మేలుకొని అవి పద్మములుగా మారుటను ఏడుగురు స్త్రీలు
ంతురు మరియు వృషభరాశినుండి వృశ్చికరాశి వరకు గల
రాశుల ఉత్తమ లక్షణములు ఏడుగురు పురుషులు సూచింపగా మరల
్చిక రాశినుండి వృషభరాశివరకు గలఏడురాశులు వారికెదురుగా
మను గనుక స్త్రీలను సూచించును ఇంకను సాంసారిక ప్రపంచమున
్కొన్న మానవుడు పశుకామమునుండి బయట పడవలయునన్నచో
్ధమైన, నిర్మలమైన ప్రేమనుపాసింపవలయును అట్టిప్రేమ చేతనే ఇది
్యమగును వృషభరాశి నుండి కన్యారాశికి అయిదవరాశి అనగా
స్థానము

కనుకనే పెరిష్యూస్‌కు మినోస్ రాకుమార్తె అరియాడ్నే చీకటి
హమునుండి బయటకు రాగలిగిన మార్గమును బోదించెను కన్యారాశి
్ధమైన నిర్మలప్రేమకు సంకేతము ప్రవేశద్వారమునకు దారముకట్టి
ల ఆదారము వెంబడి వెనుకకు వచ్చెనని చెప్పబడినది స్వచ్ఛమైన
లప్రేమనుపాసించువారి యందు కుండలిని మేలుకొని, అందలి
ుమ్నానాడి ప్రబావితమగును

అది తామరతూడు తంతువు అనగా దారమువలెనుండునని
తశాస్త్రగ్రందులందు వర్ణింపబడినది నిర్మలమైన అకారణమైన
ును తోటివారియందు ఉపాసించువారికి కామము ప్రేమగామారి

అట్టివాని రేతస్సు ఊర్ధ్వముఖమగును ఇతరుల కొరకు ప్రాణములను సహితము లెక్కచేయక వారిని కాపాడువారికి వృశ్చికరాశి వశమగును అట్టివానియందు సుషుమ్ననాడి మేలుకొని పనిచేయుచు యోగవిద్యయందు మార్గదర్శకముగా నుండును జీవుడు తానెక్కడినుండి వచ్చెనో అచ్చటికి అనగా పరమాత్మ లోనికి చేరగలుగుటకు ఈ సుషుమ్ననాడి ఆలంబనము ఆవశ్యకమగును దారముతెంట వెనుకకు వచ్చుటయనగా సుషుమ్న వెంబడి వెన్నుపూస చివర నున్న మూలాదారము నుండి భ్రూమద్యమందున్న ఆజ్ఞాచక్రము వరకు వెన్నువెంబడి ప్రయాణముచేసి చేరుట

దానివలన జీవులలోని జీవత్వము తొలగి దైవత్వము సిద్ధించును అనగా దాంపత్యమునందలి బౌతిక స్పర్శ నశించి దివ్య స్పర్శ లబించును కనుకనే పెరిమ్యాస్ తనను ప్రేమించిన అరియాడ్నెను వదలిపెట్టగా, ఆమె డియోనిసన్ అనుమిక్కిలి సుందరమైన దేవతను వివాహమాడెనని చెప్పెను డియోనిసెస్ వృషబరాశియందలి సౌందర్యమునకు సంగీతమునకు సంకేతము కనుకనే ఒంటరిగా నున్న అరియాడ్నేకి మొదట మిక్కిలి మాదుర్యమైన సంగీతము వినిపించెననియు దానివలన ఆమెకు పరవశము కలిగెననియు తదనంతరము డియోనిసెస్ సాంగత్యము, సాహచర్యము లబించెననియు చెప్పబడెను సంగీతము ప్రేమతో, భక్తితో ఆలాపనచేయుట బగవదర్పితముగా నుపాసన చేయుట తోటివారిని తన సంగీతముచే పరవశులను చేసి యోగజీవితమునకు ఉన్ముఖులను చేయుట మున్నగు లక్షణములచేత వృషభరాశియందలి కామప్రవృత్తి తొలగిపోయి ఉత్తమలక్షణములు అనుబూతిగా మిగిలిపోవును కనుకనే ఈ అరియాడ్నే, డియోనిసిస్‌ల దివ్య దాంపత్యము శాశ్వతమై నిలచినది నంది అను శబ్దముచే ఇట్టి పరవశమే సూచింపబడును

# అనువాకం - 6

## మంత్రము 1

**తత్పురుషాయ విద్మహే మహాసేనాయ ధీమహి**
**తన్నో షణ్ముఖః ప్రచోదయాత్**

## ప్రతిపదార్థము

మహాసేనాయ = గొప్పసేన గల వానిని

షణ్ముఖః = ఆరు ముఖములు గల దేవత

## తాత్పర్యము

అంతర్యామియైన పురుషుని తెలుసుకొనుచున్నాము మహత్తుయే తన సేనగా గల వానిగా ధ్యానించు చున్నాము ఆయన షణ్ముఖుడై మమ్ములను ప్రచోదనము చేయును గాక।

## వివరణ

షణ్ముఖుడనగా ఆరుముఖములు గల దేవత ఈయన మహేశ్వరుని కుమారుడు మహేశ్వరుని తేజస్సు (వీర్యము) ఆయననుండి పతనము కాగా, అగ్ని దానిని స్వీకరించెను అగ్నినుండి గంగ స్వీకరించి ఉదయ పర్వతములయందు వదిలెను అచ్చట ఆ తేజస్సు రెల్లు పొదలచే దరింపబడి బంగారు వర్ణముతో ఆ పొదలయందు వ్యాపించెను అదియే షణ్ముఖుని పుట్టుక అట్లు రెల్లు పొదలయందు పుట్టిన షణ్ముఖుని కృత్తికలు పాలిచ్చి పెంచిరి ఆ శిశువునకు ఆరు శిరస్సులుండెను ఇదియే కుమారస్వామి జన్మకద

సృష్టి కతీత స్థితిలో పరమాత్మ సృష్టి సంకల్పముగా తన తేజస్సును వ్యక్తపరిచెను అవ్యక్త స్థితిలో నున్న ఆ తేజస్సు అగ్నిచే దరింపబడెను ఇది పరమాత్మ పార్వతి దేవితో కూడి తన్మయావస్థలో నున్నప్పుడు జరిగెనని చెప్పబడినది అట్టి ఆనంద స్థితియందు పారమార్థికము తప్ప ఇతర స్పర్శకు తావులేదు ఇరువురునూ ఒకటే ఆనందమయస్థితిలో నుండిరి అనగా అప్పుడు పరమాత్మ ఆనందము అను రెండునూ రెండు స్థితులైననూ ఇంకనూ ఒక్కటిగనే నిలచియుండెనని బావము ఇదియే అర్ధనారీశ్వర తత్వము అట్టి వారున్న స్థితిలో మూడవది యుండుటకు వీలులేదు కనుక పరమాత్మయొక్క తేజస్సు వేరుగా ప్రసరించెను అట్లు వచ్చిన తేజస్సును

అగ్ని దరించెను అగ్నియనగా తనకు తాను వేరుగా మేలుకొన్న జీవాత్మ ఇదియే జీవుని మొదటి మెలకువ జీవులయందిట్టి మెలకువ కలిగించు ప్రజ్ఞనే అగ్నియందురు అట్టి అగ్ని నుండి ఆ వెలుగును గంగ స్వీకరించినది గంగయనగా ఆకాశమునుండి పనిచేయుచున్న మహాశక్తి ఇదియే విశ్వకుండలిని అనికూడా పిలువబడును అనగా పరమాత్మనుండి వెలుగు సృష్టి సంకల్పముగా బయలుదేరి రాగా అట్టి వెలుగునకు చుట్టు ప్రాణశక్తి ఏర్పడి భౌతిక సృష్టి జరుగుటకు దోహదము చేసినది

ఇట్లు వచ్చిన వెలుగు ఉదయపర్వతములలో గంగచే వదలిపెట్టబడెనని చెప్పబడినది అనగా అంతర్యామి ప్రజ్ఞ మహాశక్తితో కలసి సౌరమండలముగా అవతరించుటకు సంసిద్ధమయ్యెనని బావన రెల్లు పొదలనగా సూర్యకిరణములని రహస్యార్థము కలదు ఈ సూర్యుడే బాగవతమున ప్రాచీన బర్హి (తూర్పు దిశగా దర్భలు పరచుకొని యున్నవాడు) అనిచెప్పబడినాడు కనుకనే గంగ తన తేజస్సు నచ్చట వదలగా అదియంతయూ బంగారు వర్ణముతో నిండి పోయెనని చెప్పబడినది అనగా సూర్యుడు పుట్టెనని బావము ఈ కధయంతయూ సౌరమండలము పుట్టుటకు ముందు జరిగిన కద ఈ సూర్యుని వలననే బూమి యందున్న వారికి 6 దిక్కులేర్పడుచున్నవి అవియే తూర్పు, పడమర, ఉత్తరము, దక్షిణము, ఊర్థ్వము (పైన), అదస్సు (క్రింద)

ఇట్లు ఆరు దిక్కులే తన 6 ముఖములుగా గలవాడు షణ్ముఖుడు షణ్ముఖుని జన్మ వృత్తాంతమును ద్యానము చేయు విదానము ఈజిప్షియన్ సాంప్రదాయములలో నుండెడిది నాలుగు దిక్కులు, ఊర్థ్వము అను ఐదింటినీ కలుపుకొనుచూ పెద్ద బ్రహ్మాండమైన ద్యానమందిరములు దేవాలయములుగా చేసిరి వాటినే మనము పిరమిడ్ (Pyramid) అనుపేర పిలుచుచున్నాము అట్టి పిరమిడ్‌లలోపల గల రహస్యమార్గములలో స్త్రీగర్భకోశము నందు వలె మార్గము మద్యలో ద్యాన మందిరముంది అందు పిండమేర్పడినది మొదలు జన్మించు వరకూ గల వివిద స్థితులు శిష్యులకు ద్యాన మార్గమున మంత్రముల రూపమున అనుబూతము చేయబడి సంస్కరింతురు దాని వలన అట్టి శిష్యులు జనన మరణాతీత స్థితులను సాదించుకొందురు

ఇట్లు పుట్టిన షణ్ముఖునకు కృత్తికలు పాలిచ్చి పెంచిరని చెప్పబడినది కృత్తికలు రాశి చక్రమునందు వృషబరాశియందున్నవి ఈ వృషబరాశి

ఆహారమునకు సంకేతము అనగా కృత్తిక నక్షత్రములనుండి ప్రసరించు కిరణములు సూర్యునిచే గ్రహింపబడి భూమిపై జీవులకు భౌతిక ఆహారమును కల్పించుటయేగాక ఆత్మగతమైన యోగశక్తిని కూడా ప్రసాదించును అద్యాత్మిక సాదనలో షట్చక్రముల పరిపూర్ణ వికాసమైన తరువాత జీవునికి ద్విజత్వము కలుగును అనగా తాను జీవుడుగా నుండుట మాని అంతర్యామి యందుండుట ప్రారంబమగును అనగా జీవుడుగా చనిపోయి దేవుడుగా పుట్టును ఇదియే రెండవ జన్మ

ఇట్లు రెండవజన్మమెత్తిన వాడు పసిపిల్లవానివలె నుండును అనగా వానికి అహంకార మమకారాదులుండవు నిరంతరము ఆనందమే వానికి జీవితమంతయూ క్రీడ జీవుని ఇట్టి స్థితియే బాలకృష్ణుని లీలావిశేషములుగా చెప్పబడినవి అతనియందు స్త్రీపురుష బేదము పనిచేయదని తెలియుటకే కుమార స్వామికి (పసిపిల్లవాని తత్వము) వివాహము కాలేదని చెప్పబడెను శ్రీకృష్ణుడు కూడా 'అనాది బ్రహ్మచారి అని సంబోదింపబడినాడు ఇట్టి స్థితిలో నున్న జీవులకు ఆహారము కృత్తికానక్షత్రముల నుండి కిరణ రూపమున లభించును అట్టివారికి బౌతికమైన ఆహారముతో ఎక్కువ నిమిత్తముండదు బౌతికమైన ఆహారము వారు కేవలము లోక వ్యవహారికము కొరకు మాత్రము స్వీకరింతురు ఇట్టి స్థితిలోనున్న వారికి మనస్సు ప్రత్యేకముగా నుండదు వారు బుద్ధిమయ లోకములలో అట్టి బుద్ధిమయ శరీరమేధరించి యుందురు ఈ బుద్ధిమయ లోకమునే మహర్లోకమని యందురు అట్టి మహర్లోకమున కదిపతియైన వాడు షణ్ముఖుడు గనుక ఆయన అట్టి మహాత్తు తనసేనగా గలవాడని చెప్పబడినది

## మంత్రము 2

**తత్పురుషాయ విద్మహే సువర్ణపక్షాయ దీమహి**
**తన్నో గరుడః ప్రచోదయాత్।**

## ప్రతిపదార్థము

సువర్ణపక్షాయ = సువర్ణములైన రెక్కలు గల వానిని
గరుడః = గరుత్మంతుడు

తాత్పర్యము

మేము అట్టి మహా పురుషుని తెలుసుకొనుచున్నాము సువర్ణములైన రెక్కలుగలవానిగా ధ్యానము చేయుచున్నాము అట్టి గరుడుడు మమ్ములను ప్రచోదనము చేయును గాక!

వివరణ

సువర్ణమను శబ్దమునకు బంగారమనియు, మంచి అక్షరములనియు అర్థములు కలవు ఈ గరుడుడే సుపర్ణుడై అమృతబాండమును సృష్టిలోనికి తీసుకు వచ్చుచున్నట్లు చెప్పబడినది కనుకనే పెద్దలు సుపర్ణుని ధ్యానము చేయుటకు ఒక గోళమునకు రెక్కలు గలిగి అవ్యక్తమునుండి వ్యక్తలోకముల లోనికి వచ్చుచున్నట్లు చిత్రించి ధ్యానము చేసెదరు ఈయనను గూర్చిన పూర్తి వివరములు సువర్ణ సూక్తములందు కలవు

ఇచ్చట సువర్ణములనగా 'సోహం అను రెండు అక్షరములు ఈ రెండు అక్షరములు రెండు రెక్కలుగా గలిగి ఆయన మన శ్వాసలో ప్రయాణము చేయుచుండును అనగా మన శ్వాస కాదారముగా పనిచేయుచుండును సో అను శబ్దముచే ఊపిరి తిత్తులు వ్యాకోచించి, గాలిని లోపలికి తీసుకొనును 'హం అను శబ్దముచే శ్వాస బయటికి వదలబడును ఇట్లు ఊపిరితిత్తులయందు పనిచేయుచున్న ఈ రెండు బీజాక్షరములచే మానవుని శ్వాస నడచుచుండును ఈ రెండు బీజాక్షరముల నడుమ మరియొక బీజమున్నది అదియే 'ఓం' కారము అదియే ఈ సమస్త సృష్టికీ కారణమై అందు అంతర్లీనముగా నున్నది ఈ ఓం కారమే అంతర్యామియైన పరమాత్మ ఈయన వలననే మనకు శ్వాస నడచుచున్నది ఈయనయే సమస్త సృష్టికి కారణముగా నుండి అది పుట్టుటకును, నిలబడియుండుటకును, మరల లయమగుటకునూ ఆదారమై యున్నాడు ఈయన యుండు లోకమే హిరణ్మయములైన లోకములు అనగా అట్టి హిరణ్మయములైన లోకములు సహితము ఈయనయే పుట్టించుచున్నాడు కనుకనే శ్రీసూక్తము నందు మూల ప్రకృతియైన జగన్మాత''హిరణ్మయీం ' అని స్తోత్రము చేయబడినది ఇదియే సృష్టికాదారమైన మొట్టమొదటి వెలుగు ఈ మొదటి వెలుగునుండియే సమస్త లోకములు తరువాత పుట్టినవి ఈ వెలుగే పరమాత్మ నుండి వ్యక్తమైన మొట్టమొదటి నాదముగా చెప్పిరి ఈ నాదము

శ్వాసయందు పుట్టుచున్నది కనుక అట్టి నాద రూపమైన బ్రహ్మాండ గోళమును అమృత బాండముగా గరుడుడు బౌతిక లోకములలోనికి తీసుకుని వచ్చుచున్నాడు సోహం అను రెండక్షరములే వాని రెక్కలుగా నున్నవి ఈ గరుడునికి ముక్కు పొడవుగానున్నట్లు చెప్పబడినది అనగా శ్వాసను దీర్ఘముగా లోపలికి తీసుకొనుచూ సో॰ అను శబ్దమును మనస్సులో ద్యానము చేయవలెననియు, శ్వాసను మరల బైటకు సుదీర్ఘముగా వదలుచూ హం అను శబ్దమును పైకి ఉచ్ఛరించుచూ ద్యానము చేయవలెననియు అర్థము శ్వాస లోపలకు తీసుకున్న తరువాత గాలిని లోపల బిగవట్టరాదు అనగా కుంబకము చేయరాదు దీనివలన ఊపిరితిత్తుల యందలి కార్బన్‌డయాక్సైడ్ మరల ఊపిరి తిత్తులలోనికి పీల్చుకొనబడు ప్రమాదముండును కనుక శ్వాస లోపలకు తీసుకొనిన వెంటనే మరల ప్రశాంతముగా వదలుట ఆరంబించవలెను అట్లు పీల్చి వదలుట కూడ తన Maximum capacity లో 80% మాత్రమే పీల్చి వదలవలెను అట్లు పీల్చి వదలునపుడు పైన చెప్పినట్లు 'సో అను మంత్రమును ఉచ్ఛ్వాసలో మనస్సునందు ద్యానము చేయవలెను అనగా పైకి ఉచ్ఛరించరాదు హం అను శబ్దము పైకి ఉచ్ఛరించుచూ శ్వాస వదలవలెను ఇదియే గాయత్రీ ద్యానము

గరుత్మంతుడు కశ్యపునికి వినతకు పుట్టినవాడు ఆయన పుట్టినతోడనే ఒక్కసారిగా లోకములన్నియు వెలుగులతో నిండి పోయెననియు, అపారమైన కాంతితో ఆయన అకాశమునంతనూ ఆక్రమించెననియు, ఇంకనూ సూర్యుని తేజస్సువలె ఆయనను చూడలేక పోయిరనియూ చెప్పబడినది అనగా ఈయన వలననే వెలుగు మరియు సూర్యుడు పుట్టుట జరిగెననియూ అంతకు ముందంతయూ చీకటిగా నుండెననియూ అర్థము ఈయన తల్లి దాస్య విముక్తికై అమృతమును తెచ్చుటకు స్వర్గమున కేగెను త్రోవలో తన కాకలి కాగా, ఆహారమును గూర్చి తన తండ్రిని అడిగెను దానికి కశ్యపుడిట్లు చెప్పెను పూర్వము విబావసువు, సుప్రతీకుడను సోదరులిరువురూ ఒకరినొకరు శపించుకొనిరి

అందు సుప్రతీకుడు ఏనుగుగను, విబావసువు తాబేలుగను పుట్టిరి అయిననూ వారిప్పటికినీ అట్లే కలహించుకొనుచున్నారు వారి నాహారముగా నీవు తీసుకొనవచ్చును అని చెప్పెను ఇందు సుప్రతీకమనగా అష్టదిగ్గజములలో నొకటి ఇది ఈశాన్య దిక్కున

కదిపతియై యున్నది మన శరీరమున ఈశాన్యమనగా భ్రూమధ్యమునకు సూటిగా లోపల నున్నట్టి ఆజ్ఞాచక్రము అట్లే మూలాదారము శరీరమునకు దక్షిణదిశలో నున్నది అచ్చట ఈ భౌతికస్థితి కాదారముగా నున్న మహా కూర్మము పనిచేయుచున్నది అనగా ఈ రెండింటి నాహారముగా తీసుకొనుమని చెప్పుటలో మూలాధారమందలి బౌతిక శక్తి, ఆజ్ఞాచక్రమునందలి యోగశక్తి ఈ రెండిటి సమన్వయముచే శ్వాసయందు ఓంకారము పుట్టును అనగా పైన చెప్పబడినట్టి ఉచ్ఛ్వాస నిశ్వాసలను ద్యానము చేయువానికి హృదయమునందు ఈ రెండిటి సమన్వయమైన 'ఓం' కారము మేలుకొని వినిపించుచుండును సక్రమమయిన పద్ధతిలో యోగాభ్యాసము చేయువానికి ఈ "ఓం' కారము శ్వాసకు సంబంధము లేకయే హృదయమునందు నిరంతరము వినిపించుచుండును అట్లబ్యాసమైన వానికి అట్టి ఓం కారము వినుచు సర్వకాల సర్వావస్థలయందు దానియందే నిమగ్నుడై యుండును అనగా బౌతిక వ్యవహారములు సాగిపోవుచున్నను అవి వాని ఓం కార ద్యానమునకు అడ్డమురావు అన్ని పనులనూ చక్కగా నిర్వర్తించుకొనుచూ ఓం' కారమును ద్యానము చేయుచుందురు అట్టివారికి కాలముతో కూడ సంబంధము తెగిపోవును కాలము, దేశము మున్నగునవి వానిపై ప్రబావము చూపవు ఇదియే మనకు గరుడుని కదలో ముందు కనిపించును

అట్లు తండ్రి చెప్పిన విదమున గజ కచ్ఛపములను కాళ్ళతో ఒడిసి పట్టుకుని గరుడుడు వాటిని తినుటకు సరియైన ప్రదేశము కొరకు చివరికొక మహా వృక్షమును చూచి దాని కొమ్మపై వ్రాలెను గరుడుని వేగమునకు ఆకొమ్మ విరిగెను ఆ కొమ్మనాదారము చేసికొని వాలఖిల్యులను 60వేల మంది మహర్షులు తలక్రిందులుగా వ్రేలాడుచూ తపస్సు చేసుకొనుచుండిరి దీనిని గమనించి తన ముక్కుతో ఆ కొమ్మను కరచి పట్టుకొని గరుడుడు తండ్రియొద్దకేగి జరిగినది తెలుపగా అతడు ఆ మునులను ప్రార్థించి వారు ఆ కొమ్మను వదలి పోవునట్లు చేసెను గరుడుడు ఆ కొమ్మనొక పర్వత శిఖరముపై పారవైచి ఆ గజ కచ్ఛపములను తిని ఇంద్రుని లోకమునకు ఎగిరి వెళ్ళెను

ఇచ్చట గరుడుడు చూచిన మహావృక్షము సృష్టియను మహావృక్షమే అదియే సృష్టియందలి కార్యకారణ సంబంధముగా తెలియబడుచున్నది బగవద్గీతలో పురుషోత్తమ ప్రాప్తి యోగమున

శ్రీకృష్ణుడు ఊర్ధ్వమూల మదశ్శాఖం అని వర్ణించినదీ వృక్షము గురించియే అట్టి వృక్షముయందలి కొమ్మయనగా మానవుడాచరించు కర్మలు అందువేలాడుచున్న వాలఖిల్యాది మహర్షులనగా క్షణములతో కూడిన కాలము కాలముననుసరించి కర్మలు వాని పలితములు వాని కేర్పడును ఆ కొమ్మను ముక్కున పట్టుకుని ప్రయాణము చేసెననగా ఓం కారమును ద్యానము చేయుచూ కర్మబందమును తొలగించుకొని కాలమున కతీతుడయ్యెనని బావము అట్లు ఇంద్రుని లోకమునకు పయాణము చేసి గరుడుడు అమృత బాండమును సమీపింపగా దానిచుట్టు రెండు మహాచక్రములు తిరుగుచున్నవి ఎట్టి వారినైననూ అవి ఖండములుగా కోసివేయగలిగినవి ఆ రెండు చక్రముల మద్యగా నేర్పుగా గరుడుడు లోన కేగగా అమృత బాండమును చుట్టుకుని రెండు మహా సర్పములు విషాగ్నులను వెలిగ్రక్కుచున్నవి అవి తగిలినవాడు వెంటనే మరణించును వాటి మద్యగా ప్రవేశించి గరుడుడు అమృత బాండమును భూమికి తెచ్చెను గరుడుడు అతి చిన్న అణువంతయై తన ముక్కును లోనికి జనిపి అమృత బాండమును హరించెను దానితో తల్లికి దాస్యవిముక్తి కలిగించెను

ఇందు తిరుగుచున్న ఆ రెండు చక్రములే జననము మరియు మరణము అట్లే ఆ సర్పములు రెండు ఒకటి బూతము రెండు బవిష్యత్తు ఈ జనన మరణాదులను బూత బవిష్యత్తులను జయింపవలెనన్నచో మానవుడు తాను అణువుల వలె కావలెను అనగా చోటునందు సమస్త అణువుల రూపమున నున్న అంతర్యామిని ద్యానము చేయవలెను ఇంకనూ మిక్కిలి వినయము కలిగియుండవలెను తనకింత తెలుసుననీ, తానిట్లు సాదన చేయుచున్నానని, అహంకారపడువాడు సర్పముల చేతికి, చక్రముల చేతికి చిక్కి నశించును ఇట్టి వినయము కలుగవలెనన్నచో తోటివారి యందు అకారణమైన ప్రేమ నిష్కల్మషమూ నిర్మలమూనై యుండవలెను కనుకనే అట్టి గరుత్మంతునుపాసించుటకు హృదయమే కేంద్రము హృదయమునందలి అనాహత చక్రమును ద్యానము చేయుట యనగా ఇదియే

మన పురాణములందే కాక ఇతర దేశ పురాణములందు సహితము ఈ గరుడుని ప్రసక్తి కనిపించును ఈజిప్షియన్ పురాణములయందు ఈయన 'హోరస్' (Horus) అను పేరుతో పిలువబడినాడు అనగా ఆ బాషలో ఆ మాటకు మిక్కిలి ఉన్నతమై వ్యాపించునది లేక ఆకాశము అని అర్థము

ఈయన ఒక గోళాకారముగా దానికి రెండు రెక్కలున్నట్లుగా ధ్యానము చేయబడును సూర్యచంద్రులు ఈయన కన్నులుగా చెప్పబడిరి (భౌతిక సృష్టికి కారణమగుచున్నాడని యర్థము) కొన్నిచోట్ల ఈయన పూర్తిగా గద్ద రూపమున అర్చింపబడగా మరికొన్ని చోట్ల గ్రద్ద శిరస్సు కలిగిన మానవ దేహముగా అర్చింపబడినాడు మనము కూడా గరుత్మంతుని అట్లే ఆరాదించుచున్నాము కదా।

## మంత్రము 3

**వేదాత్మనాయ విద్మహే హిరణ్య గర్భాయ దీమహి।**
**తన్నో బ్రహ్మ ప్రచోదయాత్॥**

## ప్రతిపదార్థము

వేదాత్మనాయ = వేదములు తానుగా నున్నవాడు, వేదములకు ఆత్మయైనట్టి వాడు
విద్మహే = తెలిసికొనుచున్నాము
హిరణ్య గర్భాయ = బంగారపు గుడ్డు అయినట్టి వానిని
దీమహి = దారణ చేయుచున్నాము
నః = మమ్ములను
తత్ = దానియందు
బ్రహ్మ = బ్రహ్మదేవుడు
ప్రచోదయాత్ = ప్రచోదనము చేయునుగాక

## తాత్పర్యము

వేదమునకు ఆత్మయైనట్టి వానిని తెలుసుకొనుచున్నాము ఆయనను బంగారపు వర్ణముతో కూడిన గోళముగా దారణ చేయుచున్నాము అట్టి బ్రహ్మ మమ్ములను ప్రచోదనము చేయును గాక

## వివరణ

వేదమనగా సృష్టియందు ఇమిడియున్న నేనను ప్రజ్ఞ, సమస్త విజ్ఞానమునకు బీజము ఇది ద్రవ్యము (Matter) నందు విజ్ఞానముగా మేల్కొనును విజ్ఞానమనగా ఇది యిట్లుండును అను తెలివి ఇదియే Properties of Matter గాను, Biological Properties గాను శాస్త్రజ్ఞులచే గుర్తింపబడినది పదార్థములకు దర్మములు వున్నవని తెలియును కాని, అవి ఎందులకట్లున్నవో ఎవరికిని తెలియదు చిక్కుడు గింజలో చిక్కుడు

చెట్టు అను లక్షణము దాగి యున్నది లేనిచో చిక్కుడు గింజ నాటినపుడు చిక్కుడు చెట్టే ఏలవచ్చును? పొరపాటున మరియొక చెట్టు రావచ్చును గదా! అట్లుగాక చిక్కుడు చెట్టే వచ్చుట వలన ప్రకృతియందు మనకు తెలియకుండ ఒక క్రమమున్నదని తెలియును అట్టి క్రమమునే వేదము అందురు ఇది సృష్టివిజ్ఞానమునకు బీజము, లేదా Formula వంటిది మొత్తము ఏడు లోకముల వివరణ అంతయు ఒక చిన్న విత్తనముగా ఊహించుకొనిన యెడల, ఆ విత్తనమునే బ్రహ్మ లేదా వేదము అందురు వేదములను ఆత్మగా దరించినవాడు బ్రహ్మ

ఈ వేదమే 'నేనను' ప్రజ్ఞగా అణువులన్నింటియందును నిండియున్నది బౌతికద్రవ్యమునకు అణువు ఆదారమైనచో, అణువులకు 'నేను ఆదారము అనగా ద్రవ్యము(Matter) నుండి శక్తి (Energy) పుట్టుచున్నదని తెలియునుగాని, శక్తి నేనను ప్రజ్ఞ(consciousness) నుంచి పుట్టుచున్నదని నవీన శాస్త్రజ్ఞులకు తెలియదు బంతి విసరబడి వేగముగా వచ్చుచున్నచో దానిని విసురువాడొకడుండ వలెనని తెలియునుగదా ! ఇట్లు అణువుల కాదారముగా 'నేనను ప్రజ్ఞయున్నది ఈ ప్రజ్ఞ సకల ప్రాణులయందు వ్యాపించియున్నది శరీరములో నేనను ప్రజ్ఞగా ఈ వేదమే విస్తరించియున్నది దానిచుట్టును, ఉల్లిపాయపొరలేర్పడినట్లు శరీరములేర్పడియున్నవి అట్లు ఏడు పొరలు ఏడు ఆవరణలుగా ఏర్పడగా చిట్టచివర పొర బౌతికశరీరము కనుక ఈ ఏడు ఆవరణలకును ఆదారముగా నేనను ప్రజ్ఞయున్నది అనగా నేను వలన మిగిలిన ఏడు శరీరములు నిలబడియున్నవి ఈ ఏడు శరీరముల క్రమము నేను' నందు ఇమిడియున్నది దానినే వేదమందురు

అట్లే సూర్యుడు తనచుట్టూ తిరుగు ప్రదానములైన ఏడు గ్రహముల పరిభ్రమణ కక్ష్యలకు తానేకేంద్రమైయున్నాడు ఇట్టి ఏడు గ్రహముల కక్ష్యలే ఏడు పరిదులతో కూడినలోకములుగా, సూర్యుడు కేంద్రముగా ఏర్పడియున్నవి సూర్యుడు ఈ ఏడు గ్రహముల యొక్క విజ్ఞానమును తనయందు కలిగియున్నాడు ఇట్టి క్రమమే సమస్త విశ్వమునకు వర్తించును ఈ విశ్వము మొత్తమునకు ఆదారమై సమస్తమునందు వ్యాపించియున్న నేనను తెలివియే వేదము అట్టి వేదములే బ్రహ్మగా తెలుసుకొనుచున్నాము

హిరణ్యగర్భుడనగా ఈ సృష్టియందు అంతట వ్యాపించియున్న వెలుగు మొత్తము వెలుగుగానున్న గోళము తానే అయినటువంటివాడు

సూర్యుడు మొదలగు గోళములు ఆయన వద్దనుండి వెలుగును స్వీకరించుచున్నవి అన్ని వెలుగులకు మూలము ఈయనే ఇంద్రుడు, వరుణుడు మున్నగు విశ్వేదేవతలు చిన్న జ్వాలలుగా వున్నారు ఇవన్నియు ఆ మహాజ్వాల అంశలుగనే చెప్పవలయును

పరమాత్మ సృష్టి ప్రారంభమున మొట్టమొదట జలములను సృష్టించెను ఆ జలములే రసము రసమనగా ఆనందము లేక తన్మయత్వము జీవుల జీవత్వము కరిగి తన్మయత్వముగా నిలచియున్న స్థితి అట్లే సృష్టియంతయు ఒకే ఆనందముగా నున్న స్థితినుండి, తానున్నానని తనకు తెలియు స్థితిలోనికి ప్రజ్ఞ దిగివచ్చెను ఈ ప్రజ్ఞయే నేనను వెలుగు కనుకనే సృష్టి ప్రారంభమున సమస్తము జలమయముగా నుండగా అందు హిరణ్యాగర్భుడను బంగారపు గుడ్డు తేలినదని చెప్పిరి నీటికే నారములని పేరు

అట్టి నారములుగా నున్నట్టివాడు నారాయణుడు ఆయన యందు తాను వేరుగా వ్యక్తమయిన వెలుగే బ్రహ్మ అయననే హిరణ్యా గర్భుడని అందురు శ్వాసక్రియ జరుగునపుడు 'సో అను శబ్దము తనయందు ఉచ్చరింపబడుచుండగా శ్వాస లోనికి తీసుకొనబడుచున్నది అట్లే హం' అను శబ్దము ఉచ్చరింపబడగా శ్వాస వదలబడుచున్నది ఇట్లు శ్వాస వదలుటకు కావలసిన బీజము హం అను శబ్దము శ్వాసయందు పని చేయుచున్న దేవతలు ఈ బీజముల నుచ్చరించుటచే మనయందు శ్వాస జరుగుచున్నది ఈ శబ్దము నోటితో ఉచ్చరింపబడినప్పుడు కంఠము నందలి స్వరపేటికయందు గల పొరలతో రాపిడి చెంది మొదటగా 'ర కారమును పుట్టించుచున్నది ఇది హ్రీం' అను శబ్దముగా ఉచ్చరింపబడు చున్నది ఈ శబ్దము ప్రకృతికి కారణమైన బీజాక్షరము ఇది ప్రకృతి, సృష్టి యొక్క సంపద, దాని వైభవము కలిసి ఉచ్చరింప బడిన శబ్దము దీని నుండి హ కార ర కారములతో కూడిన హిరణ్యవర్ణాం, హరిణీం అను మంత్రములతో శ్రీసూక్తము ప్రారంభమగును పురుషపరముగా నేనను' ప్రజ్ఞగా చెప్పబడినప్పుడు హిరణ్యగర్భునిగా చెప్పిరి

సృష్టికి మూలస్వరూపుడైన ఈ హిరణ్యాగర్భుడు సూర్యునికి కారణమైన వెలుగుగా ఈ సృష్టియందంతటనూ వ్యాపించియున్నాడు ఈ హిరణ్యగర్భుని వెలుగే సూర్యునియందు భౌతికమైన వెలుగుగా అనగా సూర్యరశ్మిగా దిగివచ్చుచున్నది విశ్వమునందు అవ్యక్తముగా నున్న వాడే హిరణ్యాగర్భుడు సౌరమండలమునందు సూర్యరశ్మితో నిండిన

సూర్యమండలముగా భౌతికస్థితిలోనికి వ్యక్తమగుచున్నాడు మరియు ఈ సూర్యుని కిరణముల యందున్న ఏడు వర్ణములను ప్రజ్ఞలే భూమి యొక్క అణువులను తాకినపుడు భూమియందలి ద్రవ్యమునందు మార్పులు కలిగించి, ఖనిజములను పుట్టించుచున్నవి ఏడు వర్ణముల ననుసరించి ఏడు ప్రదాన లోహ ఖనిజములేర్పడగా వానివలన మిగిలిన ఖనిజములేర్పడుచున్నవి సూర్యకిరణముల వలన చెట్లకు ఆహారము సిద్ధించుచున్నదని మనకు తెలియును దానివలన వృక్షజాతి జీవించియున్నది Photo Synthesis గూర్చి తెలిసికొనిన మానవుడు కొద్ది కాలములోనే సూర్యకిరణముల వలననే బంగారము, మిగిలిన ఖనిజములు భూమియందు పుట్టుచున్నవని తెలుసుకొనగలడు ఇట్లు ఈ సృష్టికి కావలసిన విజ్ఞానముగా హిరణ్యగర్భుని ద్యానింపవలెనన్నచో కనులు మూసికొని కూర్చొని తనచుట్టును, క్రింద, పైన సమస్తము బంగారు వర్ణముతో నిండియున్నట్లు, తానుకూడ అట్టి బంగారు వర్ణముగా నున్నట్లు ద్యానము చేయవలయును ఇదియే హిరణ్యగర్భుని దారణ చేయుట అట్లు ద్యానము చేసి దారణ చేయుట వలన మనయందు హిరణ్యగర్భునిగను, వేదముగను వున్న బ్రహ్మ అను ప్రజ్ఞ మన బుద్ధులను ప్రేరణచేసి వికసింపచేయును ఆయా దేవతలు మనలో ప్రసన్నత చెందినపుడే మన బుద్ధులు ప్రచోదనము చెందును

మంత్రము 4

నారాయణాయ విద్మహే వాసుదేవాయ దీమహి ।
తన్నో విష్ణుః ప్రచోదయాత్ ।

ప్రతిపదార్థము

నారాయణాయ = నారాయణుని గూర్చి

వాసుదేవాయ = వాసుదేవునిగా

విష్ణుః = విష్ణువుని

తాత్పర్యము

నారాయణుని గురించి తెలుసుకొనుచున్నాము వాసుదేవునిగా దారణ చేయుచున్నాము అట్టి మమ్ములను విష్ణువు ప్రేరణ చేయును గాక

## వివరణ

నారాయణుడు, వాసుదేవుడు, విష్ణువు అను ముగ్గురును అంతర్యామి ఉపాసన యందు మూడు సోపానములవంటివారు జీవుడు సాధనలో ఈ మూడింటిని అవరోహణ క్రమమున అదిరోహించవలయును సాధకుడు మొదట విష్ణు ఉపాసనతో ప్రారంభించి, వాసుదేవోపాసన ద్వారా పరిణతి చెంది, నారాయణోపాసన యను తురీయ స్థితిని చేరవలయును

విష్ణువు అనగా ఈ సృష్టిగా వ్యాపించియున్న వెలుగు దీనివలన సమస్త జగత్తు నిలబడియున్నది ఆకారములనుండి లక్షణములు, గుణములు మొదలగునవన్నియు విష్ణువువలన ఏర్పడినవే భూమి తనచుట్టు తాను తిరుగుట, సూర్యుడు ప్రకాశించుట, అటులనే మానవుడు శ్వాసించుట, ఆహారము తీసుకొనుట, దానికై వృక్షములు పుష్పించుట, పండ్లు కాయుట మున్నగు ప్రయత్నములన్నియు విష్ణువు యొక్క అంగములే సృష్టిలో వస్తువుల యొక్క రూపములు, రంగులు, గుణములు మున్నగునవన్నియు విష్ణువు యొక్క ధర్మములు సృష్టియందలి సౌందర్యము విష్ణువు యొక్క స్వరూపము ఇవి అన్నియు పరమాత్మ యొక్క అస్తిత్వమునకు గుర్తులు సృష్టియందు విష్ణువు అనునొక మహాచైతన్యము కలదు అదియే జీవులలో నేను అన్న అస్తిత్వముగా మేలుకొనుచున్నది సృష్టిలోని లోకస్థులు, లోకేశులు, లోకములు విష్ణువు వలననే నిలబడియున్నవి శరీరము, మనస్సు, ఆత్మ ఎవరివలన నిలబడియున్నవో వానిని విష్ణువుగా పిలుచుచున్నాము విష్ణ్వుపాసన అనగా సృష్టిలోని సకల చరాచర జీవులయందున్న పరమాత్మను ధ్యానము చేయుట

పెద్దలు దేవతల పేర్లను సాంకేతికముగా ఉపయోగించిరి అనగా వారి యొక్క కర్తవ్యమును బట్టి, ధర్మమును బట్టి వారికి నామమేర్పడినది ఇంజనీరు, డాక్టరు అనునవి పేర్లు ఎటుల కావో అటులనే ఇంద్రుడు, అగ్ని, విష్ణువు మున్నగునవి కూడ వారి ధర్మములననుసరించి వారికేర్పడినవే నిజమునకు వీరందరు ప్రజ్ఞలేకాని కేవలము అదృశ్యముగా నున్న వ్యక్తులు కారు అనగా వ్యక్తులకు కారణములుగా, ఆధారములుగా పనిచేయుచున్న ప్రజ్ఞలు నిజమునకు ప్రతి మానవుని యందును ఈ ఇంద్రాది ప్రజ్ఞలు పనిచేయుచున్నవి వీరందరూ గ్రామములోని లేక కాలనీలోని డాక్టరు, ఇంజనీరు వంటివారు ఇట్లు ప్రతిజీవి యొక్క దేహములోను ఇట్టి ప్రజ్ఞలు పనిచేయుచుండగా ఒక్కొక్క వ్యక్తియందలి

ఒక ప్రజ్ఞననుసరించి ఏర్పడిన ఒక్కొక్క దర్మమునకు మొత్తము భూమియందు ఒక మహాప్రజ్ఞ పనిచేయుచుండును ఈ మహాప్రజ్ఞ జిల్లా సూపరింటెండెంట్ ఇంజనీరు, డాక్టరు వంటివారు అటులనే సౌర మండలమునందు ఇట్టి గ్రహముల మహాప్రజ్ఞల కదిపతిగా మరియొక ప్రజ్ఞ పనిచేయును వీరు రాష్ట్ర అదికారులు (State officers) వంటివారు అటులనే విశ్వమునందు మొత్తము సృష్టికి అదిపతులయిన మహాశక్తులు ఒక్కొక్క దర్మమునకు వేరువేరుగా పనిచేయుచుందురు వీరే మనమనుకొను మహా విష్ణువు, పరమేశ్వరుడు మున్నగువారు సూటిగా Govt వారికి దరఖాస్తు పెట్టుకున్ననూ వాటిపై మన గ్రామము నందలి అదికారులే తగుచర్య తీసుకుని ప్రత్యామ్నాయములేర్పరచినట్లు మనము పరమశివుని, మహావిష్ణువులనుద్దేశించి చేయుప్రార్ధనలకు మన దేహమునందలి ఉపదేవతలే అనుగ్రహించి సర్దుబాటు చేయుదురు

విష్ణువు సృష్టియందలి వ్యక్తరూపముగానున్న పరమాత్మ ఈయనను మనము అందము, క్రమము, పరిశుభ్రత, స్వచ్ఛత అనువాని పేర ఆరాదించుచున్నాము ఇంకనూ పూజ చేయుట, స్తోత్రము, బజనలు చేయుట, చక్కని చిత్రములను చిత్రించుట శిల్పములు, గానము మున్నగువన్నియు విష్ణ్వోపాసన మార్గములు దేవాలయ సందర్శనము, పుణ్యక్షేత్ర దర్శనము, సద్గ్రంథపఠనము మున్నగువన్నియు విష్ణువు యొక్క అర్చనా సంప్రదాయములే నిరంతరము ఇట్టివాని యందు మనస్సు లగ్నము చేసి తనకనుకూలమైన దానిని ప్రదానముగా స్వీకరించి, అట్టిమార్గమున జీవితమును నిరవశేషముగా గడుపువానికి జీవితమే విష్ణుమయమగును అనగా వాని స్థానమున విష్ణువే యుండును వానికి చూచునదంతయు విష్ణువు యొక్క స్వరూపమగును ఇట్టి స్థితినే బగవత్ రామానుజులవారు 'సాలోక్యము అనిరి

కాని, ఎంత విష్ణ్వోపాసన చేయుచున్నను పరిస్థితులు ప్రతికూల మయిన చోట మరియు అహంకారము మేలుకొనిన చోట, మానవునికి రాగద్వేషములు మేలుకొనును తన్ను అవమానించు చోట్లను, తనవారు తననెదిరించిన చోట్ల తను నమ్మిన సిద్ధాంతములకు వ్యతిరేకముగా ప్రవర్తించిన చోట తనవారు, తనతోటివారు తనని లెక్కచేయని చోట్ల యోగసాదకునికి మనస్సు దెబ్బతినును ఇట్లు ఇతరుల చేష్టలయందు, ప్రవర్తనయందు, మాటలయందు తన ప్రభావమును చూపు అంతర్యామిని వాసుదేవుడందురు

వాసనాద్వాసుదేవస్య వాసితంతే జగత్రయం
సర్వభూత నివాసోసి వాసుదేవ నమోస్తుతే ।

సకల భూతములయందును, జీవులయందును వసించువాడు వాసుదేవుడు ఇతరుల మాటలకు తనకు కోపము వచ్చినచో తమయందున్న కోపమును వాసుదేవుడు బేదించి చూపుచున్నాడన్న మాట సత్యము తనను విమర్శించువారియందును, నిందించు వారియందును, అవమానించు వారియందును వాసుదేవుని చూచి వాని శిక్షణగా అచ్చటి సంఘటనలను గ్రహించవలయును ఇచ్చట వాసుదేవుని శిక్షణ రెండు విధములు ఒకటి అట్టి పరిస్థితులయందు తన ఓర్పు, సహనము పరీక్షింపబడుట మరియు తనకు వారియందు ప్రేమాబిమానములు తగ్గకుండుట రెండు, అట్టి వ్యక్తులయందు తాను ప్రవర్తించవలసిన విదానము తెలియుట కనుక కేవలము ఓర్పు, సహనము నేర్పుటయేగాక కార్యదక్షత, యుక్తత, నేర్పరితనము, ఏమరుపాటు చెందకుండుట, సమయోచిత పరిజ్ఞానము, మున్నగునవి మానవునిలో వికసించవలయును ఈ లక్షణములన్నింటికి కలిపి పెద్దలు ఒకపేరు ఇచ్చిరి అదియే బుద్ధి అనబడుచున్నది ఇట్టి బుద్ధి మేలుకొని పనిచేయుటవలన వాసుదేవుని సాన్నిద్యమును పొందగలము తనతోటి వారియందు అకారణమయిన ప్రేమ, క్రిందివారియందు దాక్షిణ్యము, పైవారియందు ఋజుత్వము, విశ్వాసము, విదేయత, వీరందరియందును నిర్మలమైన ప్రేమ అను లక్షణములు వాసుదేవుని అనుగ్రహమునకు గుర్తులు అనగా ఇష్టాఇష్టముల కతీతమైన ప్రేమ కలిగి తనకిష్టమైన వారియందు ఎట్లు ప్రవర్తించునో, ఇష్టము లేనివారియందు సహితము అట్లే ప్రవర్తించుచు అట్టివారిలో వాసుదేవుని చూచు ప్రయత్నము చేయువారు వాసుదేవోపాసకులు అగుచున్నారు ఇట్టి సాదనకే మహనీయుల సాంగత్యమావశ్యకము వారినే గురువులందురు తాను పొందవలసిన శిక్షణ ననుసరించి గురువులు మారుచున్ననూ చిట్టచివరి అనుగ్రహము మాత్రము ఒకే గురువు చేతిలో వుండును అనగా ఇన్ని జన్మములయందును తనకెవరు గురువులుగానున్నను తాను మాత్రము ఆ అసలు గురువు పర్యవేక్షణలో తమకు తెలియకుండగనే వుండును ఈ ముందరి గురువులందరు వాని నియామకులే అగుదురు ఇట్టి పరస్పరత్వము పరమ గురువుల శ్రేణియందు కలదు దీనినే శ్రీరామానుజుల వారు "సారూప్యము అనిరి

నారాయణోపాసనయందు జీవప్రజ్ఞ అంతర్యామి ప్రజ్ఞయందు లీనమై సర్వాంతర్యామిత్వమునందును వారికి తమదేహమునకు, సృష్టియందలి ఇతర దేహములకును బేదము లేదు వారెప్పుడు ఏదేహముల నందయిన నుండగలరు ఈ మొత్తములోను వెలుగుచున్న నేను అను వెలుగే వారికి దేహమగును వారి ప్రయత్నము అప్రయత్నమే కాని, ప్రయత్న పూర్వకము కాదు ఎప్పుడు ఎచ్చట తాము స్మరింపబడినను వారచ్చట నారాయణుని మూర్తులుగ నుండగలరు

నారాయణుడనగా ఈ సమస్త సృష్టి యందు నిండియున్న ఆనందమను స్థితి జీవులను ఆనందమయమయిన స్థితిలో ఉంచుటయే నారాయణుని పరమావది అనగా మనలో ఉన్న నారాయణుడు సమస్తమయిన సృష్టిలోను ఆనందము అను పరమావదిగా ఉన్నాడు కారణము ననుసరించి పనిచేయుట ప్రతి జీవి యొక్క లక్షణము జీవులు కామమయ శరీరము కలవారు కనుక కారణముననుసరించి పనిచేయుట వారి లక్షణము దీనినే కార్యకారణ సంబందము అందురు కారణము లేకయే ఒక కార్యమునందు ఆనందము కలిగినచో అది బ్రహ్మానందము అనబడును

అదియే నిజమైన ఆనందము ఆ స్థితిలో ఎప్పుడూ ఉండగలుగ వలెను మనము ఒక కార్యమును చేయుచున్నాము అనుకున్నప్పుడు మనము చేయు ఉపాసనే మనలను బందించును ఉపాసన చేయుట తప్పుకాదు అయితే చేయుచున్నాము అన్న బావన మన మనస్సునందుండరాదు కారణము లేకయే పసిపిల్లలు ఆడుకుని ఆనందమును పొందుట, చక్కని గానమును వినినంతనే అప్రయత్నముగా దానియందు లీనమగుట, జరుగును అలా జీవితములో మనము చేయు సాదన ఒక ఆటగా, పాటగా నిరంతరము సాగవలెను అనగా తాను అనే అస్తిత్వం తనకు లేకుండుటయే నారాయణోపాసన విష్ణోపాసన, వాసుదేవోపాసన అలవడిన వారికి అప్రయత్నయంగా నారాయణోపాసన అలవడుతుంది జీవి బాల్యము నుంచి యవ్వనములోనికి యవ్వనము నుండి వృద్ధాప్యములోనికి ఎదిగినట్లు ఇవి సాదనలో వాటంతట అవే వచ్చే పరిణామ దశలు నేను పలానా అనే (conditioned state) స్థితిలోనుండి, నేను అంతర్యామిలో ఒక'బాగము అనే స్థితిలోనికి ఎదిగి, తరువాత తానే

అంతర్యామియై తనయందు శరీరమున్నదనే స్థితిలోనికి వెళ్ళిపోవును ఇ
స్థితియే నారాయణోపాసన

దీనినే 'శ్రీరామానుజులు సాయుజ్యము అనిరి మనచుట్టు ఉన్న
అన్ని వస్తువులయందు పరమాత్మ ఉన్నాడని జ్ఞాపకము పెట్టుకోవడ
విష్ణ్వోపాసన మన చుట్టు ఉన్నవారి ద్వారా మనతో పరమాత్మనిత్యమ
వ్యవహరిస్తున్నాడనేది గుర్తించ గలగడం వాసుదేవోపాసన నేను అన
'పరమాత్మ రెండు స్థితులు నశించి అది ఆనందమను ఒకటే స్థితి అ
గుర్తించగలుగటము నారాయణోపాసన నారాయణోపాసన చేయువారి
తమ అస్తిత్వం ఉండదు అందుకే జన్మ సంసార బంధనాత్' అన్నారు

సాదకుడు, సాదన, ప్రపంచము, జీవుడు, దేవుడు, మున్నగున
అన్నియు కరిగి ఒకే ఆనందముగా తెలియజేయబడుస్థి
నారాయణోపాసన యందు లబించును ఇదియే (ఈ ఆనందమే) రసమ
అనబడును ఇట్టి రసమువలన కలుగు ఆనందము రసానందమ
అనబడును ఈ ఆనందము కారణము అక్కరలేకయే కలిగినచో అ
బ్రహ్మానందము అనబడును మొదట విష్ణు ఉపాసనతో ప్రారంబించి
యోగసాదన వాసుదేవోపాసన వలన క్షాళనమై, స్వచ్ఛమై అంతర్యామి
ప్రజ్ఞను ప్రసరించుటకు ఉన్ముఖము అగును అప్పుడు యోగసాద
యోగికి సహజస్థితి యగును దానినే యోగమనియు సామ్యమనియ
అందురు అట్టివానికి నారాయణోపాసన సహజస్థితియగును అటువంట
విష్ణువు మమ్ము ప్రచోదనము చేయును గాక అని ప్రార్థించుచున్నాము

మంత్రము 5
వజ్రనఖాయ విద్మహే తీక్ష్ణదగ్‌ష్ట్రాయ దీమహి।

# అనువాకము 7

మంత్రము 1
తన్నో నారసిగ్‌ంహ ప్రచోదయాత్।

## ప్రతిపదార్థము

వజ్రనఖాయ = వజ్రమనబడు గోళ్ళు కలిగినవానిని
తీక్ష్ణదగ్‌ష్ట్రాయ = వాడియైన కోరలు గలవానిని

## తాత్పర్యము

పదునైన గోళ్ళు కలిగిన వానిని తెలుసుకొనుచున్నాము వాడియైన కోరలు కలవానిని దారణ చేయుచున్నాము అట్టి నరసింహమూర్తి మమ్ములను ప్రచోదనము చేయును గాక।

## వివరణ

నరసింహుడు అనగా నరులలోని సింహము (Lion in man) సింహము ధైర్య సాహసములకు, రక్షణకు గుర్తు దీనినే రాశి చక్రమందు సింహరాశిగా గుర్తించిరి మానవదేహమున చాతీకి మద్య క్రింద బాగమున ఉదరము, చాతీ కలియు ప్రదేశము ఈ రాశి సంకేతము (Lower edge of the sternum) ఇదియే గుహాముఖమని చెప్పబడినది ఆ రాశి మనలో కొన్ని లక్షణములను మేల్కొలుపును

సింహరాశి హృదయ క్షేత్రమందు పనిచేయును కనుక, హృదయమునందు ప్రేమ వ్యక్తమగుచున్నది జీవుని యందు ప్రేమగా మేల్కొనునదే ప్రకృతి లేదా జగన్మాత ఆమె హృదయ క్షేత్రమందున్నది కనుక ఆమె సింహరాశిని అదిష్టించియున్నది అనగా జీవులను రక్షించుట, శత్రువులను శిక్షించుట అను లక్షణము చేత ఆమె సింహమును అదిష్టించి యున్నది రాశులు, తూర్పున ఉదయించి పడమరన అస్తమించును తూర్పున సింహరాశి తర్వాత కన్యారాశి ఉదయించును ఆ సింహరాశి తూర్పు నుండి పడమరకు ప్రయాణించినపుడు పడమటి వైపు చూచిన యెడల సింహరాశి క్రిందికి ఉండి దానిపైన కన్యారాశి యుండును

అపుడు కన్యారూపి యైన జగన్మాత సింహవాహన అని వర్ణింపబడినది కన్యారాశి నిర్మలమైన ప్రేమకు గుర్తు కనుకనే జగన్మాతను కన్యకాపరమేశ్వరి, బాల, కౌమారి రూపములందు అర్చింతురు ఎవరియందైతే నిర్మలమైన, పవిత్రమైన ప్రేమ వర్తించునో వానియందు సింహరాశి లక్షణములు మేల్కొనును

ప్రేమ అను లక్షణమును పురుషపరంగా చెప్పినపుడు నారసింహుడు అంటారు నారసింహుడనగా మనయందు అనగా నరునియందు మేల్కొనినట్టి సింహరాశి లక్షణములు ఆయనకు తీక్షణమైనదంష్ట్రములు లేదా కోరలుండును ప్రకృతిలో ఉన్న శక్తులు మొదలగునవి తీక్షణమయిన శక్తులుగా మేల్కొని పనిచేయును తీక్ష్ణ దంష్ట్రలు జీవుల దుష్కర్మములను, పాపములను శిక్షించుటకు భగవంతునికి గల ఆయుదములు అవియే వ్యాదులు, చిక్కులు, ఆపదలు మున్నగునవి ఇవియే నరసింహుని కోరలు వ్యాది చేతను, కష్టము చేతను బాద పడినవాడు కొంతకాలము తరువాత అటువంటి కష్టము, బాద కలిగిన ఇతరులను చూచి, తనకు కలిగిన బాద గుర్తుకువచ్చి, వారియందు సానుభూతి చూపి, వారిని సేవింపగలుగును అనగా అట్లు వాని హృదయమునందు సింహరాశి లక్షణములైన ప్రేమ, దయ, సానుభూతి మేల్కొనును మొదట జీవులలోని దుష్టత్వమును తన కోరలచే చీల్చి, పిదప వానియందు తన సౌమ్యరూపమును నిల్పుచున్నాడు ఇదియే నరసింహుని అవతారరహస్యము, ఇంకను, వజ్రమును కూడిన నఖములు లేదా గోళ్ళు అనగా మెరుపుతీగలు మొదలగునవి అని అర్థము జీవులలోని దుష్టత్వము పెరిగినపుడు తుపాను, మెరుపులు, పిడుగులు మొదలగునవి ఉపయోగించి దుష్టులను సంహరించును ఈ సింహరాశి కెదురుగా కుంభరాశియున్నది కనుక ఈ రెండు రాశుల లక్షణములు పరస్పర పరిపోషకములు

కుంభరాశి మేదాశక్తి, అఖండ విజ్ఞానము మున్నగువానిని సూచించును కుంభరాశి లక్షణములు సింహరాశి యందు ప్రతిబింబించుట వలన నరసింహము అను ప్రవృత్తి జీవులలో మేల్కొనును అనగా హృదయమునందు ప్రేమ కలిగి, అట్టి ప్రేమతో వారిని రక్షించు సామర్థ్యము కలిగినపుడు అట్టి వానియందు పరిదులు లేని విజ్ఞానము పుట్టును అనగా తనకు, ఇతరులకు బేదమునశించి, అంతయూ ఒకే వెలుగుగా దర్శింపగలుగును ఇదియే కుంభరాశి లక్షణము జీవికి జీవికి

నడుమ గల అంతరములు తొలగింపబడుట కుంభరాశి ప్రబావము వలన కలుగును ఇది బౌతికముగా కాక ప్రేమచేతనే సాద్యమగును కనుకనే కుంభరాశికి సింహారాశి పరిపోషకమగును ఇట్టి జ్ఞానము మానవునకు అలవడువలెనన్నచో తీక్షణమయిన వివేకము, పరిస్థితులందు నిర్మోహామాటముగా, సూటిగా వ్యవహరించు బుద్ధి, ఋజుత్వము కావలెను వీటివలన మాత్రమే నరసింహము అను దివ్య ప్రవృత్తి మానవులయందు పుట్టును అటువంటి నారసింహుడు మన బుద్ధులను ప్రచోదనము చేయును గాక ।

## మంత్రము 2

బాస్కరాయ విద్మహే మహద్యుతికరాయ దీమహి
తన్నో ఆదిత్యః ప్రచోదయాత్

## ప్రతిపదార్థము

బాస్కరాయ = వెలుగులకు కారణమయినవాడు

విద్మహే = ద్యానము చేయుచున్నాము, తెలుసుకొనుచున్నాము

మహద్యుతి కరాయ = మహాత్తు అను వెలుగును పుట్టించువాడు

ఆదిత్యః = ఆదిత్యుడు, అదితి కుమారుడు

## తాత్పర్యము

వెలుగునిచ్చు వానిని తెలుసుకొనుచున్నాము అతనినే మహాత్తు అను వెలుగునకు కారణమైన వానిగా దారణముచేయుచున్నాము అతడు ఆదిత్యుడై మమ్మలను ప్రచోదనము చేయును గాక

## వివరణ

మనలో ఉన్న బుద్ధిని వెలిగించువాడు నారాయణుడు చోటులో ఉన్న మహాత్తు ఎవరివలన మేల్కొని పనిచేయుచున్నదో ఆయనను మేము ధ్యానము చేయుదుము గాక । ఒక ఎత్తైన ప్రదేశమున నిలుచుని పైకి చూచినచో మన చుట్టునున్న ఆకాశము బోర్లించిన మూకుడు వలె కనిపించును అట్లు చూచు వానిని పశ్యకుడు' అందురు పైన కనిపించు ఆకాశమునే కశ్యపుడు అందురు ఇందు మొదటి పదము కేంద్రమునకును, రెండవపదము పరిదికిని సంకేతములు కశ్యపుడు అనునది సృష్టిలో మొదటి వ్యక్తస్థితి ఆయనకు దితి, అదితి అను బార్యలు అదితి అనగా

తూర్పు దితి అనగా పడమర దితికి కలిగిన సంతానము దైత్యులు అదితికి కలిగిన సంతానము ఆదిత్యులు సూర్యుడు ఉదయించు లేక పుట్టు చోటును అదితి అందురు కనుకనే సూర్యుడు ఆదిత్యుడు లేక అదితి కుమారుడు ఇది దేవతలు పుట్టినచోటు

పడమర వైపు రాక్షసులు జన్మించినచోటు రాత్రి లేక చీకటిలో కనపడక అంతర్గతముగా ఉన్న శక్తులు, భూమిలో ఉన్న శక్తులు, శరీరంలోని అణుమయ జగత్తులో ఉండే శక్తులు వీరందరినీ రాక్షసులుగా చెప్పిరి మనము రాక్షసులు అనగా దుష్టులు అని బావించెదము కానీ వేద సంప్రదాయము రాక్షసులను దుష్టులుగా వర్ణించలేదు శరీరమునందు ఎక్కువ శ్రమను ఓర్చుకొను దాతువులను నిర్మించిన శక్తులను (Most strenous and labourious work) రాక్షసులు అందురు ఉదాహరణకు శరీరములోని ఎముకలు, కండరములు, జీవకణములు నిర్మాణము చేయుశక్తులు భూమి తన కక్ష్యలో నిలచియుండుటకు కారణమైన వారు, భూమి లోపలి పొరలలో పనిచేయు శక్తులు, సుప్త చైతన్యమునందు పనిచేయు శక్తులు (subconscious), శరీరములో అణు, కణ నిర్మాణము మొదలగు వాటియందు పనిచేయు శక్తులు, శరీరమును నిలబెట్టి ఉంచు శక్తులు రాక్షసులుగా చెప్పబడినారు మనకన్నా పై లోకము (plane) లలో పనిచేయువారిని దేవతలు అందురు వారు చోటులో ఉన్నటువంటి భూమి, సూర్యుడు మొదలయిన వాటి అస్తిత్వమునకు కారణమైనటువంటి వారు కనుక తూర్పున పుట్టిన వారిని ఆదిత్యులు అందురు

సూర్యుని ద్యానించునపుడు సూర్యుని పుట్టుకకు కారణమైనటువంటి మహా వెలుగుయందు మనము ప్రవేశించుదుము దానికి ముందు బౌతికమైన సూర్యుని అర్చన చేయవలయును సూర్యుడు ఒక బౌతిక గోళము మాత్రమే కాదు సౌరమండలము అంతయు తన దేహముకాగా, అందు వ్యాపించి యున్న "నేను ' అను ప్రజ్ఞయే సూర్యుడు అట్లు "నేను" అను ప్రజ్ఞ వలన ఒక వెలుగు కేంద్రమునుండి పుట్టి బౌతిక సూర్యగోళముగా ప్రకాశించుచున్నది ఆయనయందే కుజుడు, శుక్రుడు, బుదులు మున్నగు గ్రహ ప్రజ్ఞలు పుట్టి పెరుగుచున్నవి వీటి అన్నిటి సమాహార ప్రజ్ఞయే సూర్యుడు అతడు సౌరమండలమునందలి సమస్త భూతములకు వెలుగునిచ్చును సూర్యునియందు పనిచేయుచున్న ఈ వెలుగు అను లక్షణము మహత్తు వలన పుట్టుచున్నది మహత్తు అనగా మొత్తము

చోటునందు యిమిడియున్న బుద్ధి అను వెలుగు ఇది మనయందు బుద్ధి అను లక్షణముగా మేలుకొని పనిచేయుచున్నది

ఆదిత్యులు మొత్తము పన్నెండుమంది ఈ పన్నెండుమంది ఒక కుటుంబముగా, ఏర్పడి విశ్వమునందు దర్శించుచున్నారు ఇట్లు విశ్వము నందలి సూర్యులు పన్నెండుమంది చొప్పున గుంపులుగా ఏర్పడి పరిభ్రమించుచున్నారు ఇట్లు ఒక వెలుగు అనేక వెలుగులుగా వ్యాపించునట్టి శీలము గలవాడు ఆదిత్యుడు 'ఆదిత్య వర్ణః తమసస్తు పారే ' చీకటి వెనుకనున్నటువంటి సూర్యుని యొక్క వెలుగు సూర్యుడు వెలుగుగా పుట్టకముందు చీకటియందున్నాడు సూర్యుడు చీకటియందు అంతర్లీనముగా నుండి వెలుగుగా వ్యక్తమగుచున్నాడు ఆ వ్యక్తము చేయుటకు సహాయపడువానిని ''సుపరుడు' అందురు బౌతికమయిన లోకములలోనికి పైనున్న వెలుగులను తీసుకొని వచ్చుచున్నాడు కనుక ఆయనను సువర్ణుడు అందురు అందుకే సువర్ణుడు తన వీపుపై అమృతబాండము మోసుకొని వచ్చెను అని అందురు

మంత్రము 3

వైశ్వానరాయ విద్మహే లాలీలాయ దీమహి।
తన్నో అగ్నిః ప్రచోదయాత్॥

ప్రతిపదార్థము

వైశ్వానరాయ = వైశ్వానరుని

విద్మహే = తెలుసుకొనుచున్నాము

లాలీలాయ = సర్వమును గ్రహించుశక్తిగల వానిగా

దీమహి = దారణ చేయుచున్నాము

## తాత్పర్యము

వైశ్వానరునిగనున్నవానిని తెలుసుకొనుచున్నాము సర్వమును గ్రహించువానిని దారణ చేయుచున్నాము అట్టి అగ్ని మమ్ములను ప్రేరేపించుగాక।

వివరణ

వైశ్వానరుడనగా విశ్వమునందలి నరులరూపమున వ్యాపించి యున్నవాడు ఈయననే వైశ్వానరాగ్ని అని అర్చింతురు ఈయన

సృష్టియందు నరుల దేహములలో ప్రాణశక్తిగా వ్యాపించి యుండి ఆహారము స్వీకరించి, పచనము చేయుశక్తిగ తెలియబడుచున్నాడు మానవ శరీరమునందు పనిచేయుచున్న ప్రాణశక్తి మూడు విధములు అది శిరస్సునందు మేదాగ్నియను రూపమున పనిచేయుచున్నది కడుపులో గార్హపత్యాగ్ని అనుపేర పనిచేయుచున్నది దీనినే వైశ్వానరాగ్ని అని కూడ అందురు శరీరము క్రిందిబాగమున అది దక్షిణాగ్ని అను పేర పనిచేయుచున్నది ఇందు మేదాగ్ని లేక ఆహవనీయాగ్ని మేదాశక్తి, ఆలోచనలకు, బుద్ధికి కారణముగా శిరస్సులో పనిచేయుచున్నది అగ్ని అను పదమునకు నిప్పు అని అర్థముకాదు వెలుగు అని అర్థము ఈ వెలుగు రెండు విధములు ఒకటి బౌతికము రెండు అవ్యక్తము అనగా కనిపించకపోయినను ఉన్నట్టిది ఉదాహరణకు అయస్కాంత క్షేత్రము కనిపించకపోయినను ఉన్నట్లు మనకు తెలియును ఇట్లే భూమి మున్నగు వానికి గల ఆకర్షణశక్తులు వ్యక్తముగా నున్న వెలుగునే అగ్ని అని పిలుతుము

బౌతికముగ వ్యక్తముగా నున్న వస్తువులకు, శక్తులకు వాని వెనుక నున్న వెలుగే ఆదారముగ పనిచేయుచున్నది అణువునందున్న వెలుగు వలన పదార్థమేర్పడుచున్నది ఈ అగ్నియే జీవులయందలి నేను అను ప్రజ్ఞకు కారణముగ పనిచేయుచున్నది మనలో మెలకువగను గీ పరిసరములయందు ఎరుక కలిగియున్న నేను అను ప్రజ్ఞయే అగ్ని అను పేర పిలువబడుచున్నది ఈ అగ్ని సృష్టికి మొట్టమొదటగా మేలుకున్న దేవత ఆయన తర్వాతనే ఇంద్రాది దేవతలందరు మేలుకొనిరి కనుకనే అన్ని దేవతలకన్న ముందు అగ్ని నారాదింపవలెను మరియు మిగిలిన దేవతల నారాదించుటకు ఈ అగ్నియే మార్గమగుచున్నాడు హోమమునందు ఇతర దేవతలనందరిని ఆవాహనము చేయునప్పుడు హోమ ద్రవ్యములను అగ్నిహోత్రమునందు సమర్పింతుము ఈయన సృష్టియంతటనూ నేను అను ప్రజ్ఞగ అట్టి మెలకువగ వ్యాపించియున్నాడు మేధాగ్ని అనగా మానవునిలో పనిచేయుచున్న మేదస్సు అను తెలివిలేక వెలుగు తెలివితేటలు, ఆలోచనలు మున్నగునవి దీనివలన పనిచేయును అట్లే మానవునికి ఆకలి పుట్టించి ఆహారమును స్వీకరించునట్లు చేసి దానిని పచనము చేయునట్టి అగ్నిని వైశ్వానరాగ్ని అందురు

మన శరీరమందలి anabolism, metaboalism, digestion అను ప్రవృత్తులుగా పనిచేయుచున్న శక్తి ఇదియే ఇట్టి వైశ్వానరాగ్ని వలన జీవులకు జీవించుట సాధ్యమగుచున్నది సృష్టియందు నరదేహముల రూపమున నున్న పరమాత్మ నరుని రూపమున ప్రాణశక్తియను అశ్వమునదిరోహించి విశ్వమునందు చరించుచుండును మహాభారతము ఆదిపర్వమునందు ఉదంకుడు నాగ లోకమునకేగగా అతనికి అశ్వము నదిరోహించి దర్శనమిచ్చిన మహాపురుషుడితడే ఉదంకుడు ఆ అశ్వము చెవిలో నూదగా అశ్వము యొక్క శరీరమునుండి అగ్ని జ్వాలలు రేగి విశ్వమంతయు వ్యాపించెను శబ్దమును వినుట వలన ప్రాణశక్తి ఉత్తేజము పొంది జీవి విశ్వములో అంతర్యామిత్వమునందును అట్లు పరమాత్మచే వాక్కుగా ఉచ్చరింపబడి ఈ సృష్టి అంతయు వ్యాపించు ప్రజ్ఞనే విష్ణువందురు కనుకనే అగ్ని విష్ణువు అశ్వనీ దేవతలుగా స్తోత్రము చేయబడిరి వీరిద్దరివలననే సృష్టి నిలబడియున్నది

దక్షిణాగ్ని యనగా శరీరమునందు క్రింది బాగమున పనిచేయుచున్న వెలుగు ఇది జీవుల యందు సంతానోత్పత్తి, గర్భదారణము మున్నగు వానిని పరిపాలించును కామము (Desire)గర్భమునందు బీజాంకురము (Fertilisation) పిండమేర్పడుట (Reproduction) అవయవము లేర్పడుట, ప్రసూతి (Maternity) అనునవి ఈ దక్షిణాగ్ని వలననే కలుగుచున్నవి

పూర్వము విశ్వానరుడను బ్రాహ్మణుడు సంతానము కొరకు శివుని గూర్చి తపస్సుచేసెను శివుడు ప్రత్యక్షమై అతనికి అల్పాయువుగల కుమారుడు జన్మించునని చెప్పెను విశ్వానరుని బార్య శుచిష్మతి గర్భము దరించి పుత్రుని ప్రసవించెను అతనిపేరు శుచిష్మంతుడు విశ్వానరుడనగా విశ్వమునందలి మానవరూపము (The concept of human being) శుచిష్మతి అనగా తపింపచేయుట చేత పరిశుద్ధి అయినట్టిది

ఇచట తపించుట అనగా sublimation అని అర్థము జీవ (ప్రజ్ఞ) స్వచ్ఛమైన స్థితిలో అనగా ఆకార వికారాదులు లేని స్థితిలోనున్న పుడు అది నిర్మలముగ నుండును అట్టి స్థితిలోనున్న ప్రజ్ఞయే అగ్ని (consciousness) కనుకనే శుచిష్మతికి అగ్ని కుమారుడై పుట్టెను ఇచ్చట శివుడనగా సృష్టికతీతముగా నున్న అంతర్యామి (The supreme consciousness or the background consciousness) అగ్ని (లేక శుచిష్మంతుడు) తానల్పాయువునని తెలిసి తల్లిదండ్రులు దుఃఖించుట చూచి, తాను శివుని గూర్చి తపస్సు చేసెను అనగా భౌతిక స్థితిలోనికి దిగివచ్చిన జీవ ప్రజ్ఞ మరలనిత్య

జీవితమునందు, పరిస్థితులయందు, సన్నివేశములయందు, సుఖాన్వేషణ పేర అంతర్యామిని గూర్చి తపించును అందుచేతనే జీవునకు సుఖములెన్ని కలిగినను సంతృప్తియుండదు అట్టి సంతృప్తి అంతర్యామిని దర్శించుటవలన మాత్రమే కలుగును కనుకనే శివునిగూర్చి తపస్సు చేయుచున్న బాలునికి ఇంద్రుడు కనిపించి వరములు కోరుమని చెప్పెను ఇంద్రుడనగా నింద్రియములయందు చరించుచున్న మనస్సు పంచేంద్రియముల సంతృప్తికై మానవుల యత్నించుచున్నంతకాలము అంతర్లీనముగనున్న పరమాత్మ దర్శనము లభింపదు

ఇంద్రుడు ఆబాలుని వజ్రాయుదముతో కొట్టగా అతడు మూర్ఛపోయెను వజ్రాయుదమనగ జీవుని వెన్నెముకయందు పనిచేయుచున్న కుండలినీశక్తి అంతర్యామిని గురించి తపించు జీవప్రజ్ఞ క్రమముగ బౌతిక సుఖముల యందలి అపేక్షను తొలగించుకొని అంతర్యామియందు దృష్టి నిలుపును అనగా బౌతిక విషయములయందు స్పృహ నశించును

అట్టి వానికి కుండలిని ఊర్ధ్వగతమై శిరస్సునందలి ఇంద్రగ్రంది లేక ఇంద్రయోని అనుకేంద్రమును చేరును ఇట్టిస్థితిలోనున్నవారికి బౌతికప్రజ్ఞ పూర్తిగ నశించును ఇదియే ఇంద్రుడు వజ్రాయుదముతో కొట్టగా బాలుడు స్పృహాకోల్పోవుటగా చెప్పబడినది అప్పుడు శివుడు ప్రత్యక్షమగును అనగా అట్టి స్థితిలో జీవునికి అంతర్యామి దర్శనమగును శివము అను పదమునకు శుభము, ఆనందము అని అర్ధము అప్పుడు శివుడు అగ్నిని దీర్ఘాయుష్మంతునిగ చేసెను పన్నెండు సంవత్సరములు మించి బ్రతుకడు అన్న పరిమిత ఆయుర్దాయమునుండి అతనిని దీర్ఘాయువుగా చేయుట శివుని అనుగ్రహాము పన్నెండు సంవత్సరములు అనునది పరిమితత్వమునకు సంకేతము పన్నెండు అనగా ఒక సంవత్సర కాలములో సూర్యుడు చుట్టివచ్చు రాసులమొత్తము సూర్యుడు పన్నెండు రాసులలో తిరిగివచ్చుటకు ఒక సంవత్సరము పట్టును అట్టి గమనముతో కూడిన పరిమిత ఆయుర్దాయమే మానవుని జీవిత కాలము పన్నెండు రాశుల యందు చరించు గ్రహాగోళాదులు జీవుని పరిమితత్వములోనికి మళ్ళించును వానియందంతర్యామి నుపాసించువానికి అట్టి పరిమితత్వము తొలగి, బౌతిక దేహామునకు సంబందములేని పరిపూర్ణత్వము సిద్ధించును

శివుడు జీవులననుగ్రహించి ఇచ్చునదియే అట్టి అనుగ్రహమును పొందినవాడు గ్రహముల ప్రభావముచే బంధింపబడక, వానిపై ఆదిపత్యమును పొందును కనుకనే శివుడు శుచిష్మంతుని అష్టదిక్పాలకులలో నొకనిగా అగ్నేయ దిక్కున కదిపతిగా చేసెను అగ్ని అనునది అట్టి స్థితికి చెందిన పేరుగాని, వ్యక్తియొక్క నామముగాదు అగ్ని యొక్క వాహనము మేషము అనగా మేషరాశితో ప్రారంభమైన సంవత్సరమునితడు పరిపాలించును చోటునందు అగ్ని, దాని ప్రజ్ఞమేల్కొని, జీవుని యందు దిగి వచ్చిన తరువాత, సంవత్సర చక్రము మేషరాశితో ప్రారంభమయ్యెను అగ్ని బార్య పేరు స్వాహా దేవి అనగా దేవతలకు స్వాగతము పలుకునది అని అర్థము అగ్ని వలన సంవత్సర చక్రము ప్రారంభమైన తరువాత ఇంద్రాది దేవతలు సృష్టిలోనికి దిగి వత్తురు కనుకనే అగ్ని దేవతలలో మొట్టమొదటివానిగా కీర్తింపబడినాడు మానవ జీవితమునందు మంచి చెడుల సంఘర్షణ నిరంతరము జరుగుచుండును కొంతకాలము మంచిగుణములు ఆదిపత్యము వహించుచుండగా మరికొంతకాలము చెడ్డగుణములు జయించు చుండును ఇట్టి సంఘర్షణ ప్రతిమానవుని జీవితమునందును నిరంతరము జరుగుచుండును ఇదియే దేవాసురయుద్ధముగా చెప్పబడినది అందు కొంతకాలము దేవతలు ఓడిపోవుచుండగా మరికొంతకాలము జయించుచుందురు మానవుడు జీవితమున యోగసాదనయందు పరిపూర్ణత సాదించుకొనువరకు ఇట్టి సంఘర్షణ కొనసాగుచునే యుండును

దేవాసుర యుద్ధమునందు చివరకు దేవతలు గెలిచి తమ విజయమునకు గర్వపడిరి మంచిపనులు చేయుట నారంబించినవానికి తనకు తెలియకుండగనే తనకట్టి సద్గుణములు కలవని గర్వమంకురించును కనుకనే దేవతలు తమ విజయమును గూర్చి పరబ్రహ్మమునకు నివేదించుటకై అగ్నిని నియోగించిరి భౌతికలోకమున పనిచేయు ప్రజ్ఞలన్నియు నేనను ప్రజ్ఞపై నాదారపడి పనిచేయుచుండును అదియే అగ్ని వారుమరల పరబ్రహ్మమును చేరవలయునన్నచో ఈ అగ్నియే ఆదారము ప్రజ్ఞలన్నియు నేనను మెలకువ యందు లీనముకాగా, అద్వైకత్వము నొందిన బాహ్యప్రజ్ఞ లేక మెలకువ అంతర్ముఖమగును

ఇదియే అగ్నిపరబ్రహ్మమును సమీపించుట పరబ్రహ్మము నీ వెవరవని యడుగగా అతడు నేను అగ్నిని అని సమాదానమిచ్చెను అప్పుడు పరబ్రహ్మము నీవేమి చేయగలవనెను అగ్ని తాను దహింపగలనని చెప్పెను అంతర్యామి అయిన పరమాత్మను సమీపించుచున్నను జీవప్రజ్ఞకు తన వ్యక్తిత్వముపై పట్టుపోదు కాని అంతర్యామియందు లీనమయినతరువాత వ్యక్తిత్వము తనకు తెలియకుండగనే నశించును నీటిలో మంచుగడ్డ వేసినపుడు మంచుగడ్డ కరిగి నీరగులోపల దాని ప్రత్యేకత ఉండును కదా। అంతర్యామి యందు లీనమైనను కొంతకాలమిట్టి స్పృహామాత్రము జీవప్రజ్ఞయందు నిలచియుండును.

The tendencies of behaviour of the soul consciousness will continue as glimpses memories of the past associations of the previous life though dissolved in supracosmic consciousness కాని అట్టి స్థితియందు జీవత్వము పూర్తిగా తొలగిపోవును కనుక భౌతికమగు లక్షణములేవియు పనిచేయవు కనుకనే పరబ్రహ్మము ఒక గడ్డిపోచను చూపించి దీనిని దహింపుమని చెప్పగా అగ్ని దహింపలేక పోయెను అప్పుడు సమస్తమునకు కారణము అంతర్యామియేయని తెలిసికొని అగ్ని నమస్కరించెను

లాలీలాయ అనగా సర్వమును తనయందు గ్రహించు ప్రజ్ఞ గలవాడని అర్థము అగ్ని తన జ్వాలలచే సర్వమును దహించి తనలోపలికి ఇముడ్చుకొనగలుగును అంతియేకాక శరీరమునందు ప్రాణశక్తిగా పనిచేయుచున్న అగ్ని పంచేంద్రియ ప్రజ్ఞల ద్వారా పనిచేయుచున్నాడు అనగా వినుట, చూచుట, ఆహారము స్వీకరించుట మున్నగు ప్రక్రియల ద్వారా భౌతిక ప్రపంచ విషయములను తనలోపలికి స్వీకరించుచున్నాడు. ఈ అగ్నియే శ్వాసకోసమునందు శ్వాసించుట అనుప్రజ్ఞగా పనిచేయుచు శ్వాసకు అదిపతియై శరీరమును నడుపుచున్నాడు కనుక మనయందు పనిచేయుచున్న అగ్నిని ద్యానము చేయవలయునన్నచో శ్వాసను ద్యానము చేయవలయును

## మంత్రము 4

కాత్యాయనాయ విద్మహే కన్యకుమారి దీమహి।
తన్నోదుర్గిః ప్రచోదయాత్॥

## ప్రతిపదార్ధము

కాత్యాయనాయ = కాత్యాయనుని పుత్రిక

కన్యకుమారి = కన్యాకుమారి అను దేవత

## తాత్పర్యము

కాత్యాయనీ దేవిని మేము తెలుసుకొనుచున్నాము కన్యగా ఆమెను దారణ చేయుచున్నాము ఆమె దుర్గయై మమ్ము ప్రేరేపించునుగాక!

## వివరణ

కన్య అనునది untainted love అని మాస్టరు E K translate చేశారు కన్య నగా మచ్చలేనిది ప్రేమయనునది దాంపత్య లోకములలోనికి వచ్చుసరికి condition అగుచున్నది తన బార్యను, తన పిల్లలను మాత్రమే ప్రేమించుట జరుగుచున్నది కాని అంతకుముందున్న ప్రేమ స్వచ్ఛమైన ను నావారు అనికాకుండ సహజస్థితిలోనున్న స్వచ్ఛమైన ప్రేమను కన్య అందురు అట్టి అవతారములోనున్న అమ్మ వారిని కన్యకుమారి, కౌమారి అనికూడపిలిచెదరు ప్రేమకు కారణమక్కరలేనిస్థితి మాతృప్రేమ కూడ condition అగుచున్నది ఎందుకనగా తల్లి తన బిడ్డలను మాత్రమే ప్రేమించగలుగును

అంతకన్న పవిత్రమైనది జగన్మాత ప్రేమ ఆమె సృష్టికే తల్లి ఆమె తన బిడ్డలు అని మాత్రమే కాక ప్రేమను సహజస్థితిగా కలిగియున్నది ఆమె మొట్టమొదట మహావిష్ణువుయందు ప్రేమగా మేల్కొనినది కనుకనే ఆమెను లక్ష్మియందురు The first love నారాయణుని హృదయస్థానమున యుండును బగవంతునియందు ప్రేమయను గుణము వేరుగా మేల్కొంచినపుడు ఆ గుణమును లక్ష్మి యందురు ఆమెకు జగన్మాత మహామాయ అని పలుపేర్లుకలవు దేవీ బాగవతమున రాదాకృష్ణులుగా చెప్పబడిరి కనుక ఆమెను స్వచ్ఛమైన ప్రేమ కలిగిన కన్యకుమారిగా ద్యానము చేసిరి ప్రేమ ఎప్పుడూ స్వచ్ఛమైనది కాని మనము ఒక కారణము ఆదారముగా ప్రేమించుచున్నాము అని పొరపాటు పడుచున్నాము కనుకనే అది కొందరియందే మనకు అబ్యాసమగుచున్నది అందరియందగుటలేదు అందరియందబ్యాసమయినప్పుడు కొందరి యందున్న మాయ తొలగిపోవును Actually love is unconditional

ఒక గదిలోనికి కిటికీ ద్వారా సూర్యుని వెలుగు పడినపుడు పడినంత మేరకే వెలుగుయుండును మిగతా మేరకు వెలుగు కావలెననగా గదిగోడలు పగలగొట్టనక్కరలేదు మనమే బయటకు వచ్చి నిలబడవలయును

అలాగే నేను శరీరమను condition నుండి బయటకు వచ్చినయెడల మొత్తము ప్రేమ అను వెలుగులో మనము ఉందుము మనలో ప్రేమ అను సహజస్థితిని మనము గ్రహించవలయును దాని కబ్యాసము కావలయును కనుక మనయందు జగన్మాత, ప్రేమయను పేరుతో మేల్కొనును కాత్యాయనీవ్రతము కృష్ణుడు గోపికలకుపదేశించెను మార్గశిరములో గోదాదేవి కూడ చేసెను ఆమెకు ఆ వ్రతము చేయునపుడు ఆకలి కూడ తెలిసెడిదికాదు కృష్ణునిపైననే ఆమె ద్యానముండెడిది కనులు మూసినా తెరచినా నారాయణుడే మెదిలెడివాడు ఆయన సేవపైననే ఆమె ద్యానము అవిదముగా ఏప్రయత్నములేకయే మా ఊహాలు నీపై లగ్నమగునట్లు చేయవలసినది దుర్గ అనగా దుర్గము అనగా చొచ్చుటకు వీలుకానిది చోటులో రక్షణశక్తి యొకటి కలదు మనకు కష్టములు కలిగినప్పుడు తొలగించెడి శక్తిగా బౌతికముగా తెలియబడుచున్నది జబ్బులు వచ్చినపుడు తొలగించుటగా, వ్యాదులనే కారణముతో మనయందున్నదుష్కర్మల యొక్క సంస్కారములు మనలను హింసించుచున్నప్పుడు వానినుండి మనలను ఆశక్తియే రక్షించును వ్యాది కారణములను ఆమె తల్లియై నిర్మూలించును అటువంటి ప్రేమమయమయిన శక్తిని మనము ద్యానింతుము గాక।

మంత్రము 5

సహస్ర పరమాదేవీ శతమూలా శతాఙ్కురా।
సర్వగ్ం హరతుమే పాపం దూర్వా దుస్స్వప్న నాశనీ॥

ప్రతిపదార్థము

సహస్రపరమా = సహస్రమునకన్న అతీతమై వెలుగునది

దేవీ = ఓ దేవీ

శతమూలా = నూరు మూలములు కలిగినట్టిది

శతాఙ్కురా = నూరు అంకురములు కలిగినట్టిది

దుస్స్వప్న నాశనీ = చెడ్డ కలలను నశింపచేయునట్టిది

దూర్వా = గరిక

మే = నాయొక్క
సర్వగ్ం పాపం = సమస్తమైన పాపములను
హరతు = హరించును గాక।

## తాత్పర్యము

సహస్రమున కతీతమై నూరు మూలములు లేక వ్రేళ్ళు మరియు నూరు అంకురములుగా వెలుగుచు, దుష్టస్వప్నములను నశింపజేయునట్టి గరిక యను దేవి నా పాపమంతటిని హరించును గాక।

## వివరణ

'సహస్రపరమా' అనగా వేలకిరణములు కలిగి అవ్యక్తముగానున్న వెలుగు యని అర్థము మరియు ఈ వెలుగే మానవుని శిరస్సునందలి సహస్రారమునకు కారణమైన వెలుగు ఈమెయే మూల ప్రకృతనియు, అదితి అనియు, పరాదేవి అనియు పురాణములయందు కీర్తింపబడినది అట్టి అవ్యక్తస్థితి నుండి ఈమె జీవులలో సహస్రారముగ మేల్కొనును మరియు జీవుని యందలి ప్రాణశక్తిగా వెన్నెముకయందు పనిచేయును అట్లు పనిచేయుచున్న ప్రాణశక్తివలన మానవునకు నూరు సంవత్సరముల ఆయుర్దాయమేర్పడుచున్నది కనుక ఈమె శతమూల అని చెప్పబడినది అట్టి మానవునికి సంతతిగా వృద్ధిపొందుచూ మరల వారికి సంతతిగా వంశవృద్ధి యగుటను శతాంకురా అని సూచింపబడినది అట్లే అసంఖ్యాకులైన జీవులలో ఈమె ప్రాణశక్తిగా పనిచేయుచున్నది కనుక శతాఙ్కుర అని పిలువబడినది ఇట్టి వెలుగును తన శరీరమునందును, తన చుట్టును గమనించి దర్శించువానికి తనజీవితము, అందలి కష్టనష్టములు, చెడ్డకలలు నశించి జీవితమంతయు నొక వెలుగుగా దర్శనమగును అట్టివానికి పాపముచేయుట యనునది తొలగిపోవును ఇట్టి ఈ వెలుగే సూర్యుని యొక్క కిరణముగా దర్శించుటను గూర్చి "దూర్వా" అని చెప్పబడినది

ఆయుర్వేదమున గరికకు ఒక విశిష్టమైన ఔషధప్రక్రియ యున్నది పైత్యమును కఫమును హరించునట్టి ఔషధము రక్తస్రావములు మున్నగువానితో పాటు, నరముల బలహీనత, హిస్టీరియా వ్యాధి కలవారికిని, నిద్రలో కలవరించు లక్షణము కలవారికిని గరికనుండి తయారుచేసిన ఔషదమును ఉపయోగింతురు మరియు ఈ ఔషధము

హోమియో విధానమున సంతతిలేని స్త్రీలకు సంతతి కలిగించు లక్షణము కలదని వర్ణింపబడినది ఈ ఔషదమునుపయోగించుచు, ఈ మంత్రము ద్యానముచేయువారికి సంతానము కలుగును

సూచన - ఈ పై చెప్పబడిన మంత్రము మరియు తదుపరి మంత్రములు స్నానము చేయునపుడు చదువుకొనవలసినట్టివి నదిలో స్నానము చేయునపుడు శిరస్సుపై దర్భలనుంచుకొని తూర్పు ముఖముగా తిరిగి సూర్యుని ధ్యానించుచు ఈ మంత్రము చదువుచు శిరస్సుపై నీళ్ళు పోసుకొనవలెను అట్లుకొన్ని దినములు చేసినవారికి మనస్సు ప్రశాంతమగును

మంత్రము 6
కాణ్డాత్కాణ్డాత్ప్రరోహన్తి పరుషః పరుషః పరి ।

# అనువాకము 8

మంత్రము 1
ఏవానో దూర్వే ప్రతను సహస్రేణ శతేనచ ॥

## అర్థము

దూర్వే = ఓ దూర్వమా లేక దర్భా
కాణ్డాత్కాణ్డాత్ = ప్రతి కాండమునుండి
పరుషః పరుషః = ప్రతి కణుపునుండి
పరి = తిరిగి
ప్రరోహన్తి = మొలకెత్తుచున్నదానవు
ఏవా = ఇట్లు
నః = మమ్ములను
శతేన సహస్రేణచ = వేల, వందల కొలది
ప్రతను = సూక్ష్మమైన, మిక్కిలి సన్నగానున్నట్టి, (వృద్ధిపొందునట్టి)

## తాత్పర్యము

ఓ దూర్వమా ! అక్కరలేని దానిని నశింపజేయునట్టిదానవు కాండము కాండము మధ్యగల కణుపులనుండి మరల మొలకెత్తు స్వబావము కలిగినట్టి దానవును అయిన నీవు ఇట్లే మమ్ములను కూడ సహస్రశతములుగా సూక్ష్మస్థితికి తరింపజేయుము

## వివరణ

దూర్వమనగా హింసించునది అనికూడ ఒక అర్థముకలదు గరికలో నొకజాతియైన ఈ గరిక నేలపై వ్యాపించును ప్రతికణుపు వద్దమరల వ్రేళ్ళు మొలిచి అచ్చటినుండి మరల కొన్ని కాండములు బయలుదేరుచుండును ఇట్లు వృద్ధి పొందు లక్షణము గరికకు ఉన్నది తామర తంపర వలె (Geometrical Progression) వృద్ధి పొందుట ప్రకృతి లక్షణము ప్రకృతియందు జీవులిట్లే వృద్ధి యగుచున్నారు తండ్రినుండి సంతతిగా మరలవారిలో ఒక్కొక్కరికి సంతతి అనుప్రవృత్తిగా ప్రకృతి జీవులయందు

పనిచేయుచున్నది ఇది ఒక మానవజాతియందేగాక వృక్ష పశుజాతులయందుకూడ ఇట్లే జరుగుచున్నది మరియు గరిక జాతికి చెందిన చెరుకు కాండములను కణుపులవద్ద నరికి భూమిలో పాతినచో మొలకెత్తు లక్షణము కలదు

మానవుని వెన్నెముక యందు కుండలిని యనుశక్తి ఇట్టి పర్వములను కలిగి యున్నది పర్వములను కలిగియున్నది కనుక ఆమె పార్వతి ఇట్లు ఒక్కొక్క పర్వమునందులేక కణుపునందు ఒక్కొక్క కేంద్రముకలదు ఈ కణుపులందు ప్రజ్ఞ మేల్కొనుటయే మొలకెత్తుట మరియు ఒక్కొక్క కణుపునందు మెలకువకలిగినట్టి జీవులు ఒకస్థితిలో నుందురు అనగా ఒక జాతిగా చెప్పబడుదురు ఇట్లు ఏడు పెద్దకణుపులు, వానికన్న చిన్నవి 7 x = (21) కణుపులు, మరియు ఇంకను చిన్నవి 7 x 7 = (49) కణుపులు కలవు ఇవిగాక సూక్ష్మములైన కణుపులు అనేకములు కలవు ఇవి శతముగా సంకేతింపబడినవి ఇందువేరువేరు కణుపులందు ప్రకృతి మేల్కొను చుండగా ఆయాజాతుల జీవులు పుట్టుచుందురు ఇట్లు కణుపులద్వారా ప్రసరించు కుండలిని ఊర్ధ్వగమనముచేసి సహస్రారమును చేరును ఈ ప్రయాణమంతయు వెన్నెముకయందలి గొట్టమునందు జరుగును గనుక ప్రతను సహస్రేణ శతేన అని చెప్పబడినది ఇట్లు ఊర్ధ్వగమనము చేయు ప్రకృతి లేక కుండలిని లక్షణమే 'ప్రరోహన్తి' యని చెప్పబడినది

ఇట్లు కుండలిని ప్రచోదనము చేయు కార్యక్రమమును నిర్వహించువారిని గురువులు అందురు ఈ భూమియందలి జీవులకు మొట్టమొదటగా ప్రచోదనము చేయుటకు సనత్కుమారుడను మహా శుక్రగ్రహమునుండి దిగివచ్చెను ఈ భూమిపై మరి కొందరు జీవులకు శిక్షణనిచ్చి ఏడుస్థానములందు ఆశ్రమములు స్థాపించెను వారినుండి మరికొందరు యోగవిద్యను శిక్షణ పొంది మిగిలిన వారికి బోధింతురు ఇట్లు యోగవిద్య రూపమున కుండలిని అనుశక్తి గురువులనుండి శిష్యులకు వారినుండి మరల శిష్యులకు తామరతంపరగా విస్తృతి చెందుచున్నది

మానవుని వెన్నెముకయందు చెరుకుగడవలె కుండలిని వ్యాపించియుండి అందలి కణుపులే చక్రములని చెప్పబడినది ఇట్టి ఒక్కొక్క కణుపునందును, జీవుని మనస్సుమేల్కొని జీవిత సారమును ఆనందముగా పొందుచుండును ఇదియే చెరకు నందలి తీపి తానున్న స్థితినిబట్టి తనచుట్టూ వాతావరణము, సంఘటనలు సృష్టింపబడ

చుండగా వాటియందు చిక్కుకున్న మనస్సు వాని యనుభవమునే రసాస్వాదన చేయును ఈ రసము ప్రారంభ స్థితులలో వివిధ రకములుగా నున్నను పైస్థితులను పొందుకొలది వాని యందలి తీయదనము హెచ్చుచుండును సహస్రారము చేరుసరికి జీవితమంతయు మేలు జాతికి చెందిన చెరకు రసము వలె మాదుర్యము చెందియుండును కాని ఇందు విచిత్రమేమనగా జీవి ఏస్థితిలో నున్నను తానున్న జీవితము నందలి అనుభవమను రసము (పరుషముగా నున్ననూ) వారికి ఇష్టమే యగును ఇదియే పూర్వశ్లోకములందు ప్రియ మింద్రస్య కామ్యం ' అని వర్ణింపబడినది (ఇట్లు ఈమె జీవులయందు 'ప్రియము అను ప్రవృతిగా పనిచేయుచున్నది) చెరకునందు తీపివలె వెన్నెముకయందలి కాండములయందు, పర్వములయందు సూక్ష్మముగా వ్యాపించి యుండుట ప్రతను శబ్దమును సూచించుచున్నది

మంత్రము 2

యా శతేనప్రతనోషి సహస్రేణ విరోహసి |
తస్యాస్తే దేవీష్టకే విదేమ హవిషావయమ్ ||

ప్రతిపదార్థము

దేవి = ఓ దేవీ

ఇష్టకే = ఇష్టము అను పేర పూజింపబడుచున్న దేవతవు

యా = ఏనీవు

శతేన ప్రతనోషి = నూరు (సంవత్సరముల జీవితము) గా విస్తరించుచున్నదో

సహస్రేణవిరోహసి = సహస్రము చేత సుడివలె పైకి ప్రసరించుచున్నవి

తస్యాః తే = అట్టి నిన్ను

హవిషా = హవిస్సులచేత

విదేమ = దరించుచున్నాము

తాత్పర్యము

ఓ ఇష్టకాదేవీ ! నీవు నూరుగా విస్తరించుచు సహస్రముగా ఊర్ధ్వగమనము చేయుచున్నావు అట్టినిన్ను పై హవిస్సులచేత మేము వహించుచున్నాము

## వివరణ

ఇష్టాదేవి లేక ఇష్టకాదేవి అనుపేరున అర్చింపబడుచున్న దేవత అమ్మవారి యొక్క అవతారతత్త్వములలోనొకటి ఈమె జీవులయందు ఇష్టము అను ప్రవృత్తిగా పనిచేయుచున్నది ఇట్టి ప్రవృత్తి వలననే సృష్టి కార్యము నిర్వహింపబడుచున్నది

ఎవరు ఏపనిని చేయవలసినను తనకిష్టము కానిది చేయరు పనుల మంచి చెడ్డలు వేరు ఇష్టమగుట, కాకుండుట వేరు మంచిపనులు అయినంతమాత్రము చేత అది ఇష్టము కాకపోవచ్చును అట్లే చెడ్డ పనులు ఇష్టము కావచ్చును దేవతలలో సైతము సూర్యుడు ప్రకాశించుట, వాయువు వీచుట మున్నగు ప్రవృత్తులు ఆయా దేవతల కిష్టమగుట చేతనే జరుగుచున్నవి కానీ మంచి పనులే నచ్చుట అనునది మాత్రము దేవతల లక్షణము ఇష్టా ఇష్టములు మంచి చెడ్డలు కలగాపులగముగా ఏర్పడుట మానవలక్షణము అట్టి స్థితినుండి మంచిది మాత్రమే నచ్చునట్టి దైవత్వములోనికి మానవుడెదుగవలెను అట్లు మానవుని పశుస్థితి నుండి దైవత్వములోనికి నడిపించునట్టి దేవత ఇష్టాదేవి ఈమె జీవులలో ఇష్టము అను ప్రవృత్తిగా పనిచేయుచు, తద్వారా సంభవించు సంఘటనల రూపమున జీవలక్షణములందు మార్పులు కలిగించుచు దైవలక్షణము లోనికి ఎదుగునట్లు చేయుచున్నది ఇష్టక అను శబ్దమునకు బలిపీఠము లేక యజ్ఞ వేదిక అను అర్థము కలదు ఈ ఇష్టక అనుపదమునుండియే ఇటిక అను పదము వచ్చినది అందుచేతనే హోమకుండమును చతురస్రాకారముగా ఇటుకలతో నిర్మాణము చేయు సంప్రదాయము పాటింపబడుచున్నది కనుకనే జ్యోతిని ధ్యానము చేయుకొన్ని క్రతు ప్రక్రియల యందు ఇటుకలు గానీ అటువంటి ఆకారము కల వస్తువుపై కానీ జ్యోతిని ఉంచి ధ్యానము చేయుదురు

ప్రాచీన (మెసపుటోమియా) సంప్రదాయమునందు ప్రధాన దేవత యైన ఇష్టార్ అను నామె యజ్ఞములకు అదిదేవత గాను, మరియు జీవుల యందు ప్రేమ, ఇష్టము అను ప్రవృత్తులను, కల్పించు దానిగను పూజింపబడుచున్నది ఆమె కుడిచేత సూర్యుని ఎడమచేత చంద్రుని

దరించి, సింహాయాడయై ఉండును ఇవియే ఇడ, పింగళ, సుషుమ్నానాడులు వాని సముదాయమే కుండలినీ శక్తియని పిలువబడుచున్నది సూర్యాత్మకమైన ఇడానాడి సూర్యనాడి అనియు చంద్రాత్మకమైన పింగళనాడి చంద్రనాడి అనియు, వీనిమద్యగల తోజోమయమైన సుషమ్న యను నాడి అగ్నినాడి అనియు ప్రాచీన ఋషులు దీనిని గుర్తించి దేవీ స్తోత్రములయందు 'సూర్య చంద్రాగ్నిలోచనా' అని స్తోత్రము చేసిరి ఆమె సింహవాహాన అట్టిది దర్శింప వలెనన్నచో నరుడు తనయందలి సింహమును దర్శింపవలెను ఇదియే సింహరాశి అనుపేర నరుని హృదయమునందు పనిచేయుచున్న కుండలినీ శక్తి జ్యోతిశ్శాస్త్రములయందు సింహరాశి హృదయమును ఏరిపాలించునని వర్ణింపబడినది

హృదయమాదారముగా పనిచేయుచున్న శక్తి కేంద్రము అనాహతము అని చెప్పబడును ఈ కేంద్రము ప్రేమకు, కుండలిని సె-ఖాసమునకు, దమించు శక్తికి సంకేతము హృదయ క్షేత్రమునకు చేరవలెనన్నచో లోకమునందలి దుష్టశక్తులను దమించి నిర్మూలించగలిగి ఉండవలెను కనుకనే జగన్మాత సింహవాహానయై లోకపీడకులైన రాక్షసులను సంహరించెను అట్లే ఇష్టార్ దేవత దుష్ట శిక్షణము చేసి తీవ్ర రక్తపాతము కలిగించెనని, భూమి రక్తములో తడిసెననియు చెప్పబడినది రక్తవర్ణము రజో గుణసంకేతము కనుకనే ఈమె లలితా సహస్రనామ స్తోత్రములయందు 'రక్తాక్షీ 'రక్త వర్ణ యని సంబోదింపబడినది అట్టి దమించు శక్తి చేతనే మానవుని యందు కరుణ, ప్రేమ మున్నగు ఉత్తమ లక్షణములు మేల్కొనును కనుకనే ఈ అనాహత చక్రము ప్రేమ, కరుణ, సానుభూతి మున్నగు ఉత్తమ లక్షణములను జీవులలో కలిగించును అనగా కుండలినీ శక్తియే ఈ కేంద్రము పనిచేయుచున్నప్పుడు అట్టి లక్షణములను జీవులలో కలిగించును

యాశతేన ప్రత నోషి నూరు సంవత్సరములను పొందిన మానవుని భౌతికజీవితముగా వ్యాపించినట్టిది అనగా జీవితమునందు మొదటినుండి చివరివరకు వ్యాపించియుండు జీవితేచ్ఛ లేక జీవించుట యందలి ఇష్టముగా ఈమె భౌతిక జగత్తున వ్యాపించియున్నది అట్టి ఈమె పైన చెప్పబడినట్లు జీవలక్షణములను సంస్కరించుచు, ఊర్ధ్వగమనము కలిగించుచున్నది విరోహాసి యనగా విచ్చుకొనుచూ పైకి పోవునట్టి ప్రవృత్తి (Spiral Force) ఇట్లు పైకి గమనము చేయుట శిరస్సునందలి

సహస్రారము అను కేంద్రము యొక్క ఆకర్షణచే జరుగును మూలాదారమునందలి బౌతిక స్థితియందలి నిక్షిప్తమై యున్న జీవప్రజ్ఞ సహస్రారకేంద్రము యొక్క ఆకర్షణచే ఊర్ధ్వ ముఖమై వెన్నెముకద్వారా అందలి కేంద్రముల వికాసముల ననుసరించి పైకి ప్రయాణము చేయును ఈ ప్రయాణము ఊర్ధ్వము మరియు ప్రదక్షిణాత్మకము

జీవ ప్రజ్ఞ కేంద్రముగా ఏర్పడిన బౌతిక జీవితమునందు, సంఘటనలన్నిటియందు, మనస్సు తనచుట్టూ తాను పరిభ్రమించు చుండును ఇట్టి సంఘటనల ద్వారా పరిభ్రమించు మనస్సు క్రమేణ సంస్కరింపబడుచున్న కొలదియు పైకి ప్రయాణము చేయును అనగా సంఘటనలకు తాను కేంద్రముగా నుండక సాక్షిగ మాత్రముండును ఇట్టి దృష్టివలన మనస్సు క్రమేణ విశాలమగును ఇదియే పైన చెప్పబడినది ఇట్లు జీవించుట యందలి అబిలాష లేక ఇష్టత అనురూపమున సహస్రారమునందలి దైవ ప్రజ్ఞ జీవ ప్రజ్ఞను పైకి ఆకర్షించుచు సంస్కరించుచున్నది ఈ కథయే పైన చెప్పబడిన ఇష్టార్ దేవత " Ishtar" మెసపుటోమియాలోని దేవతను గూర్చిన కథ ఇందులో ఈమె తానత్యదికముగ ప్రేమించు తనబర్త Tammuz వదింపబడగా అతనిని గూర్చి విలపించుచు చీకటిలోకములలోనికి ప్రయాణము చేయును ఆమె ఏడు ద్వారములు అని పిలువబడు ఏడు లోకములలోనికి ప్రయాణము చేయుచు, అనేక కష్టములకు లోనై చిట్టచివరకు తన బర్తను పొంది ఆనందపరవశురాలగును ఈ మెసపుటోమియా యందలి ఇష్టార్' (Ishtar) దేవతయే 'కుండలిని యని పిలువబడు మహాశక్తి ఆమె అంతర్యామియైన పరమాత్మనుండి వెలువడి, బౌతికలోకమునందలి జీవప్రజ్ఞగా పరిమితత్వమునందు చిక్కుకొని తనభర్తయైన పరమాత్మను కోల్పోవును

అట్టి జీవ ప్రజ్ఞ మరల ఏడు లోకములు దాటి అంతర్యామియైన పరమాత్మను చేరుటయే పై కథయందు వర్ణింపబడినది ఈమె భర్తయైన Tammuz అనునతడు తేజస్సు లేక వెలుగునకు సంకేతము అతడే సూర్యుడు పడమటి దిశయే చీకటిలోకములుగా వర్ణింపబడినది ఇదియే వరుణ లోకములుగా పురాణములయందు చెప్పబడినది అట్లు లోకములయందు తేజస్సు అదృశ్యమగుటచే లోకములను చీకటి ఆవరించుచున్నది అట్లు అంధకారమున మ్రగ్గుచున్న లోకములను ఇష్టార్ అను దేవత నడుపుచు పరమాత్మ Tammuz కై అన్వేషణ ఆరంబించును ఇట్టి అన్వేషణము

ఏడులోకములు దాటి తదతీతముగనున్న యంతర్యామి యందు పర్యవసించును ఇదియే మరల సూర్యోదయముగ చెప్పబడినది సంవత్సరమునందు దక్షిణాయనమను చీకటిలోకము లోకములలోనికి అదృశ్యమైన సూర్యప్రజ్ఞమరల ఉత్తరాయణమున ఉద్ధరింపబడుటచే సుఖశాంతులు లబించెనని బాబిలోనియన్ పురాణ కథలయందు వర్ణింపబడినది

"వయమ్ హ విషావిదేమ ' హావిస్సులుగా నిన్ను మేము వహించు చున్నాము పైన చెప్పబడిన బౌతిక జగత్తు దానిననుసరించి ఏర్పడిన బౌతిక శరీరము, కుండలిని, షట్చక్రములు మున్నగునవన్నియు ఇష్టార్ దేవతకు సమిదలు మరియు హావిస్సులు ఇవి యజ్ఞమునందు సమర్పించబడుటచే నరుని జీవితము యజ్ఞమగును అందు ఇష్టార్ దేవతయే యజ్ఞవేదిక ఆమెయందు సమర్పింపబడు ఈ హావిస్సులవలన జీవునికి అంతర్యామిత్వము యజ్ఞపలముగా లబించును

## మంత్రము 3

అశ్వక్రాన్తే రదక్రాన్తే విష్ణుక్రాన్తే వసున్ధరా ।
శిరసాదారయిష్యామి రక్షస్వ మాం పదే పదే ॥

## ప్రతిపధార్థము

అశ్వక్రాన్తే = అశ్వముచే ఆక్రమింపబడినట్టియు,

రదక్రాన్తే = రదముచే ఆక్రమింపబడినట్టియు

విష్ణుక్రాన్తే = విష్ణువుచే ఆక్రమింపబడినట్టియు

వసున్ధరా = వస్తువులను ధరించిన బూమి

శిరసా = శిరస్సుచేత

ధారయిష్యామి = దరించుచున్నాను

మాం = నన్ను

పదే పదే = మరల మరల

రక్షస్వ = రక్షించుము

## తాత్పర్యము

వస్తువులను దరించినట్టి ఓ భూమి । నీవు అశ్వముచేత, రదముచేత, విష్ణువు చేత చుట్టబడియున్నావు నిన్ను నేను శిరస్సుపై ధరించుచున్నాను ప్రతిపాదమునందు నన్ను రక్షింతువు గాక ।

## వివరణ

అశ్వక్రాన్తే అనగా అశ్వము చేతచుట్టబడినట్టిది అశ్వమనగా గుఱ్ఱమనియే గాక ప్రాణశక్తి యని యర్థము చోటు లోపల అనంతమైన ప్రాణశక్తి యున్నది అదిభూమియందు భూమిచుట్టూ వ్యాపించి యున్నది అట్లు భూమిచుట్టూ ఏర్పడిన ఈ ప్రాణశక్తి అయస్కాంతశక్తియని కూడ పిలువబడినది భూమి చుట్టూవున్న అయస్కాంతక్షేత్రము వలన వాతావరణమేర్పడి, ప్రాణులు జీవించుటకు సహాకరించుచున్నది ఈ వాతావరణపు పొరవలననే జీవకణము (Biological kingdom) ఏర్పడుచున్నది

రదక్రాన్తే అనగా రధము చేత చుట్టబడినట్టిది భూమిచుట్టూ సూర్యుడు తిరిగే మార్గము ఒక వృత్తాకారముగానున్నది ఇదియే సూర్యుని రద చక్రము ఈ వృత్తాకార మార్గముననుసరించి సూర్యుడు ప్రయాణము చేయుచూ భూమియందు ప్రాణశక్తిని నిక్షిప్తము చేయుచుండును దీనివలన భూమియందు ప్రాణశక్తి ఉద్భోదనము చెందుచుండును ఒక ఇనుప ముక్కచుట్టూ రాగి చుట్టను చుట్టి అందు విద్యుత్తును ప్రసరింప చేసినచో ఇనుపముక్క అయస్కాంతమగునని మనకు తెలియును కదా । అట్లే సూర్యుని గమనముచే భూమి అయస్కాంతీకరణము చెందుచున్నది అనగా నిజమునకు భూమియే సూర్యుని చుట్టు తిరుగుచు, దానివలన తనలో అయస్కాంతశక్తిని, విద్యుత్తును ఉత్పాదనము చేసికొనుచున్నది మొట్టమొదటగా సూర్యకిరణముల యొక్క ప్రబావము చేత చోటులో నున్న ప్రజ్ఞలు అయస్కాంతీకరణము చెంది, వాని చుట్టు అయస్కాంతక్షేత్రమేర్పడినది ఇవియే గ్రహముల సూక్ష్మ శరీరములు అట్లేర్పడిన ప్రాణశక్తి మరింత చిక్కనై అణువులుగా కట్టుకొని, ద్రవ్యము (matter) గా రూపాంతరము చెందినది ఇట్లు మార్పు చెందుటకు సూర్యుని యందలి విద్యుత్తు అనుశక్తియే కారణము చోటునందు పనిచేయుచున్న శక్తి వలన గ్రహములకు శక్తి లభించుటయేగాక భౌతిక గోళములు ఏర్పడును The sun rays cause induction in the space through which energy is generated around the souls of the planets The energy surrounding the planetary consciousness

gradually becomes thin and generates into matter by precipitating atoms అట్లే భూమి అయస్కాంతీకరణము చెంది జీవవంతమై నిలుచుటకు కారణము ఈ సౌరశక్తియే అంతేకాక ఈ సౌరశక్తి వలననే భూమికి పరిభ్రమణమేర్పడు చున్నది మానవ శరీరమునకు రక్త ప్రసరణమెట్లో భూమికి పరిభ్రమణమట్లు ఈ పరిభ్రమణము వలన భూమిచుట్టూ వాయువులతో కూడిన వాతావరణమేర్పడి ప్రకృతి ఏర్పడుచున్నది అట్లే ఈ సూర్యకిరణములనుండి దిగి వచ్చిన ప్రజ్ఞలే భూమియందు జీవులుగా నేర్పడి, భూమివలన భౌతిక రూపములను పొందుచున్నారు

విష్ణుక్రాన్తే అనగా విష్ణువుచేత చుట్టబడినట్టిది విష్ణువనగా చోటునందంతటను అంతర్యామిగా వ్యాపించియున్న మహాప్రజ్ఞ ఈసమస్త విశ్వమునందు అంతర్లీనముగానున్న ప్రాణశక్తినే మనము విష్ణువని పిలుచుచున్నాము He is the cosmic energy who permeates the entire cosmos through which all the stars nebulas etc are generating and floating in the universe of late, it is suspected as the cosmic fluid by the Scientists ఈ మహాశక్తి వలన ఆకాశమున తారలు, తారాపుంజములు, ఉద్భవించి నిలిచి యున్నవి సూర్యుని సౌరశక్తికి కూడా ఈ విష్ణుశక్తియే కారణమగుచున్నది సూర్యుని పుట్టుకకు వాని చుట్టునున్న సౌరమండలమునకు ఈ విష్ణుశక్తియే కారణము అనగా చోటునందు వెలుగు, వేడిమి మున్నగు వానికి ఈ విష్ణుశక్తి కారణమగుచున్నది

ఇట్లు ఈ విష్ణుశక్తి విశ్వమునందును, సౌరమండలమునందును, భూమండలమునందును, మూడు స్థితులుగా వ్యాపించి ఆక్రమించుచున్నది ఇదియే విష్ణువు యొక్క విశేషమైన క్రమములేక విక్రమము ఇది 3 స్థితులలో (In 3 planes) జరుగుచున్నది గనుక త్రివిక్రమము అనబడినది ఈత్రివిక్రమత్వమును దారణచేసి, ధ్యానము చేయువారి శిరస్సునందు, విష్ణుశక్తి దరింపబడును కనుకనే 'శిరసాదారయిష్యామి అని చెప్పబడినది అట్లు దరింపబడిన విష్ణుశక్తి అడుగడుగునా రక్షించి తన అంతర్యామిత్వమును నిలుపుకొనునని 'రక్షస్వమాం' అని పదేపదే చెప్పబడినది పదే పదే యనగా విష్ణువు యొక్క 3పాదములు లేక అడుగులు ఇది బలి చక్రవర్తి శిరస్సుపై విష్ణువు పాదముంచి అతనికి అంతర్యామిత్వము నొసగుట అను అంశమును సూచించును

వసుంధర యనగా వసువులచేత దరింపబడునది వసువులనగా భౌతిక పదార్థ నిర్మాణమునకు కారణమైన విశ్వశక్తులు లేక విశ్వేదేవతలు

(Gods of materialisation) ఇట్లు భూమియొక్క భౌతిక అస్తిత్వమునకు కారణముగా పనిచేయుచున్నవాడు విష్ణువే ఆయన అణుగత ప్రజ్ఞ (Nucleus) గా దిగి వచ్చుట చేతనే వసువులు పదార్థ నిర్మాణము చేయగలిగిరి ఇట్లు అణుగత ప్రజ్ఞగా పనిచేయుచున్న విష్ణువే వామనుడు

అశ్వమేదము నందు యజ్ఞశాలను అశ్వములచే త్రొక్కించి ఆమట్టిలో అచ్చట యజ్ఞవేదిక నిర్మాణము చేయుట ఒక సంప్రదాయము దానివలన చోటునందలి అశ్వ(ప్రాణ)శక్తి అచ్చటికి ఆవాహనమగును అశ్వములను పెంచి పోషించి రక్షించుట, అశ్వముల సమీపమున కూర్చుండి అశ్వనీమంత్రములను, హాయగ్రీవమంత్రములను ద్యానముచేయుట ఒకసాంప్రదాయము దీనివలన సృష్టియందలి అనేక రహస్యములు, జ్యోతిశ్శాస్త్రము మున్నగువానియందు విశేషప్రజ్ఞ కలుగును అట్లే గవామయమగు గోమేదములను యజ్ఞములయందు గోవుచేతొక్కబడిన ప్రదేశమున యజ్ఞశాల నిర్మాణముచేయుట, గోవులను సేవించుట, గోవులవద్ద మంత్రములను ద్యానము చేయుట మున్నగు వానివలన వేదస్వరూపము బోదపడి గాయత్రిగా మేల్కొనును కనుకనే గోమయము (ఆవుపేడ) పరమ పవిత్రము (ఆవు పేడతో అలికిన ఇండ్లలో నున్నవారికి T B వంటి వ్యాదులు రాకుండుట ఇటీవలనే గమనింపబడినది)

స్నానము చేయునపుడు చదువు మంత్రములలోనిది కూడా యొకటి నదిలో మట్టిని తీసి, శిరస్సుపైన వంటికి పూసుకొని ఈ మంత్రము చదువుచు దారణ చేయుచు కొద్దిసేపువుండి స్నానము చేసినచో శరీరము ఆరోగ్యవంతమగును నదులు కొండలలో నుండి ప్రవహించునపుడు అనేక మూలికల సారమును స్వీకరించి తమతో తీసుకొని వచ్చుచుండును నదిలోపల మట్టి యందలి ఈ మూలికల సారము శరీరమునకు పూసుకొన్నపుడు శరీరములోనికి స్వీకరింపబడును దీర్ఘరోగము లున్నవారు ప్రతిదినము ఇట్లు మట్టి పూసుకొని ఈమంత్రములను ద్యానము చేసినచో నిస్సందేహముగా నివారణయగును

( ఈ మంత్రము మొదలు 15వ అనువాకములోని 6వ మంత్రము వరకు స్నాన సంబంధములైన మంత్రములుగా చెప్పబడుచున్నవి ప్రాతఃకాలమున స్నానము చేయునపుడు ఈ మంత్రములను పఠించుచు స్నానము చేయవలయును తూర్పు వైపునకు తిరిగి సూర్యునుద్దేశించి పఠింపవలయును ప్రాతఃకాలమున కాకపోయిననూ స్నానము చేయుచున్నప్పుడు ఎప్పుడైననూ పఠించినచో చక్కని ఫలితముల

నిచ్చును అనగా శరీరమును, ప్రాణశక్తిని, మనస్సును శుభ్రపరచి అంతఃకరణమును నిర్మలము చేసి బుద్ధిని ప్రచోదనము చేయును అనుదినము చేయువారికి దినమంతయూ మనస్సు ప్రశాంతముగా నుండుటయేగాక అనారోగ్యములు, వ్యాదులు రావు ఈ మంత్రములు నదీతీరములయందును, సముద్ర స్నాన సమయములందును, గ్రహణసమయములందును అమావాస్య పౌర్ణమి తిదులయందును మిక్కిలి పలితముల నిచ్చును ఇందుకొన్ని మంత్రములు గరికతో (అనగా దర్భలు), మట్టితోను చేయవలయును గరిక శిరస్సు పైననూ, భుజములపైననూ ఉంచుకొని స్నానము చేయుచు ఈ మంత్రములను పఠించవలయును 7వ అనువాకములోని 5, 6 మంత్రములు, 8వ అనువాకములోని 12 మంత్రములు గరికెతో స్నానము చేయవలసిన మంత్రములు)

## మంత్రము 4

భూమిర్ధేనుర్ధరణీ లోకదారిణీ |
ఉద్ధృతాసివరాహేణ కృష్ణేన శత బాహునా ||

## ప్రతిపదార్థము

భూమిః = భూమి (భౌతికతత్వమునకు చెందినట్టిది)
దేనుః = గోవు
దేనుర్ధరణీ = గోవును దరించినట్టిది
లోకదారిణీ = లోకములను దరించినట్టిది
శతబాహునా = అనేక బాహువులు కలిగినట్టి
కృష్ణేనవరాహేణ = నల్లని వరాహమూర్తి చేత
ఉదృతాఅసి = ఉద్ధరింపబడినట్టి దానివి

## తాత్పర్యము

ఓ భూమి ! (నీవు) దేనువును, లోకములను దరించినావు కృష్ణ వరాహమూర్తిచే నూరు బాహువులతో ఉద్ధరింపబడినట్టిదానివి

## వివరణ

వరాహము పరమాత్మ యొక్క మొట్టమొదటి అవతారముగా చెప్పబడినది ఒకవిదముగా అడవిపంది ఆకారము, ఒక రకముగా

ఎలుగుబంటి ఆకారముగా కూడా చెప్పబడినది ఈ వరాహము అను ఆకారముతో ఆయన భూమిని ఉద్ధరించినాడు సింహాచలము నందున్న దేవుని పేరు వరాహస్వామి అనగా ఆదివరాహామూర్తి రూపము అప్పుడు Precipitation of earth అనేది form అయినది అటులే చోటులో Solidification, వస్తువు పుట్టుట అనునది జరిగినది సృష్టిలో నక్షత్రములు, సూర్యుడు మొదలయినవి పుట్టుట జరిగినది సృష్టి ఏమియు లేనప్పటి స్థితి నల్లనయినది (కృష్ణము) దానినే మహాసముద్రము అనినారు ఆ మహాసముద్రము నందు నారాయణుని ప్రజ్ఞ చోటులో వరాహామూర్తిగా దిగివచ్చినది ఆవరాహామూర్తి భౌతికమైన స్థితిని ఉద్ధరించినాడు ఆయన యొక్క ప్రబావముచే చోటులో గోళములు ఏర్పడినవి

ఉద్ధృతాసి వరాహేణ కృష్ణేన శతబాహునా - అనగా నూరు బాహువులు కలిగిన కృష్ణవరాహముచేత ఉద్ధరింపబడినట్టిది యని అర్థము అంతర్యామియైన పరమాత్మ అవ్యక్త స్వరూపుడు గనుక నల్లని రూపముగా చెప్పబడినది అట్టి అవ్యక్తస్థితినుండి భౌతిక రూపమగు సృష్టి ఆదివరాహా మూర్తియైన పరమాత్మచేత వ్యక్తస్థితిలోనికి ఉద్ధరింపబడినది అట్లుద్ధరించుట అనేక దశలలో జరిగినది సృష్టిగోళము ప్రారంబము అగుటకు ముందు సృష్టిదర్మము ప్రళయస్థితినుండి ఉద్ధరింపబడినది

అట్టి సృష్టిదర్మమునే యజ్ఞము అందురు కనుక పరమాత్మ యజ్ఞవరాహామూర్తిగా కీర్తింపబడినాడు ఆయనకు నూరు రూపములున్నవని విష్ణుపురాణమునందు చెప్పబడినది అనగా ఈ సృష్టియందు సూర్యగోళములు, వానితో సౌరమండలము ఎప్పటికప్పుడు విశ్వమునందు ఉద్ధరింపబడుచున్నవి అనగా అవ్యక్తముగా నున్నచోటునందు అపారమైన ప్రాణశక్తి నిండియున్నది ఇదియే మహాసముద్రమని, ఆపస్సులనీ చెప్పబడినది అట్టి ఆపస్సులయందు సృష్టి అనగా సౌరమండలము కరగి యుండగా మరల నీటిపై మంచుగడ్డలు ఘనీబవించి తేలునట్లు సౌరమండలము పుట్టుచున్నది ఇట్లు సౌరమండలములు పుట్టుటయే వరాహామూర్తి వానినుద్ధరించుట ఇచ్చట ఇంకొక విశేషము కలదు ఈ విశ్వమంతయూ సప్తర్షి మండలముపై నాదారపడియున్నది

సప్తర్షి మండలమందలి 7 తారలు సృష్టి యందలి7లోకములు కదిపతులు అట్లే 7 గ్రహములకును అదిపతులు ఇంకన మానవదేహామందలి 7 ప్రజ్ఞా కేంద్రములకును అదిపతులు ఈ ప్రజ

కేంద్రములు శిరస్సునుంచి వెన్నెముకవరకు వ్యాపించియున్నవి ఇట్లు సప్త ఋషులు మూడు లోకముల యందును అదిష్టించి పనిచేయుచున్నారు సంస్కృతమున ఋక్షము అని అందురు ఋక్షము అనగా ఎలుగుబంటి ఎలుగుబంటికి, పందికి ఆకారసామ్యము కలదు ఇంగ్లీషులో సప్తర్షిమండలమును The great bear' అని అందురు Bear అను పదమును Boar అను పదమునకు (అడవిపంది) సామ్యముకలదు ఈ సప్తర్షి మండలమే ఆదివరాహమూర్తి రూపముగా సంకేతింపబడెను అట్లు సౌరమండలమును ఉద్ధరించుట తన రెండు కోరలతో చేసెను ఆ రెండు కోరలే సూర్యాత్మకము, చంద్రాత్మకము అయిన వెలుగులు (Solar and Lunar fire) అందొకటి సృష్ట్యాత్మకము (Creative) రెండవది జీవోత్పత్తి కారకము (Reproductive) సౌరమండలమందు భూగోళము పుట్టుట గూడా ఇదే పద్ధతిలో జరిగెను ఇచ్చట భూమినుద్ధరించిన వాడు సూర్యుడు సూర్యుడు తన నూరు కిరణములచేత అవ్యక్తస్థితిలోనున్న భూమికి భౌతిక శరీరము కల్పించెను అట్టి సూర్యుడు వెలుగుతో కూడి యున్నాడు కనుక శ్వేత వరాహముగా చెప్పబడియున్నాడు ఆయననూరు కిరణములే నూరు బాహువులు ఆయన భూమిని భౌతికసృష్టిలోనికి వ్యక్తమగునట్లు చేసెను ఇట్లు అనేక సౌరమండలములందు భౌతిక సృష్టి ఉద్ధరింపబడుచున్నది కనుక వరాహమూర్తికి నూరు బాహువులని చెప్పబడినది

"భూమిర్దేనుదరణీ లోకదారిణి" చోటునందు పనిచేయుచున్న పరమాత్మ యొక్క వైభవము లేకశక్తియే మూలప్రకృతి ఆమెనే కుండలిని అను పేరకూడ పిలిచెదరు అట్టి మహాశక్తి తనప్రభావముచే గోళములను, తారలను, భ్రమణాత్మకముగా త్రిప్పుచున్నది ఇట్లు సృష్టిలో చక్రాకారముగా తిరుగుచూ తన గమనము వలన భౌతిక సృష్టిని నిలిపియుంచు మహాశక్తి కుండలిని కుండలిని యనగా చుట్టలుగా చుట్టుకొని యున్నది యని యర్థము అట్టి శక్తి భూమిని తన శక్తి చేత దరించి యున్నది అట్టి భూమిదేనువుగా వర్ణింపబడినది వేదమునందు భూమి గోవుగా, సూర్యుడు వృషభముగా సంకేతింపబడినది సూర్యుడు పురుష శక్తికి చిహ్నముకాగా, భూమి స్త్రీత్వమునకు, గర్భదారణకు, తద్వారా జీవసృష్టిని దరించి యుండుటకు సంకేతము కనుకనే గోవుగా చెప్పబడింది గోవునుండి పాలు పిదుకబడినట్లు భూమి యందలి వాతావరణము అవు పొదుగుగా ఏర్పడగా, అందుండి జీవసృష్టి పిదుకబడినది దేనువు అను శబ్దమునకు దూడకు పాలిచ్చి పోషించునది

అని అర్థము ఈజిప్టు పురాణములలో (Hather) 'హాదర్' అను దేవత గోరూపముగా వర్ణింపబడినది ఆమెతన పొదుగునుండి జీవులకాహారమిచ్చుచున్నట్లు, ఇంకను చనిపోయివారికి కూడ ఈమెయే ఆహారము కల్పించుచున్నట్లుకూడ చిత్రింపబడినది గోదానము చేసినవారిని చనిపోయిన వెనుక వైతరణి అనునదిని దాటించెనని పురాణములయందు వర్ణింపబడినదికదా। ఇట్లు దేనువు ప్రాచీన కాలము నుండి అన్ని జాతులయందును మాతృమూర్తిగా ఆరాదింపబడుచున్నదనుటకు ఇది నిదర్శనము

ఓ భూమీ। నీవు దేనువుగా నుండి జీవులకు కావలసిన సంపదలు, చోటునుండి సృష్టించి ఇచ్చుచున్నావు భూమియందు సూర్యుని కిరణములు ఆకర్షింపబడి కర్షణము (Ignition)చెంది జీవుల ఉత్పత్తి, జంతువులు, వృక్షములు, ఖనిజములు ఏర్పడినవి మొదట ఖనిజములుగా ఏర్పడి, వానినుండి మత్స్యావతారకథలో చెప్పిన జలము, జలచరములు, భూచరములు, వృక్షములు, మానవులు ఏర్పడినవి చోటునుండి జీవులకు కావలసిన సమస్త సంపదలు సూర్యకిరణములనుండి భూమి తయారుచేసి ఇచ్చినవే కనుక భూమి దేనువు(ఆవు యొక్క రూపము) ఆవు గడ్డి తిని పాలిస్తుంది సూర్యుని కిరణములకు దర్భలని అర్థము సూర్యకిరణముల నుండి భూమి జీవులకు కావలసిన సమస్త సంపదలు ఇస్తుంది

భూమిచేత బౌతిక శరీరము (Physical Body) సూర్యుని కిరణములచేత ఆత్మగత శరీరము (soul)ఏర్పడుచున్నవి భూమియందున్న మహాశక్తిని Earth magnitism అందురు దీనివల్లనే శరీరము నిలబడి యున్నది అణువులు రూపుకట్టుకొని యుండుటకు కారణమై భూమిలో ఏప్రజ్ఞ పనిచేయుచున్నదో శరీరములోను, అదేప్రజ్ఞ పనిచేయును సూర్యుని ఒక్కొక్క కిరణముచేత మనకు ఒక్కొక్క లోహము వచ్చుచున్నది దరణి-సమస్తమును తనయందు దరించి యున్నది ప్రాణము (centripetal), అపానము (Centrifugal) అను శక్తులవలన ఇది ఏర్పడుచున్నది భూమి బొంగరమువలె తిరుగును త్రిప్పి వదలినవాడు సర్వాంతర్యామి భూమి తనచుట్టు తాను తిరుగుచున్నపుడు పై రెండు శక్తులు పనిచేయుచున్నవి ఇవి పనిచేయుట చేత జీవులకు శరీరములు నిలబడియున్నవి లేకున్నచో దూదిపింజవలె అగును చోటులో pressure nil గా ఉండును భూమి యందు pressure ఉండును కనుక నిలబడి యుండును

మంత్రము 5
మృత్తికే హనమే పాపం యన్మయాదుష్కృతం కృతమ్।
మృత్తికే బ్రహ్మదత్తాసి కాశ్యపే నాభి మన్త్రితా॥
మృత్తికే దేహిమే పుష్టింత్వయి సర్వం ప్రతిష్ఠితమ్

ప్రతిపదార్థము

మృత్తికే=ఓ మృత్తికా దేవీ!(మట్టి రూపముననున్న దేవి)
మయా = నాచేత
యత్ + దుష్కృతం = ఏ చెడ్డది అయిన
కృతం మే పాపం = చేయబడిన నా పాపము
హన = నశింపజేయుము
మృత్తికే = ఓ మృత్తికా దేవి!
బ్రహ్మదత్తా + అసి = బ్రహ్మచేత ఈయబడినట్టి దానిని
కాశ్యపేన = కశ్యప మహర్షి చేత
అభి మన్త్రితా = మంత్రింపబడిన దానివి
మృత్తికే = ఓ మృత్తికాదేవి
మే = నాకు
పుష్టిం = పుష్టిని
దేహి = ఇమ్ము
త్వయి = నీయందు
సర్వం = సమస్తమును
ప్రతిష్ఠితం = నిలచియున్నది

తాత్పర్యము

ఓ మృత్తికా దేవీ! నాచేత చేయబడినట్టి చెడ్డ పనియను పాపమును నశింప చేయుము సృష్టికర్తయైన బ్రహ్మచే ప్రసాదింపబడి, కశ్యపునిచే అభిమంత్రింప బడిన దానివి అట్టి నీవు నాకు పుష్టిని ఇచ్చుదానివి నీయందు సమస్తము నిలబడియున్నది

వివరణ

మట్టి యొక్క అణువులను ఒకే రూపముగా వుంచు దేవతను మృత్తికాదేవి అందురు ఈమె ఖనిజములయందు పనిచేయు దేవత

భౌతికమయిన సృష్టిగా, ఖనిజములుగా దిగి వచ్చిన దేవతా ! నా చేత ఏదయినా చేయకూడనటువంటి పని చేయబడినచో దానిని నశింపచేయ వలసినది ఏ పనిని చేసినా ఈ శరీరముతోనే చేయబడినది ఇది నీవు ఇచ్చిన రూపము భూమి నుండి వచ్చిన ఖనిజములతో నిర్మాణమయినట్టి ఈ రూపము నీదే నీ అనుజ్ఞ లేనిదే ఏపనియును చేయజాలము మేము చేయు పొరపాట్లను సర్దుబాటు చేయవలసినది కూడని పనులు చేయు అవకాశం నాయందు లేకుండా చేయవలసినది సంకల్పము నీదయినా నా ద్వారా ఆచరింపబడుచున్నది కనుక కర్మలవలన దుష్ఫలితములు మేము పొందకుండా చేయవలసినది" యని ధ్యానము చేయవలెను

ఈ భూమి బ్రహ్మచే కశ్యపున కీయబడి ఆయనచే అభిమంత్రింప బడినదని చెప్పబడినది పూర్వమొకసారి కశ్యపుడు యజ్ఞమున సంకల్పించి పూర్తి చేయగా బ్రహ్మ మెచ్చి ఆయనకు భూమి దేవిని వరముగా ప్రసాదించెను దానికి భూమి దేవికి కోపము వచ్చి పాతాళమునందు దాగి విలపించుచుండెను అప్పుడు కశ్యపుడు తపస్సుచేసి భూమిదేవిని మెప్పించి ఆమె మరల పైకి తేలునట్లు చేసెను ఇచ్చట కశ్యపుడనగా భూమిని చుట్టియున్న ఆకాశము అందు రాశి చక్రమున్నది ఈ రాశిచక్రము యొక్క ప్రబావముచేత చోటులో మార్పులేర్పడి భూగోళమొక నుడిగా ప్రాణమయ తరంగములుగా తేలినది తరువాత సూర్యుని ప్రబావముచేత, రాశిచక్ర ప్రభావముచేత ఈ తరంగములను జలములు అనగా శక్తిమయ తరంగములు భౌతి గోళముగా ఏర్పడినవి అప్పుడు భూమి భౌతిక స్థితిలోనికి వచ్చి గట్టిప గోళాకారముగా నిలచినది అంతకుముందు శక్తిమయ లోకములలో నున్నపుడు భూమికి ఉత్తరధృవమే గాని దక్షిణధృవము లేదు

ఇదియే మరియొక కథగా చెప్పబడినది కశ్యపుడు భూమికి దక్షి ప్రాంతమునందలి ప్రదేశము పాతాళము లోనికి మునుగగా తాను, పైకె పట్టి నిలిపి తరువాత ఉత్తరమునందలి రాజులను తెచ్చి అచ్చ పరిపాలకులుగా నేర్పరచెనని చెప్పబడినది ఇచ్చట ఉత్తరము నుం రాజులను తెచ్చి పరిపాలకులుగా నేర్పరచుట అనగా సూర్యకిరణముల భూమి దక్షిణదిశకు ప్రసరించునట్లు భూభ్రమణము నేర్పరచి ఉత్తరాయ దక్షిణాయనముల నేర్పరచి భూగోళమును పరిపూర్ణ భౌతిక స్థితి యం నిలిపెను

# అనువాకము 9

## మంత్రము 1

**మృత్తికే ప్రతిష్ఠితే సర్వం తన్మే నిర్ణుద మృత్తికే।**
**తయాహతేన పాపేన గచ్ఛామి పరమాం గతిమ్ ||**

### ప్రతిపదార్థము

మృత్తికే = మట్టియందు
సర్వం = సమస్తము
ప్రతిష్ఠితే = ప్రతిష్ఠింపబడియున్నది
మృత్తికే = ఓ మృత్తికా దేవి
తత్ = ఆ (పాపములు)
మే = నాకు
నిర్ణుద = తొలగజేయుము
తయా = దానిచేత
పాపేన హతేన = పాపమును కొట్టుట చేత
పరమాంగతిమ్ = పరమము అయిన స్థితికి
గచ్ఛామి = పోవుచున్నాను

### తాత్పర్యము

సర్వము మృత్తికయందు ప్రతిష్ఠింపబడియున్నది అట్టి ఓ మృత్తికాదేవీ! నాయందు వానిని (పాపములు) తొలగజేయుము అట్లు పాపము కొట్టబడుట చేత నేను పరమగతిని పొందుచున్నాను

### వివరణ

మృత్తిక యందు సమస్తము ప్రతిష్ఠింపబడియున్నది మానవులు జంతువులు, వృక్షములు మట్టివలననే నిలచి ఉన్నవి మట్టిలేనిచో ప్రపంచమే లేదు భూమియందలి ఖనిజాదుల వలన, లవణముల వలన వృక్షములకు ఆహారమేర్పడుచున్నది అట్టి వృక్షములను ఆహారముగా స్వీకరించుట చేత మానవకోటి, జంతువులు జీవించుచున్నవి

భూమియందలి ఖనిజాదుల వలన మానవుడు లోహములు వానివలన ఆయుదములు (instruments) నిర్మించుకొని జీవితమున సుఖమయముగా మార్చుకొనుచున్నాడు మట్టియందు బంగారమువంటి లోహములేకాక, పెట్రోలియము వంటి ఇందనములు, ప్లాస్టిక్ వంటి వస్తువులను పొందుచున్నాడు కనుకనే సమస్తమునకు మట్టియే ఆదారము అంతేకాక కొన్ని రోగములు మట్టిని శరీరమునకు రాచుకుని స్నానము చేయుటచే నశించును ముఖ్యముగా నదిలో స్నానము చేయునపుడు నది అడుగుభాగముననున్న మట్టిని శరీరమునకు రాచుకుని స్నానము చేసినచో శరీరము ఆరోగ్యవంతము, పుష్టివంతము అగును ఆయుర్వేద చికిత్సయందు 'మట్టి పట్టి యను పేరుతో దీనిని గూర్చి సమగ్ర చికిత్సా విదానము కలదు

అట్టిమట్టిని ఆధారముగా చేసికొని ఈ ప్రపంచమంతయు నిలచియున్నది మానవునకు నిత్యజీవిత వ్యవహారములన్నియు మట్టిని గూర్చి, దానికి సంబందించిన వస్తువులను గూర్చి ముడిపెట్టుకొనియుండును మట్టినుండి పుట్టిన (పైన చెప్పబడిన) లోహాది ద్రవ్యములన్నియు మట్టిలో బాగములే కదా । సూర్య కిరణములు భూమి అణువులపై చూపు కర్షణము అను శక్తి చేత (Magnetic and Electrical charge upon the atoms of the earth)మట్టి యొక్క అణువుల యందు రసాయని మార్పులేర్పడి, వేరు వేరు ద్రవ్యములుగా విశ్లేషణము చెందును అట్టి విశ్లేషణము చేత బంగారమునుండి మైకా, పెట్రోలియము వరకు ఎన్నో ద్రవ్యములు భూమియందేర్పడుచున్నవి

ఇది అంతయు కొన్ని మన్వంతరముల కాలము (కోట్ల సంవత్సరములు) జరిగిన వెనుక భూమిపై మానవసృష్టి ప్రారంభమయినది అనగా సుమారు నేటికి 8॥కోట్ల సంవత్సరముల క్రితము భూమిపై మొట్టమొదటి మానవుడు జన్మించినాడు మొట్టమొదటి మానవజాతి మిక్కిలి ఎత్తయినవారు సుమారు 150 అడుగుల ఎత్తు కలిగి క్రమేణా ప్రస్తుత ఆకారములోనికి వచ్చినారు

అట్టి దశలలో కొంతకాలము మానవుడు రెండుకన్నులు బదులు ఒక కంటితో జీవించినాడు వీరినే cyclopes అను పేరుతో జీవశాస్త్రజ్ఞులు (Biologists) భూమిపై ఒకప్పుడు కొంతకాలము జీవించియుండి యుండవలెనని అంగీకరించినారు ఆనాటి మానవ దేహమ ననుసరించియే జంతువుల దేహములు కూడా నుండినవి రాక్షసబల్లు

(Dinosaur) మున్నగు పేర్లతో నున్న జంతువులు అట్టివే కాలక్రమేణా మానవునికి బుద్ధి వికాసము పెరిగిన కొలది శరీర పరిమాణము క్రమేణా తగ్గినది వానితో పాటు జంతువుల పరిమాణము కూడా తగ్గినది ఇట్టి మార్పులు భూమిపై సూర్యుని ప్రభావము వలన కలుగుచున్నవి భూమిపై నున్న అణువుల చేతనే మానవులకు, జంతువులకు శరీరము లేర్పడుచున్నవి కనుక సూర్యకిరణ ప్రబావము కూడ వారి దేహములపై సైతము పనిచేయును ఇది అంతయునొక విశ్వప్రణాళిక(Cosmic law) ననుసరించి జరుగును దానిననుసరించియే బూమి యొక్క దర్మము, జీవుల దేహముల దర్మములు మారుచుండును

ఇట్టి సత్యములను ప్రకృతియందు గమనించి జీవితమును వానితో సమన్వయము చేసికొనవలెను అట్టి మహాశక్తి సృష్టియందు పనిచేయు విదమును గమనించి తమ జీవితముల యందలి వ్యక్తిత్వములను, ప్రత్యేకతలను బట్టి విశ్వప్రణాళిక యందు సమర్పించుకొనవలెను తన దేహము, ప్రాణము, మనస్సు, బుద్ధి, పరిసరములు మున్నగునవి అట్టి విశ్వప్రణాళిక యొక్క ప్రతిస్పందనములని తెలుసుకొని వాటియందలి ఏకత్వమును దర్శింపవలెను అనగా జీవితమునందు తననాకర్షించి పనులు చేయుటకై పురిగొలుపుచున్న ఊహాలను, సన్నివేశములను తన వ్యక్తిగత ప్రణాళిక లేక జీవిత ప్రణాళికయందలి అంశములుగా గుర్తింపవలెను తల్లి బిడ్డను ప్రేమించుట ఉద్యోగము చేసి దనము సంపాదించుట, సుఖకరమైన జీవితము కావలెననుకొనుట, జీవిత ప్రణాళికలోని బాగములే అట్టి తాననుకొనినవి సాదించుటయందు తానవలంబించు మార్గములు తన వ్యక్తిత్వమును ప్రతిబింబించును అట్టి తన వ్యక్తిత్వము అను లక్షణము విశ్వప్రణాళిక యందలి బాగముగా తెలియువానికి సమస్యలుండవు విశ్వప్రణాళిక యను మహాసముద్రమునుండి ఒక చెంబుతో తాను తెచ్చుకొను నీరు వంటిది వ్యక్తిగత ప్రణాళిక తన ఇష్టాయిష్టములకు సంబందము లేక తన దర్మమును నిర్వహించుకొనువానికి జీవితమునందు నచ్చకపోవుట అను అంశములుండక అన్నియు ఇష్టమే అగును ఇవియే తన చెంబులోని ఉప్పునీటిని మంచినీటిగా మార్చుకొనుట వంటిది అట్టి దర్మము తనకిష్టమైనపుడు జీవితము ఒక మదురమయిన అనుబూతియగును ఇదియే నీటిని పాలుగా మార్చుకొనుటవంటిది ఆవు నీటిని, గడ్డిని స్వీకరించి పాలను ఇచ్చినట్లు అంతర్యామి బావనచేత పరిస్థితులను

సమన్వయము చేసుకొనువానికి జీవితమంతయు క్షీరమై ఆహ్లాదకరమైన అనుభూతిగా మారును చోటునందంతను నిండియున్న ఇట్టి మాధుర్యముతో కూడిన అనుభూతినే క్షీరసాగరము అని పెద్దలు పిలచిరి అట్టి క్షీరసాగరమునందలి అనుభూతిగా తనలో జీవులను లీనము చేసికొనువాడు మహావిష్ణువు లేక పరమాత్మ అట్టి పరమాత్మయందు లీనమగు అనుభూతియే పరమాంగతిమ్ అని ఈ మంత్రమునందు చెప్పబడినది అట్టి స్థితిలోనున్నవాడు పాపములు చేయుట ఉండదు

## మంత్రము 2

యత ఇన్ద్రభయామహే తతో నో అభయం కృధి
మఘవ చ్ఛగ్ధి తవ తన్న ఊతయే విద్విషో విమృధో జహి।

## ప్రతిపదార్థము

హే ఇన్ద్ర = ఓ। ఇంద్రుడా।

యతః = ఎచ్చటనుండి (దేనివలన)

భయామహే = మేము భయపడుచున్నామో

తతః = అచ్చటినుండి

నః = మాకు

అభయం = భయములేని స్థితిని

కృధి = (కలిగించుము)

నః = మాకు

తతో = అట్టి

తవ = నీయొక్క

ఊతయే = అలంబనము కొరకు

విద్విషః = శత్రువు (ద్వేషమును కలిగించువాడు)

విమృధః = పీడన కలిగించునట్టి

జహి = సంహరించుము

మఘవన్ = ఓ। మేఘాదిపతియైనవాడా।

శగ్ధి = శక్తి కలుగుట

తాత్పర్యము

ఓ ఇంద్రా ! మేము దేనినుండి భయపడుచున్నామో, అట్టి వానినుండి మాకు అభయమును కల్పించుము ఓమేఘాదిపతియైన వాడా ! నీయొక్క ఆలంబనముచే మాయందలి సంఘర్షణమును, ద్వేషము కలిగించు వానిని సంహరింపుము

వివరణ

ఈ మంత్రము శత్రుంజయ మంత్రములలోనిది ఇచ్చట ఇంద్రుని ధ్యానము చేయుటచేత అభయము పొందు విధానము చెప్పబడినది మానవునికి భయము కలుగుటకు కారణము భౌతిక జీవితమును గూర్చిన అస్థిరత్వము సృష్టిలో వస్తువులు, సంపదలు ఎవరి వద్దను శాశ్వతముగానుండవు లోకమున సంపదలు ఒకరిచే ఉత్పత్తి చేయబడి production) మరియొకరిచే వినిమయము(Distribution) చేయబడి, ఇంకొకరిచే అనుభవింపబడు (consuming) చున్నవి ఇట్లు సంపదలు స్థిరత్వములేనివి కనుకనే అట్టి సంపదలు కలిగించు లక్ష్మిని చంచల అనిరి లక్ష్మి అనగా ధనము అనిమాత్రమే అర్థము కాదు భౌతిక జీవితమునకు కావలసిన సాధనములన్నియు సంపదలు ' అని పిలవబడుచున్నవి ఋతువుల ననుసరించి ఆహార దాన్యములను, ఇతర సాదనములను భూమియందు కల్పించి ఇచ్చు ప్రకృతిశక్తినే లక్ష్మిగా చెప్పిరి ఈమెప్రబావము చేతనే జనులకు సంపదలను తోటివారికి పంచి పెట్టవలయుననెడి ప్రకృతి కలుగుచున్నది సంవత్సరము లోపల వినియోగింపనిచో నశించిపోవు లక్షణము ధాన్యాది పదార్థములకు లేనిచో సంపదలను ఎవడు పంచిపెట్టును? తుదకు బంగారము, డబ్బువంటివి సహితము దాచుకొన్నచో దొంగల నాకర్షించు లక్షణము గలవి గనుక తప్పనిసరిగా అవి వినిమయములగును దొంగలు కానిచో పన్నులు వసూలు (Tax officers)చేయు అధికారుల రూపమున ధనము వినిమయములోనికి వచ్చును

కాని ఇందలి చిత్రమేమనగా బంగారముకాని, ధనముకాని ధాన్యాది ఆహారద్రవ్యముల వినిమయమునకు మాత్రమే ఉపయోగపడును వాటి విలువ అంతవరకుమాత్రమే ఇంకను బంగారము, వెండి, రత్నములు, ముత్యములు మున్నగునవి కొన్ని ఔషధములలో ఉపయోగింపబడును అట్లే ప్రతిగ్రహమునకు ఒకలోహము, కొన్ని విలువగల రాళ్ళు(రత్నము,

మాణిక్యము మున్నగునవి) ఉత్తేరకములుగా నుండును (Projectors of Energy)అనగా వాటిని దరించుట వలన ఆయాగ్రహములకు సంబందించిన కొన్ని దుర్లక్షణములు తొలగి, ప్రాణశక్తి ఆకర్షింపబడును మరియు ఆయాగ్రహములకు సంబంధించిన ఉత్తమ మానసిక లక్షణములు ప్రచోదనము చెందును కనుకనే ఆబరణములు దరించుట యనుసంప్రదాయ మేర్పడినది కనుక దానిని మించిన సదుపాయము ఈ దనమునందులేదు అనగా అవసరమునకు మించిన దనము మానవునకు నిరుపయోగము ధనమును నమ్ముకున్నవారికి దొంగలు బాధించుట, పన్నుల అదికారులను గూర్చిన భయము మున్నగునవి భయకారణములుగా పనిచేయును అట్టి వానినుండి బయటపడవలెనన్నచో మానవుడు దనమును విశ్వసించుట మాని సంపదలను విశ్వసింపవలెను సంపదలు అనగా దాన్యాదులు, బూములు, పశువులు మొదలగునవి ఎందుచేతననగా ఒకగింజను నాటినచో వేయిగింజలు వచ్చును ఇట్టి సదుపాయము ప్రకృతియందుండగా దానిని విశ్వసింపకపోవుట వలన మానవుడు భయపడుచున్నాడు దానికన్న దనము ఎక్కువ శాశ్వతమని విశ్వసించుటయే నేటి వ్యాధులకు, సమస్యలకు, ముఖ్యకారణము ఇట్టి భయమే రక్తపోటు, గుండెజబ్బు ఇంకను ఆందోళన మున్నగు వాటికన్నిటికి కారణము ప్రస్తుతము సమాజమునందు దనిక వర్గము, పేదలు అను తరగతులు ఇట్టి దనముననుసరించియే యేర్పడినవి సమాజమునందలి వినిమయమునకు సంపదలను ప్రధానముగా చేసి, దనమును అప్రదానముగా చేసినచో ఈ తారతమ్యములు తొలగిపోవును అట్టి మార్పు రానంతవరకు రాజకీయవాదులు ఎన్ని సిద్ధాంతములు ప్రతిపాదించినను, ఎన్ని పార్టీలు పెట్టుకొన్నను లాభము లేదు దనముయొక్క అప్రధానత్వమును, సంపదలయొక్క ప్రాధాన్యమును జనులకు నిరూపించి, అందలి సుఖమును లభింపచేయనంతవరకు ఈ పరిస్థితులు మారవు సంపదయొక్క ప్రాదాన్యము గుర్తించుట వలననే మానవునియందు భయకారణములు తొలగిపోవును

అట్లే వ్యాధులు కూడ శరీరమునకు సంబందించినవి శరీరముకన్న తాను సత్యము తనపై ఆధారపడి శరీరమున్నది కాని శరీరముపై ఆధారపడి తాను లేదు తానే శరీరమనుకొనువానికి శరీరము భయకారణమగును. తాను సత్యమై, శరీరములు తనకు

వచ్చిపోవుచుండునని తెలిసినవానికి భయకారణములు నశించును అట్లే పరిస్థితులు, వ్యక్తులు సత్యమై అందలి అంతర్యామి విస్మరింపబడినపుడు పరిస్థితులు, వ్యక్తులు భయకారణమగును కాని అట్టి అంతర్యామియొక్క స్మరణ మరల ఇంద్రియములవలననే కలుగుచున్నది కనుక తనయందలి లోపము ఇంద్రియములకాపాదించి తనను ఇంద్రియములు మోసగించుచున్నవని నమ్మువాడు మూర్ఖుడు దేవుని చిత్రపటమును చూచుట, ఆయననుగూర్చి వినుట మున్నగునవి ఇంద్రియము వలననే నిర్వహింపబడును కదా! అట్టి ఇంద్రియములకదిపతి ఇంద్రుడు కనుక ఇంద్రునిగూర్చి ద్యానించుటవలన భయకారణములు తొలగును ఇంద్రుడు వేదములయందు, కొన్నిచోట్ల ఇంద్రియములకదిపతిగా, కొన్నిచోట్ల సూర్యునిగా, మరికొన్నిచోట్ల దుష్టశక్తులను నశింపచేయు రుద్రునిగా, ఇంకను జనులయందు ఆనందమును, పారవశ్యమును కలిగించు సోముడను దేవతగా వర్ణింపబడినాడు మరియు(శరీరమునందలి) దేవతలకదిపతిగా ఇతడే తెలియబడుచున్నాడు మానవునికి భయమును కలిగించు కారణములను ఇంద్రుడే ఒక్కొక్కరూపమున ఒక్కొక్కస్థితిలో ఒక్కొక్కటిచొప్పున తొలగించును సూర్యుడను రూపమున వర్షమును కలిగించి సంపదలనిచ్చును మేఘాదిపతిగా, అన్యాపదేశముగా 'మఘవన్' అను పదమును సూచించుచున్నది ఇంకను 'మఘవన్' అను పదము'మఖ'లేక 'మఘ' నక్షత్రముగల సింహరాశి కధిపతియైన సూర్యుడుగా సంబోదింపబడు చున్నాడు సింహరాశి ధైర్యసాహసములకు, రక్షణకు ప్రేమకు అదిపతి మృగములలో సింహము రాజు కనుక సింహరాశి ప్రజలను రక్షించుట అను లక్షణమును సూచించును సింహరాశి కదిపతియైన సూర్యుడు జీవులను రక్షించుచున్నాడు అట్టి సింహరాశి లక్షణములననుసరించి సూర్యవంశపు రాజులయిన శ్రీరాముడు, దిలీపుడు, అజమహారాజు మున్నగువారు ప్రజలను రక్షించి నిర్భయులుగా జీవించునట్లు చేసిరి సింహరాశి దానికదిపతియైన సూర్యుడు శరీరమునందలి హృదయమునకదిపతులు మానసికపు వత్తిడులవలన జబ్బులు వచ్చుటయు గుండెజబ్బులు మున్నగునవి కలుగుటయు 'విమృధః' అనుపదము సూచించును అట్టిజబ్బులు రాకుండవలెనన్నచో సూర్యుని ఉపాసింపవలెను ప్రస్తుతమంత్రములు కూడ అట్టివే ఇతరులను చూచి ఈర్ష్యపడి ద్వేషించువారికి, అట్టి లక్షణము వారికి తనకు గల తారతమ్యములు చూచుకొనుట వలన, వారియందు ప్రేమలేకుండుట

వలన కలుగును తనకుమారుడు తననెంత నిందించినను, అగౌరవపరచినను, ద్వేషించు తల్లి వుండదు ఆమెకు కుమారుని యందుగల ప్రేమయే దీనికి కారణము అట్టిప్రేమకు అదిపతి రాశిచక్రమునందలి సింహరాశియే కనుకనే 'మఘవన్' అను శబ్దముకూడ సూర్యుని, ఇంద్రుని సూచించును అట్టి ఇంద్రుని ఉపాసించుట వలన మానవులకు భయకారణములు, వ్యాదికారణములు, ద్వేషకారణములు తొలగిపోవుచున్నవి అనగా తోటివారిని ప్రేమించి, ఆదరించుటవలన మానవునికి భయకారణములు తొలగిపోవుచున్నవి

(ఈ మంత్రము దీనితరువాత మంత్రములు ఇంద్రు నుద్దేశించినవి ఇవి స్నానమంత్రములే గాక వర్షమును గూర్చికూడ ద్యానము చేయవచ్చును)

## మంత్రము 3

స్వస్తిదావిశస్పతివృత్రహావిమృదోవశీ
వృషేన్ద్రః పుర ఏతునస్స్వస్తిదా అభయంకరః

## ప్రతిపదార్థము

స్వస్తిదా = సుఖమును ఇచ్చువాడు

సు+అస్తి = స్వస్తి (well being) క్షేమముగానుండుగాక

విశస్పతి = విశ్వమునకు అదిపతియైనటువంటివాడు

వృత్రహా = వృత్రాసురుని సంహరించినటువంటివాడు

విమృదః = యుద్ధములను నశింపచేయువాడు

వశి = వశపరచుకొనువాడు

వృషా = వర్షింపచేయువాడును

అభయంకరః = అభయము ఇచ్చువాడు (అగు)

ఇంద్రః = ఇంద్రుడు

నః = మమ్ములను

పురః = మొదట (ముందుండి)

ఏతు = రక్షించుటకు వచ్చునుగాక

## తాత్పర్యము

శుభమును కలుగచేయునట్టి, విశ్వమునకు అదిపతియైనటువంటి, వృత్రాసురుని సంహరించునటువంటి, యుద్ధములను

శింపచేయునటువంటి, వర్షమును కల్పించునట్టి, (అభయమిచ్చునట్టి
ంద్రుడు మమ్ములను రక్షించుటకు వచ్చుగాక

## వరణ

స్వస్తి యనగా శుభము లేక సుఖము అనుస్థితి దీనిని ఇచ్చువాడు
శస్పతియైన ఇంద్రుడు విశస్పతియనగా విశ్వమునందతర్లీనముగా
ండి దాని కదిపతిగా పనిచేయుచున్న మహాప్రజ్ఞ అట్టి ఇంద్రుడు
ఞవిశ్వమునందు రెండుస్థితులలో పనిచేయుచున్నాడు పైలోకములలో
నిచేయుచున్న ఇంద్రప్రజ్ఞను ఇంద్రావిష్ణువు అందురు
ందిలోకములలో పనిచేయుచున్న ఇంద్రుడు అగ్నావిష్ణువు
నిపిలువబడును ఈయన జీవప్రజ్ఞకు, భూమియందును ఖనిజముల
యందును పనిచేయుచున్న ప్రజ్ఞలకును, అదిపతియైయుండి వానిని
డుపుచున్నాడు బౌతిక స్థితిలో మానవులకు భయకారణములు
ంద్రియభ్రాంతులచే కలుగును రాగద్వేషములు మున్నగు వానికి
నగుట జరుగుచుండును అట్టివి సంస్కరింపబడుట వలన అగ్నా
ష్ణువు యొక్క అనుగ్రహము పొందును ఇంకను ఇంద్రియముల
తీతమైన స్థితిని సాదించినవాడు ఇంద్రావిష్ణువుయొక్క అనుగ్రహము
ొందును

వృషేంద్రః నః పురయేతు - వృషేంద్రులు మమ్ములను నడుపును
ాకయని యర్థము వృషభరాశి యందలి సూర్యుడే వృషేంద్రుడుగా
ాంకేతికములుగా చూపబడినాడు రాశిచక్రమునందుగల 12 రాశులలో
ృషభరాశి రెండవది ఇది మనశరీరమునందు ముఖమును (నోరు)
ూచించును అనగా ఆహారము, సుఖము మున్నగునవి సూచించును
చ్చట వృషేంద్రః పురయేతునః అనిచెప్పుటలో జీవించుటకు
ుట్టమొదట ఆహారము కావలెను కనుక అట్టి ఆహారము తద్వారా
హాపుష్టిని కలిగించునట్లు సూర్యుడు కోరబడుచున్నాడు మరియు
ృషా అనుశబ్దము వర్షమును సూచించును జీవులకాహారము
ావలెనన్నచో వర్షము కురిసి పంటలు పండవలెను కనుక ఇంద్రుడట్లు
ంబోదింపబడుచున్నాడు వర్షము కలిగించుటకు సూర్యుడు
ారణమగుచున్నాడు గనుక ఇచ్చట సూర్యుడే ఉద్దేశింపబడినాడు ఇంకను
ృషశబ్దము వృషభమును సూచించును వృషభము దాంపత్యమునకు
ర్భదారణకు సంకేతము కనుక వృషభరూపుడైన సూర్యుడు జీవులకు

దాంపత్యమును, మరియు మొక్కలు, చెట్లు పలించి, పుష్పించుటను సూచించును కనుక అట్టి వృషభరూపుడైన సూర్యుని లేక ఇంద్రునికి సంతోషము కలిగింపవలెనన్నచో గో, వృషభములను పెంచి పోషించి రక్షించవలెను మరియు వాటినుపయోగించి భూమిని సాగుచేసి పాడిపంటలను చక్కగా వినిమయము చేయవలయును దీని వలన మానవుడు తాను సుఖపడుటయేగాక తోటివారిని సుఖపెట్టును

విమృదోవశీ యనగా యుద్ధములను నశింపచేసి శత్రువులను వశపరచుకొనువారు అని అర్థము సమస్తమును అంతర్యామిగా నుపాసించు వారికి శత్రువులుండరు అనగా భయకారణములుండవు

ఈ మంత్రమును ధ్యానము చేయుచు స్నానము చేయువారికి చక్కటి ఆరోగ్యము చేకూరును

మంత్రము 4

స్వస్తి న ఇన్ద్రో వృద్ధశ్రవాః స్వస్తినః పూషా విశ్వవేదాః।
స్వస్తినస్తార్క్ష్యో అరిష్టనేమిః స్వస్తినో బృహస్పతిర్దధాతు॥

ప్రతిపదార్థము

ఇంద్రః = ఇంద్రునకు

సు+అస్తి = స్వస్తి = సుఖము కలుగుగాక

వృద్ధశ్రవాః = పెద్ద చెవులు కలవాడు

పూషావిశ్వవేదాః = విజ్ఞానరూపుడైన పూషుడు

నః = మాకు

స్వస్తి = స్వస్తిని కలిగించుగాక

అరిష్టనేమిః = చక్రమునందు వర్తించు

తర్క్ష్యః = గరుడుడు

నః = మాకు

స్వస్తిః= సుఖమును

బృహస్పతి = వాక్కునకు అధిపతియైన బృహస్పతి

దదాతు = కలిగించుగాక।

## తాత్పర్యము

పెద్ద చెవులు గల ఇంద్రుడు మాకు స్వస్తిని కలిగించుగాక విశ్వమందలి విజ్ఞానరూపుడైన పూషుడు మాకు స్వస్తిని కలిగించుగాక। అరిష్టములను తొలగద్రోయు చక్రము నందు వర్తించు గరుడుడు మాకు స్వస్తిని కలిగించుగాక। వాక్కునకు అదిపతియైన బృహస్పతి మాకు క్షేమమును కలిగించుగాక।

## వివరణ

ఇంద్రుడు వృద్ధశ్రవుడు అని చెప్పబడినది ఇచ్చట ఇంద్రుడు గానమునకు అదిపతియైన సోముని అంశగా స్తోత్రము చేయబడుచున్నాడు చక్కటి గానమునకు ఇంద్రియములు వశమగును గనుక ఇంద్రుడు వృద్ధశ్రవశుడు అనిచెప్పబడినది చోటునందలి ఇట్టి గానముననుసరించియే సృష్టి నిర్మాణమగుచున్నది ఒక్కొక్క రాగమునకు సృష్టియందలి ఒక్కొక్క దర్మము లేక ప్రవృత్తి మేలుకొనుచుండును సూర్యుడు, చంద్రుడు మొదలగు గ్రహములు వేర్వేరు రాగములుగ మేల్కొనుచున్నారు అంతేగాక విశ్వమునందు సహితము ఇట్టిరాగముల చేతనే తారలు మేల్కొనుచున్నవి దానివలన రాశి చక్రమేర్పడి తరువాత సౌరమండలము వచ్చినది రాశిచక్రమునందు కూడ మొట్టమొదటగా మిదునరాశి మేల్కొనినదని చెప్పబడినది ఈ మిదునరాశి సృష్టికంతటికి మిక్కిలి ప్రాచీనమైనదనియు దాని ననుసరించియే మిగిలిన సృష్టి ఏర్పడినదనియు పెద్దలు చెప్పిరి మిదునరాశి సంగీతమునకు, ఉచ్చారణకు అదిపతి ఇట్లు ఇంద్రుడు గానమున కదిపతియైయున్నాడు కనుకనే అట్టిగానము చేయుటవలననే మరల ఇంద్రియములు కరగి పరమాత్మయందు అంతర్లీనమగుట సాద్యమగును కనుక ఇచ్చట ఇంద్రుడు పెద్దచెవులు కలవానిగా చెప్పబడినాడు

పూషుడు విశ్వవేదుడు అనగా విశ్వమునందు మేలుకొనియున్న వేదము లేక జ్ఞానము దీని వలననే అపుడే పుట్టిన శిశువునందు ఆహారము తీసుకొనుట అను జ్ఞానము మేలుకొని పనిచేయుచున్నది ఆహారముతీసుకొనుట, శరీరము పుష్టివంతమగుట మున్నగునవి పూషుని ప్రవృత్తులు ద్వాదశాదిత్యులలో (12మంది సూర్యులు) పూషుడొకడు జ్యోతిషశాస్త్రమున వృషభరాశిలోని సూర్యుడు పూషుడని

పిలువబడుచున్నాడు వృషభరాశి, నోరు ఆహారము స్వీకరించుట అనువానికి సంకేతము కనుక దేహము పుష్టివంతము కావలెనన్నచో మరియు ఆకలి పెరిగి జీర్ణప్రక్రియ సక్రమముగా జరుగవలెనన్నచో పూషుని ధ్యానము చేయవలెను

తార్క్ష్యుడు అనగా ఈభూమికి పరిదియైనవాడు ఇచ్చట భూమియనగా భూగోళమనికాక, భూమియొక్క ఆకర్షణశక్తి ఎంతవరకు విస్తరించియుండునో అంతవరకు అని అర్ధము ఇట్టి పరిది తార్క్ష్యుడను దేవతచేత ఏర్పరుపబడియున్నది దీనిలోపల యుండు జీవులకు అనగా భూవాతావరణమునందుండు జీవులకు సూర్యుని నుండి ఇతరగ్రహములనుండి, నక్షత్రములనుండి ప్రాణవినాశకరమగు శక్తులు భూవాతావరణమున ప్రవేశింపకుండునట్లు కాపాడుచుండును ఇదియే లేనిచో భూమిపై జీవసృష్టి లేకుండెడిది దీనికి కొంచెము క్రిందుగనే నేటి శాస్త్రజ్ఞులచే చెప్పబడు ' ఓజోన్ (Ozone) పొర ఏర్పడియున్నది కనుకనే ఈ తార్క్ష్యుడు అరిష్టనేమిః అని చెప్పబడినాడు నేమి యనగా చక్రము అరిష్టనేమి యనగా బాదలను తొలగించుశక్తి వేదములందు ఇతడింద్రసభయందుండునని మృత్యుభయములేని వాడుగా చెప్పబడినది

బృహస్పతి యనగా వాక్కునకదిపతియైనవాడు ఈయన సరస్వతి యొక్క పురుషరూపము వాక్కులు, వాక్కును ధ్యానము చేయుట, శబ్దమును ధ్యానముచేయుట, స్తోత్రములు, మంత్రములు ఉచ్చరించుట తద్వారా అంతర్యామినుపాసించు మార్గమునకీయన అదిపతి పూజలు, యజ్ఞములు, హోమములు, ఉత్సవములు, దేవాలయములు, ఆగమ శాస్త్రము మున్నగువానితోబాటు, పురాణములు, వేదములు, ఇతిహాసములు, మతశాస్త్రగ్రందములు, జ్యోతిశ్శాస్త్రము మున్నగునవన్నియు ఈయనకు సంబందించినవే అట్టిమార్గముల ద్వారా అంతర్యామిని ఉపాసించుట బృహస్పతి మార్గము

## మంత్రము 5

ఆపాన్తమన్యుస్తృపలప్రభర్మాదునిశ్శిమీవాఞ్చరుమాగ్ంబుజీషి|
సోమో విశ్వాన్యతసావనాని నార్వాగిన్ద్రం ప్రతిమానానిదేభుః ||

## ప్రతిపదార్థము

అపాన్తమన్యుః = అంతులేని కోపముగల మరియు జలములకు చివరియైన వాడు

తృపలప్రభః = రాళ్ళచేకొట్టబడినట్టి లేక చంద్రకాంత శిలలవంటి కాంతి కలిగినవాడు

మాదునిః = వసంతునికి స్నేహితుడు

శిమీవాన్ = శాంతినిచ్చువాడు లేక శమీపత్రములు కలిగినవాడు

శరూమాన్ = మిక్కిలి సౌఖ్యము కలిగించువాడు లేక ఆయుదములను దరించువాడు

ఋజీషీ = దీప్తి కలిగినవాడు లేక ఋజుస్సు అయినవాడు

సోమః = సోముడు

విశ్వాని = విశ్వమంతయు

అతసా = ఎడతెగని గమనము చేత

వనాని = వనములను

అర్వాన్ = వర్షించునట్టి

ప్రతిమానాని = ప్రతిమానములు లేక విశేషమైన కొలతలు

ఇంద్రం = ఇంద్రుని

నదేభుః = క్రిందకి లాగలేవు

## తాత్పర్యము

జలములకు అంతము అయినవాడును మరియు అంతులేని కోపము గలిగినవాడును, చంద్రకాంత శిలలవంటి కాంతిని కలిగి మూడు విదములైన పలితములిచ్చువాడును, మాదుర్యముగలవాడును శత్రువులను నశింపచేయువాడును, శమీవృక్షము నందుండి శాంతిని ఇచ్చువాడును, మిక్కిలి సౌఖ్యమును రసమును ఇచ్చునట్టి సోముడు తన గమనముచే వనములను, ఓషదులను వృద్ధి పొందించుచున్నాడు ఎట్టి విశేషమైన కొలతలు ఇంద్రుని సామీవ్యము నివ్వజాలవు (కొలతలకు అతీతుడని బావము)

వివరణ

ఆపాన్తమన్యుః యనగా జలములకు చివరయైన వాడు లేక మనస్సునందలి బావములకు ఆనకట్టయైన వాడు ఆపస్సులనగా నీరు సృష్టియందు అంతర్యామినుండి మొదట జలములు పుట్టినవి దీనికి సంకేతముగనే శివుడి శిరస్సునుండి గంగ పుట్టినట్లు చెప్పబడినది మన్యుః యనగా ఏకాదశరుద్రులలో నొకడు మన్యువు అనగా కోపమను యర్ధమున్నది జీవులలో కోపముగా వ్యక్తమై ఒకరినొకరు బాదించు కొనుటవలన వారి దుష్కర్మకు పలితముల నిచ్చుచున్నాడు

త్రిఫలప్రబువు యనగా మూడు విదములైన పలితములకు అదిపతియని విశేషార్ధము కోపముచే ఒకరినొకరు కొట్టుట, నిందించుట, అవమానించుట మున్నగువానివలన శారీరకము, మానసికము ఆత్మగతమునైన పలితములనిచ్చి జీవులను సంస్కరించుచున్నాడు దుష్కర్మయైనను, సత్కర్మయైనను మూడులోకములలో దాని పలితము అనుబవింపవలసియున్నది మరియు జీవుడు ఈమూడు లోకములయందు సంస్కరింపబడవలసియుండును కర్మయనునది మానసికము, ఆత్మగతము కూడానగును కర్మలకు సంకల్పములు జీవాత్మయందు ప్రారంబమగును జీవునియందు సంస్కారము కలుగనిచో బౌతిక సంస్కరణముపయోగము లేదు కనుక జీవులకు పలితములు మూడులోకములలో సిద్ధించును అట్లు సిద్ధింపచేయువాడు శివుడు కనుక ఆయన మిక్కిలి కోపము గలవాడుగా చెప్పబడినాడు

ఇంకను ఆయన ఆయుదములు కలవాడుగా కూడా చెప్పబడినాడు అనగా యిట్లు శిక్షించుట ఆయుదములవలన కూడా కావచ్చును సోముడనగా శివుడను యర్ధముకలదు కనుకనే త్రిపల ప్రబువు అనుపదమునకు రాళ్ళతో కొట్టుటయను అర్ధముకలదు అవసరమైనచో రాళ్ళతోను, ఆయుదములతోను, కొట్టబడి జీవులు సంస్కరింపబడుదురు ఇతరులను నిర్ధాక్షిణ్యముగా హింసించువారు, దయ, జాలి ఏమాత్రము లేక మిక్కిలి కఠినముగా వ్యవహరించువారు శివుని కోపమునకు గురియగుదురు ఇట్టి ఇంద్రియముల కదిపతిగా నున్న శివుడు ఇంద్రుడిగా చెప్పబడినాడు అట్టి ఇంద్రుని రూపములోనున్న శివుడు మన ప్రయత్నములకు లొంగడు అనగా యిట్టివారు ఇంద్రియములకు వశులై జీవింతురేకాని ఇంద్రియములు వారికి వశముకావు తనకోపముతో ఇతరులను బాదించువారికి ఇంద్రియములెన్నటికి లోబడవని బావము

ఇందలి విశేషార్థమేమనగా జలములనగా రసములేక జీవితమునందలి అనుభవము అట్టి జలములకు చివరయనగా అన్నిరసములు కలసి ఒకేరసమైన ఆనందము తన్మయత్వమని అర్థము అది మనసు చివర పుట్టును గనుక అపాంత మన్యుః యని సూచ్యముగా చెప్పబడినది అనగా మనస్సు లీనమైన స్థితి యని అర్థము తృపలప్రభువు యనగా తెల్లని చంద్రకాంతశిలలవంటి కాంతిగలవాడని అర్థము అనగా వెన్నెలయని అర్థము పైన చెప్పబడినట్లు మనస్సులయమై తన్మయస్థితిలో నున్నవాని చుట్టును పూర్ణిమ వెన్నెలవంటి కాంతి యుండును అట్టి తన్మయత్వస్థితియందు వాని మనస్సు మాదుర్యము వంటి స్థితి కలిగియుండును ఇదియే మాదుని. యను పదము సూచించుచున్నది అనగా వారు మాటలయందు, చేతలయందు, మాదుర్యత, ఆప్యాయత కలిగి యుందురని బావము

శమీవాన్ యనగా శాంతిని కలిగించువాడు శివుని యొక్క మాదుర్యస్థితి సోముడు అనగా శివుడే జీవులకు ఆనందము కలిగించు స్థితియందు సోముడిగా చెప్పబడినాడు ఈ సోముడు మన సౌరమండలము నందు చంద్రునిద్వారా పనిచేయుచున్నాడు అనగా మనస్సునందు పనిచేయునపుడు చంద్రునిద్వారా, ఆత్మయందు పరవశత్వము కలిగించునపుడు ఇంద్రగ్రహము ద్వారా (Neptune) పనిచేయును కనుకనే ఆయన పరవశము కలిగించి మనస్సు లయము చేయువానిగా, చంద్రుని వంటి కాంతిగలవానిగా, మాదుర్యము కలిగించువానిగా, శాంతిని యిచ్చువానిగా చెప్పబడుచున్నాడు

ఇంకను శరూమాన్ యనగా నిజమైన సౌఖ్యము నిచ్చువానిగా ఋజీషి యనగా ఋజుష్మను పిండి యిచ్చువానిగా చెప్పబడినాడు అనగా సోమరసమును పిండి యిచ్చువాడు జీవితమందలి సంఘటనలనుండి ఆనందమును, తన్మయత్వమును జీవితసారమును పిండి యిచ్చువాడు ఆయనయే సోముడని వర్ణింపబడినాడు అట్టి సోముని ప్రబావము చేతనే భూమిపై మొక్కలు, చెట్లు పెరిగి వనములుగా నేర్పడుచున్నవి సంగీతముచే మొక్కలు చక్కగా పెరుగునను విషయము నవీన శాస్త్రజ్ఞులు రుజువు చేసిరికదా ! ఇట్టి సోముడు మనలోనున్న ఇంద్రగ్రంది (Pineal Gland) ద్వారా శిరస్సు నందు పనిచేయుచున్నాడు ఈ గ్రంది జీవి యంతర్లోకములయందు ఉత్తమ మానసిక లోకములయందు మాత్రమే

పనిచేయును గాని మిగిలిన భౌతిక ప్రక్రియలయందు పాల్గొనదు కనుకనే ఈ ఇంద్రుడు ఎట్టికొాలతలకును లోబడడని చెప్పబడినది

ఇచ్చట మరియొక చిన్నవిశేషమున్నది సోమః అతసావనాని యని చెప్పుటలో సోముడు ఓషదులను వృద్ధిపొందించుచున్నాడనగా తదితరమైన వానియందు వాని సాన్నిద్యము దొరకదని అర్థము అనగా పైనచెప్పిన నిరంతర పారవశ్యము, ఆనందమయస్థితి నిత్యజీవితము నందు సాదించుకొనవలెనన్నచో తప్పనిసరిగా శాకాహారియైయుం డవలెనని యర్థము



# అనువాకము 10

## మంత్రము 1

**బ్రహ్మజజ్ఞానం ప్రదమం పురస్తాద్విసీమతసురుచో వేన ఆవః |**
**సబుద్న్నియా ఉపమా అస్యవిష్ఠాస్సతశ్చ యోని మసతశ్చ వివః ||**

## ప్రతిపదార్థము

బ్రహ్మజ జ్ఞానం పురస్తాత్ = తూర్పు దిక్కున బ్రహ్మనుండి పుట్టిన
ప్రదమం = మొట్ట మొదటిగా
వేనః = వేనుడు
సీమతః = అంచులవరకు
వి ఆవః = విశేషముగా ఆవరించెను
సురుచః = గొప్ప కాంతి గలవాడై
సః = ఆయన
బుద్న్నియా = బుద్ధి చేత
ఉపమా = సామ్యము గల
యోనిం = పుట్టుకను
సతశ్చ, అసతశ్చ = సత్తును (existing), అసత్తును (non existing)
అస్య = వీని యొక్క
విష్ఠా = ఎత్తైనదిగా
వివః = వ్యాపించెను

## తాత్పర్యము

తూర్పుదిక్కున మొట్టమొదటిగా పుట్టినటువంటి బ్రహ్మనుండి పుట్టిన ప్రజ్ఞారూపుడైన వేనుడు గొప్ప కాంతిగలవాడై సౌరమండల పరిదుల వరకు విశేషముగా వ్యాపించుచున్నాడు అతడు బుద్ధిమయమైన లోకములయందు ఉపమములైనటువంటి వాటిని నిలిపెను సత్, అసత్ అను వాటి పుట్టుకను విస్తరింపజేసెను

వివరణ

వేనుడు అను గంధర్వుడు సృష్టి అంతటను వ్యాపించియున్నాడు ‹
వేనుడు గానము చేయును సృష్టి ప్రారంభమైనపుడు ఒకే స్వరము
ఆయన గానము చేసెను ఆ ఒక్క స్వరము నుండి ఏడు స్వరముః
వచ్చినవి అట్లు వేనుడు ఏడు తీగెలు గల వీణతో ఏడు స్వరములతో గానవ
చేయుచున్నాడు ఏడు కేంద్రములలో (Seven centres) మన శరీరమునంద
మూలదారమునుండి సహస్రారము వరకు గల (వెన్నుపాము) బ్రహ
దండమును (వీణగా చెప్పబడిన దానిని) మ్రోయించుచున్నాడు

అట్లు మ్రోయించుచున్నపుడు మనయందు వాక్కుగా వచ్చున
సరస్వతి అని చెప్పుదురు సరస్వతి అనగా గానముగా ప్రవహించునదే
ఈ వేనుని ' Apollo అని అందురు Apollo అనగా సూర్యుడు అ
పొరపడుచుందురు వేనుడు సృష్టికి మొదట పుట్టెను బ్రహ్మనుం
అందరికన్న ముందుగా కుమారుడను ప్రజ్ఞగా పుట్టెను పుట్టి మూడ
లోకములలో వ్యక్తము, అవ్యక్తము అయిన సమస్తమును గానవ
చేయుచున్నాడు ప్రపంచములో వ్యక్తము, అవ్యక్తము అయి
రూపములలో తానే ఉన్నాడు వాటికి కారణములుగా తానే ఉన్నాడ
ఆయన మనయందు బుద్ధియను వెలుగుగా వ్యాపించియున్నాడు మహత్త
అను వెలుగుగా చోటులో వ్యాపించియున్నాడు అచ్చటినుండి ఆయ
గానము భౌతికమైన శరీరాదుల వరకు, శరీరము పుట్టడము వరక
వ్యాపించుచున్నది అనగా బుద్ధి, మనస్సు, ఇంద్రియములు, శరీరమ
ఆయన గానమ యొక్క రూపములుగా వచ్చినవి ఏడు స్వరములు లే
తీగలతో కూడిన ఏడు నాదములు ఏడు స్థాయిలలో, స్వరములలో
వినిపించుచున్నపుడు ఒక్కొక్క స్వరము ఒక్కొక్క లోకమునక
సంబందించినట్లుగా ఆలపించబడుచున్నది ఆయన 49 (7x7) రాగములలో
గానము ఆలపించుచున్నాడు 49ప్రజ్ఞలుగా తానే పనిచేయుచు వాః
అనుభూతిని, రసమును మన ప్రజ్ఞలయందు నిలుపుచున్నాడు ఆ రసమ
లేక అనుభవమే భౌతిక శరీరముగా వ్యక్తమగుచున్నది ఆయన గానమ
నుండి అన్ని రూపములూ వ్యక్తమై చోటులోనికి వచ్చుచున్నవి

సూర్యునికన్న ముందు పుట్టునది ఉషస్సు ఆ సమయమున ప్రాత
కాలమునకాంతిగా, చక్కటి వెలుగుగా వ్యాపించువానిని వేనుడు అందురు
వేనుడు సూర్యుని కన్న ముందు సృష్టిలో పుట్టెను భౌతికమైన వెలుగ

సృష్టిలో వ్యాపించుటకు ముందు వేనుడు వచ్చును బుద్ధి మహత్తు అను వెలుగులుగా వ్యాపించును

సత్ అసత్ అను రెండును తానే అయిన వేనుడు గానము చేయుచు ఈ సమస్తమైన సృష్టియందు వ్యాపించి తన రూపమును, అనుభూతిని జీవులయందు స్థాపనము చేయుచున్నాడు అసత్తు అనగా వ్యక్తమయియున్న సృష్టి 'సత్ యనగా అవ్యక్తముగా నున్న అంతర్యామి దీనిని బట్టి సత్తుగాను, అసత్తుగాను అంతర్యామిని వేనుడు తన గానముచే రెండుగా విభజించుచున్నాడు ఈ రెండింటికిని సామ్యము కలదు సత్ వలన'అసత్' పుట్టినది కనుక అసత్ యనగా వ్యక్తమైన సృష్టి మరియు మానవదేహము మానవుడు పూర్తిగా పరమాత్మ యొక్క సారూప్యమునే కలిగియున్నాడు అంతర్యామి యొక్క సంకల్పము నందలి సృష్టి స్వరూపమే మానవ దేహము విశ్వము కూడ మానవ దేహమును బోలియుండును కనుక వీటికి గల సామ్యమే పైన ఉపమ' యను శబ్దము చేత సూచింపబడినది ఇట్టి వేనుని గానముచే మరల జీవుడు అంతర్యామితో సారూప్యము నొందుచున్నాడు ఈ వేనుని గానము హృదయమునందు విని ద్యానము చేయువానికి అంతర్యామితో సారూప్యత కలుగును ప్రతివాని హృదయము నందును ఈ వేనుని గానము చేతనే గుండె కొట్టుకొనుట మొదలగు ప్రక్రియలు జరుగుచున్నవి హృదయము నందలి తన గుండె చప్పుడును వినుచు ద్యానము చేయువానికి క్రమేణా అందంతర్లీనముగా నుండు వేనుని గానము వినిపించును

**మంత్రము 2**

**స్యోనా పృదివి భవా నృక్షరా నివేశనీ।**
**యచ్ఛాన శ్శర్మ సప్రదాః॥**

**ప్రతిపదార్థము**

పృదివి = ఓ పృదివీ

నివేశనీ = నివాసము కూర్చుదానివి

నృక్షరా = జీవులను, ప్రాణులను సృష్టించు దానవు

నః = మాకు

స్యోనా = మృదువైన దానివి

భవ = అగుదువు గాక

సుప్రదాః = కోరికలిచ్చు దానివి

శర్మ = సౌఖ్యము

యచ్ఛ = ఇమ్ము

## తాత్పర్యము

ఓ పృదివీ। నీవు మాకు మృదువైన దానవగుదువు గాక। జీవులకు, ప్రాణులకు నివేశము కల్పించుచున్నదానివి వరములు ఇచ్చు నీవు మాకు సౌఖ్యమును ఇమ్ము

## వివరణ

స్యోనా పృదివీః ఈ భూమి లేక భౌతిక ప్రపంచము మృదువగు గాక యని చెప్పిరి అనగా నిత్యజీవితమునందు, వ్యవహారములయందు క్లేశములేర్పడకుండును గాక అని అర్థము అట్లుండవలెననినచో ముందు మన మనస్సు పెళుసుగా నుండక మృదువుగా నుండవలయును మెత్తని మనస్సుగల వానికి భౌతిక ప్రపంచముకూడ సుఖమయముగనే యుండును ఈ సుఖమనునది సంపాదించినచో వచ్చునది కాదు ఇతరులను సుఖపెట్టుట నేర్చుకొనని వారు తాము సుఖపడలేరు సుఖమనగా కేవలము శరీర సౌఖ్యము కాదు ఇతరులకు ఏమి కావలెనో తెలుసుకొని వారికది చేసిపెట్టుటవలన తనకు సుఖము లభించును నిత్యజీవితము అట్లుండవలెననినచో నిరంతరము ఇతరుల సుఖమును కోరువాడై యుండవలెను అంతేకాక కొందరికి నిజముగా సుఖపడుట తెలియదు అన్ని అనుకూల పరిస్థితులలోను సకల సౌఖ్యములున్ననూ అనభవింపలేని వారు ఉందురు నడుమునొప్పి వచ్చిన వాడు వైద్యుని సంప్రదించినచో నీకు వెన్నుపూస జారినది, కఠినమైన దానిపై నిద్రించవలెను గానీ మెత్తని మృదువైన పరుపులు మున్నగునవి పనికిరావు అని చెప్పును అట్టివానికి ఇంటిలో ఎటువంటి సౌఖ్యములున్ననూ కఠినమైన చెక్కపైగానీ, నేలపైగానీ శయమించవలసి యుండును దీనికి కారణమొక్కటియే అతడు అంతకుముందు ఎవరికో కష్టము కలిగించి నిద్రసౌఖ్యము లేకుండా చేసియుండును దాని ఫలితమే

వానినిపుడు బాదించుచున్నది కనుకనే తనకు నిజమైన సుఖము కలుగవలెనన్నచో తోటివారిని సుఖపెట్టవలెను

నృక్షరా నివేశనీ యనగా జీవులను, ప్రాణులను సృష్టించి నివాసములు కల్పించుచున్నది ఈ భూమియే మానవులయందు తెలివితేటలు కల్పించి ఇల్లు కట్టుకొనుటయను తెలివి తేటలుగా పనిచేయుచున్నది అందుకు కావలసిన సామాగ్రిని తానే సృష్టించి యిచ్చుచున్నది ఇంకనూ జీవులకు సుఖపడు అబిలాష కలిగించి దానికి కావలసిన వస్తువులను, పదార్థములను సృష్టించి ఇచ్చుచున్నది దీనిని ° పరమాత్మ కష్టములను సృష్టింపలేదని, జీవులు సుఖపడుటకే సృష్టి ఎర్పరచబడినదనీ నిజముగా సుఖపడదలుచు కొనిన వానికి ప్రకృతి సహకరించునని తెలియుచున్నది అయినచో కష్టములెందుకు వచ్చినవనగా దానికొక్కటే సమాదానము కష్టములు మానవునిచే సృష్టించుకొనబడినవి తానొక్కడే సుఖపడవలెనను దుష్యయత్నమే మానవునికి కష్టములను తెచ్చిపెట్టినది ఎందుకనగా ప్రతిమానవుడునూ అట్టి ప్రయత్నమే చేయును కదా। దాని వలన జీవులందరకును ఒకరితో మరొకరికి పెనుగులాటలు సంఘర్షణలు, యుద్ధములు, దానికి ఫలితముగా అశాంతి ప్రకృతి మొత్తము మానవుని సుఖమునకై సహకరించుచుండగా మానవుడే స్వయముగా దుఃఖములను సృష్టించుకొనుచున్నాడు ప్రకృతి సహితము మానవుడు వ్యక్తిగతముగ సుఖపడుటకు గాక సమిష్టిగా సుఖపడుటకు మాత్రమే సహకరించును చెట్టునందలి పండ్లన్నియూ తానొక్కడే తినవలయునని ప్రయత్నించినచో అవి నిలువయుండక కృళ్ళిపోవును తోటివారితో కలసి తినినచో అందరకునూ, ఎప్పుడును తాజాఫలములు లబించును ప్రకృతి బోదించు ఈ రహస్యమును తెలుసుకొనినవారికి భూమి మృదువైనదీ, సౌఖ్యకరమైనదీ యగుచున్నది

(ఇది మృత్తికా శుద్ధి మంత్రము మట్టియందు అపవిత్రతయున్నచో లేక దోషములున్నచో ఈ మంత్రము ద్యానించుకొనవచ్చును)

## మంత్రము 3

గన్ధ ద్వారాం దురాదర్షాం నిత్యపుష్టాం కరీషిణీమ్ ।
ఈశ్వరీగ్ంం సర్వభూతానాం తామిహోపహ్వయే శ్రియమ్॥

## ప్రతిపదార్థము

గన్ధద్వారాం = గంధమే తన ద్వారముగా కలదానిని
దురాదర్షాం = తేలికగా సమీపించుటకు వీలుకాని దానిని
నిత్యపుష్టాం = నిత్యము పుష్టియైన దానిని
కరీషిణీం = కరములచే అనగా కిరణములచే పొందించబడిన ఈషణములు కలదానిని
సర్వ భూతానాం = సమస్త జీవరాసులకు
ఈశ్వరీగ్ం = అది దేవతయైన దానిని
తాంశ్రియం = ఆ శ్రీదేవిని
ఇహి+ఉపహ్వయే = సమీపించుటకు ఆహ్వానించుచున్నాను

## తాత్పర్యము

సుగంధముతో కూడిన ద్వారము కలది, సులభముగా సమీపించుటకు వీలుకానిది, ఎల్లప్పుడును పుష్టిగా నుండునది, కిరణములచే ఆకారము కట్టుకొనినది, సర్వజీవులకు పరమేశ్వరియు నగు ఆ శ్రీదేవిని మమ్ము సమీపింపుమని ఆహ్వానించుచున్నాము

## వివరణ

గంధ ద్వారాం అనగా గంధము లేక వాసన ద్వారా తెలియబడునది పృదివీ తత్త్వము వాసనద్వారా వ్యాపించును సువాసనలు, వానిలో ముఖ్యముగా గంధము మానసికమైన ఆహ్లాదమునకు, ఆరోగ్యమునకు ఉపయోగపడును కొన్ని పూలవాసనలు, చెట్లగాలులు కొన్ని వ్యాదులను నిర్మూలించును పారిజాతము, తులసి, కదంబవృక్షము, వేప, మఱ్ఱి, రావి మున్నగునవి TB BP, PNEUMONIA, గుండెజబ్బులు వంటి వ్యాధులను నిర్మూలించును కనుకనే 'దురాదర్షాం' అని చెప్పబడినది అనగా వ్యాదులను, దారిద్ర్యమును దగ్గరకు రానివ్వదు

నిత్యపుష్టాం అనగా జీవులు పుష్టివంతముగా నుండుటకు చక్కని ఆహారముతోబాటు పరిశుభ్రమైన వాతావరణమును కలిగి సువాసనలతో కూడియుండవలెను దుర్వాసన కలిగిన ఆహారములు లేక అట్టి వాతావరణమున భుజింపరాదు

కరీషిణి అనగా తన కిరణముల ద్వారా జీవుల కోర్కెలు తీర్చునట్టిది సమస్తజీవరాసులకు ఈమెయే అదిపతి మిగిలిన ఇతర జీవులలో అంతర్యామి ఉన్నప్పటికినీ భౌతిక ప్రజ్ఞయే ప్రధానముగా పనిచేయును తన శరీరమును గూర్చిన జాగరూకత, ఆకలిదప్పులు, నిద్రాహారములు, వ్యాపార వ్యవహారములు మున్నగునవి ప్రాముఖ్యము వహించును అనగా జీవులలో పరిపూర్ణత్వము కలుగువరకు వారియందు పనిచేయుచు భౌతిక శరీరమును కాపాడును కనుకనే భౌతికస్థితిలోనున్న జగన్మాతను నిర్లక్ష్యము చేయువానికి అంతర్యామి స్పర్శ లభింపదు వస్తువులను పదార్థములను నిర్లక్ష్యము చేయువానికి, వృదాచేయువానికి, నిరుపయోగము గావించువానికి, దుర్వినియోగము చేయువానికి, లోభియై సద్వినియోగము చేయనివానికి ఈమె అనుగ్రహము లభింపదు అట్టివారు అంతర్యామి స్పర్శలేక అనేక జన్మల తరబడి ఒకేవిదమైన జన్మల పరంపరలో గడుపవలసి యుండును అట్టివారిని కష్టముల రూపమున, బాధల రూపమున సంస్కరించి మరల వివేకము కలిగించి ప్రేమమయ మార్గమునకు పురికొల్పునది ప్రకృతియనబడు పృదివీ తత్త్వమునందలి జగన్మాతయే

## మంత్రము 4

శ్రీర్మే భజతు । అలక్ష్మీర్మే నశ్యతు ।
విష్ణుముఖావై దేవాశ్ఛన్దోభిరిమాన్‌లోకాన
నపజయ్య మభ్యజయన్న్
మహగ్ంఇన్ద్రో వజ్రబాహు షోడశీ శర్మ యచ్ఛతు ।

## ప్రతిపదార్థము

శ్రీః = సంపద

మే = నన్ను

భజతు = పొందును గాక ।

అలక్ష్మీః = అలక్ష్మి

నశ్యతు = నశించును గాక ।

విష్ణుముఖావై = విష్ణువు ముఖములుగా కలిగిన

దేవాః = దేవతలు

ఛన్దోభిః = ఛందస్సుల చేత

లోకాన్ = లోకములను

అనపజయ్యమ్ = జయించుటకు వీలుకానట్లుగా

అభ్యజయన్ = జయించిరి కదా।

వజ్రబాహుః = వజ్రము దరించిన

షోడశీ = పదహారు కళలు కలిగిన

మహాగ్ం ఇంద్రః = గొప్పవాడైన ఇంద్రుడు

శర్మ = సుఖమును

యచ్ఛతు = ఇచ్చును గాక।

## తాత్పర్యము

సంపద నన్ను పొందును గాక। అలక్ష్మి నాకు నశించును గాక విష్ణుముఖస్థులైన దేవతలు చందస్సులచేత ఈ లోకములను మర౹ జయించుటకు వీలు కానట్లుగా జయించిరి కదా। వజ్రము దరించి౹ పదహారు కళలు కలిగిన, ఇంద్రుడు సుఖమును ఇచ్చుగాక।

## వివరణ

సంపద రావలెను, దరిద్రము పోవలెను అనునది సరియై౹ సిద్ధాంతము కాదు దరిద్రమనగా దనము లేకపోవుట కాదు దరిద్ర౹ అనగా మనలోనున్న సోమరితనము, వాయిదావేయు తత్త్వమ౹ నిరుత్సాహము మున్నగునవి సోమరితనము, బయము నశించుటవలన కార్యదీక్షపెరుగుటవలన సంపదలు వచ్చును కష్టపడకుం౹ సుఖపడవలెనను దుస్సంకల్పమే దారిద్ర్య హేతువు పని చేయకుం౹ దనము రావలెనని కోరుట నేటి సగటు బారతీయుని లక్షణము కా౹ విచిత్రమేమనగా కష్టపడిపని చేయువానికే ఆరోగ్యముండును శరీ౹ కష్టము చేయువానికి వ్యాధులు తక్కువగా వచ్చును ఇది కష్టపడి పనిచేయ౹ వానికి ప్రకృతి ఇచ్చు వరము

విష్ణు ముఖావై అనగా విష్ణువే ముఖముగా (ప్రదానముగ) కలిగిన దేవతలు విష్ణువు సమస్త సృష్టియందు వ్యాపించియున్న ప్రజ్ఞ విష్ణువు ఆ దేవతలద్వారా పనిచేయుచున్నాడు ఆయన ఒక్కొక్క శక్తిగా వచ్చినపుడు ఒక్కొక్క దేవతగా పిలువబడుచున్నాడు వాయువుగా వచ్చినపుడు వాయు దేవతగను, సూర్యుడుగా వచ్చినపుడు ఆదిత్యుడిగను,

నవగ్రహములలో పనిచేసినపుడు శని మున్నగు పేర్లతో పిలువబడు చున్నాడు

చందోభిః అనగా చందస్సులుగా వ్యాపించిరి అని అర్థము అనగా వారు స్పందనాత్మకమైన తరంగములుగా వ్యాపించియున్నారు చందస్సు అనగా స్పందనము (pulsation) ఈ స్పందనము నారాయణుని నుండి ప్రారంభమైనది నారాయణుని ఒక శ్వాస ఈ మొత్తము సృష్టి సృష్టి ప్రారంభమునుండి అంతము వరకు ఆయనకు ఒకే శ్వాస ఆ పరమాత్మ శ్వాసయే మొదటి శ్వాస శ్వాస నారాయణుని నుండి జీవుని వరకు వచ్చినది నారాయణుడు మొదట శ్వాసను బయటకు వదలి తరువాత లోనికి తీసుకొనెను ఆయన మొదట నిశ్వాసను బయటకు వదలగా ఆయనలోనుండి సృష్టి వ్యక్తము అయినది మరల ఆయన శ్వాసను తనలోనికి తీసుకొనగా (ఉచ్ఛ్వాస) సృష్టి ఆయనలోనికి లయమగును కనుక నారాయణుని శ్వాస మనకు వ్యతిరేకదిశలో నుండును అనగా మనము నారాయణునికి వ్యతిరేకముగా శ్వాసింతుము

అనపజయ్యమ్ అనగా జయించుటకు వీలులేని చందమున అభ్యజయన్ అనగా జయింతురు అనిభావము విష్ణువును తనయందు దరియించి యున్న స్థితి జయించుటకు వీలుకాని స్థితి ఈ స్థితినుండి దేవతలు ఎప్పుడు బయటకు వత్తురో అప్పుడు రాక్షసులు వారిని జయించుచున్నారు మరల విష్ణువును శరణు జొచ్చునపుడు ఆయన రాక్షసులను సంహరించి దేవతలను రక్షించుచున్నాడు శరీరములోని ప్రజ్ఞలన్నియు విష్ణువు యొక్క రూపములేయని ధ్యానము చేసినపుడు అరిషడ్వర్గములు జయింపబడును ఇంద్రియములు తనవి అని బావించినపుడు రాగద్వేషములు జయించును

సంగీతమున లయ, శృతి, తాళము, స్వరములు ఇవన్నియూ గాయకుడు చక్కగా గానము చేయుటకు ఏర్పడినవి తదనుగుణముగ గానము చేయునపుడు దానిలో నున్న శ్రావ్యతచేత గాయకుడు, శ్రోతలు అందు లయమగుచున్నారు సంగీతములో ఇట్లు శ్రావ్యతను కలిగించు లయ, శృతి మొదలగు వానిని చందస్సులందురు అటువంటి చందస్సులుగానున్న దేవతలు ఈలోకమునంతయు జయించి ఆక్రమించిరి ఆ విదముగ మరల జయించి ఆక్రమించుటకు వీలులేని విదముగా సర్వలోకములను ఆక్రమించిరి అనగా సర్వలోకముల యందలి వస్తుజాలముయందు ఆ వస్తుగతమయిన నేను అను ప్రజ్ఞగా

(విష్ణువుగా) వ్యాపించిరి హిరణ్యాక్షుడు మొదలగు రాక్షస అన్నిలోకముల యందును నారాయణుని కొరకై వెదకిరి ' నారాయణుని కనుగొన లేక పోయిరి ప్రతివ్యక్తిలోను, వస్తువుల అంతటనూ ప్రజ్ఞగా వ్యాపించి యున్నాడను దృష్టితో చూచిన అంతయు నారాయణమయముగా, విష్ణుమయముగా గోచరించు ఆయన ఈ సమస్త సృష్టియందునూ ఉన్న ఒకే సమాహారమైన ప్ర ఇన్నిటి యందును 'నేను'గా వ్యాపించియున్న మహా 'నేను' ఒకటి కల వేర్వేరుగానున్న 'నేను' లన్నిటికి మధ్య సూత్రమువలె భాసించుచున్నది ఒకమంచి ముత్యముల హారమునందు కనుపించకు దాగియున్న బంగారు తీగవలె ఈ మహా నేను అను బంగారుతీగ కనబడకుండ జీవులందరి యందు దాగి వారిని పట్టియుంచిన అట్టిమహాప్రజ్ఞయే నారాయణుడు

కపిల దేవహూతి సంవాదములో కపిలుడు ఈ కనుపిం తారకలన్నియూ నారాయణుని కిరీటములోనున్న మణులుగా, ఈభూ ఆయన పాదములుగ చెప్పెను ఇట్లు ఆయన పాదములు భూమిగ విశ్వాంతరాళమును ఆయన యొక్క ఆకారముగ ధ్యానము చేసిన నారాయణుని తెలియగలరు కనుక దేవతలు ఈ లోకములన్నియు మహా 'నేను గా వ్యాపించి యున్నారు అనగా తాము వ్యక్తిగతముగా క విష్ణువు యొక్క శరీరమునందలి భాగములుగ వ్యాపించిరి విష్ణు వజ్రములవంటి బాహువులు కలిగియున్నాడు చోటులోనున్న విద్యు మొదలైన బాహువులు దరించి ఇంద్రుని రూపములో పని చేయుచున్నాడ పిడుగు అను ఆయుదము దరించియున్నాడు ఇంకనూ జీవులయొక వెన్నెముకనే వజ్రాయుదముగా దరించి (బ్రహ్మదండం) కుండలినీ శక్తి మన శరీరమునందు వ్యాపించియున్నాడు మరియు పదహారు కళలతో కూడియున్న చంద్రుని ద్వారా (మన మనస్సుద్వారా) పనిచేయుచున్నాడ మనస్సునకు పదహారు కళలుండును మనము మనస్సునకి లోబడినపుడు మనస్సను చీకటి అమావాస్యరూపము వృత్రాసురుడువలె నేను వేరు అను ప్రజ్ఞగా విజృంబించి ఇంద్రుని జయించెను పూర్ణిమనాడు మనస్సు ప్రశాంతముగ నుండి ఇంద్రుడ వృత్రాసురుని జయించును ఇది అమావాస్యనుండి పూర్ణిమ వరకు జరుగ సాధన

అమావాస్యనుండి పూర్ణిమ వరకు గల తిదులు మొత్తం పదహారు ఈ పదహారు తిదులు పదహారు చంద్రకళలు అమావాస్యనాడు చంద్రుని యందు సూర్యరశ్మి ప్రతిఫలించును అనగా అది అంతర్యామి స్పర్శలేని పూర్తి బౌతిక జీవితమునందు బందింపబడియున్న జీవప్రజ్ఞను సూచించును అట్టిస్తితిలోనున్న వారినే మనము రాక్షసులు అందుము అట్టిస్థితినుండి జీవప్రజ్ఞ జన్మల తరబడి వికాసము పొందుచు శుక్లపక్షపు చంద్రునివలె క్రమేణా వికసించుచుండును పూర్ణిమనాడు చంద్రుడు మనస్సు పూర్తిగా అంతర్యామిని ప్రతిపలించు స్థితి అనగా పరిపూర్ణస్థితిలోనున్న మానవుడు ఇట్లు మనస్సునందలి కళలు పరిపూర్ణత్వము లోనికి వికసించు విదానమే 'షోడశి' అని పురాణములయందు సంకేతింపబడినది అమావాస్యనాడు మహర్షుల వంటి సజ్జనులకు మనసు అంతర్ముఖమై తనయందు తాను లీనమై యుండును సామాన్యులకు మనసు చీకటి చేత ఆవరింపబడి కామక్రోదాదులు వానియందు పనిచేయుచుండును వారినే రాక్షసులు అనిరి

పౌర్ణమినాడు చంద్రుడు (మనస్సు) సూర్యునికి ఎదురుగా నుండి వెలుగుచుండును సూర్యునిగా అంతర్యామియైన నారాయణుని ప్రజ్ఞపనిచేయుచున్నది మనస్సు(చంద్రుడు) జీవప్రజ్ఞ, భూమి బౌతిక ప్రజ్ఞ అమావాస్యయందు నారాయణునికి, జీవునికి మద్య మనస్సు అడ్డుగా నిలచును మనస్సు బౌతిక లోకములలో పనిచేయునపుడు తాత్కాలికముగా నారాయణుని నుండి మరుగుపడుచున్నది అప్పుడు మనస్సును పూర్తిగా చీకటి ఆవరించును అదియే వృత్రాసురుడు వ్యాపించుట అప్పుడు వెన్నుపాము నందున్న కుండలినీ శక్తిగా యున్న జగన్మాత షోడశి అను పేరుతో పదహారు కళలతో విచ్చుకొని పరిపూర్ణస్థితి వచ్చుటకు జీవునికి దోహదపడును

సృష్టి పరిపూర్ణమైన స్థితి. పూర్ణిమ సృష్టి పూర్తిగా లేని అందకారమయమైన స్థితి అమావాస్య ఈ మద్యగల స్థితులు పదునాలుగు మన్వంతరములుగ చెప్పబడినవి జీవుడు ఈ పదునాలుగు మన్వంతరములలో యోగసాదనతో అంతర్యామిలో పరిపూర్ణత

చెందును నారాయణునిగానుండును అదియే చంద్రుని పరిపూర్ణమైన పున్నమి వెన్నెల

ఈ పదునాలుగు మన్వంతరములలో జరుగు మానవుని ఎదుగుదలకు సంబందించిన ఈ కదను నడుపువాడు ఇంద్రుడను ప్రజ్ఞ ఈయన తన పదహారు కళలతో చంద్రాత్మకమయిన ప్రజ్ఞగా మాయనుండి మేము పరిపూర్ణుల మగునట్లు అనుగ్రహించును గాక।



# అనువాకం 11

## మంత్రము 1

స్వస్తినో మఘవా కరోతు హన్తుపాప్మానం యోస్మాన్ద్వేష్టి|

## ప్రతిపదార్థము

మఘవా = మేఘాదిపతియైన ఇంద్రుడు

నః = మాకు

స్వస్తి = శుభమును

కరోతు = కలిగించును గాక।

అస్మాన్ = మాయందు

ద్వేష్టి = ద్వేషమును పుట్టించునటువంటి

పాప్మానం = పాపకారణమును

హన్తు = నశింపజేయును

## తాత్పర్యము

మేఘాదిపతియైన ఇంద్రుడు మాకు శుభమును కలిగించుగాక। మాయందు ద్వేషమును పుట్టించునటువంటి పాపకారణమును నశింపజేయును గాక।

## వివరణ

ఇంద్రుడు మాకు క్షేమమును కలిగించు గాక। ఇక్కడ ఇంద్రుడను పదము సూర్యుడు అను అర్థములో వాడబడినది సూర్యుడు మేఘముల నాకర్షించి సకాలమునకు వర్షములను కురిపించి తద్వారా పాడిపంటలను అనుగ్రహించి మాకు క్షేమమును కలిగించును గాక। అని ప్రార్థించు చున్నాము

మమ్ములను ద్వేషించువారు లేకుండునట్లు జేయుదువు గాక। అనగా ఈ మంత్రము పఠించినంత మాత్రము మన శత్రువులు నశించుదురని భావము కాదు మనలను ఇతరులు ద్వేషించుటకు కారణములు మనయందే కలవు మనయందున్న కారణములను బట్టి ఇతరులు మనకు శత్రువులు లేక మిత్రులు అగుట జరుగుచున్నది దాని ననుసరించి మనలను ద్వేషించుట

లేక ప్రేమించుట జరుగుచున్నది అనగా ఇతరులకు, మనకు మధ్య వున్న లావాదేవీలు శతృత్వమునకు కారణమగుచున్నది కనుక మాయందున్న అట్టి కారణములను నశింపజేయవలసినదిగా ఇంద్రుని ప్రార్థించు చున్నాము

## మంత్రము 2

సోమానగ్ంస్వరణంకృణుహి బ్రహ్మణస్పతేకక్షీవన్తంయఔశిజమ్।
శరీరం యజ్ఞ కమలం కుసీ దం తస్మిన్థ్సీదతు యో స్మాన్ద్వేష్టి॥

### ప్రతిపదార్థము

బ్రహ్మణస్పతే = బ్రహ్మత్వమునకు అదిపతియైన వాడా
సోమానం = సోమముచే
స్వరణం= స్వరవంతముగా నిలిపి
శిజమ్ = ఉశికుని యొక్క పుత్రుడగు
కక్షీవంతం = కక్షీవంతుని
శరీరం = దేహమును
యజ్ఞకమలం = యజ్ఞముచే శమించునట్టిదిగా
కృణుహి = చేయునుగాక।
అస్మాన్ = మమ్ములను
యః = ఎవరు
ద్వేష్టి = ద్వేషించునో
సః = వాడు
కుసీదం = నరకమునందు
సీదతు = పడియుండును గాక।

### తాత్పర్యము

బ్రహ్మత్వమునకు అదిపతియైన వాడా। సోమముచే ఉశికుని యొక్క పుత్రుడగు కక్షీవంతుని శరీరమును స్వరవంతముగా నిలిపి యజ్ఞముచే శమించు నట్టిదిగ చేయుదువు గాక । ఎవడు ద్వేషించునో వాడు నరకమునందు పడియుండును గాక।

వివరణ

జీవులలో సోమము అను స్థితి వాక్కుగా, శ్వాసగా, స్పందనముగా తెలియబడుచున్నది ఇదియే జీవుని యొక్క జీవప్రజ్ఞగా కూడ వ్యక్తమగు చున్నది దీనిని మేము గుర్తించి ఆస్వాదించునట్లు చేయవలసినది

'కౌసల్యా సుప్రజా రామా పూర్వా సంధ్యా ప్రవర్తతే' అని ప్రార్థించునపుడు ఓరామా! తూర్పున సూర్యోదయమగుచున్నది లేవవలసినది అనుట బాహ్యముగా కనుపించు అర్థము తూర్పుదిక్కు హృదయమునకు సంకేతము ఈ హృదయమునుండి వాక్కుగా ఏదైతే వచ్చుచున్నదో దానికి ముందు స్థితి సూర్యోదయమునకు ముందరి సమయము ప్రతి దినము ఈసమయము అంతర్యామి నుపాసించుటకు తగిన సమయము అదియే మనలో వాక్కు నుచ్చరించుటకు చేయు ప్రయత్నము ఆస్థితిని మనము ధ్యానించినచో రాముడు మనయందు మేల్కొనును ఆరాముని యందు మనము రమించుటయే సోమరసమును ఆస్వాదించుటగా వేదఋషులయందు వర్ణింపబడినది ఆనందమను స్థితిగా జీవుల చేత అనుభవింపబడుచున్నాడు ఆస్థితిలో ఆయనను సోముడని, అట్టి ఆనందమును జగన్మాతయని, లక్ష్మియని లేక మూలప్రకృతియని అందురు రమించువాని యందున్న రమింపబడుట అనుస్థితి కూడా ఈయనయే ఈ రెండిటి అనుభవమే సోమము ఇదియే ఆనందమను పేరుతో జీవులచే ఆస్వాదింపబడుచున్నది కనుక వాక్కుగా ఉచ్చరింపబడి వ్యక్తమగు దానిని తెలుసుకొని ఆస్వాదించునట్లు చేయవలసినది

ఇదియే 'సోహం' అను శబ్దముగా శ్వాసయందు ఉచ్చరింపబడుచున్నది దీనినే 'సామము అనికూడా అందురు సామము అనగా సామ్యస్థితిని (Equilibrium of mind) కలిగించునది అనగా శ్వాస క్రమముగా మనయందు జరుగుటయే అట్టి శ్వాసయందు ఓం కారము ధ్యానము చేయుట ఆ 'ఓం' కార నాదమునే వేణుగానమనియు, మధువు అనియు అనిరి ఆ గాన మాధుర్యమే సోమరసము దానిని అనుభవించుటయే సోమరసాస్వాదనము అన్ని పురాణములందు ముఖ్యముగా భాగవతమునందు ఇట్టి స్థితియే వర్ణింపబడినది

శుక్రుడు జీవులయందు సృష్టిని కలిగించునట్టి ప్రజ్ఞగా దిగి వచ్చును జీవులయందు క్రిందిలోకములలో కామముగా, ఊర్ధ్వలోకములలో స్వచ్ఛమైన ప్రేమగా ఈ ప్రజ్ఞ పనిచేయును శుక్రుడు పవిత్రమైన కామము, దాని ద్వారా సంతానమునకు అధిపతి ఈయన ప్రేమగా మన

హృదయమున మేల్కొనును ఇట్లు జీవులయందు ప్రేమను కలిగిం
శరీరమను యజ్ఞభూమిలో, జీవించుట అనుయజ్ఞముగా ఈ ప్ర
పనిచేయుచున్నది జీవులలో నున్న అంతర్యామిని ఉపాసన చేసి వాని
సమర్పణముగా చేయు ప్రతిపనియు యజ్ఞమగును ఇతరులకు కావలసి
పనులు సమర్పణ బుద్ధితో చేయుచున్నప్పుడు ఈ శరీరమ
యజ్ఞక్షేత్రమగును యజ్ఞము యొక్క శ్రమను సహించునట్లుగా
ప్రశాంతమగు స్థితిని అనుగ్రహింపవలసినదిగా ఇచ్చుట వేడబడుచున్నది

కక్షీవంతుడు ఉశికుడని, ఉశిక్నియను స్త్రీకిని దీర్ఘతమసుడు
మహర్షికిని పుట్టినవాడు ఈ దీర్ఘతమసుడు దీర్ఘతమస్సు అన
సంవత్సరములో చీకటి లేక రాత్రి ఎక్కువ సమయమున్నరోజు ఇ
సూర్యుడు దక్షిణాయనము నుండి ఉత్తరాయణమునకు మారుదినమ
అనగా సుమారు డిశంబరు 22 తారీఖున వచ్చును ఆరోజున రాత్రికాలవ
మిగిలిన అన్ని దినములకన్నా ఎక్కువ అనగా నాటితో జీవులకు చీక
నశించి మరల వెలుగు ప్రసాదింపబడును వారి యందలి జీవచైతన్యము
నున్న సూర్యతేజస్సు భౌతిక జీవితము నందలి సంఘటనలు, పరిసరము
మున్నగు వానినుండి యోగసాధన, పరస్పరత్వము, సహకారమ
భూతదయ, వివేకము మున్నగు వాని యందు మేలుకొనును నాటినుం
దినములో చీకటియొక్క భాగము తగ్గి వెలుగు యొక్క భాగమ
పెరుగుచుండును ఈ దీర్ఘతమసుని ఉపాసనచేసి, ధ్యానము చేసి ఆయ
అనుగ్రహముపొందు వారికి జీవితము నందలి చీకటి భాగములు తగ్గిపో
వెలుగు భాగములు పెరుగుచుండును అట్లు ధ్యానము చేయగోరువా
డిశంబరు 22నుండి ఈమంత్రమును ప్రతిదినము ప్రాతఃకాలమున నాలు
గంటల ప్రాంతమున ధ్యానము చేయుచున్నచో వారి మనస
ప్రశాంతమగుచుండును

అట్టి దీర్ఘతమసుని కుమారుడు కక్షీవంతుడు ఈయన ఆకాశమునం
సూర్యుని మార్గము నిర్ణయించువాడు అనగా భూమిచుట్టు సూర్యు
చరించు మార్గముగా నున్నవాడు ఈయన సూర్యకిరణములలో నొక
సూర్యుని మొట్టమొదటి కిరణములుగా బయలుదేరి భూమిచుట్టు సూర్యు
మార్గమును దారివలె నేర్పరుచుకొనుచు పోవుచుండ
సూర్యుడామార్గమున ప్రయాణము చేయును దానివలన భూమి చు
చైతన్యరూపమయిన ఒక గోళమేర్పడి దానియందు జీవము (life ener
ఉండుటకు కావలసిన వాతావరణ మేర్పడును ఇదియే అంతరిక్షలోకమ

దీనియందు జీవులు పుట్టుట, వారికి భూమిపై శరీరములు ఏర్పడుట మున్నగు ప్రక్రియలు జరుగును ఇట్లు కక్షీవంతుడు సూర్యోదయమునకు ముందుగా సోముని గానముగా లేక స్వరముగా బయలుదేరి తన గానముతో జీవులను పుట్టించును ఈ కధయే దీర్ఘతమసుడను చీకటియందు ఉశికునికి సంతానమేర్పడుటగా చెప్పబడినది కళింగదేశపు రాజు తనకు సంతానము లేకపోగా సంతానము కొరకు దీర్ఘతమసుని ప్రార్థించి తన భార్యయందు ఆయన సంతానమనుగ్రహించునట్లు వేడెను ఆమెకది అంగీకారము గాక తన పరిచారికయగు ఉశిక్నిని పంపెను ఇచ్చట రాజు అనగా సూర్యుడు ఉశిక్నియనగా సంతానము గూర్చిన కామము భూమిపై జీవులు పుట్టుటకు కక్షీవంతుని ప్రభావము కారణము ఇట్లు జీవుల శరీరములు ఇట్టి యజ్ఞములుగా కల్పింపబడుటయే శరీరం యజ్ఞశమలమ్ కృణుహి అని చెప్పబడినది

ఇట్లు సోముని స్వరముగా దిగివచ్చు కక్షీవంతుడు జీవుల శరీరములను అందలి చైతన్యమును తన యజ్ఞముచే శమించునట్లు చేయును అనగా సుఖవంతము, ఆహ్లాదవంతము చేయును అట్లు జరుగవలెనన్నచో జీవుల మధ్య ద్వేషముండరాదు తోటివారిని చూచి, వారి ఔన్నత్యమును చూచి వారికి గల సద్గుణములను చూచి ద్వేషించువాడు ఇట్టి సుఖశాంతులను కోల్పోయి దుఃఖ జీవితమును నరకముగా పొందుదురు

### మంత్రము 3

**చరణం పవిత్రం వితతం పురాణం యేన పూతస్తరతి దుష్కృతాని |**
**తేన పవిత్రేణ శుద్ధేన పూతా అతి పాప్మానమరాతింతరేమ ||**

### ప్రతిపదార్ధము

పురాణం = పురాణములయిన

వితతం =విస్తారమయిన

చరణం = పదము, నామము

పవిత్రం = పవిత్రమైనటువంటి

యేన = దేనిచేత

పూతః = పవిత్రమైనట్టి

దుష్కృతాని = చెడ్డపనులు (చేయుట)

తరతి = దాటించునో

తేన శుద్ధేన = అట్టి శుద్ధమైన

పవిత్రేణ = నిర్మలమైనట్టి

పూతాః = పవిత్రమైనట్టివి

పాప్మానం = పాపములు చేయు మమ్ములను

అరాతిం = శతృత్వము (నరకమును) నుండి

అతింతరేమ = తరింతుము గాక

## తాత్పర్యము

ఎట్టి చరణములు పురాణములై, విస్తారములై పవిత్రమగుచున్నవో, దేనివలన పరిశుద్ధులై చెడ్డపనులు చేయుట అను స్థితిని దాటుచున్నామో అట్టి పవిత్రము పరిశుద్ధము అయిన పాదములచే పునీతులమై, శతృత్వము నొందుటచే పాపాత్ముల మగు స్థితిని మేము దాటుచున్నాము

## వివరణ

భగవంతుని యొక్క పాదము విస్తారమయినది అనగా కనపడునట్టి ఈ సమస్త భౌతిక సృష్టి ఆయన పాదమే సృష్టి అరంభము నుండి యున్న ఈ చరణములను అర్చన చేయుట చేత, సాధనా మార్గములో నున్న వాడు తన పాపములనుండి తరించుచున్నాడు అనగా పాపములు చేయుట అను స్థితిని దాటుచున్నాడు ఉదాహారణకు శ్రీకృష్ణుడు మహా భారత యుద్ధసమయమున, ద్రోణుని జయించుటకు అబద్ధము లాడెను నిస్వార్ధముగా సకల ప్రజల యోగక్షేమముల కొరకు చెప్పిన మాటలు అబద్ధములైనను తప్పుకాదు ద్రోణాచార్యుడంతటివాడు దర్మరాజు మాటలు నమ్మినట్లు కృష్ణుని మాటలు నమ్మలేదు అయినను మొహమాటము లేకుండ తన బాధ్యత కొరకు శ్రీకృష్ణుడు అబద్ధములాడినాడు కనుక అది దైవత్వ లక్షణమయినది ఇచ్చట స్వార్ధములేదు కనుక పాపము అనునది కృష్ణుని యందు వర్తించదు అందుకనే వేదము నందు సత్యంచానృతంచ సత్యమ భవతి అని చెప్పబడినది

కనుక సృష్టిలోనున్న సమస్త భూతములయందు అంతర్యామిని చూచి, వాటిని నారాయణునిగా అర్చన చేయువాడు పాపములు చేయుట అను స్థితిని దాటి పోవును ఎదుటివారికి అవసరమైనది, హితము, క్షేమము

అయినది, చేయువానికి పాప కార్యములు, పుణ్యకార్యములు అను బేదము నశించి కార్యాచరణము మాత్రమే యుండును దానివలన సాదకుడు అప్రయత్నముగా పవిత్రీకరణము చెందును అటువంటివాని మనస్సు అద్దము వలె పవిత్రముగా, స్వచ్ఛముగా స్ఫటికము వలె నుండును

చరణము అను పదమునకు నామము, అక్షరము అని అర్ధములు పరమాత్మనుద్దేశించి ఉచ్చరించు శబ్దము వలన, ఆయన గురించి మనము మాటలాడుకొను మాటలు, కదలు మున్నగు వాని వలన ఆయన ఆ సమయమున మనయందుండును మనయందు ఓంకారమును ఉచ్చరించు వాడు నారాయణుడు మొట్టమొదటి శబ్దమైన ఈ ఓంకారమే అనేక శబ్దములుగా విచ్చుకొనుచున్నది శాఖోపశాఖలై 56 అక్షరములుగా దిగివచ్చుచున్నది మూలాదారమునుండి సహస్రారమువరకు ఏడు కేంద్రములున్నవి ఈ కేంద్రములకు సంబందించిన బీజాక్షరములుగా ఈ ఓంకారమే వ్యాపించియున్నది మూలాదారమునుండి ఆజ్ఞాచక్రము వరకు ఉన్న నాడీ కేంద్రములందు అక్షరములు ఉచ్చరించుటకు కావలసిన శక్తులు లేక ప్రజ్ఞలు పనిచేయుచున్నవి తంత్ర శాస్త్ర గ్రందములయందు వీటి వివరములు లబింపగలవు మూలాదారము నుండి మొదటి ఆరు కేంద్రములలో పనిచేయు శక్తులు అంతర్గతముగా పనిచేయుచుండును ఈ కేంద్రములనుండి బయలుదేరినట్టి చైతన్య తరంగములు (pulsation or vibrations) కంఠమునందు శబ్దము ఉచ్చరించుటకు కావలసిన ఏర్పాటుగానున్నవి అనగా ఆయా అక్షరములుచ్చరించుటకు కావలసిన వేర్వేరు ప్రవృత్తులు ఆయా కేంద్రములయందు వేర్వేరుగా పనిచేయుచుండును వాటినే దళములు అందురు ప్రతి కేంద్రమునందు కొన్ని దళములుండును మూలాదారము నందలి దళములకున్న సః అను దళము ఉద్బోదనము చెంది ఉచ్ఛ్వాస(inhalation) అను శ్వాస ప్రక్రియ ఊపిరితిత్తులయందు ప్రారంబం కాగా, కంఠమునందలి హం అను బీజము ప్రచోదనము చెంది నిశ్వాస (exhalation) వలన శ్వాస విడచుట జరుగును

కనుక సోహం మంత్రము ద్యానము చేయుట వలన మూలాదారమునందు చైతన్యము ఉద్బోదనము చెంది కంఠమునందు గల విశుద్ధి చక్రము చేరి, తర్వాత ఆజ్ఞాచక్రము చేరును

ఇట్లు అక్షరములు ఉచ్చరించుటకు కావలసిన ప్రజ్ఞలు లేక శక్తులు ఈ కేంద్రముల యందుండి కంఠమునకు స్పందనలుగా వచ్చును అట్లు నాడీ

కేంద్రముల నుండి వచ్చినpulsations ను బట్టి కంఠమునందు contractions ఏర్పడి ఆయా అక్షరములు ఉచ్ఛరింపబడును అంతేగాని అది కేవలము కంఠమునకు మాత్రమే సంబందించినది కాదు అనగా space craft లో ప్రయాణించు వారికి భూమిపై నుండి wireless signals పంపినట్లు ఇది జరుగును (vocal paralysis వచ్చుటకు ఈ spiral centres లో వచ్చిన తేడాలే కారణమగుచున్నవి)

అందువలన చరణములు (అనగా పదములు) ఉచ్ఛరించుట ద్వారా అ శబ్ద రూపముగా పరమాత్మ మనయందు వ్యక్తమగుచున్నాడు కంఠము ద్వారా నారాయణుని నామము ఉచ్ఛరించుట వలన నారాయణుని స్మృతిని హృదయమునందు జీవుడు దరించి పవిత్రీకరణము చెందుచున్నాడు పూతః అనగా పవిత్రీకరణము చెందుట అనగా క్రమేణా తనలోని ఊహాలు, అక్షరములు, బావములు, వాక్కులు, శబ్దములు అన్నియు నారాయణుని ప్రజ్ఞలు, రూపములుగా, తాను గుర్తించును అప్పుడు సమస్తము నారాయణమయమగును

వితతం పురాణం అనగా అన్నిటికన్నను పురాతన మైనది అని అర్థము నేను అను దాని నుండి శరీరము, బుద్ధి మనస్సు అనునవి వచ్చినవి కనుక నేను ఒక్కటే అన్నిటికన్న పురాతనమైనది ఈ నేను అను ప్రజ్ఞనుండి ఆకాశము, మహత్తు, గోశములు మొదలగునవన్నియు వచ్చినవి నారాయణుడు సృష్టిలోనికి నేను అను ప్రజ్ఞగా వ్యక్తము కాగా ఆయననే బ్రహ్మగా చెప్పిరి అట్టి బ్రహ్మ మరల తనను నారాయణుడు నడుపుచున్నాడు, అని ద్యానము ద్వారా తెలుసుకుని, ఆ నారాయణుని సంకల్పము చేత''వాక్కు నుఉచ్ఛరించెను ఆ వాక్కు సృష్టిగా సమస్తము విస్తరించెను 'వితతం' అనగా విస్తరించుట

కనుక మనము పాపములు చేయుట అను స్థితిని దాటవలెనన్నచో నారాయణుని యొక్క చరణములను హృదయమునందు నిరంతరము దరించి యుండవలెను దానికి నారాయణుని నామోచ్చారణమే మార్గము అట్లు పవిత్రీకరణము చెందుట చేత మనస్సు మన ప్రయత్నము అక్కరలేకయే పాపములు చేయుట అను స్థితిని దాటిపోవును

'అరాతి అనగా శతృవు ఈ శతృత్వము వలననే పాపములు చేయుట జరుగును కనుక శతృత్వము మనయందు లేకుండును గాక ఆయన ద్యానము ద్వారా, నామోచ్చారణ ద్వారా ఇట్టి పాపములను దాటుచుందుము గాక।

(ఈ మంత్రము స్నానమంత్రము లోనిదే యైననూ పెద్దల పాదములు కడుగు సమయమున పఠించుచు చదువుకొనవలసిన మంత్రము)

## మంత్రము 4

**సజోషా ఇన్ద్ర సగణో మరుద్భిస్సోమం పిబవృత్రహా న్ఛూర విద్వాన్।
జహి శత్రూగ్ం రపమృధో నుదస్వా దాభయం కృణుహి విశ్వతోనః॥**

## ప్రతిపదార్థము

వృత్రహాన్ = వృత్రుని సంహరించినవాడా!

శూర = శూరుడా!

ఇన్ద్ర = ఇంద్రుడా!

సజోషా = సంతోషముతో కూడి యున్నవాడు

విద్వాన్ = సమస్తము తెలిసినవాడు

సగణః = గణములతో

మరుద్భిః = మరుత్తులను దేవతలతో

సోమః = సోమరసమును

పిబ = పానము చేయుము

శత్రూన్ = శత్రువులను

జహి = చంపుము

మృధః = యుద్ధములు

అపనుదస్వ = నాశనము చేయును

అద = అదియుగాక

నః = మాకు

విశ్వతః = విశ్వమునందు

అభయం = అభయమును

కృణుహి = ఇవ్వవలసినది

## తాత్పర్యము

ఓ ఇంద్రా! వృత్రుని సంహరించినవాడా! శూరుడా! సమస్తము తెలిసినవాడా! సోమరసమును నీయొక్క గణములతో (మరుత్తులను దేవతలతో) కూడి పానము చేయుము శత్రువులను సంహరించి

యుద్ధములు అక్కరలేని స్థితిని ఇమ్ము మాకు సమస్త విశ్వమునందును అభయమును ఇవ్వవలసినది

## వివరణ

సమస్తమునందు వ్యాపించి యున్నవానిగా, ఆనందముతో కూడి యున్నవానిగ, ఆనందము తానే అయిఉన్నవానిగ వృత్రుని సంహారించినవానిగ ఇంద్రుని గురించి ఉపాసన చేయుచున్నాము వృత్రుడనగా సమస్తమును తానుగా ఆవరించి యున్నప్రజ్ఞ వృత్రాసురవద అనుకద యందు చెప్పబడిన అంశమేమనగా ఒక్కొక్కసారి ఇంద్రునివంటి దేవతలు కూడా పొరపాటు చేయు అవకాశము కలదు అట్లే చెడ్డవారుకూడ ఒక్కొక్కసారి మంచి పనులు చేయుదురు ఈ వృత్రాసురుని గూర్చిన ప్రతిపాదన ముఖ్యముగా ఇంద్రుడు వృత్రహన్ అను పేరుతో వేదములయందు పురాణములయందు అనేకచోట్ల ఉదాహరింపబడినాడు వృత్రాసురుడు ఇంద్రునిపై దండెత్తి, ఇంద్రుని తరిమి దేవలోకము నాక్రమింపగా, ఇంద్రుడు నారాయణుని గూర్చి తపస్సు చేయగా నారాయణుడు ఇంద్రుని అనుగ్రహించెను దదీచి మహర్షి వెన్నెముకతో తయారుచేయబడిన వజ్రాయుదమును దరించి ఇంద్రుడు వృత్రాసురునితో యుద్దము చేసెను కాని గెలువలేకపోయెను అప్పుడు వృత్రుడు నారాయణుని ద్యానము చేయు విదానము ఇంద్రునకుపదేశించి తద్వారా తనను సంహారించుమార్గము తానే తెలిపెను

వృత్రుడనగా మనచుట్టు అవరించిన అజ్ఞానమను చీకటి అదియే 'నేను ఈ సృష్టినుండి వేరు' అను అజ్ఞానమును కలిగించును అదియే వృత్రాసురుడు ఇంద్రుడనగా జీవప్రజ్ఞ అనగా జీవుడు మరల నారాయణుని చేరవలెనన్నచో మరల తన అజ్ఞానమే తనకు మార్గము చూపింపవలెను దేవాలయమున కేగుట, తపస్సుచేయుట, నామజపము చేయుట మున్నగునవన్నియు మాయలో బాగములేయైనను అట్టి మాయ లేక అజ్ఞానమే తనను పరమాత్మ యొద్దకు చేర్చును ఇదియే వృత్రాసురుడు ఇంద్రునకు బోదించిన మార్గము (దీనిపై ఇంకను వివరములు కావలసినవారు గురువర్యులైన కులపతి ఎక్కిరాల కృష్ణమాచార్యులవారి బాగవతరహస్యప్రకాశము 14వ బాగము చూడవచ్చును) కనుక ఎక్కడ మంచి కలదో అదియే దర్మము, ఎక్కడ చెడు వున్నదో అది అదర్మము

న మనస్సునందు ఇదిస్థిరముగ నుండవలయును అప్పుడు మాత్రమే
నము నారాయణుని యొక్క అస్తిత్వమును తెలిసికొనగలుగుదుము
వృత్రకద వలన తెలియునదేమనగా మంచి వారిగ
లియబడువారివలన మంచియు చెడ్డవారిగా తెలియబడువారివలన చెడు
గునను (Preconceived Mind) భావనతో ఎవరిని approach అవకూడదు
క్కొక్కసారి చెడ్డవారు అని బావింపబడిన వారు మంచివారని
వింపబడినవారు కూడ చేయలేని మంచిని చేయగలుగుదురు ఇందుకు
రవ పాండవ యుద్ధమున ఘటోత్కచుడు ఒక ఉదాహరణ
ర్మాదర్మములు బాగుగ తెలిసిన వారని బావింపబడిన
ష్మద్రోణులంతటివారుకూడా అదర్మ పక్షమున యుద్ధము చేసిరి వారికి
లిసిన దర్మము కర్మబందమైవారి చేత అదర్మ పక్షమున యుద్ధము
యించినది ఘటోత్కచుడు రాక్షసుడైనను దర్మపక్షమున యుద్ధము
సెను కనుక ఏరాజునకైనను రాజ్యమందలి సకలజీవులు శాంతిగా,
క్షేమగా, సౌఖ్యముగా వుండవలెనన్న ప్రజాదర్మమే మొదటి దర్మము
దే అన్ని దర్మములకు అతీతమైన పరమ దర్మము దానిననుసరించి
గిలిన దర్మము లేర్పడినవి అవియే రాజ దర్మము, సేవాదర్మము,
మాజదర్మము, పౌరదర్మము మొదలగునవి ఈ దర్మములన్నియు
కదానినొకటి అనుసరించి యున్నవను విషయమును విస్మరించినచో
పములో బాగమును పంచుకొనవలసియుండును కాని అదర్మపరుడైన
పత్యర్థి బలవంతుడైనపుడు తప్పనిసరియై వానిని జయించుటకు
ల్పముగా ధర్మోల్లంఘనము చేసినను ఆ పాపము అంటజాలదు
ష్మడు తలచినచో కౌరవులనదుపు చేయగలడు దర్మస్థాపనము కూడ
యగల సమర్థుడు ఈ ఒక్క విషయము తప్పించినచో భీష్మడు
శ్రీకృష్ణుడంతటివాడు పరమదర్మము నెరిగిన వారికి ఏ దర్మమైనను
ర్తించును అందువలననే శ్రీకృష్ణుడు నిర్మొహమాటముగా
ర్మమువైపు పక్షపాతము వహించెను సత్యము, దర్మము ఎక్కడ
యున్నదో అక్కడనే పరమాత్మ యుండును దర్మమును అసత్యముచే
లపవచ్చును కాని అదర్మమును సత్యము చెప్పి నిలుపరాదు ఉదా
స్సహాయురాలైన ఒక స్త్రీని దుండగుల బారినుండి తప్పించుటకు
అసత్యమాడిన అది తప్పుకాదు కనుక సత్యము యొక్కతత్వము తెలిసి
యుండవలెను అది తెలియని వానికి నేను సత్యము చెప్పుచున్నాను' అను
అహంబావము (ego) మాత్రమే మిగులును కనుక దర్మాచరణములోని

తత్వము తెలియవలెను నేర్పరితనముతో ధర్మము నాచరింపవలెన
శ్రీకృష్ణరాయబారములో ధర్మమును గూర్చి శ్రీకృష్ణుడు అందరకు
విడమరచి సూటిగా చెప్పియున్నాడు ధర్మమునకు హా
జరుగుచున్నపుడు రక్షించగలిగిన వారు ఉపేక్షించినచో తాత్కాలికము
ధర్మచ్యుతి కలిగినట్లు కన్పించినను, అంతిమముగా ధర్మమే జయించున
కాని ధర్మమును రక్షించక ఉపేక్షించిన వారు మాత్రము నాశనమగుదుర
శ్రీకృష్ణుడు చెప్పియున్నాడు కనుక జీవులలోనున్న నారాయణు
మించిన సత్యమే లేదు నారాయణుని అస్తిత్వము తెలియవలెనన
జీవులయందున్న పరమాత్మను ఉపాసన చేసి వారి క్షేమమునకు బాధ్య
వహించి తన కర్తవ్యాచరణ చేయవలయును దీనిని ఉపేక్షించిన
అదర్మమును ప్రోత్సహించినట్లగును వృత్రాసురుడు ధర్మ
నెరిగినవాడు ఇంద్రుడు తప్పుచేసినవాడు ఇంద్రుడు వృత్రాసురు
చంపబూని కష్టముల పాలబడినాడు వృత్రాసురుడు ఇంద్రునిపై దండె
ఇంద్రుని జయించి స్వర్గము నాక్రమించెను అంతకుముందు ఇంద్రు
బృహస్పతిని సభలో అవమానించెను ఇంద్రుని వివేక
తాత్కాలికముగ మరుగున పడెను అతడు బుద్ధిహీనతతో వివేకము
కోల్పోయి దేవగురువు నవమానించెను బృహస్పతి తనగృహమున
వెడలిపోయినాడు ఆ పిదప తనపొరబాటును గ్రహించిన ఇంద్రు
బృహస్పతి కొరకు వెళ్ళగా ఆయన కనుపించలేదు అనగా అహంకార
చేతవివేకమును విస్మరించినవానికి పెద్దల సాన్నిధ్యము లభింప
అటువంటి స్థితిలో తప్పులు చేయుట మొదలగును తామసప్రవృత్తు
మేలుకొనును దీనినే రాక్షసులు యుద్ధమునకు బయలుదేరివచ్చు
అనినారు దేవతలు ఓడిపోయి, రాక్షసులు గెలిచినారు రాక్షసు
యుద్ధమున కేతెంచుటకు పూర్వము వారిగురువగు శుక్రాచార్యుని వద్ద
వెళ్ళి ఆయన అనుమతి అడిగిరి వెంటనే ఈ సమయము చాలామంచి
విజయం చేకూరగలదని చెప్పినాడు వారు గురువు మాటను ఆచరించి
కనుక విజయమువారిని వరించినది అనగా గురువునకు ఎవ
శరణాగతులగుదురో, వారు శ్రేయస్సును పొందుదురు గురువు మాట
విస్మరించి ధిక్కరించిన వారు అధోగతి పాలగుదురు వృత్రాసురుని
యుద్ధము చేయునపుడు ఇంద్రునకు వజ్రాయుధ ప్రయోగవిదాన
తెలియరాలేదు వృత్రాసురుడే ఇంద్రునికి ఆవిదానమును బోధించినా
నారాయణుని ఉపాసించి, స్మరించుట చేత వజ్రాయుద ప్రయో

విదానము అవగతమగునని నారాయణ దర్మమును వృత్రాసురుడు ఇంద్రునికి ఉపదేశించెను ఆవిదముగచేసి, ఇంద్రుడు వృత్రాసుర సంహారము గావించెను

మనలో 'నేనువేరు నీవువేరు' అనుకొను స్థితిని వృత్రునిగా వివరించిరి అంతర్యామికి ఈవేరు అనుబావమునందు ఉనికిలేదు మాయ సమస్తము వ్యాపించియున్నది చిక్కని చీకటి రూపములో వృత్రాసురుడు ఈ సమస్తమునందు వ్యాపించియున్నాడు అట్టి వృత్రాసురుని వదించు మార్గము గానక ఇంద్రుడు అయోమయ స్థితిలో నుండినప్పుడు నారాయణ స్మరణకూడ ఇంద్రునకు గోచరించలేదు అప్పుడు వృత్రాసురుడు తనని నారాయణుని అస్తిత్వముగా ద్యానించి, ప్రయోగించుట, ప్రయోగింపబడునది, ప్రయోగించువాడు మూడునూ నారాయణుని రూపమేనని ద్యానము చేయుచు ఆయుద ప్రహారము చేసినచో తనకు అంత్యము కలుగునని బోదించినాడు అనగా మనస్సుపై మాయా ప్రబావము పనిచేయుచున్నంత కాలము మనస్సు అంధకారములోనుండును అప్పుడు నేను వేరు' అని అనిపించును అట్టి స్థితిలో నారాయణుని గూర్చి బోదించువారు కావలెను వారిచే ఉపదేశము పొందువానికి సమస్తము నారాయణునిమయమగును సమస్తమున నారాయణుడు కలడు అను జ్ఞానము నెవరు ఉపదేశింతురో వారుకూడ నారాయణ స్వరూపులే ఉపదేశము, ఉపదేశము పొందుట - ఇదంతయూ నారాయణుని మాయయందు బాగములే ఈ మాయను తరించుటకు నారాయణ ద్యానమే మార్గము నిజమునకు ఉపదేశము పొందుట కూడ మాయలో బాగమే కాని అట్లు ఉపదేశమును పొందిన వాడే మాయను జయించగలుగుచున్నాడు వృత్రహాన్ అనగా అర్ధమది

సజోషా అనగా సమస్తము తెలియుటచేత 'ఆనందమయమయిన స్థితిలో నున్నవాడని అర్ధము సాదనలో ఆనందమయమయిన స్థితిని పొందుట అనునది పరిపూర్ణమయినస్థితి అదియే సాదనకు పరమావది నిరంతరము ఆనందముగా నుండు స్థితి వచ్చినవాడికి ఇక తెలియవలసినది ఏమియులేదు సాదన స్థితిలో అన్ని విషయములు తెలుసుకొనవలెనను ఉత్సుకత (curiosity) మాత్రముండును తెలుసుకొను విషయములు ఎల్లప్పుడూ యుండును అన్నియు పూర్తిగా తెలిసినస్థితి యుండదు కనుక ఆనందమయస్థితిని సాదించిన వాడే ఇంద్రత్వము లబించిన వాడుగా నున్నాడు అనగా ఇంద్రియములను జయించిన వాడగుచున్నాడు వాడే

'వృత్రహాన్ శూరః' అని పిలువబడినాడు అతడే నిజమయిన శూరు తనయందు వృత్రునిగా ఇంద్రియములయందున్న వా జయించినపుడు అది సాద్యమగును అటువంటి ఇంద్రుడు ః ఇంద్రియములనెప్ప్పుడు పరిపాలించునో అప్పుడు మనము అ విషయములు తెలిసినవారిగా నుందుము దేవతలలో మరుత్తుల పనిచేయుచున్నవారున్నారు అనగా7 Nodes of vibrations ఏడు రాగము అవియే సప్తమరుత్తులు వీరు పరమాత్మనుండి దిగివచ్చిరి సప్తమరుత్తులను 7 Rays అని జ్వాలకూల్ మహర్షి చెప్పిరి ఈ కిరణములననుసరించి మానవజాతికి శిక్షణయివ్వబడుచున్నది అవి సూర్యుని యందలి 7 కిరణములుగా వ్యక్తమై మన సౌరమండలములో గోళములుగా కట్టుకొనినవి

మానవునిలో ఏడు కేంద్రములుగా పనిచేయుచున్నవి They are vibratory nature 7రకములయిన స్పందనములు ఒక్కొక్క స్పందనముకు ఒక్కొక్క layer of awakening or consciousness గా చెప్పిరి అన్ని రాగమ ఒకేస్థాయిలో నుండవు మనసు, బుద్ధి మొదలు జంతువులు, వృక్షము ఖనిజముల వరకు 7లోకములుగా చెప్పిరి దేని మానసికస్థితిని వాటిలోకము ఉండును ఒకే ప్రదేశమునందున్ననూ వేని లోకమువాని ఆవిదముగా 7గ్రహములున్నవి చీమలకు మనకు ఎంత బేదము కల గ్రహములకు మనకు అంతే బేదము కలదు

"సోమం పిబ ' అనగా నీవు మరుత్తులతో కలిసి సోమపాన చేయవలసినది అని అర్థము హృదయమునుండి వచ్చు సోమము అన రసమును నీవు వినవలయును గరుత్మంతుడు తన తల్లికి దాస్యవిమ కలిగించుటకు అమృతబాండమును తీసుకుని వచ్చెను అనగా మన శ్వాసను ద్యానము చేసినపుడు మన ప్రయత్నమవసరము లేకనే మన హృదయమునందు లయమగును ఈ శ్వాసయందుగల సోహ అనునదియే సోమగానము లేక సోమరసము అమృతము అన అంతర్యామి యందు లయమయిన స్థితి గరుత్మంతునిగా చెప్పకొనబ సుపర్ణుడు మన శ్వాస యందలి ఉచ్ఛ్వాస నిశ్వాసలను తన రెక్కలు కలిగినటు వంటి ఒకమహాప్రజ్ఞ ఆయన 7 లోకములందును, అనగా కేంద్రములయందు పనిచేయుచుండును అదియే సప్తమరుత్తులతో క సోమపానము చేయుట ఈవిదముగా సర్వమును తెలుసుకొని యుండ చేత, అన్నివిషయములందును సమానత్వము లేక సమత్వము కలుగు

ద్వంద్వత్వము తొలగును అట్లు ఆనందమయమయిన స్థితిని సాధించుకొనుట చేత మానవుడు సోమపానము, చేయగలవాడగుచున్నాడు అణుమయ జగత్తునుండి బ్రహ్మ వరకు తానే వ్యాపించియుండు ఒకే స్థితిని "A simultaneous existence in all planes అని మాష్టరు C V V గారు చెప్పినట్లు అన్నిలోకములలో మేల్కొని పని చేయుటయే సమాధిస్థితి అనబడును

'శత్రూన్ జహి' అనగా శత్రువులను చంపుము మానవుడు అందరియందును సమయయిన ప్రీతి గలిగి యున్నపుడు శత్రువులను జయించినవాడగును అదియే యుద్ధములు చేయవలసిన అవసరము లేనిస్థితి అనగా బయములేనటువంటి స్థితి 'మృదః అపనుదస్వ' అనగా యుద్ధములు చేయవలెనన్న ఊహాలను పోగొట్టవలసినది 'అబయం కృణుహి' అనగా అబయము ఇవ్వవలసినది అన్నిటియందును నారాయణుడు గలడు అనుబావముచే అబయము ప్రాప్తించును బయము ఎప్పుడు కలుగును' When you feel insecurity of life, అటువంటి స్థితి నారాయణుని దర్శించుటచే తొలగును అనగా అంతటను నారాయణుడే వ్యాపించి యున్నాడను విషయమును మననము చేసికొనినచో దేనియందును బయము కలుగదు

మంత్రము 5
సుమిత్రాన అప ఓషద యస్సన్తు దుర్మిత్రా
స్తస్మైబూయా సూర్యోస్మా న్ద్వేష్టియంచ వయంద్విష్మః|

ప్రతిపదార్థము

నః = మాకు

ఆపః = నీరు

ఓషదయః = ఓషదులు

సుమిత్రాః = మంచిమిత్రత్వముగా

సంతు = అగుగాక

యః = ఎవరు

అస్మాన్ = మమ్ములను

ద్వేష్టి = ద్వేషించువారో

యంచ = ఇంకను ఎవరిని

వయం = మేము (మాచే)

ద్విష్మః = ద్వేషింతుమో
తస్మై = దానియందలి
దుర్మిత్రా = అమిత్రత్వము
భూయాసుః = సిద్ధించునుగాక।

## తాత్పర్యము

మాకు ఆపస్సులు, ఔషదులు మంచి మిత్రులుగా అగుగాక మమ్ములను ద్వేషించునట్టి కారణములయందు మీరు అమిత్రత్వము నందుదురు గాక। (అనగా, అట్టివి మానుండి తొలగింతురు గాక అని బావము)

## వివరణ

ఇంతకుముందరి మంత్రములలో సమస్తజీవరాసులలోను తానుండి మనకానందమిచ్చు చున్నట్లుగా ఇంద్రుడు ఉపాసనచేయబడెను ఇప్పుడు వృక్షములయందు, జలముల యందు ఉపాసన చేయబడుచున్నది

సుమిత్రానఆపౌషదయస్సన్తు అనగా మాకు ఓషదులు, జలములు మంచి మిత్రులగుదురు గాక అని కోరబడుచున్నది ఓషదులనగా పలించగనే మొక్కనశించుజాతి అనగా దాన్యజాతి ఈ ఓషదుల వలన జీవుల కాహార మేర్పడుచున్నది మేఘములు సకాలమునకు వర్షించుటచే పంటలు పండిజీవులకాహారము లభ్యపడును కనుక అట్లు సకాలమునకు వర్షములు కురియుటకు ఇంద్రుడే అదిపతి ఇంద్రునకాగ్రహము కలిగినచో వర్షములు కురియవు

వేదములయందు, పురాణములయందు ఇంద్రుడు మేఘాదిపతిగా వర్ణింపబడినాడు అనగా సూర్యుడే కొన్నిచోట్ల ఇంద్రుడుగా వర్ణింపబడినాడు సూర్యుని వలననే మేఘములేర్పడును

సూర్యుడు తన వేడిచే నీటినావిరి చేసి మేఘములుగా పైకి ఆకర్షించి మరల వర్షముగా ఆనీటినే ఇచ్చుచున్నాడు ఇట్లు నీరు మేఘములుగా ఆకర్షింపబడుటయు, మరల వర్షముగా వచ్చుటయు జరుగుచున్నది నీరు పైకిపోవునపుడు ఉత్తరాయణమనియు, క్రిందకు వచ్చునపుడు దక్షిణాయనమనియు మనము పిలుచుచున్నాము నీరు లేక నారముల యొక్క ఈ అయనమే నారాయణము అనగా ఉత్తరాయణము వలన ఒక

అర్ధవృత్తమేర్పడగా (భూమి సూర్యుని చుట్టు తిరుగుమార్గము) దక్షిణాయనము వలన మరియొక అర్ధవృత్తమేర్పడుచున్నది ఈరెండు కలిపినచో నొక చక్రాకారమైన గమన మేర్పడుచున్నది ఇదియే చక్రభ్రమణము లేక విష్ణువు యొక్కచక్రము ఈచక్రమునందు వర్తించువాడు నారాయణుడు ఇట్టి నారాయణుని యొక్క పరిభ్రమణముచే జీవులకాహారమేర్పడుచున్నది అట్టి నీటిని, ఆహారమును నారాయణుని యొక్క ప్రసాదముగా స్వీకరించువానికి రాగ ద్వేషాదులు తొలగిపోవును అనగా నీటి యందలి దోషములు, ఆహారమునందలి దోషములు వానిపై పనిచేయవు మరియు ఆహారమును, నీటిని ఇచ్చువారిపైన, ఈయనివారిపైన రాగద్వేషములుండవు ఆహారమిచ్చువారనగా మనకు జీవనభృతికి కారణమైన వారని యర్థము కనుక అట్టివారియందు మనకు రాగద్వేషములు తొలగించుటయే గాక ఇతరులకు మనయందు ద్వేషము కలుగునట్టి దుర్గుణములున్నచో, మనయందున్న అట్టి దుర్గుణములు కూడ పోగలవు అనగా ఇతరుల మనస్సును ఆహారాది విషయముల యందు కష్టపెట్టు లక్షణము మనయందుండరాదు

మంత్రము 6
ఆపోహిష్ఠామయోభువస్తాన ఊర్జే దదాతన।

# అనువాకము 12

మంత్రము 1
మహేరణాయ చక్షసే।
యోవశ్శివతమోరసస్తస్యభాజయతేహనః।
ఉశతీరవమాతరః।
తస్మా అరంగమామవో యస్యక్షయాయజిన్వద।
ఆపోజనయదాచనః।

ప్రతిపదార్థము
ఆపః = జలములుగా వున్న ప్రజ్ఞలారా!
మయోభువః = మాకు సుఖకారకములు
ష్ఠా (స్థ) = అగుదురు గాక
హి = కదా!
తాః = అట్టి (మీరు)
నః = మాకు
ఊర్జే = ఆహారసారము
మహే = పూజనీయమైనట్టియు
రణాయ = రమణీయమైనట్టియు
చక్షసే = అంతర్దర్శనము
దదాతన = ఈయవలసినది
వః = మీ యొక్క
యః = ఏ
శివతమః = కళ్యాణతమమైన
రసః = రసముగలదో
తస్య = అట్టి
ఇహ = ఈజన్మయందు
నః = మమ్ములను

మాతరః ఇవ = తల్లులవలె

ఉశతీః = కోరికను

భాజయతే = కలిగించుచున్నారు

ఆపః = ఓ ఉదకములారా!

యస్య = ఎవరి

క్షయాయ = క్షయముకొరకు

జిన్వధ = ప్రీతిని చేయుచున్నారో

వః = మిమ్ములను

తస్మై = దానికొరకు

అరం = మిక్కిలివేగముగా

గమామ్ = పొందుదుము గాక

నః = మాకు

జనయదాయ = పుట్టించుటకు అర్హులను చేయుము

## తాత్పర్యము

ఓ జలములారా! మాకు సుఖమునిచ్చునట్టి ఆహారసారమునందించి, గొప్పదగు అంతర్దర్శనము కలుగునట్లు చేయుడు మరియు ఈజీవితమునందే తల్లులు ప్రేమను(తమబిడ్డలకు) అందించు రీతిలో కల్యాణతమమగు రసానందానుభూతిని శీఘ్రముగా పొందునట్లు మమ్ము అనుగ్రహించుడు

ఓ ఉదకములారా! మాలో ఏది (పాపము) నశించుటకై ప్రీతిని కల్గించుచున్నారో అట్టి మిమ్ములను దానికొరకు సమీపించుదుము మాయందు అది పుట్టుటకు అర్హులను చేయుము

## వివరణ

ఓ ఆపస్సులారా! జలములుగా నున్న ప్రజ్ఞలారా! మీరు జీవులకు శుభము, ఆనందము కలిగించునట్టి కారణములుగా నున్నారు అనగా ఆపస్సులు జీవులకు సుఖకారణములుగానున్నవి ఆహారముద్వారా మానవునికి కలుగు శక్తిని "ఊర్జ" అందురు ఆహారసారము ద్వారా మానవునకు సత్త్వము లేక శక్తి "ఊర్జస్సు" వలన కలుగుచున్నది ఆహారము నందలి సహజమైన రుచియే ఊర్జమనబడును ఆకలిగొన్న

వానికి ఆహారమునందు కలుగు రుచులను సహజముగా పండిన చక్కని పలములయందు అట్లే చక్కని ఆరోగ్యవంతమై పుష్టివంతమైన ఆహారము చక్కగా పచనము చేయబడినప్పుడు కలుగు రుచి వంటిది ఇట్టి ఆహారమువలన బలము, ఓజస్సు, బ్రాజస్సు కలుగును ఓజస్సు అనగా బుద్ధి సూక్ష్మత

శరీరము నిలబడుటకు ఆహారము అవసరము ఆహారము స్వీకరించినంత మాత్రమున బలము రాదు సత్త్వము రావలెను అది లేకున్నచో ఎంత ఆహారము తీసుకున్నను శరీరము ఎండిపోవుచుండును శరీరములో ఎక్కువ వేగముగా ప్రాణశక్తి ఖర్చు అగుచున్నపుడు ఎక్కువ ఆహారము కావలసి యుండును overheat, over activity వున్నపుడు శక్తి తక్కువగా నుండును శరీరమునందలి పంచప్రాణములు సరిగా పనిచేయుచున్నపుడు ఆహారమందలి సారము అన్నిభాగములకు సరిగా చేరును దాని ద్వారా చక్కని దృష్టిని మాకు ఈయవలసినది పవిత్రమైన ఆహారము యొక్క సారము బుద్ధికి చేరి, ఆత్మను ఉన్నత కక్ష్యలో నిలుపును కనుక బుద్ధిలోకములకు చేరుశక్తి నిచ్చునట్టి సత్త్వవంతమగు ఆహారమును తీసుకొనవలయును, తేలికగా జీర్ణమగునట్టి ఆహారము, పలములు, పాలువంటి ప్రత్యేక ద్రవ్యములు తీసుకొనుట చేత మనస్సు అప్రయత్నముగా పైలోకములలో నిలచును పరిమాణము తక్కువగా నుండి పోషకవిలువలు ఎక్కువగా గల ఆహారమును స్వీకరించవలయును తీక్షణము, రూక్షము, పులుపు, ఘాటు, ఎక్కువ వేడిమి, ఎక్కువ శీతలము అయినట్టి ఆహారమును స్వీకరించరాదని భగవద్గీత యందు చెప్పబడినది అట్టి పదార్థముల పై రజోగుణములు పనిచేసివానిని ప్రేరేపించును కనుక స్వీకరించరాదని చెప్పబడినది సత్వగుణమును ప్రేరేపించునట్టి సాత్వికాహారమును తీసుకొనవలయును వేళకు సరిగా నిద్రవచ్చి, త్వరగా మెలకువ వచ్చునట్టి ఆహారమును తీసుకొనవలయును దానివలన మనస్సుకు ప్రశాంతి, ఉత్సాహము కలుగునట్లుండవలెను మనసు అప్రయత్నముగా ధ్యానములోనికి ప్రవేశించవలెను తేనె, మర్రిపండు మున్నగు ఫలములు, కొన్నిరకముల ఆకులలో ఇట్టిశక్తి యుండును

ఆపస్సులనగా శరీరమునందు ఆహారమును జీర్ణముచేయు రసములుకూడ సూచింపబడును(digestive juices) ఇవి శరీరమునందలి శక్తికి సంధానకర్తలుగా పనిచేయుచున్నవి రక్తము ద్వారా కొంత, రసముల res) ద్వారా శరీరనిర్మాణము కొంత జరుగుచుండును

మాశరీరమునందు రసములుగా నున్న ఓ ఆపస్సులారా మాకు చక్కని చూపును లేదా దర్శనము కలిగించవలసినది

'యోవశ్శివతమో రసః' శుభము, శివమయమైనటువంటి రసముగా జలములను ధ్యానము చేయుచున్నాము రసము అనగా అనుభవము (The State of experience) అనికూడ అర్థమున్నది ఆ రసము ఈభౌతిక స్థితి యందుమాకు ఆనందమును కలిగించవలయును అనికోరబడుచున్నది ఆశివతమమయిన రసమునకు మమ్ము పాత్రులను చేయుము

సృష్టిలో మాతృప్రేమ సహజముగా నున్న సత్యము ఆసత్యమును గమనించి ఆచరించుటచేత మనము ఆ సత్యమునందు జీవించిన వారమగుదుము మన వద్దనుండి ఏమియు ఆశించకుండగనే మనకు కావలసినవన్నియు ప్రకృతి ఇచ్చుచున్నది ప్రకృతిననుసరించి చరించు జంతువులు స్వేచ్ఛగా, భయావేశములు లేక జీవించుచున్నవి ప్రకృతిననుసరించని మానవుడు పరిమితజీవనమును (restricted life) గడుపుచున్నాడు కనుక ప్రకృతి యందలి ప్రేమనుచూసి ఉపాసన చేయుట మానవుని కర్తవ్యము అది ప్రకృతియందు సహజముగానున్నది అంతర్యామినుండి ప్రకృతికి ఈ సహజమయిన గుణము వచ్చినది అంతర్యామి జీవులకొరకు ప్రకృతిని సృష్టిచేసెను అంతర్యామినుండి వచ్చిన ఆ ప్రకృతినే శివతమముగా శుభము, ఆనందము అయినట్టి మార్గముగా తెలుసుకుందుముగాక।

సత్యము తెలుసుకొనుట వేరు ఆచరించుట వేరు జంతువులకు సత్యము అని తెలియకపోయినను ప్రకృతి దర్మములనాచరించి సుఖపడుచున్నవి మానవులలో ప్రకృతి సత్యములను తెలుసుకొనువారు మరియు ఆచరించినవారే ఋషులు, జ్ఞానులు ఆచరణలేనివారు తెలిసినవారుగా మిగులుచున్నారు కనుక ఈ ఆచరణయందలి సత్యము తెలిసినవారు ప్రకృతిననుసరించి జీవించి ప్రకృతి ఇచ్చినదానిని చక్కగా వినిమయము చేసుకొందురు కనుక ఈ శివతమమైనట్టి రసమును ఉపాసన చేయవలయును మానవుడు రేపటి ఆహారము గూర్చి ఆలోచించుచుండగా జంతువు రేపటి గూర్చి ఆహారమును దాచుకొనుచున్నదా ? చిత్రముగా ప్రకృతియే దానికి కావలసిన ఏర్పాటు చేయుచున్నది

జలదేవతలు జీవులకు సంతోషము, ఆనందము కలిగించుచున్నారు దుఃఖమును పోగొట్టి సంతోషము కలిగించుట సాధ్యము కాదు

జీవితములోని సంఘటనల ద్వారా సంతోషము అప్రయత్నముగా వచ్చును కనుక ఎప్పుడూ సంతోషముగా నుండుట నేర్చుకొనవలెను మాయందు అట్టిస్థితి కలిగించవలసినది ప్రేమ అనుస్థితిని మేముత్వరగా చేరుటకు సహకరించవలసినది పునరుత్పత్తి అను ప్రవృత్తియందు మమ్ము ఉంచవలసినది అనికోరవలెను కామము వేరు, సంతానము వేరు కామము మనసుయందున్న కోరిక సంతానము అనునది మనదర్మము దాంపత్యము కొరకు కామము కాని, కామము కొరకు దాంపత్యము కాదు ఇది తెలుసుకొనినవాడు నిజమైన సన్న్యాసియగుచున్నాడు అందుకే శ్రీకృష్ణుని "అనాది బ్రహ్మచారి" అనినారు ఇదితెలియనివాడు నరకము లేక దుఃఖముల పాలగుచున్నాడు ప్రకృతి ధర్మములను గౌరవించుటయే మోక్షమునకు దారియగును ఫలితమునందు దృష్టి లేకుండ పనిచేయువాడు సన్న్యాసియగుచున్నాడు ప్రాచీన మహర్షులు అనేకమంది గృహస్థ దర్మము నాచరించినవారే ఓ ఆపస్సులారా ! సంతానము కలిగించు స్థితి యందు మమ్మొంచుదురు గాక అనికోరబడుచున్నది

మంత్రము 2

**హిరణ్యశృఙ్గం వరుణం ప్రపద్యే తీర్థంమే దేహి యాచితః|**
**యన్మయా భుక్తమ సాధూనాం పాపేభ్యశ్చ ప్రతి గ్రహః|**

ప్రతిపదార్థము

మయా = నాచేత

అసాధూనామ్ = సాధుస్వబావములేని వారినుండి

యత్ = ఎట్టిది

భుక్తమ్ = స్వీకరింపబడినదో

పాపేభ్యశ్చ = పాపులనుండి

ప్రతి గ్రహః = గ్రహింపబడినదో (అట్టినేను)

హిరణ్య శృఙ్గం = బంగారపు కొమ్ము కలిగిన

వరుణమ్ = వరుణుని

ప్రపద్యే = శరణు జొచ్చుచున్నాను

యాచితః = కోరబడినట్టి దానిని

తీర్థం = జలములను

మే = నాకు

దేహి = ఇమ్ము

## తాత్పర్యము

బంగారపు కొమ్ము కలిగిన వరుణునినేను శరణుజొచ్చు చున్నాను సాదుస్వబావము లేనివారినుండి, పాపుల నుండి, దానమును స్వీకరించుట వలన వచ్చు పాపము నుండి రక్షించునట్టి పవిత్రమైన జలములను ఇమ్ము

## వివరణ

హిరణ్య శృంగం వరుణం అనగా హిరణ్మయమైన కొమ్ముకలిగిన వరుణుడు అని అర్థము అనగా బంగారముతో చేసిన కొమ్ము కలవాడు మన శిరస్సునందు రెండు కనుబొమల నడుమగల బిందువునుండి సూటిగా శిరస్సులోనికి ఒక సరళరేఖ (Horizontal line) నూహించుకొనవలెను అట్లే శిరస్సుపై బాగమున మద్యనుండి క్రిందకు మరియొక సరళరేఖ నూహించుకొనవలయును ఈ రెండును ఖండించుకొనుచోట మన శిరస్సునందు ఆజ్ఞాచక్రము పనిచేయుచున్నది మూలాధారమునుండి ఆజ్ఞాచక్రము వరకు గల కేంద్రములలో ఆజ్ఞాచక్రము ఆరవది ఈ కేంద్రమునుద్భోదనము చేయుటకు బృగు మధ్యమునందు బొట్టుపెట్టుకొనుట, తిలకము దరించుట చేయుదురు ఇందువలన అచ్చటి నాడులు ప్రేరణ చెంది ఆజ్ఞాచక్రమును చైతన్యవంతము చేయును ఈ ఆజ్ఞాచక్రమునకు ప్రక్కనే వరుణ గ్రంది కలదు ఈ వరుణగ్రంధి ప్రబావితమగుట వలన మనచుట్టు చోటుగానున్న వరుణుని ద్యానము చేయగలుగుట, అందుచే పరిసరములు వ్యక్తులు నారాయణుని స్వరూపములుగా చూడగలుగుట సాద్యపడును దీని పక్కనేనున్న ఇంద్రగ్రంది ఇంద్రునికి పుట్టుక స్థానమని చెప్పబడినది అనగా ఇంద్రియములు వాటి నదిష్ఠించియున్న మనస్సు పుట్టి పనిచేయుచోటని యర్థము కనుకనే ఇంద్రలోకము చేరిన వారికి మనస్సు, ఇంద్రియములు ఆనందము నందు లయమగును ఇదియే పరవశస్థితి యనియు, దీనిపైన అనగా శిరస్సుపై బాగమునందు సహస్రారమను ఏడవ కేంద్రముకలదు ఇదియే బంగారు వర్ణముతో ప్రకాశించుకేంద్రము శిరస్సు పైబాగమున నున్న ఈ కేంద్రమే మేరుపర్వతమని సంకేతింపబడినది

ఆజ్ఞాచక్రము నందు ఉద్భోదనమైన వెలుగు సహస్రారము వరకు ప్రసరించును అదిబంగారు వర్ణములో నుండును గనుక హిరణ్యశృంగం అని చెప్పబడినది

మన ఉచ్ఛ్వాస, నిశ్వాసలయందు రెండు బీజాక్షరములు పనిచేయుచున్నవి శ్వాసలోపలికి తీసుకొనుట 'సః' అను బీజము చేతను, శ్వాస బయటకు వదలుట 'హం అను బీజము చేతను జరుగుచున్నది అనగా మన శ్వాస ఈ సోహం అను మంత్రముపై నాదారపడి పనిచేయుచున్నది ఆయాబీజములు శ్వాసను నడుపు దేవతలచే నుచ్ఛరింపబడుచున్నవి ఇందు హం అనుశబ్దము శ్వాసవదలుటకు కారణముగా పనిచేయుచున్నది అది కంఠము నందలి స్వరపేటికలతో మర్షణ చెందగా ర కారము లేక రేపము పుట్టుచున్నది దానినే ఋక్కు అనికూడ అందురు హ'కార ర కారములనుండి పుట్టిన శబ్దము లేకవెలుగే హిరణ్మయము అయిన వెలుగుగా చెప్పబడినది దానినే ప్రకృతి యనియు, లక్ష్మియనియు చెప్పుదురు కనుకనే శ్రీసూక్తమునందు హిరణ్మయీం లక్ష్మీం జాతవేదో మమావహ యని చెప్పబడినది కనుక ఇట్టి హిరణ్మయమైన వెలుగు శిరస్సునందు దరింపబడియున్నది ఈ సహస్రారమే కైలాసమని కూడా వర్ణింపబడినది శివుడు ఇచ్చటనేయుండుననియు, ఆయన శిరస్సుపై ఆకాశగంగ పుట్టి ప్రవహించుననియూ చెప్పబడినది చోటునందు పనిచేయుచున్న కుండలిని శక్తియే ఆకాశగంగ అది జీవుని శరీరములోనికి శిరస్సునందలి సహస్రారము ద్వారా ప్రవేశించి షట్చక్రములయందు ప్రవహించి మూలాదారమును చేరుచున్నది అట్లు శిరస్సునందు ప్రవేశించుటయే శివుడు తన శిరస్సులోనికి గంగను స్వీకరించుటగా వర్ణింపబడినది మూలాదారమున ప్రవేశించిన కుండలినియే పాతాళ గంగ పాతాళ గంగయనగా అణువులయందు, కణములయందు పనిచేయుచున్న కుండలినీ శక్తి ఇట్లు మూలాదారము చేరిన కుండలిని మరల ఉద్భోదనము చెంది సహస్రారము చేరుటయే యోగసాదన యందలి పరమావది ఇట్లు జన్మల తరబడి జరుగుచున్న యోగసాదనలో ఒక్కొక్క కేంద్రమే క్రమేణ ఉద్భోదనము చెందగా, ఆజ్ఞాచక్రమునందు వరుణగ్రంది (pituitary gland) ప్రబావితమై దానినుండి ఇంద్రగ్రంది ప్రబావితం (peneal gland) చెందుచున్నది అప్పుడు ఈరెండు గ్రందుల నడుమ నొక కాంతిమయమైన వారది ఏర్పడును ఇదియే Higher Bridge అని

యోగాచార్యులైన మాష్టర్ CVV గారిచే సంకేతింపబడినది అట్టి వారికి అంతఃకరణ శరీరము నిర్మాణమై సమస్తము అంతర్యామి యొక్క వెలుగుగా దర్శనమగును అట్టి వారినే 'తీర్థంకరులు అందురు వారు నిలిచిన చోటు, చరించిన చోటు పవిత్రములగును వారు ఒకచోట కొంతకాలముండి తపస్సు చేసినచో అదియొక పుణ్యక్షేత్రమగును ఇట్టి వరుణుని ధ్యానము చేసినచో సమస్తపాపములు కరిగింపబడుచున్నవి

ఎవరివద్దనైననూ తెలియక ఆహారము స్వీకరించినచో దానివలన కలుగు పాపము తొలగింపబడుగాకయని చెప్పబడుచున్నది అనగా ఇతరులు అన్యాయముగా ఆర్జించిన దనము చేత లభించిన ఆహారము అట్టిపాప లక్షణములు కలిగి యుండి తిన్నవారికి సహితము తెలియకున్ననూ బాదించును ఒకవేళ పొరపాటున అట్టిపాపము సంభవించినచో పై వరుణమంత్రము ధ్యానము చేసినచో అట్టిపాపము తొలగి పోవును

మంత్రము 3

యన్మే మనసా వాచా కర్మణావాదుష్కృతం కృతమ్ ।
తన్న ఇన్ద్రో వరుణో బృహస్పతిస్సవితాచ పునన్తు పునః పునః ॥

ప్రతిపదార్థము

మే = నాయొక్క
మనసా = మనస్సుచేతను
వాచా = వాక్కుచేతను
కర్మణావా = కర్మచేతను, కాని
యత్ = ఏదైతే
దుష్కృతం = దురితము
కృతమ్ = చేయబడినదో
తత్ = అట్టిపాపమంతయు
ఇంద్రః = ఇంద్రుడు
వరుణః = వరుణుడు
బృహస్పతిః = బృహస్పతి
సవితాచ = సవిత్రుడును

పునః పునః = మరల

పునన్తు = పవిత్రీకరణము చేయుదురు గాక।

## తాత్పర్యము

నాయొక్క మనస్సుచేత, వాక్కుచేత, కర్మచేత ఎట్టి దురితము చేయబడినదో అట్టి పాపమంతయు ఇంద్రుడు, వరుణుడు, బృహస్పతి మరియు సవిత్రుడు మరల మరల పవిత్రీకరణము చేయుదురు గాక।

## వివరణ

నిత్య జీవితమునందు మనము చేయుపనులు అనేకములు కానీ ఏపని యైనను మొదట మనస్సులో సంకల్పించి చేయుదుము కనుకనే పెద్దలు మనము చేయు పనులు స్థూలముగా 3 విభాగములు చేసిరి కేవలము మనసుతో చేయునవి కొన్ని, వాక్కుతో చేయునవి కొన్ని, భౌతికముగా శరీరముతో చేయునవి కొన్ని

ఇంద్రుడు మనయందలి ఇంద్రియములకును, వాటికదిపతియైన మనసునకును అధిపతి మనమేపనియైనను ఇంద్రియములచేతను, మనస్సుచేతను ప్రేరేపింపబడి చేయుదుము మనము చేయుపని యందలి మంచి చెడ్డలతో మనకెక్కువ నిమిత్తముండదు మంచి పనులన్నియు మన మనసు ప్రేరేపింపనిదే చేయలేము చెడుపనిలేక అనవసరమైన పని ఇంద్రియములు ప్రేరేపించినచో చేయుదుము భగవద్గీత చక్కని వ్యాఖ్యానముతో కూడినది ఎదురుగా కనిపించుచున్నను చదువబుద్ధి పుట్టనిచో మనము చదువము తరువాత చదువవచ్చునులే యనిపించును ఈ తరువాత యనునది రోజులు, నెలలు, సంవత్సరములు కూడ కావచ్చును రుచియైన ఆహారపదార్థములు కనిపించినచో ఆకలి లేకున్నను ఇంద్రియములు ప్రేరేపించునుగనుక తిందుము అట్లే భగవద్గీతయందు మనకు గౌరవభావమున్నను చదువుటకు మనసు ప్రేరేపింపలేదు కనుక చేయము ఇట్లు ఇంద్రియములను మనస్సును ప్రేరేపించువాడు ఇంద్రుడు ఇతడు ఇట్టి ప్రేరణను మన పూర్వసంస్కారములననుసరించి చేయును కనుక మనము మంచి భావములు, మంచి అలవాట్లను కలిగియుండవలెను అట్లు కలిగి యుండవలెనన్నచో మరల ఇంద్రుని అనుగ్రహముకావలెను దీని కొక్కటే మార్గము మనసునందు, అందలి భావములయందు, అలవాట్లయందు ఇంద్రుని రూపములోనున్న నారాయణుని చూడవలెను

ఇట్లు ధ్యానించువారిని ఇంద్రుడనుగ్రహించి వారి దుష్టమైన పూర్వసంస్కారములను పవిత్రీకరణ మొనర్చును

వరుణుడు చోటుగా ఆవరించియున్న అంతర్యామి ప్రజ్ఞ మనమేమి చేసినను చోటునందే చేయవలెను మనమేపని చేసినను మన పరిసరములచే అందరి వ్యక్తులచే పురికొల్పబడి చేయుచున్నాము అట్లు పురికొల్పువాడు చోటునందలి వరుణుడే కనుక వరుణుని యుపాసించవలెను ఇట్లు మనయందు జరుగు పనులకు ఇంద్రా వరుణుల సమన్వయ సహకారములు కావలెను అనగా అంతఃకరణ శరీర నిర్మాణము జరిగినచో ఇది సాధ్యమగును అట్టి వానికి ఇంద్రావరుణులు వేరువేరు ప్రజ్ఞలుగా కాక, మనకు సమన్వయ పూర్వకమైన విజ్ఞానమునిచ్చిరి దీనినే మేదస్సు అందురు అనగా ఎపుడేమి చేయవలెనో ఏది చేసినచో తాను ఆనందము కలిగి ఇతరులకు ఆనందము కలిగింపగలుగునో దానిని మాత్రమే ఆచరించు బుద్ధి ఇట్టి వారికి వస్తువులయందు, పరిసరములయందు వ్యామోహములు పనిచేయవు అనగా వీరిని ఎట్టి విషయములు వ్యామోహపెట్టలేవు

పైన చెప్పబడిన స్థితి రావలెనన్నచో మానవుడు మొట్టమొదట వాఙ్మయమము పాటింపవలెను వాఙ్మయమమనగా మాట్లాడుట మానివేయుట గాని, లేదా మితముగా మాట్లాడుట గాని, లేక కొందరు వ్యక్తులతో మాట్లాడి కొందరితో మాట్లాడకుండుట గాని కాదు మాటలాడుట యందలి ప్రయోజనమును (purpose of speech) తెలిసి మాట్లాడుట మాటల యొక్క పవిత్రతను తెలిసికొని వాగ్రూపమైన యజ్ఞముగా జీవించుట మనమొక మాట మాటలాడినచో దానికొక ప్రయోజనముండవలెను మరియు అట్టి ప్రయోజనము నందు లోకహితముండవలెను పెద్దలు, గురువులు సంభాషించువైఖరి మిక్కిలి విచిత్రముగా నుండును ఇతరుల క్షేమమునకు మంచి విషయములు చెప్పవలసినపుడు నిర్మొహమాటముగా చెప్పుదురు మరియు దానిని గూర్చి ఎంతసేపు వివరింపవలసి వచ్చినను సంతోషముగా చేయుదురు గానీ వెనుదీయరు అనావశ్యకమైన చోట్ల పెదవి కదపరు కనుక ఇట్లువాక్కునుపాసించువారికి వాక్కునకు అధిపతియైన బృహస్పతి ప్రసన్నమగును బృహస్పతి యనగా మన యందున్న సత్ సంకల్పము జీవులను మాట్లాడుటకై ప్రేరేపించున దీయనయే ఇట్టి బృహస్పతి అనుగ్రహమున్నచో ఇంద్రుడు వరుణుడు మొదలగు దేవతలు చక్కగా

సహాకరింతురు అనగా అట్టివాజ్ఞ్యయమును కలవానికి సమస్త ప్రకృతియు సహాకరించును

దీనిని గూర్చియే సూక్ష్మముగా పెద్దలిట్లుచెప్పిరి 'సత్యం బ్రూయాత్ ప్రియం బ్రూయాత్, నబ్రూయాత్ సత్యమప్రియం'' సత్యము చెప్పవలెను కానీ ప్రియమునే చెప్పవలెను సత్యమైనప్పటికిని అప్రియమును చెప్పరాదు అట్లే ప్రియమైనప్పటికిని అసత్యమును చెప్పరాదు ఈసూత్రమును చక్కగా అర్థము చేసుకొని అందలి పరమార్థము గ్రహించి నిత్యజీవితమున ఆచరించువానిని సమస్త దేవతలు అనుగ్రహింతురు

సవిత్రుడనగా సృష్టికర్త సూర్యుని ద్వారా పనిచేయుచున్న ప్రజ్ఞ అట్టి సవిత్రుడు జీవుల ద్వారా జీవోత్పత్తిని నిర్వహించును ఇట్టి సవిత్రుని ఉపాసించుట యనగా చక్కటి సంతానము పొందుట మరియు పంటలు పండించి తోటి జీవులకు ఆహారము నేర్పరుచుట, ఇంకను గోసంపద పెంచి ఇతరులకు పాలు సమృద్ధిగా దొరకునట్లు చేయుట మొదలగునవి ఇట్టికార్యక్రమములు నిర్వహించుట వలన మనము చేయుపనుల యందలి పాపబుద్ధి నశించి దానివలన పాపములు తొలగింపబడి మనము మంచి మార్గమునకు మరలుదుము

ఈపైన చెప్పబడినవన్నియు ఒకదానిపై నొకటి ఆదారపడియున్నవి ఇందేది శ్రద్ధగా ఆచరించినను మిగిలినవి అప్రయత్నముగా సరియగును

**మంత్రము 4**

**నమోగ్నయేప్సుమతేనమ ఇంద్రాయ నమో**
**వరుణాయ నమో వారుణ్యై నమో ద్భ్యః |**

**ప్రతిపదార్థము**

అప్సుమతే = జలములుగల

అగ్నయే = అగ్నికి

నమః = నమస్కారము

ఇంద్రాయ = ఇంద్రునికి

వరుణాయ = వరుణునికి

నమః = నమస్కారము

వారుణ్యై = వారుణుకి

నమః = నమస్కారము

అద్భ్యః = జలములకొరకు

నమః = నమస్కారము

## తాత్పర్యము

జలములు గల అగ్నికి నమస్కారము ఇంద్రునికి, వరుణునికి నమస్కారము వారుణి(వరుణపత్ని) కి నమస్కారము జలముల కొరకు నమస్కారము

## వివరణ

''నమో అగ్నయే యనగా అగ్నిగా ఈసృష్టియంతయు వ్యాపించిన అంతర్యామికి నానమస్కారము అని అర్ధము అగ్నియనగా సృష్టిగా మేల్కొన్న అంతర్యామి ప్రజ్ఞ సృష్టి యందలి సమస్తపదార్థములయందు, జీవుల యందు, వృక్షఖనిజాదులయందు నేనుగా మేలుకొని పనిచేయునట్టి ప్రజ్ఞ ఈనేనను ప్రజ్ఞ మొదట సూర్యునిగా మేలుకొని తరువాత జీవులుగా దిగివచ్చుచున్నది అంతేకాక సమస్తదేవతలయందును ఈ ప్రజ్ఞపని చేయుచున్నది అట్లే వరుణునికి, జలములకు, ఇంద్రునికి ఈ అగ్నియే ఆదారము ఇంద్రుడు మనయందు ఇంద్రియముల కదిపతిగా పనిచేయుచున్నాడు ఇతడు మనయందు పనిచేయవలయుననగా అగ్నియే ఆదారము చోటునందు సహితము అగ్ని లేనిదే నీరు మున్నగునవి లేవు సూర్యుని వలననే నీరు మేఘములై వర్షించుట జరుగుచున్నది అంతేకాక మొట్టమొదట భూమిచుట్టు నీరు ఏర్పడుటకు కారణము ఈఅగ్నియే ఈ అగ్ని సూర్యకిరణముల ద్వారా విద్యుత్తుగా దిగివచ్చిచోటునందలి వాయువులను సంఘటిత పరచి నీరుగా మార్చును అనగా హైడ్రోజన్ అణువులు ఆక్సిజన్ అణువులకు మద్య చోటునందలి విద్యుత్తు వలన రసాయనక మార్పు ఏర్పడి నీటి అణువులు పుట్టుచున్నవి ఇట్లు చోటు నందు పనిచేయుచున్న ప్రాణశక్తి 'వారుణి అనిపిలవబడినది ఈమె వరుణుని బార్య

# అనువాకము 13

## మంత్రము 1

**యదపా క్రూరం యదమేధ్యం యదశాన్తం తదప గచ్ఛతాత్|**

## ప్రతిపదార్థము

అపాం = నీటియందలి

యత్ = ఏ

క్రూరం = తీవ్రలక్షణములు (వ్యాధి లక్షణములు)

యత్ = ఏయది

అమేధ్యం = మేదస్సును పాడుచేయునట్టి

అశాంతం = అశాంతిని కలిగించునట్టి

తత్ = అదియంతయు

అపగచ్ఛతాత్ = తొలగిపోవును గాక

## తాత్పర్యము

నీటియందలి వ్యాధి కలిగించునట్టి, మేదస్సును పాడుచేయునట్టి, అశాంతిని కలిగించునట్టి లక్షణములన్నియు తొలగిపోవును గాక

## వివరణ

పరమాత్మ సకల జీవులయందు సృష్టి యందు వర్తించుచున్నాడు ఆయనయందు మనము జీవించుచున్నాము అనునది సత్యము అట్టి విధముగా కాక మన లావాదేవీలు, ఇచ్చి పుచ్చుకొనుటల ద్వారా మన ప్రత్యేక అస్తిత్వమును స్థాపన చేసుకొనుచున్న వారమగుచున్నాము అట్టి తీవ్ర లక్షణములు పోవలెను అమేధ్యమయినట్టి లక్షణము మాలోనున్నది అది తొలగించుము మహాజలముతో నిండిన చోటులో (సృష్టి) మహా యజ్ఞము జరుగుచున్నది దానియందు యజ్ఞార్థమునకు కాకుండా మనకోసము పనిచేయుట అను లక్షణము మనలో నుండుట వలన మనము యజ్ఞమునందు భాగముగా నుండుట సాధ్యపడుటలేదు ప్రక్కవారిని ప్రేమించుటకు అడ్డువచ్చు కారణము లన్నిటిని తొలగించవలసినది

జలములన్నియు ఒక్కటే అయినప్పటికిని ప్రాంతమును బట్టి నీటి స్వభావము మారుచుండును కొన్నిచోట్ల నీరు పడకపోవుట, కొన్నిచోట్ల

నీరు సరిపడుట, కొన్ని ప్రాంతములయందున్న నీటివలన అజీర్ణము మొదలగు వ్యాధులు వచ్చుట మనకు తెలియును నీటియందిట్టి అనారోగ్యకర లక్షణములే క్రూరములుగా వర్ణింపబడినవి మరియు మనము గమనించినచో కొన్ని నదుల ప్రాంతముల యందు చరించువారు కొన్ని లక్షణములు కలిగియుండుట గమనించుచున్నాము ఒక ప్రాంతమువారికి ఆవేశము, కోపము, చిరాకు ఎక్కువగా నుండుట గమనించుచున్నాము

మరియొక నదీ ప్రాంతమువారికి మనసులో విషయములు పైకి తెలియనీయకుండుట, కోపము వచ్చినపుడు మనసులో దాచికొని తగు సమయమునకై వేచియుండుట మొదలగు లక్షణములుండును ఇట్లు జలముల యొక్క లక్షణములను బట్టి అవి త్రాగువారి స్వబావాదులు మారుచుండును అట్లే కొన్ని రకముల జలములయందు బుద్ధి మందకొడిగా నుండుట, బుద్ధి, చురుకుతనము తక్కువగా నుండుట మొదలగు లక్షణములుండును అట్టి చోట జలములు త్రాగవలసివచ్చినపుడు ఈ పై మంత్రమును ద్యానించుము జలముల కదిదేవత యైన వరుణుని ద్యానించుచు ఆ జలములను స్వీకరించినచో పైనచెప్పిన బాదలు సంక్రమించవు లేక నారాయణుని ఆజలములయందు ద్యానముచేసి పైమంత్రము చదువుకొని అట్టి జలములను స్వీకరింపవచ్చును ఇట్లు చేయనిచో అట్టిజలములనేమి చేసినను అనగా ఎంత వడపోసినను, కాచి చల్లార్చి త్రాగినను ఎన్ని మందులు కలిపినను పై లక్షణములు పోవుకదా మీాదు మిక్కిలి ఆ కలపబడిన మందుల లక్షణములు సైతము రోగరూపమున బాదించును

## మంత్రము 2

**లు మారుచుండుఅత్యాశనా దతీపానా ద్యచ్చ ఉగ్రా త్ప్రతిగ్రహాత్|**
**తన్నో వరుణో రాజా పాణినా హ్యావ మర్శతు |**

## ప్రతిపదార్థము

అత్యాశనాత్ = ఎక్కువ తినడము వల్ల

అతీపానాత్ = ఎక్కువ త్రాగడము వల్ల

ఉగ్రాత్ = తీవ్రమయినవి

ప్రతిగ్రహాత్ = స్వీకరించడము వలన

యచ్ఛ = దుర్లక్షణములు కలుగుచున్నవో

తత్ = ఆ పాపమును

రాజా = రజస్సులకు అధిపతియైన

వరుణః = వరుణుడు

పాణినా = చేతితో

హ్యావమర్శతు = తీసివేయును గాక

## తాత్పర్యము

ఎక్కువ తినడము వలన, ఎక్కువ త్రాగడము వలన తీవ్రమైనవి స్వీకరించడము వలన ఎటువంటి దుర్లక్షణములు నాయందు కలుగుచున్నవో అవి రజస్సులకు అదిపతియైన వరుణుడు చేతితో తీసివేయును గాక।

## వివరణ

ఎక్కువగా తినుట త్రాగుట వలన ఆరోగ్యములో వచ్చిన తేడాలను సరిచేయవలసినది అని కోరబడుచున్నది తీవ్ర స్వబావము కలిగిన వారినుండి మనము దానము తీసికొనినచో వారి దుర్లక్షణములు మనకు వచ్చును దాని వలన ఏపాపము కలుగుచున్నదో దానిని రజస్సులకు అదిపతియైన వరుణుడు తన చేతితో తీసివేయును గాక అని ద్యానము చేయవలయును

కనుకనే ప్రతివారి యొద్దనుండి ఆహార పానీయాదులు స్వీకరించుట పనికిరాదు అట్లు తీసికొన్నచో వారి మానసిక ప్రవృత్తులు (ఆవేశాత్మకమైన ప్రవృత్తులు) మనపై పనిచేయును ఎందుచేతననగా ప్రతివారియొక్క మానసిక ప్రవృత్తులు, ఆవేశములు, వారుపయోగించు వస్తువులను, నివసించు ప్రాంతములను ఆశ్రయించియుండును ముఖ్యముగా క్రమబద్ధమైన జీవితము లేని వారియందు ఇది హెచ్చుగానుండును ఇట్టి ప్రవృత్తి గలవారిచే వ్యాదులు అతి త్వరగా ఆకర్షించబడును నిశితముగా గమనించినచో ఆద్యాత్మికచింతన కలిగి క్రమబద్ధమైన జీవితము గడుపుచు, ప్రశాంతముగా జీవించువారికి ఆగంతుక వ్యాదులు (Epidemics) అనగా జ్వరములు, విరేచనములు మున్నగునవి ఎక్కువగా బాదింపవు అట్టివారు ఇతరుల వస్తువులను ఉపయోగించుట, ఆహారాదులను దనమును అయాచితముగా

్వకరించుట చేయరాదు చేసినచో పైన చెప్పిన వ్యాదులు రావచ్చును
)జమునకు ఆయుర్వేద శాస్త్రము నందును, హోమియో శాస్త్రము నందును
వియే వ్యాది కారణములనియు, ఇట్టి కారణములేర్పడిన తరువాత అచటికి
ాక్టీరియా ఆకర్షింపబడుననియు చెప్పబడినది అట్లే ఆకలికి మించి
నుట, దాహము లేక పోయిననూ పానీయాదులు త్రాగుచుండుట
)షేదమని చెప్పబడినది మరియు ఉగ్రాత్' అని చెప్పబడుట వలన
ఆల్కహాల్, బ్రాంది మొదలగు మత్తు పానీయములు, గంజాయి మున్నగు
మాదక ద్రవ్యములు, మసాలాలు, అతికారములు, మిక్కిలి పులుపు, చేదు
ీక మూలైన వస్తువులు, పొగాకు సిగరెట్ వంటివి యని అర్థము అటువంటి
ాటివలన కలుగు ఘోరవ్యాదులు పై మంత్రమును ధ్యానము చేసినచో
)వారింపబడుట కవకాశమున్నది అనగా మొదట అట్టిరోగికి
పశ్చాత్తాప మంకురించి, తాను నియమబద్ధ జీవితమును గడుపుటకు
తికరణ శుద్ధిగా నిర్ణయించు కొనవలెను ప్రాతః కాలమున లేచుట
సూర్యోదయమునకు ముందే స్వచ్ఛమైన నీటితో స్నానాదికములు
పూర్తిచేసికొని దైవధ్యానము చేసికొనుట ప్రాతః కాలమున
ేదమంత్రములను చదువుచు లేక భగవన్నామ ముచ్చరించుచు లేక పై
మంత్రము నుచ్ఛరించుచు (సంధ్యాసమయమున) కొంతసేపు
)హారించవలెను తరువాత ఇంటిలో పూజ చేసికొనుట గాని
భగవద్యానమున కొంత సమయము గడపుటగాని చేయవలెను దీనివలన
మనస్సునందలి ఆవేశములు దమింపబడి మనసుకు ప్రశాంతత చిక్కును
వెంటనే వ్యాదికారణములు నిర్మూలింపబడును ఇంకను దినచర్య కూడ
)కాకు ఆవేశములతో కూడినది కాకుండ నుండవలెను ఇంకను
ేహమునకు మేలుచేయు ఆహారపానీయాదులను స్వీకరించుచు సరియైన
వైద్యమును పొందుచున్నచో అతి త్వరలోనే అట్టివారికి రోగనివారణము
ాగలదు

## మంత్రము 3

సోzహ మపాపో విరజో నిర్ముక్తో ముక్త కిల్బిషః
నాకస్య పృష్ఠ మారుహ్య గచ్ఛే ద్బ్రహ్మసలోకతామ్

## ప్రతిపదార్థము

అపాపః = పాపము నశించిన స్థితి పొందినవాడనైన

అహం = నేను

సః = ఆ
విరజో = రజస్సును పోగొట్టుకొనిన వాడినై
నిర్ముక్తః = ముక్తస్థితి
ముక్తకిల్బిషః = పాపములు నశించినవాడినై
నాకస్య = స్వర్గమునకు
పృష్ఠం = వెనుక బాగమును
ఆరుహ్య = అదిష్ఠించి
బ్రహ్మసలోకతామ్ = బ్రహ్మయొక్కలోకమునందు
గచ్ఛేత్ = చేరుదును గాక।

## తాత్పర్యము

పాపము నశించు స్థితి వలన రజస్సును పోగొట్టుకొనిన వాడినై ముక్త స్థితిలో పాపములు నశించిన వాడినై పాపరహితమైన స్థితిని అదిష్ఠించి, బ్రహ్మయొక్క లోకమును చేరుదును గాక।

## వివరణ

రజస్సులు లేకుండ యనగా పనులకు సంకల్పములు లేకుండుట అనగా పనులు తాను నిర్ణయించరాదు మహానుబావులు తమంత తాము నిర్ణయించరు ఇది చేయమని అడిగినపుడు చేయుదురు అదియే activity నశించిన స్థితి అపుడు పాపపుణ్యములు ఉండవు లాభదృష్టిలేనివాడు స్వర్గమునకతీతముగా నుండును బ్రహ్మలోకము అనగా సత్యము అయిన స్థితి సృష్టిలోకూడ అటువంటి సత్యమార్గములో జీవించిన వాడు బ్రహ్మతో కలసి వుండును, దానిని చూచుట అనగా అంతర్యామిని చూచుట లేక అంతర్యామిని చేరుట

పాపములు నశింపవలెననగా పాపబుద్ధి పోవలెను పాపము చేయు బుద్ధి పోవలెనన్నచో పుణ్యము చేయు బుద్ధికూడా పోవలెను వ్యాపారమునందు లాబము వచ్చుట ఎంతసహజమో నష్టముకూడ అంతే సహజము బౌతికజీవితమునందు వ్యాపారదృష్టియున్నచో కొంతవరకు సరిపెట్టుకొనవచ్చునేమో కాని యోగసాధనయందు వ్యాపారదృష్టి అసలే పనికిరాదు అట్టివాడు ఇహమునకు, పరమునకు కాకుండ పోవును తానేదో అనుష్ఠానము లేక యోగసాదన చేయుచుంటినను ఆత్మవంచన

మిగులును ఇది ఒకపిచ్చివాని స్వర్గమువంటిది (Fools Paradise) దేవతార్చన, అనుష్ఠానము మున్నగునవి కేవలము లాభదృష్టితోనే చేసినచో అవి అంతవరకే పనిచేసియూరకుండును యోగసాధన వేరు, లాభదృష్టితో పనులుచేయుట వేరు రావణాసురుని వంటి రాక్షసులు సహితము వేదములు చదువుకొని నిత్యదేవతార్చన మనకన్నఎక్కువ నియమ నిష్ఠలతో చేసిన వారే కదా। కాని వారికవి చేయుటలో లాభదృష్టియే తప్ప అంతర్యామి ఉపాసన లేదు కనుకనే వారుచేసిన పూజలు, తపస్సులు వారిని రక్షింపలేకపోయినవి ధ్రువుడు, ప్రహ్లాదుడు వాల్మీకి వంటివారు అట్టి అనుష్ఠానములు లేకున్నను అంతర్యామి యొక్క ఉపాసన చేయుటచే తరింపగలిగిరి కనుకనే పుణ్యకార్యములు చేయుటచేత తనకధిక సుఖములు కలుగవలెనను కోరిక, వందరూపాయల నోటు ఇచ్చివేరుసెనగ పప్పుతినుట వంటిది అనగా పుణ్యకార్యములు చేయువారు వాటి ఫలితముల కొరకు కక్కుర్తి పడనక్కరలేదు ఫలితములు వాటంతట అవియే లభించును నిజమునకు తనలో జరుగవలసినది అంతర్యామి నుపాసించుటయే నిత్య జీవితమునందు, సంఘటనలయందు, పాప పుణ్యములయందు, కష్టసుఖములయందు అంతర్లీనముగా నున్న నారాయణుని ఉపాసించువాడు ఫలితము లక్కర లేని స్థితికి చేరును అట్టి వానికి సమస్తమును నారాయణుని యొక్క అస్తిత్వముగనే కనబడునని పైన చెప్పబడిన "బ్రహ్మసలోకతాం అను దానివలన తెలియుచున్నది అట్టివాడు 'నిర్ముక్తః' అని చెప్పబడినది అనగా మోక్షస్థితి కూడ అక్కరలేనిది మోక్షస్థితి యనగా జనన మరణాదులక్కర లేక అంతర్యామియందు లయమైయుండు స్థితి నిజముగ సమస్తమునందున అంతర్యామిని దర్శింప గలుగువానికి సృష్టియందలి జీవులు నారాయణుని స్వరూపములే యగుదురుకదా। అట్టివారు పుట్టినను పుట్టకున్నను నారాయణునియందే నున్నపుడు వాని సేవకై పుట్టుట కధ్యంతరమేమి ? అట్టివారు మోక్షముకూడ అక్కరలేని స్థితియందుందురు

మంత్రము 4

యశ్చాప్సు వరుణస్సపునాత్వఘమర్షణః।

ప్రతిపదార్థము

అప్సు = జలములయందు

యఃచ వరుణః = ఏవరుణుడు గలడో

అఘమర్షణః = పాప వినాశకుడగు

సః = ఆ వరుణుడు

పునాతు = పవిత్రునిగా చేయుగాక।

## తాత్పర్యము

నీటియందు పాప నాశకుడగు ఏ వరుణుడు కలడో అతడే నన్ను పవిత్రునిచేయును గాక।

## వివరణ

, జలములయందున్న వరుణుని గూర్చి మరల చెప్పబడుచున్నది వరుణుడనగా చోటులో నిండియున్న మహాప్రాణశక్తి Space లో Charged గా నున్న energy cosmic or Higher energy ఆ శక్తి నీటియందు కూడ charge అయివుండును కదా। ఆ జలముల యందున్న శక్తియే వరుణుడు ఆయన నన్ను పాపబుద్ధి నుండి రక్షించును గాక యని కోరబడుచున్నది

జలములు పవిత్రీకరణమునకు, శుద్ధికి అత్యంత ముఖ్యములు జలములయందు చోటు యందలి ప్రాణశక్తి నిండియుండును పసుపు, గందము, పచ్చకర్పూరము మున్నగు ద్రవ్యములను నీటియందు కలుపుటచే వాటియందలి ప్రాణశక్తి నుద్బోదనము (Stimulate)చేయవచ్చును మరియు ఈ ద్రవ్యములు వాతావరణము నందలి దుష్టమైన శక్తులను (evil or negative thoughts or situations) పారద్రోలును ఇట్లు జలములచో అపవిత్ర వాతావరణము (unhygenic and evil influence in atmosphere) ను శుద్ధి చేయవచ్చును శుభకార్యముల సందర్భమున నీటియందు పైన చెప్పిన సుగంద ద్రవ్యములను కలిపి వరుణమంత్రములతో పునీతము చేసి ఆనీటిని ఇంటియందు పరిసరముల యందు జల్లు సంప్రదాయము "పుణ్యాహవాచనము అను పేర బారతీయ కుటుంబములలో సుప్రసిద్ధమైయున్నది మంత్ర పూతములైన జలములతో వ్యక్తులను అభిషేకించి శుద్ధిచేయుట కూడ ప్రత్యేక శుభకార్యములయందు నిర్వహింపబడును ఇట్టి సంప్రదాయము ఇతర మతములయందు కూడ మనము గమనింతుము క్రైస్తవ సంప్రదాయమునందు పుట్టిన బిడ్డకు లేక క్రొత్తవారిని వారి సంప్రదాయములోనికి స్వీకరించు సందర్భమున పాదరు మంత్రజలములను (Holy water) జల్లుదురు దీనినే Baptism అందురు అట్లు

పునీతుడైన వాడు తన పూర్వ దుష్కర్మలనుండి విముక్తుడైనాడని అర్థము ఇట్లు నీటియందలి అఘమర్షణుడైన వరుణుడు జీవులను శుద్ధి చేయుచు వారియందలి పాపబుద్ధి తొలగించి వారిని పాపవిముక్తులుగా చేయుచున్నాడు

నీటికి పాపమును తొలగించు శక్తి కలదా ? యని మన కాశ్చర్యము కలుగవచ్చును కాని స్వచ్ఛమైన నదీజలములయందు గాని తటాకములయందుగాని శిరస్సుపైకి స్నానము చేయువానికి మనస్సు వాని ప్రయత్నమక్కరలేకయే ప్రశాంతమగును కనుకనే పెద్దలు యోగసాదనకు అట్లుస్నానము చేయుట తప్పనిసరిగా సంప్రదాయముల యందు విదించిరి నదీజలమున శిరఃస్నానముచేసి, సంద్యావందనము చేసి శ్వాసనుపాసించు వానికి మనస్సు నిర్మలము, ప్రశాంతముగా నుండి దినమంతయూ ఎట్టి ఉద్వేగములు లేక శాంతియుతమై యుండును ఇట్లు కొంతకాలము ఆచరించిన వానికి అది సహజ స్థితియగును కోపతాపాదులు బాదింపవు దానికి తోడు దినచర్యలో కూడ కొంతసమయము సద్గ్రంథపరనమునకు, సత్కర్మాచరణమునకు వినియోగించినచో దినమంతయు మనసు తనయందు లీనమై ఒకే తన్మయావస్థ తనయందు నిండియుండును అది ఉదయమునుండి రాత్రి నిద్రించువరకు అవిచ్ఛిన్నముగా కొనసాగును అట్టివాడు తాను పరిస్థితులయందున్నను వానియందు పరిస్థితులుండవు పరిస్థితులయందు కేవలముదాసీనుడుగా నుండి ఆనందమొకటే సత్యముగా, శాశ్వతముగా కలిగి యుండును ఇన్నిటికిని మూలకారణము కాకున్ననూ అదికముగా సహకరించునది ఉదయము తానాచరించు స్నానమే కదా !

మంత్రము 5

ఇమంమే గఙ్గేయమునే సరస్వతి శుతుద్రి స్తోమగ్ం సచతా పరుష్ణియా |
అసిక్నియా మరుద్వృదేవి తస్తయా ర్జికీయే శ్రుణుహ్యాసుషోమయా |

ప్రతిపదార్థము

గఙ్గే = ఓ గంగానదీ

యమునే = ఓ యమునా నదీ

సరస్వతి = ఓ సరస్వతీ నదీ

శుతుద్రి = ఓ శుతుద్రీనదీ

మరుద్వృధే = ఓ మరుద్వృద యను నది

పరుష్ణియా = పరుష్ణియను నది

అసిక్నియా = అసిక్నియను నది తోడను

ఆర్జికీయే = ఓ యార్జికీ యను నది

వితస్తయా = వితస్తా నది తోడను

సుషోమయా = సుషోమ యను నది

మే = నాయొక్క

ఇమం = ఈ

స్తోమం = స్తుతి

శ్రుణుహిః = వినుడు

## తాత్పర్యము

ఓ గంగా, ఓ యమునా, ఓ సరస్వతీ, ఓ శుతుద్రి, ఓ మరుద్వృద, అసిక్నియా । మీరు వచ్చి పరుష్ణి వితస్త సుషోమలతో కూడి నాయ స్తోమమును విని విచ్చేయవలసినది

## వివరణ

నదుల దేవతలను ఆవాహన చేయుచున్నాము ఓ గంగా, ఓ యమున ఓ సరస్వతీ, ఓ శుతుద్రి, ఓ మరుద్వృద, ఓ అసిక్నియా, వితస్త, సుషోమ - ఈ నదులన్నియు రావలసినది ఇట్లు స్నానము చేయునపుడు సమస్త నదు శక్తులు ఆవాహనము చేసుకొని స్నానము చేయుదురు దాని వలన నదుల ప్రజ్ఞలు అట్టి నీటియందు మేలుకొని పనిచేయును మరియు మ దేహమునందు నాడులు కూడ మేలుకొని పనిచేయును మన దేహమున నదులన్నియు vitality flow యగు కాలువలు (canals) శిరస్సు నుం శరీరమునందలి అన్ని బాగములకు ప్రాణశక్తి ప్రసరించుచుండును దాని కుండలిని యందురు అట్టి కుండలిని మన శరీరమంతయు కాలువ కాలువలుగా ప్రవహించుచుండును ఇట్లు ప్రాణశక్తి ప్రవహిం కాలువలనే నాడులు అందురు ఈ నాడులు మన శరీరము నం ప్రదానముగా3 గలవు వాటిని ఇడ, పింగళ, సుషుమ్న అని పిలుతు వీనినే గంగ, యమున, సరస్వతి యనికూడ పిలిచెదరు ఈ మూడే గ అనేకములైన నాడులు మన శరీగ... ందు పనిచేయుచున్నవి అవి కొ

వేల వరకునుండగా వానిలో 10 ప్రదానమైనవిగా సంకేతించిరి వానిలో పై మూడును గాక మిగిలిన ఏడును మన శరీరము నందలి ఏడు ప్రజ్ఞా కేంద్రముల ననుసరించి పనిచేయుచున్నవి భృగు మద్యము నుండి వెన్నెముక చివరి భాగము వరకు ఇడ, పింగళ, సుషుమ్న నాడులు వ్యాపించియున్నవి సరస్వతి అంతర్వాహిని అదియే సుషుమ్న దానినే ఆకాశగంగ అని కూడా అందురు

నాడులన్నియు జీవునియందు ప్రాణశక్తికి కాలువలుగా పనిచేయుచున్నవి ఈ శక్తులు మేలుకొనినపుడు మన ప్రవర్తన బట్టి సద్వినియోగమగుచుండును వీరినే దేవతలందురు వీరిని నిత్యము ఆయాకేంద్రములయందు ఆవాహనము (invoke) చేసుకొనవలెను మనము పూజ చేయునపుడు 'ఆవాహయామి అందుము ఆవాహయామి యనగా I invoke God into My mind and body '' అని అర్థము ఆక్షణమునుండి పరమాత్మ మనకుండుట మొదలగును అంగన్యాసము, కరన్యాసము మున్నగునవి ఇందలి బాగములే దీనివలన నాడులుగా నున్న శక్తులను ఆవాహన చేసికొని మనయందు మేలుకొలుపుకొనుచున్నాము బారతదేశము నందున్న నదులన్నియు మానవ శరీరమందలి నాడులకు సంకేతములు పైన చెప్పబడిన నదులు ప్రదానముగా గంగ, యమున, సరస్వతి మరియు సిందు యొక్క ఉపనదులు వీనిలో 5 ఉపనదులు ప్రస్తుతము కనిపించుచున్నవి మిగిలిన రెండు బహుశా కాలక్రమేణా క్షీణించియుండవచ్చును వీనిలో సుషోమ యనునది'సోహాన్ గను, వితస్త 'జీలం' నదిగను, అసిక్ని చీనాబ్ నదిగను, పరుష్ణి రావి యను నదిగను, శుతుద్రి 'సట్లెజ్ నది గను, మరుద్వృద, ఆర్జీకీయా ఆరు, ఏడుగను ఊహింపబడుచున్నవి

## మంత్రము 6

**ఋతంచ సత్యంచాబీ ద్ధాత్తపసోద్య జాయత।**
**తతో రాత్రి రజాయత తతస్సముద్రో అర్ణవః॥**

## ప్రతిపదార్థము

అబీద్ధాత్ = అంతట ప్రకాశించు పరమాత్మ వలన

ఋతంచ = ఋతము, మరియు

సత్యంచ = సత్యము

తపసః = తపస్సు
అది అజాయత = పుట్టెను
తతః = దా౯ ుండి
రాత్రి = రాత్రి
అజాయత = పుట్టెను
తతః = పిదప
సముద్రః = సముద్రము
అర్ణవః = అర్ణవమైన
అదిజాయత = పుట్టెను

## తాత్పర్యము

ఋతము మరియు సత్యమునుండి తపస్సు పుట్టినది దానినుండి రాత్రి పుట్టినది పిదప అర్ణవమైన సముద్రము పుట్టినది

## వివరణ

ఋతము అనగా పరమాత్మనుండి పుట్టిన మొట్టమొదటి అవ్యక్తమైన వెలుగు ఇదియే సత్యమైనది సత్ అను శబ్దమునకు ఉండుట అని అర్థము అవ్యక్తముగా నున్న అంతర్యామి ప్రజ్ఞ తనకు తానున్నానని తెలియు వ్యక్త స్థితిలోనికి దిగివచ్చుటయే సత్యము అని చెప్పబడినది సమస్త సృష్టికి ఇదియే బీజము దీనియందు సృష్టి సమస్తమునకు కావలసిన తెలివి (The intelligence of creation) ఇమిడి యున్నది దీనినుండి తపస్సుపుట్టినది ఇదియే సృష్టికి కావలసిన సంకల్పము లేక కోరిక దీని వలన రాత్రి లేక చీకటి పుట్టినది ఇదియే తమస్సు అని పిలువ బడినది దానివలన సృష్టికి కావలసిన మహా చైతన్యము ప్రాణశక్తిగా మేలుకున్నది ఇదియే అర్ణవము

అనగా సత్యమనియు, ఋతమనియు చెప్పబడు మొదటి వెలుగు నుండి తపస్సు పుట్టినది తపస్సు అనగా తీవ్రమైన కోరిక మరియు తపము అనగా వేడిమి (temparature) అవ్యక్తమైన అంతర్యామి నుండి మొదటి నేనున్నాను'' (consciounsness) పుట్టినది ఇదియే సత్యము సత్ అను శబ్దమునగు ఉనికి (existence) అని అర్థము

ఇట్టి స్థితినే సత్యలోకము అందురు ఇదియే బ్రహ్మ స్థానము అనగా
ంవ్యక్త లోకములకు పరమాత్మ అదిపతికాగా ఆయననుండి పుట్టిన బ్రహ్మ
్యక్త లోకములకు అదిపతియై ఉన్నాడు నారాయణుని నుండి పుట్టిన
ొదటి వెలుగే బ్రహ్మ ఆయనయే పరమాత్మయొక్క ఋక్కుగా మరియు
ాక్కుగా తెలియబడుచున్నాడు అట్టి బ్రహ్మనుండి తపస్సు లేక వేడిమి
ుట్టినది అనగా చోటులోని వేడి, వెలుగు పుట్టి గోళాకారములుగా
ట్టుకున్నవి ఇట్లు చోటులో పుట్టు వెలుగులే కాంతిపుంజములు (Nebulae)
ని ఖగోళశాస్త్రజ్ఞులచే గుర్తింపబడినది ఈ పుంజములనుండి తారలు
tars) పుట్టుచున్నవి అని మనకు తెలియును కదా। మన సూర్యుడు కూడ
కతారయే ఇట్లు బ్రహ్మ సమస్త భౌతిక సృష్టికి తన తపస్సు అను ప్రవృత్తి
లన కారణమగుచున్నాడు

అట్టి తపస్సు వలన రాత్రి లేక చీకటి పుట్టుచున్నది అనగా వెలుగు,
ీకటి అను రెండు స్థితులు ఏర్పడినవి దానివలన సూర్యోదయము,
ూర్యాస్తమయము తరువాత దిగి వచ్చెను

ఈ పైన చెప్పబడినవి అన్నియు పూర్తిగా వ్యక్త రూపములుగా కాక
ంవ్యక్త స్థితిలో జరిగినవి అనగా అట్టి లక్షణములు సృష్టి దర్మములుగా
ఏర్పడి అవి సృష్టి ప్రారంభమునకై వేచియున్నవి

అర్ణవమనగా శబ్దతరంగములతో కూడిన చైతన్యము అట్టి
ైతన్యముగా శబ్దతరంగములు వ్యాపించగా దానినుండి భౌతిక సృష్టి
ఎచ్చినది



# అనువాకము 14

## మంత్రము 1

**సముద్రా దర్ణవా దధి సంవత్సరో అజాయత
అహోరాత్రాణి విదదద్విశ్వస్య మిషతో వశీ**

## ప్రతిపదార్థము

సముద్రాత్ అర్ణవాత్ అది = అర్ణవమైన సముద్రము వలన
అహోరాత్రాణి = అహోరాత్రాదికమును
విదదత్ = చేయుచున్నట్టియు
మిషతః = నిమేషము చేయుచున్నట్టియు
వశీ = స్వాదీన కర్తయగు
సంవత్సరః = సంవత్సరము
అజాయత = పుట్టెను

## తాత్పర్యము

అర్ణవమైన సముద్రము నుండి సంవత్సరము పుట్టినది దానినుండి రాత్రింబగళ్ళు నిమిషములతో కూడిన కాల విబాగము మరియు విశ్వమునందు రెప్పపాటుగల జీవులు వచ్చినవి

## వివరణ

అర్ణవమైన సముద్రము నుండి సంవత్సరము అను వ్యూహము (plan) ఏర్పడినది దానియందు అహోరాత్ర్యాది విబాగములు నిమిషములు మున్నగు కాలమాన మేర్పడినది ఇది సౌరమండలము పుట్టుటకు ముందున్న స్థితి ఒక బడికి గాని కాలేజికి కాని దైనందిన కార్యక్రమము (time table) కాలేజీ ప్రారంబమగుటకు ముందే ప్రిన్సిపాలు మున్నగు పెద్దలచే నిర్ణయింపబడును ఏఏ తరగతి ఎంతసేపు ఉండవలెనో, ఎవరెవరు ఏఏ విదుల నాచరింపవలెనో, ఎట్లాచరింపవలెనో, ఎంతవరకాచరింప వలెనో ముందుగానే నిర్ణయింపబడును అట్లు క్షుణ్ణముగా అన్ని విషయములు పరిశీలించి ఏర్పాట్లు చేయబడిన తరువాతనే కాలేజీ ప్రారంబింపబడును అట్లే బౌతికసృష్టికి పూర్వమే ఇట్టి ఏర్పాట్లు జరుగును సంవత్సర చక్రము

కాలమానము, బౌతికసృష్టి వివరణలు అందేర్పడును తరువాత దానిననుసరించి బౌతిక సృష్టి నిర్మాణమగును పైన చెప్పబడినవి బౌతిక సృష్టికి మూనలుగా నేర్పడి భౌతిక వస్తువుల, జీవుల ఉత్పత్తికి కారణములుగా పనిచేయుచున్నవి ఇట్లు మొదట అంతర్లోకసృష్టి, తరువాత బౌతిక సృష్టి జరిగినవి

సంవత్సరము మొదట పుట్టిరనియు, దాని తరువాత అహోరాత్రములు, తరువాత రెప్పపాటుగల జీవులు పుట్టిరని చెప్పబడినది సంవత్సరచక్రము అనగా సూర్యుడు మరియు సౌరమండలము మొట్ట మొదట సూర్యుడు పుట్టగా వానిచుట్టూ గ్రహాప్రజ్ఞలు గోళములుగా కట్టుకొనెను అహోరాత్రములు పుట్టినవనగా బూమి పుట్టినదని అర్ధము బూమి పుట్టి దానికి పరిభ్రమణ మేర్పడి, ధృవములేర్పడి తనచుట్టు తాను తిరుగుట, సూర్యుని చుట్టు తిరుగుట అను ప్రవృత్తులేర్పడినవనియు దానివలన అహోరాత్ర విబాగము ఏర్పడినదనియు అర్ధము మిషతః అనగా రెప్పపాటుగల జీవులు పుట్టిరని అర్ధము దీని వలన రెప్పపాటు, శ్వాసించుట మున్నగు ప్రవృత్తులు గల జంతువులు, మానవులు పుట్టిరని అర్ధము ఇట్లు బౌతిక సృష్టి దిగి వచ్చినది మరియు నిమిషములు, గంటలు మున్నగు కాల విబాగమేర్పడినది అనగా బూపరిభ్రమణము వలన ఇది జరిగినది

## మంత్రము 2

సూర్యాచన్ద్ర మసౌ దాతా యదా పూర్వమకల్పయత్ |
దివంచ పృదివీం చాన్త రిక్ష మదో సువః ||

## ప్రతిపదార్ధము

ధాతా = బ్రహ్మ

సూర్యాచన్ద్రమసౌ = సూర్య చంద్రులను

పృదివీంచ = బూలోకమును

అంతరిక్షం = అంతరిక్షమును

అదః = క్రింది లోకములను

సువః = సువర్లోకము

యదా పూర్వమ్ = పూర్వకల్పము వలెనే

అకల్పయత్ = సృష్టించెను

## తాత్పర్యము

ధాత సూర్యచంద్రులను, భూమిని, అంతరిక్షమును, సువర్లోకమును మరియు క్రిందిలోకములను పూర్వకల్పము వలెనే సృష్టించెను

## వివరణ

సృష్టికర్తయైన బ్రహ్మ సూర్యచంద్రులను, భూమిని అంతరిక్ష లోకములను యింతకు ముందువలెనే సృష్టించెను అనిచెప్పబడినది ఇది చెట్టునుండి గింజ మరల గింజనుండి చెట్టువచ్చుట వంటిది ధాన్యము పంటగా వచ్చుసరికి మొక్కలు వాడిపోవును కదా। అప్పుడు వరిమొక్కలు లేకపోయిననూ వరిగింజ రూపమున వరిమొక్క యుండును అనగా వరిమొక్క బౌతికముగా లేకున్ననూ వరిగింజయందు వరిమొక్క తాలూకు విజ్ఞానమంతయూ నిమిడి యున్నది లేనిచో వరిమొక్క ఏలవచ్చును దానిబదులు మరియొక గోదుమ మొక్కయో, వేపమొక్కయో రావచ్చును గదా। అట్లుజరుగుట లేదనగా వరిమొక్కను గూర్చిన Biological Data అంతయూ వరిగింజలో ఇమిడియున్నదని అంగీకరించక తప్పదు ఇట్లు సృష్టియందలి సమస్త వస్తువుల విజ్ఞానము చోటుయందు బీజముగా నున్నది ఈ బీజముగా నున్న తెలివినే బ్రహ్మ (Creative Intelligence) అందురు ఈ సృష్టికర్తయైన బ్రహ్మ బౌతిక సృష్టి నశించినను, తానుండును మరల క్రొత్తసృష్టి ప్రారంబమున ఇంతకు ముందున్నట్లే సమస్తమును సృష్టించును అట్లు సృష్టించుటలో మొదట సూర్యచంద్రాదులను సృష్టించి తరువాత వారి లోకములైన సువర్లోకమును, అంతరిక్షమును, చిట్టచివరగా భూమిని సృష్టించును అట్లే మానవ దేహము నందు మొదట జీవాత్మ సృష్టింపబడగా వానిచుట్టూ మనస్సు మున్నగునవి పొరలుగా ఏర్పడును ఆత్మ కేంద్రముగా నుండగా దాని వలన బుద్ధి, మనస్సు, ప్రాణమయకోశము, ఇంద్రియములు ఏర్పడి చిట్ట చివరగా బౌతిక శరీర మేర్పడును ఇట్లు బౌతిక శరీరమేర్పడుటకు తండ్రియే కారణము తండ్రివలన కుమారుడు వచ్చుచున్నాడు తండ్రినశించిననూ కుమారుడు తండ్రియొక్క ప్రతినిదిగా మానవ రూపమున నిలచియున్నాడు

ఇట్లుసంతానము తల్లిదండ్రుల పోలికననుసరించియే యుండును కనుక బ్రహ్మ పూర్వకల్పము వలెనే సృష్టించెనని చెప్పబడినది కల్పము అను పదమునకు కల్పింపబడినదని (conception) అర్థము అందుచేతనే ఆంగ్లమునconception అను పదమునకు గర్భదారణము అని కూడ అర్థమున్నది



**మంత్రము 3, 4, 5**
యత్పృదివ్యాగ్ం రజస్స్వమాన్తరిక్షే విరోదసీ।
ఇమాగ్స్తదాపో వరుణః పునాత్వఘమర్షణః॥

పునన్తువసవః పునాతువరుణః పునాత్వఘమర్షణః।
ఏష భూతస్య మధ్యే భువనస్య గోప్తా॥

ఏష పుణ్యకృతాంలోకానేష మృత్యోర్ హిరణ్మయమ్।
ద్యావా పృదివ్యోర్హిరణ్మయగ్ం సగ్ంశ్రితగ్ం సువః॥

# అనువాకము 15

**మంత్రము 1**
సనస్సువస్సగ్ంశిశాది।

**ప్రతిపదార్థము**

పృదివ్యాం = భూమియందున్న
యత్ = ఏ
స్వం = స్వకీయమైనట్టి
రజః = రజస్సు
అన్తరిక్షే = అంతరిక్షలోకమునందు
విరోదసీ = రోదసి యందు
తత్ = దానినుండి
ఇమాన్ = ఈ మమ్ములను
అఘమర్షణః = పాప వినాశకుడును అగు
ఆపః = జల రూపుడును
వరుణః = వరుణుడు
పునాతు = పవిత్రుని జేయుగాక।
వసవః = అష్ట వసువులు
పునంతు = పవిత్రుని చేసెదరు గాక।
ఏషః = ఈ వరుణుడు

భూతస్య = ప్రాణి సమూహము యొక్క
భువనస్య = లోకముల యొక్క
మధ్యే = మధ్యయందు
గోప్తా = గుప్తముగా నున్నవాడు
పుణ్యకృతాః = పుణ్యాత్ములకు
లోకాన్ = లోకములను
మృత్యోః = మృత్యు సంబంధమైన
హిరణ్మయం = లోక విశేషమును
ద్యావాపృదివ్యోః = ద్యులోక పృదివీ లోకములకు
సంశ్రితం = నిలుపును
సువః = అట్టి స్వర్గ లోకమును
సః = ఆ నీవు
నః = మమ్ములను గూర్చి చక్కగా
సంశిశాధి = అనుగ్రహింపుము

## తాత్పర్యము

తన నుండి పుట్టిన రజస్సులుగా అంతరిక్ష మనబడు రోదసియందు మరియు భూమియందు వ్యాపించినట్టి వరుణుడు మా పాపబుద్ధిని పోగొట్టి జలరూపుడై పవిత్రుని చేయును గాక। వసువులు మా పాపబుద్ధిని పోగొట్టి పవిత్రుని జేయును గాక। వరుణుడు ఈ వ్యక్తమైన లోకములయందు గుప్తుడైయున్నాడు ఈయన పుణ్యాత్ములకు మంచి లోకములను, మృతి చెందిన వారికి హిరణ్మయములైన లోకములను ఇచ్చుచున్నాడు అట్టి ఓ దేవా। నీవు భూలోకములకు ఆదారమైన హిరణ్మయమైనట్టి సువర్లోకములు చక్కగా మాకు అనుగ్రహింపుము

## వివరణ

రోదసియనగా విశ్వమునందలి శక్తిమయమైన అంతరిక్షము ఇది అయస్కాంత శక్తితో నిండియుండును తన చుట్టు అణువులనాకర్షించి భౌతిక శరీరము నేర్పరచుకొను శక్తి దీనికి గలదు అట్టి శక్తి వలన సూర్యుడు, భూమి మొదలగు గ్రహ గోళములేర్పడుచున్నవి ఇన్నిటికి కారణముగా ఈ

శక్తులన్నియు వరుణుడు అను అంతరిక్ష శక్తి వలన వ్యక్తమగుచున్నవి ఈ వరుణుని వలననే చోటు లేక శబ్దము ఏర్పడియున్నది

ఈ సృష్టి మొత్తము సత్వము, రజస్సు, తమస్సు అను మూడు ప్రదాన శక్తులపై ఆదారపడి పనిచేయుచున్నది సత్వమనగా ఈ సృష్టియందు సమస్తమునకు ఆదారమైయున్న ఉనికి యను శక్తి సత్ అను శబ్దమునకు ఉండుట యని యర్ధము ఈ సృష్టి మొత్తము దేనివలన నిలబడియున్నదో దానినే సత్వము యందురు అట్లే రజస్సు యనగా పుట్టుట లేక కదలిక యని అర్ధము ఈ సృష్టి వేనివలన పుట్టి చైతన్యవంతమైనదో దానిని రజస్సుయందురు తమస్సు యనగా చీకటి అనగా చిక్కనైనది లేక గట్టిపడినది యని అర్ధము ఈ సృష్టియందు బౌతికస్థితికి కారణమైన శక్తిని తమస్సు అందురు ఈ తమస్సు వలన సృష్టి నిలబడియుండుట జరుగుచున్నది వేదమునందు అగ్ని, మిత్రుడు, వరుణుడు అను శక్తులు ముప్వురునూ ఈ పైన చెప్పబడిన మూడు శక్తుల కదిషతులుగా పనిచేయుచున్నారు పై మూడు శక్తులే త్రిగుణములుగా చెప్పబడినవి

వసువులనగా బౌతిక వస్తువులు నిలబడియుండుటకు కారణమైన ప్రజ్ఞలు అనగా వీరివలన వస్తువులకు ఆకారములేర్పడి అవి ఆయారూపములలో నిలచియున్నవి వీరి ప్రబావమే లేనిచో అణువులు వేటికవి విచ్చుకొని చోటులో కలసిపోవును

ఈ వరుణుడు పుణ్యాత్ములకు స్వర్గలోకమును, మృత్యువు పొందిన వారికి హిరణ్మయ లోకములను అనుగ్రహించుచున్నాడని చెప్పబడినది పుణ్యాత్ములనగా పుణ్య కార్యములు చేసినవారు లేక పలితముల నాశించి పనులు చేయువారు అట్టివారికి వారివారికి తగిన లోకములయందు స్థానము కల్పింపబడును మృత్యువు నొందిన వారనగా పూర్తిగా శరీర భ్రాంతిపోయిన వారని యర్ధము అట్టివారు హిరణ్మయ లోకములను చేరుదురు హిరణ్మయమనగా బంగారు వర్ణమని యర్ధము ఇదియే సూర్యుని పుట్టుకకు కారణమైన హిరణ్మయ లోకము అనగా సమస్త దేవతలూ పుట్టుచోటు పరమాత్మ నుండి జీవులుగా వేరగుట ఇచ్చటనే జరుగును కనుక శరీర భ్రాంతి తొలగిన వారు అట్టి హిరణ్మయ లోకములు చేరుదురు ఇచ్చట శరీర భ్రాంతి తొలగుట యనగా నిజముగా చనిపోవుట యని యర్ధము గాదు శరీరమునకు సంబంధము లేకయే తానున్నానని తెలియుట వారే మహానుబావులు, అవతార పురుషులు మున్నగువారు

**మంత్రము 2, 3**

**ఆర్ద్రం జ్వలతి జ్యోతి రహమస్మి।**
**జ్యోతి ర్జ్వలతి బ్రహ్మాహమస్మి।**

**యోహమస్మి బ్రహ్మాహ మస్మి।**
**అహమస్మి బ్రహ్మా హమస్మి।**
**అహమే వాహం మాంజు హోమిస్వాహా।**

**ప్రతిపదార్థము**

ఆర్ద్రం = తడిసినట్టిది
జ్వలంతి = ప్రకాశించుచున్నది
జ్యోతిః = వెలుగు
అహం = నేను
అస్మి = ఉన్నాను
జ్యోతిః = జ్యోతిగా
జ్వలతి = వెలుగుచున్నాను
బ్రహ్మ = బ్రహ్మముగా
అహం అస్మి = నేనే ఉన్నాను
యః = ఎవరు
అహం అస్మి = నేనుగా నున్నానో
బ్రహ్మాహమస్మి = బ్రహ్మముగానున్నాను
అహం అస్మి = నేనే యున్నాను
బ్రహ్మ + అహం + అస్మి = బ్రహ్మగా నున్నాను
అహమేవ = నేనే
అహం = నేనుగా
మాం = నన్ను
జుహోమి = స్వీకరించుచున్నాను
స్వాహా = స్వీకరింపబడుగాక।

